Tilak, Bal Gangadhar, 1856-1920

వైదిక నిలయము : ఆర్యుల ఉత్తరధ్రువనివాసము

బెజవాడ, 1929

Record no. 22

Tilak, Bal Gangadhar, 1856-1920

Vaidika nilayamu : Āryula Uttaradhruvanivāsamu

Bejavāḍa, 1929

Record no. 22

# SUNDARAYYA VIGNANA KENDRAM

1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

Tilak, Bal Gangadhar, 1856-1920.

వైదిక నిలయము : ఆర్యుల ఉత్తరధ్రువనివాసము / లోకమాన్య బాలగంగాధరతిలక్ గారిచే రచింపబడిన 'ఆర్కిటిక్ హోం ఇన్ ది వేదాస్' అను గ్రంథమునకు సంక్షిప్తాంధ్రానువాదము ; అనువాదకుడు మానికొండ సత్యనారాయణశాస్త్రి. - బెజవాడ : విజ్ఞాన చంద్రికామండలి, 1929.

(5), 2, 16, xvi, 548 p. :ill. ;17cm.

Record no. 22

Tilak, Bal Gangadhar, 1856-1920.

Vaidika nilayamu : Āryula Uttaradhruvanivāsamu / Lōkamānya Bālagaṅgādharatilak gāricē racimpabaḍina "Ārkiṭik hōṃ in di Vēdās" anu granthamunaku saṅkṣiptāndhrānuvādamu ; anuvādakuḍu Mānikoṇḍa Satyanārāyaṇaśāstri. - Bejavāḍa : Vijñāna Candrikāmaṇḍali, 1929.

(5), 2, 16, xvi, 548 p. :ill. ;17cm.

Record no. 22

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB        Date filming began:

ఓమ్

విజ్ఞానచంద్రికా గ్రంథమాల : ౩౮

# వైదిక నిలయము

## (ఆర్యుల ఉత్తరధ్రువనివాసము)

చిత్రపటశోభితము.

లోకమాన్య బాలగంగాధరతిలక్

గారిచే రచింపఁబడిన "ఆర్కిటిక్ హోం ఇన్ ది వేదాస్"

అను గ్రంథమునకు

సంక్షిప్తాంధ్రానువాదము.

అనువాదకుఁడు :

మానికొండ సత్యనారాయణశాస్త్రి బి. ఏ.

విజ్ఞాన చంద్రికా మండలి

వారిచేఁ బ్రకటితము.

బెజవాడ

౧౯౨౯.



వెల చందాదారులకు రు ౨-౦-౦

„ ఇతరులకు ౨-౮-౦




**1929**

గుంటూరు

చంద్రికాముద్రాక్షరశాలయందు

ఈమని భీమశంకరముగారిచే

ముద్రింపఁ బడినది.

---

ప్రథమముద్రణము ౧,౦౦౦ ప్రతులు.

# విజ్ఞాన చంద్రికా మండలి

## ( The Telugu Athenæum )

( 1860 వ సంవత్సరపు 21 వ నెంబరు శాసనము ప్రకారము రిజష్టరు చేయఁబడినది. )

## సభానిర్వాణము

అధ్యక్షుఁడు:

ఆచంట లక్ష్మీపతి, బి. ఏ., ఎం.బి., సి. ఎమ్.

కార్యదర్శి:

అయ్యంకి వేంకటరమణయ్య

సభాసదులు:

అయ్యదేవర కాళేశ్వరరావు, బి. ఏ., బి. ఎల్.

శ్రీరాజా వి. దుర్గా సదాశివేశ్వర ప్రసాద బహద్దరు జమీందారు

సూరి వేంకట నరసింహశాస్త్రి

గూడూరి రామచంద్రరావు

మాడపాటి హనుమంతరావు

కార్యస్థానము:

బెజవాడ.

# రాజపోషకులు

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజాగారు
కే. సి. ఐ. ఇ.

శ్రీ శ్రీ శ్రీ పిఠాపురం మహారాజాగారు

శ్రీ శ్రీ శ్రీ మునగాల రాజాగారు

*

# తొలిపలుకు

ఆర్యుల ఉత్తరధృవనివాసమునుగూర్చి వివరించుచు లోకమాన్య బాలగంగాధరతిలకుమహాశయుఁడు "ఆర్కిటిక్ హోం ఇన్ దీవేదాస్" అను మహాగ్రంథమును రచియించి యున్నాఁడు. ఆగ్రంథము ననుసరించి, శ్రీ మానికొండ సత్యనారాయణశాస్త్రిగారు "వైదికనిలయ" మను గ్రంథమును రచించిరి. దానిని విజ్ఞానచంద్రికాగ్రంథమాలికయం దొక కుసుమముగ ప్రకాశింపజేయుటకు దయతో నంగీకరించి యున్నారు. ఈగ్రంథమునందలి విషయము అగాధమగు వేద వాఙ్మయమున కేగాక, కఠినములగు ననేకభౌతిక, ఆధిభౌతిక శాస్త్రములకును సంబంధించినదైయున్నది. గ్రంథమంతయు సాంకేతికములయిన పారిభాషికపదములతో నిండియున్నది. ఇట్టిగ్రంథము నెల్లఱకు సుబోధకముగనుండునట్లు మిక్కిలి సులభశైలితో రచియించినందులకు గ్రంథకర్తకు ఆంధ్రదేశ పక్షమున కృతజ్ఞతావందనము లర్పించుచున్నాఁడను.

దైవికములగు నంతరాయములచేత మాగ్రంథమాల యందుగ్రంథములు సకాలమున వెలువడకుండెను. ౧౯౩౮ సం॥ ఏప్రియల్ మాసమునందు ౩౭ వ కుసుమముగు "అల్లాహొఅక్బర్" అను గ్రంథమును వెలువరించితిమి. జూలై నెల ౧ వ తేదీన యీగ్రంథమును ప్రకటించుచున్నారము. దైవానుగ్రహముండెనేని ముందుకూడ సకాలమున మాగ్రంథమాలయందలి కుసుమములు వికసింపుచుండగలవు.

విజ్ఞానచంద్రికామండలి, బెజవాడ. ౧-౭-౩౮.

ఇట్లు విన్నవించు విధేయుఁడు,
అయ్యంకి వేంకటరమణయ్య,
కార్యదర్శి.

# విషయసూచిక



# పటముల పట్టిక



* బ్లాకు 8 కొఱకు తరువాతిపుటలో చూడనగు.

# ప్రస్తావన

భారతవర్షము "బ్రిటిష్ యిండియా" గాక భారతవర్షముగను, భారతీయులు "బ్రిటిష్ సబ్జక్ట్సు" గాక భారతీయులుగను నుండియుండినయెడల యీ భూభాగమునెల్ల నేకచ్ఛత్రాధిపతిగ నేలు మహారాజుగనో, ప్రపంచరాజ్యాంగముల నెల్ల దిద్దిమ్మని నాట్యమాడించు మహా మంత్రిగనో— వీరాపగాతరణక్రీడ యొనర్చు యోధాగ్రేసరుడుగనో వేదఖనులనుండి నూతనరత్నముల పెకలించి లోకమునకంతకు నవజీవనము నొసంగు లోకాచార్యుడుగనో – విశ్వమందలి బహువిధశాస్త్రములనెల్ల తన సునిశితమేధాసంపత్తిచే పరిశోధించి వానిని లోకకల్యాణముకొరకు ప్రవర్తింపజేయు మహాపండిత ప్రకాండుడుగనో – ఉండియుండదగిన శ్రీలోకమాన్య తిలక్ మహారాజుతో, లోకాతీతప్రఖ్యాతశ్రీమహారాష్ట్రచిత్పావనమంత్రివంశఖనిగర్భోద్భూతసద్రత్న శ్రీబల్వంతరాయామాత్యునితో, భగవాన్ తిలకాచార్యునితో, నిజదేశప్రజాదాస్యాంధకారరాక్షసిని పారద్రోలిన శ్రీబాలగంగాధరునితో, వీరతిలకునితో నాకు పంద్రెండు సంవత్సరముల క్రిందట – 1916 సంవత్సరములో – పరోక్షమాత్రమున

గలిగిన పరిచయ విశేషముచే నా జీవితమం దపూర్వ మగు మార్పుగలిగెను. అప్పటినుండియు వారియుపన్యాసముల తెనిగించుటయు, వారి గ్రంథముల పఠించుటయు నాకొక వెఱ్ఱియైనది. వారి స్వరాజ్యోపన్యాసములు కేవల లౌకిక "స్వరాజ్య" మునకేగాక, పారలౌకిక "స్వారాజ్య" మునకుగూడ సోపానములుగ గన్పట్టెను. శ్రీభగవద్గీతా గ్రంథముయొక్క యుత్కృష్టతయు, దానిలో నిమిడియున్న నిజభావములును, సర్వకాల సర్వావస్థలయందు సమస్త దేశములవారికి, సమస్త వర్ణములవారికి, సమస్త లౌకిక పారలౌకిక వ్యవహారములకు సుకరమును లోకకల్యాణ ప్రదమును నగు మార్గమును జూపింపజాలిన గ్రంథ మిది యొక్కటియే యను మనోనిశ్చయమును నాకు నిజముగ శ్రీతిలక్ మహారాజుగారి రాజకీయోపన్యాసముల పఠించి తెలిగించిన మీదటనే గలిగినది. ఈగ్రంథరాజమును నేనిదివర కెన్నడు జూచి యుండకపోయినను, శ్రీతిలక్ మహారాజుగారు తమ రాజకీయోపన్యాసములందెల్ల గీతాసారమును కుప్ప తిప్పలుగ గుప్పివైచి యుండుటచే నేను దాని రుచిని మరగి పరవశుడనై యుంటిని. ఇట్టిస్థితిలో శ్రీవ్యాకరణాచార్య బ్రహ్మశ్రీ నోరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే తిలక్ గారి "గీతా రహస్యము" తెలిగింపబడి వావిళ్ళవారిచే ముద్రింపబడిన



దన్న వార్త పత్రికలలోజూచిన మొదటిదినమందే నేనాగ్రంథ మును తెప్పించుకొని పఠింపబూనితిని. అప్పటినుండియు తిలక్ గారియెడ నాకు గలిగిన పిచ్చి మరింత హెచ్చయ్యెను. భావము పొంగి తరంగిత మగుచున్నప్పుడు ఉన్మాదావస్థ గలుగుట సహజలక్షణమే. ఉత్కృష్టభక్తిచే ప్రహ్లాదు డున్మాదుడైనట్లు "స్వరాజ్యవిషయమైకూడ మీరు నిరంతరము – నిలుచున్నను కూర్చున్నను, మేల్కొన్నను నిద్రించుచున్నను, తినుచున్నను త్రాగుచున్నను, సదా యేకధోరణిని స్మరింపుచు మీరు కేవలము వెఱ్ఱివారై పోవలెను; దాని యందు మీరు తాదాత్మ్యమును పొందవలె" నని శ్రీతిలక్ గారొకచోట చెప్పియుండిరి. కావున, మూర్తీభవించిన స్వరాజ్యభావమగు శ్రీతిలక్ మహనీయునియందు నాకిట్టివెఱ్ఱి యున్మాదము పుట్టినదన్నచో ఆశ్చర్యపడ నక్కరలేదు.

ఇట్టి యపూర్వమగు పరివర్తనము నామనఃక్షేత్రమందు గలిగినప్పటినుండియు వారి గ్రంథముల తెలిగింప బూనితిని. 1916 సం॥ లో మదరాసునందు బి. ఏ. తరగతిలో నుండగ నింటివద్ద తీరికగలిగినప్పుడెల్ల వారి యుపన్యాసముల తెలిగించుచుంటిని. ఇదియైన పిమ్మట విజయవాడ యందలికొందరు మిత్రులప్రోత్సాహముచే వారిజీవిత చరిత్రను కూడ వ్రాసితిని. పిమ్మట అవి 1921 సంవత్సరమందు నేను

'లా' కాలేజీలో నుండగ ముద్రణమై గ్రంథరూపమున ప్రచురమైనవి.

కేవల మొక్క రాజకీయములందేగాక సమస్తశాస్త్రములందు వీరికిగల యపారప్రతిభ నన్నాకర్షించుటచే, వీరు రచించిన యితరగ్రంథములకూడ తెలిగింపవలయునను నభిలాష నాకు జనించెను. వానిలో పాశ్చాత్యపౌరస్త్య పండితు లందరిచే పేరెన్నికగన్నవి "Arctic Home in the Vedas," and "Orion" అను రెండు గ్రంథరాజములు గలవు. వీనిలో మొదటిదియగు Arctic Home (వైదికనిలయము) అను నీగ్రంథమును 1918 సం॥ నవంబరు నెలలో — యిప్పటికి పదేండ్లక్రిందట — నేను గుంటూరు టౌన్ హైస్కూలులో అధ్యాపకుడుగ నున్నకాలమున తెలిగింప మొదలిడితిని. అప్పుడప్పుడు కొద్దికొద్దిగ వ్రాయుచు వచ్చుటచేతను, మొదటి, 4, 5 అధ్యాయములు సాంకేతిక పరిభాషాపదములతోనిండి తేట తెలుగులోనికి దింపుట దుర్ఘటముగ నుండుటచేతను, నేను యితరవ్యాపకములందు మగ్నుడ నగుటచే తీరికగలుగమిచేతను, 1922 సంవత్సరమునాటికి 4, 5 అధ్యాయములుమాత్రము పూర్తియయ్యెను. కాని, ఆ సంవత్సరమందు నేనొనర్చిన కొలదిపాటి రాజకీయపరిశ్రమ ఫలితముగ నాకు గలిగిన నవమాసముల కారాగారస్థబలాత్కార



విశ్రాంతి మూలమున నేనీగ్రంథమును సాంతముగ తెలిగించుటకు చక్కని యవకాశము చిక్కినది. ఈగ్రంథమును తిలక్ గారును కారాగారమం దున్నకాలములోనే వ్రాయుటయు, దానిని నేనును కారాగారవాసమందే తెలిగించుటయు జూడ విచిత్రసంఘట్టనముగ గన్పట్టకమానదు. నిజముగ, నాకీకారాగారవాసమే తటస్థించి యుండనియెడల నేనీగ్రంథమును దీనితోపాటు "Orion" "వేదకాలనిర్ణయ" గ్రంథమును తెలిగింప గలిగెడివాడనో లేదో చెప్పజాలను.

ఈ రెండుగ్రంథముల భాషాంతరీకరణపద్ధతినిగూర్చి నేనిచట కొంత ముచ్చటింపవలసి యున్నది. ఇది కేవలము భాషాంతరీకరణముగాదు-అనుసరణమని చెప్పినచెప్పవచ్చును. మాతృకలోని భావముల తెలిగించితినిగాని, పదముల తెలిగింపలేదు. గ్రంథమందలి విషయము కట్టుకథవలెనో, లేక నవలవలెనో తేలికగ నెల్లరు చదివి గ్రహించి ఆవలపారవేయునది గాక, సాంకేతికపరిభాషాపదభూయిష్ఠమై కఠినములగు అనేక భౌతికఆధిభౌతిక శాస్త్రములకును,అగాధమగు వేదవాఙ్మయమునకును సంబంధించినదగుటచే సామాన్యజనులెల్లరికి సులభముగ ఒక్కసారి చదివినంతమాత్రముననే బోధపడి ఆనందమును గలిగించునదిగ నుండజాలదు; యిది నాలుకపై వేసికొనినంతమాత్రముననే రసముప్పతిల్లు ద్రాక్షపండువంటిది కాదు.

అందుచే మాతృకలోని ప్రతిపదమునకు, ప్రతివాక్యమునకు
ముక్కకు ముక్కగ తెలుగుజేసిపెట్టినయెడల గ్రంథములోని
విషయ మెవరికిని గ్రాహ్యమగుట కవకాశముండదను తలం
పుతో గ్రంథమం దాయాయధ్యాయములలో నిమిడియున్న
భావములను మాత్రము గ్రహించి, చాలవరకు స్వతంత్రరీతిని,
నా యోపినకొలది తేనెవంటి తేటతెలుగులోనికి ద్రాక్షాపాక
ముగ దింపజూచితిని. అట్లు దింపుటకు వీలులేనివానిని వదలి
వేసితిని. భావములు నిగూఢముగ నున్నచోట్ల విపులమొనర్చి
పెంచి వ్రాసితిని. కవిత్రయమువారి తెలుగుభారతము
వ్యాసులవారి సంస్కృతమాతృకకు భాషాంతరీకరణమన్నచో,
నాయీ రెండుగ్రంథములను తిలకుగారాంగ్లమందు రచించిన
మాతృకలకు భాషాంతరీకరణములని చెప్పవచ్చును.

కారావాసమునుండి బయటికి వచ్చినపిమ్మట కొలది
కాలమునకే దానియదృష్టవశమున శ్రీజయంతిపురం రాజా
వారి యవ్యాజకరుణచే "వేదకాలనిర్ణయ" (Orion) గ్రంథ
మెట్లో అచ్చునబడినది. కాని, దానికంటె చాల ముందుగ
ప్రారంభించిన యీ "వైదికనిలయము" మాత్రము నేటి
వరకు ప్రజలముఖము చూచుట కవకాశము చిక్కినదిగాదు.
నేను దీనిని కారావాసమందు అస్పష్టముగ చిత్తుకాగితముల
మీద పెన్సలుతో, చాల కొట్టివేతలతో వ్రాసియుండుటచే



దీనికి సాఫువ్రాయుటకే చాలకాలము పట్టినది. దీని నెట్లయిన
త్వరగ ముద్రించి ప్రచురింతమను నాశచే, నేను రాచకీయ
ప్రచారమునకై పోయినగ్రామాదులకెల్ల నావెంట, నావాలం
టీరుసంచిలో వేసికొని, దీనిని తీసికొనిపోయి విశ్రాంతిదొరికి
నప్పుడెల్ల రైళ్ళలోను, ప్లాటుఫారములమీదను కూర్చుండి
సాఫుప్రతి వ్రాయుచుండెడివాడను. ఈరీతిగ సాఫుప్రతి ముగించి
యిప్పటికి అయిదేండ్లయినది. ఈగ్రంథమును ముద్రింపించుట
కై యీఅయిదేండ్లలో నేనుపడినశ్రమ చెప్పనలవిగాదు.
నావద్ద తగుధనము లేమిచే, — ధనమునుగూర్చు సాధనములు
లేమిచే — అనేకమంది పెద్దలను, ధనాఢ్యులను ఆశ్రయించి
తిని; కాని, ఫలితములేకపోయెను. తుదకు, శ్రీజయంతిపురం
రాజావారే తిరిగి జగ్గయ్యపేటలోని తమ భవానీముద్రాశాల
యందు ముద్రించిపెట్టుదుమని సెలవిచ్చిరి. ఒక ప్రియమిత్రు
డును కాగితమిచ్చెను. జగ్గయ్యపేటయం దచ్చు ప్రారంభ
మయ్యెను. కాని, కొలదిఫారములు అచ్చుఅగునప్పటికి, వారి
ముద్రాశాల కారణాంతరములచే చాలకాలము మూసివేయ
బడవలసివచ్చెను. అందుచే నాగ్రంథము తిరిగి రెండు
సంవత్సరములు మూలబడెను.

తుదకు వ్రాతప్రతి వృథాగా చెదలుతిను స్థితికి రా
దొడగెను. గ్రంథమును ప్రారంభించిన యీ పదేండ్లనుండియు

యీ వ్రాతప్రతిని కాపాడలేక నా మచ్చమాసినది. అనేక సార్లు కొన్నిపత్రములు పోవుటచే తిరిగి నానాఅవస్థలుపడి వానిని వ్రాసికొనవలసివచ్చెను. లోకప్రఖ్యాతిగాంచిన యిట్టి గ్రంథము,– నేనింతశ్రమజేసి ప్రీతితో వ్రాసికొన్నగ్రంథము– తెలుగువాఙ్మయమం దుండదగిన శ్రీతిలకాచార్యుని గ్రంథము – యీరీతిగ చెదలుతినిపోవనిచ్చుటకు మనసొప్పక, సాహసించి, అప్పోసప్పోజేసి, నేనే ద్రవ్యమును సేకరించి, దీని నెట్లయిన బయటపడవేయవలెనను స్వయంసహాయ పంథను త్రొక్కుటకు సంకల్పించితిని. తదనుగుణముగ ద్రవ్యమును సేకరించి, గత జూలై నెలాఖరున ఆంధ్రదేశమహాసభల యేర్పాటునిమిత్తమై నేనుగుంటూరుపురమం దుండవలసివచ్చిన సందర్భమున శ్రీచంద్రికా ప్రెస్‌వారితో సంప్రతించి, యీ ముద్రణాకార్యమును వారికి ఒప్పగించితిని. వారును నాయం దవ్యాజమగు సానుభూతితోడను, మిక్కిలి పట్టుదలతోడను, నేననుకొన్నదానికంటె త్వరగనే, గ్రంథమునంతను సాంతముగ ముద్రించి నాకిచ్చిరి. ప్రూఫులను అతిజాగరూకతతోచూచి, నాయం దభిమానముతో నాకెంతయో శ్రమను తగ్గించిన శ్రీయుత అమరేశ్వరశాస్త్రిగారికిని, చంద్రికా ప్రెస్ ప్రొప్రయిటరుగారగు శ్రీయుత ఈమని భీమశంకరముగారికిని



నా మనఃపూర్వకవందనములు. పదేండ్లక్రిందట 1918 సం॥లో గుంటూరునగరమున ప్రారంభించిన యీగ్రంథము యిప్పుడీరీతిగ పదేండ్లయనంతరము తిరిగి గుంటూరునగరమందే సంపూర్ణవికాసముతో చక్కని పుస్తకరూపమున బయలుపఱచుటకు సర్వేశ్వరుడు సంకల్పించెను కాబోలు!

ఇందలి నానాచిత్రవర్ణశోభితములగు పటములకు కావలసిన బ్లాకుల నన్నిటిని శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు మదరాసులోని తమ స్వంతకార్ఖానాలో ఉచితముగ చేయించి యిప్పించినందులకు నేను వారి కనేక కృతజ్ఞతాపూర్వకవందనము లర్పించుచున్నాను.

పదేండ్లనుండియు నన్నాశ్రయించుకొని, నేను విడిచిపెట్టుదునన్నను అది నన్ను విడువక, నావెంటబడి, ఊరూరు తిరిగి, అనేక కష్టములబడి, అనేక క్రిమికీటకముల బాధలకోర్చి, నామనస్సున కనేకసమయములయందు ముదమును గూర్చి యిప్పు డీరీతిగ నన్ను విధిలేక బాసి, ఆంధ్రలోకమున ప్రచారము సలుపబోవుచున్న యీగ్రంథరాజముతోడి సాహచర్యము నాకింక నుండదుగదా యని నాకు కించిత్తు విచారము గలుగుచున్నది. పదేండ్లనుండియు అల్లారుముద్దుగపెంచి

కాపాడిన యీగ్రంథమును వ్రాయుటకే నాకింతమనోవేదన గలుగుచున్నప్పుడు "తమంతఁగను కూతులఁ వ్రాయు గృహస్థులింకెంతగాఁ గుందుదురోగదా ?"

నా ప్రస్తుతచిత్తవృత్తియు, బాహ్యపరిస్థితులును నన్నిప్పు డీయవస్థకే తెచ్చినవి. ఇప్పటికి సుమారు పదేండ్లక్రిందట యెత్తినపూనిక కాలక్రమమున సన్నగిల్లెను. అప్పటి యుత్సాహశక్తులు క్షీణించెను. ఆ మహాప్రస్థానమందు సోదరులు ఒక్కొక్కరే జారిపోయిరి. తుదకు నావంతును వచ్చెను. నేనును సర్వవిధముల పతితుడనైతిని. "ఆత్మోపభోగార్థ మర్థలాభేచ్ఛ నా కెన్నండు లేక" పోయినను, "నాయరయు నీచుట్టాలకు గ్రాసవాసోదైన్యంబులు వచ్చుగావున," "యాచ్ఞాకలనావిభంగచయసంభృతగద్గదశూన్యకంఠుడనై దేహియం చడిగి" యొకగూటిలో చేరుకొంటిని. ఇంకయీగూటినుండి స్వేచ్ఛయను నిర్మలవాతావరణములోనికెగిరి, స్వాతంత్ర్యగేయముల నాలపించుభాగ్య మీజన్మకిక కలదోలేదో ! ఇంతవరకుచేసిన జీవయాత్రయే, ధనాభావబాధితమయ్యు, నిర్దుష్టమును, మధురమును స్వేచ్ఛాప్రవృత్తమునునై యుండెను. ఈనూతన దశయందు జీవితమెట్లు పరిణ



మించి యంతమొందునో దుర్గ్రాహ్యము. మహానీయులచే ప్రసాదింపబడిన యిట్టి యుత్కృష్టగ్రంథరాజముల తెలిగించిగాని, నూతనగ్రంథముల రచించిగాని ఆంధ్రలోకమునకు ప్రసాదించుభాగ్యము నాకికమీద గలుగునో కలుగదో ! ప్రస్తుతావస్థ నాకిట్టియవకాశముల నొసంగునని ధైర్యముగ చెప్పజాలను.

ఈ గ్రంథరచనము నాజీవితముయొక్క సువర్ణదశ (Golden age) తో ప్రారంభమై, తద్దశాంతముతోపాటు యిదియు ముగింపునకువచ్చి, నన్నిప్పుడు అయోమయదశ (Iron age) యందు విడిచిపోవుచున్నది. పురాతన యుత్కృష్టతను ప్రస్తుతదైన్యస్థితిని తలంచుకొని గుందుచు భావిశుభోదయమునకై యెదురుజూచుచు కాలముగడపుచున్న మా యనుంగుతల్లి భారతమాతవలెనే వెనుకటి యుత్సాహోద్రేకములను ప్రస్తుతమాంద్యస్థితిని తలపోయుచుండ భావిశుభోదయమునకై నేనును నొక భీరువువలె కాలకర్మములకు కట్టువడి యుండెదను.

ఉ॥ "కానలపాలుజేసితని గర్వమునొందకుమీ సుయోధనా !
యీనెలలెట్టులో గడపి యెన్నటికైనను వత్తుమే జుమీ
మైనను నీవు త్రవ్విన మహావిపదబ్ధిని మున్గియుంటచే
నేనును నొక్కభీరువున నీకు భయంపడి యిట్టులేగెదఁ"

(పాండవాజ్ఞాతవాసము)

నే నిట్టులైతి. పదేండ్లనుండియు అల్లారుముద్దుగ పెంచిన యీబిడ్డను ఆంధ్రమహాజనుల చేతులలో చేయివేసి యప్పగించుచున్నాను. వారును దీనిని తమ పుత్రికలనువలెనే దిద్దుకొని పాలించుకొందురుగాక !

( తవ పుత్రీవ పాలయ ! )

మచిలీపట్టణము,
విభవ సం॥ భాద్రపద బ ౩౦
స్థిరవారము.
13–10–'28.

మానికొండ
సత్యనారాయణశాస్త్రి.



శ్రీ

# గ్రంథకర్తృ వంశావళి

సీ॥ మాని వశిష్ఠుండు మైత్రావరుణియుఁ గాం
డిన్యుండు నే మహాధన్యు ఋషులు
శోభితాపస్తంబసూత్రంబు మఱి యజు
శ్శాఖ యేఘనుని వంశమున కలరు
ఆర్వేలసద్బ్రాహ్మణాన్వయంబందునఁ
బుట్టుక యేపుణ్యమూర్తి గాంచె
ఇల మానికొండనా నింటిపే రేమహా
త్మున కొప్పు విఖ్యాతరీతిఁ
తే॥ గీ॥ దాను బొగడొందు మత్ప్రపితామహుండు
నిర్మలయశుండు సన్మాననీయగుణుఁడు
భావభవరూపుఁ డసమానబాహుబలుఁడు
లలితధన్వంత్రి వేంకటరామమంత్రి ॥
కం॥ ఆవేంకటరామాపర
భావజుగర్భంబునందుఁ బ్రభవించి రొగిన్
శ్రీవీరరాఘవార్యసు
ధీవరుఁడును గేశవార్య కోవిదవరుఁడున్ ॥

కం॥ ఆవీరరాఘవార్యుని
పావనగర్భంబునందుఁ బ్రభవించిరి మే
ధావులు వేంకటరామయ
శ్రీవరలక్ష్మీనృసింహ శేఖరు లెలమిన్ ॥

శా॥ శ్రీలక్ష్మీక్షణసత్కటాక్ష నిచితా
క్షీణైకభాగ్యంబుతో
నాలక్ష్మీనరసింహమూర్తికిని వి
య్యమ్మాంబకున్ బ్రీతిమై
భూలోకంబున జన్మమొందితిమి స
త్పుత్రత్రయం బే మొగిన్
నాళీకాసనువంశమం దలపిత్రా
ణంబున్ దగన్ దీర్పఁగన్ ॥

తే॥ పుత్రసంతతియైన మామూవురందు
క్రమత జ్యేష్ఠుండు వేంకటరామమంత్రి
అలకుటుంబరాయండు రెండవసుతుండు
సంజ్ఞ సత్యనారాయణశాస్త్రి నాకు ॥

తే॥ గీ॥ నాదునైదవయేటనె మాదుతండ్రి
యకట! పరలోకమున కేగ నంతనుండి
'పితృసమో జ్యేష్ఠ' యను నీతి పెంపుగాంచఁ
బ్రేమ ననుఁ బెంచె మాయన్న రామమంత్రి ॥



శా॥ భారద్వాజపవిత్రగోత్రమున నా
పస్తంబసత్సూత్రమం
దారున్వేలనియోగిశాఖను హనూ
మాఖ్యన్ దగన్ దాల్చి యా
మారాకారుఁడు తుర్లపాట్కులుఁడు మ
న్మాతామహుం డొప్పఁదా
శ్రీరామావనిజానిపాదయుగళీ
సేవాపరాధీనుఁడై ॥

కం॥ ధృతి మన్మాతృపితామహుఁ
డతులితలక్ష్మీసమేతుఁ డార్యుఁడు లక్ష్మీ
పతినామధేయుఁ డనఘుఁడు
వితరణఖని యనఁగఁ బరగె విభవమెలర్పన్ ॥

కం॥ మాతుఃప్రపితామహునిన్
జేతోముదమొదవ భక్తి సేవింతు మదిన్
శ్రీతనయుఁ బోలుఘనునిన్
ఖ్యాతిగఁ బరదేశిసంజ్ఞ నలరెడువానిన్ ॥

కం॥ హనుమార్యుఁడు మాతాతయ
తనయులఁ గాంచంగ లేమి దౌహిత్రులచే
తనె యూర్ధ్వలోకమందునఁ
బొనుపడఁగా నార్పనెంచెఁ బున్నరకాగ్నిన్ ॥

ఆ॥ వె॥ తుర్లపాటివారి స్వర్లోకగతికినై
నృహరి యిల్లటంబు నెరపెఁ గరుణ
పాలసంద్రమందు లీలతో శ్రీవిష్ణుఁ
డిల్లటంబునుండఁ డెట్లు నాఁడు ॥

ఉ॥ శ్రేణులుగట్టి యుద్భవముఁ జెందెదు ముద్దులపుత్రికాళితోఁ
రాణదలిర్చుకన్నియల రమ్యవివాహమహోత్సవాళితో
శ్రోణిభరాఢ్యలౌ సుతల శోభనకేళిపరంపరాళితో
జాణలునైనకూతులకు సారెకుఁబోయుపురుళ్ళపంక్తితో
వాణియు లక్ష్మి పార్వతియు వ్రాలినరీతిఁ దనర్చుచుండి సం
ప్రీణనమీయ శోభనముమీఁదను శోభనమై చెలంగి వి
న్నాణమొనర్ప వృద్ధిఁగను నాదగు శ్వశ్రుగృహంబు నిత్యక
ల్యాణము పచ్చతోరణమునై
వెలుగొందుచు నుండుఁ గావుతన్ !



# వేద భూమి
# భరతఖండమా? ధ్రువఖండమా?

(విమర్శము)

ఈభరతఖండమే ఆర్యులకు జన్మస్థానమనియు, వారితర దేశములనుండి యిచ్చటికి వచ్చిన ఆగంతుకులు కారనియు 'స్వధర్మప్రకాశినీ' వారిచే ప్రచురింపబడిన 'వేదభూమి' యను గ్రంథము చెప్పుచున్నది. శ్రీలోకమాన్య తిలక్ గారిచే ప్రతిపాదింపబడిన ధ్రువఖండసిద్ధాంతము సరిగాదని యీ గ్రంథకర్తలు చెప్పుచున్నారు, కాని నాకు జూడగ ధ్రువఖండ సిద్ధాంతమే యెక్కువ సబబుగ నున్నట్లు తోచుచున్నది. ఏలనగ, ఈభరతఖండవాదులు ధ్రువసిద్ధాంతములోని చాల సారాంశములతో నేకీభవించిరి; వ్యతిరేకించినచోట్లు భరతఖండ సిద్ధాంతమున కంతపుష్టికరములుగ లేవని నానిశ్చయము.

ఈక్రింది సారాంశములపై ఉభయపక్షములు నేకీభవించినవి.

(1) ఇప్పుడు మంచుతో బిగుసుకొని పోయిన ఉత్తర ధ్రువఖండము పూర్వమొకప్పుడు సమశీతోష్ణముగ నుండి మానవ నివాసమునకు యోగ్యముగ నుండెను.

(2) అప్పుడు ఆర్యులక్కడ కాపురముండిరి. (అందరో, కొందరో.)

(3) ఏకారణములచే నయిననేమి, తదుపరి కొంతకాలమునకు హిమప్రళయము రాగా, అది మానవ నివాసమునకు అనుపయోగమయ్యెను.

(4) అందుచే చలికి తాళజాలక ఆయార్యులు నల్దిక్కులకు బారిరి. వారిలో కొందరు యిండియాకు వచ్చిరి.

ఇక భరతఖండవాదులు చెప్పున దేమనగా.

అసలు ఆర్యజాతి (Original Stock) పుట్టుకయే భరతభూమియనియు, అందులో కొందరు యెప్పుడో ఉత్తరధ్రువఖండమునకు వలసబోయి యుండిరనియు, తదుపరి హిమప్రళయానంతరము ఆకొందరిలో కొందరు తిరిగి తమ వెనుకటి జన్మస్థానమగు యిండియాకు వచ్చిరనియు వీరివాదన. ఈ వాదన చాల 'అసావాదిత్యో బ్రహ్మ'గ గన్పించుచున్నది. ఇండియానుండి ధ్రువఖండమునకు చేసిన ప్రయాణమును గూర్చి వీరేమియు సాక్ష్యము చూపలేదు. ఊరక ఊహా ప్రపంచమున మేడలుకట్టిన ప్రయోజనమేమి? అట్లుగాక ధ్రువఖండమునుండి ఇండియాకు చేసిన ప్రయాణమునకు సాక్ష్యమున్నదని వీరె ఒప్పుకొన్నారు.

ఇక ఆర్యుల—వేయేల మానవుని—పుట్టుకయే భరతఖండమందు జరిగెనని వీరు చెప్పుచున్నారు. అసలు యీశ్వరుడు సృష్టియొక్క ఉత్పత్తిని యీభరతఖండమందే చేసెనని వీరు



చెప్పుచున్నారు. మన జన్మభూమియొక్క గొప్పతనమును గూర్చి మన కింతటి అభిమాన ముండుట సంతోషమే. మన భరతఖండమునే యీశ్వరుడు తన ప్రథమ సృష్టిరంగముగ వరింపవలెనను 'మనోరథము' మనకుండుట సహజమే. అది మెచ్చుకొనతగిన విషయమే. కాని కేవలము సత్యమునే అన్వేషింప బూనినప్పుడు మాత్ర మిట్టి యభిమానములను మనోరథములను దూరముగ నుంచుట అవసరము.

భరతఖండమే ప్రథమ సృష్టిరంగ మనుటకు వీరు చూపిన సాక్ష్యము చాల నీరసముగ నున్నదని నా యభిప్రాయము. ఇందుకు నిదర్శనముగ వీరు ఉదహరించిన వేదవాక్యములలోని భావము నిర్వివాదముగ లేదు. అనేకార్థములకు తావిచ్చుచున్నది. "ఓ సరస్వతీ! సర్వజీవము నీయందున్నది" అను వేదవాక్యమును పట్టుకొని, జీవము సరస్వతీ నదిలో ప్రప్రథమమున కనిపించిన ట్లీశ్రుతివలన స్ఫురించుచున్నద"ని వీరు వ్రాసిరి. ఈ వాదన యెంతవరకు నీరసముగ నున్నదో చూడుడు! ఇట్లే, జలసృష్టి, ప్రథమ సూర్యోదయ దర్శనము మున్నగునవి బహుపేలవముగ సమర్థింపబడినవి.

ఇక ధ్రువఖండవాదమును గూర్చి
తిలకుగారు చెప్పున దేమనగా,

ఆర్యులు హిమప్రళయమునకు పూర్వము ధ్రువఖండములో నివసించియుండి, ప్రళయానంతరము నానాదేశములకు బోయిరి. కొందరు ఇండియాకు వచ్చిరి. వా రానాడు ధ్రువ

ఖండములో చూచిన దీర్ఘఉషస్సు, దీర్ఘదివస, దీర్ఘరాత్రములు మున్నగు సృష్టివైచిత్ర్యముల నన్నిటిని మరచిపోకుండ వాక్పేటికలయందు అవిచ్ఛిన్నపారంపర్యముగ భద్రపరచియుంచి, స్థిరనివాసము లేర్పరుచుకొన్న తరువాత వానిని సూక్త (సు-ఉక్త) రూపములుగ బొందుపరచిరి. ఇవే మన కీనాడు గన్పించుచున్న వేదములు.

వీనిని ఇండియాలోనే సూక్తరూపములుగ బొందుపరచిరిగాన ఇండియాయే వేదభూమియని చెప్పుకొన్నచో తిలకుగారి కంత ఆక్షేపణ యుండక పోవచ్చును.

కాని ఆ సూక్తములందు బొందుపరుపబడిన విషయములు మాత్రము ప్రళయాత్పూర్వపు ధ్రువనివాసము నాటివని మరువకూడదు. ముప్పదిదినము లెడతెగకుండ వెలుగు ఉషస్సులనుగూర్చి చెప్పుచునివి పూర్వకాలమునాటివి (పురా, ప్రథమ) అని వేదములే వక్కాణించినవి. "ప్రథమ" అనగ సృష్టి ప్రథమకాలమని సాయనాచార్యులవా రనిరి. అట్లయినను, 30 దినముల ఉషస్సు ధ్రువఖండములోనిది కాబట్టి, ప్రథమ ఉషస్సృష్టి ధ్రువఖండములోనే జరుగవలెనుగద! ఇండియాలో జరిగియున్నచో, 30 దినముల ఉషస్సు ఇండియాలో యేది? నిజ మేమనగ, యీ వేదవాక్యములు వ్రాసిన కాలమునాటికే యీ 30 దినముల దీర్ఘఅఖండఉషస్సు "పురా" (పురాతనము) అయిపోయినది. తాను కూర్చుండి యీవాక్యమును వ్రాసిన భారతభూమిలో తన కండ్లయెదుట ప్రత్యక్షముగ ఒకేఉషస్సు



కనిపించుచుండగ, యజ్ఞవేదికపై 30 ఉషస్సులను సూచించుటకు 30 ఇటుకలను (వ్యుష్టి-యిష్టకా) యేల పెట్టవలెనను సందేహము తోచి, దానిని సమర్థించు టెట్లని యూహించి, మార్గము గానక, యిది "పురాతనాచారము"ని యీ ఋషి సరిపెట్టుకొనెను.

ఇట్లే ధ్రువఖండమందలి 7 నెలల సూర్యరశ్మిని మాత్రమే సూచించు అదితిగాథ (పూర్వ్యంయుగం) పూర్వయుగము నాటిదని వేదమే స్పష్టముగ వక్కాణించుచున్నది. మరియు, పదినెలలపరిమితిని సూచించు "గవాం అయనం" మున్నగు యజ్ఞములుకూడ పూర్వకాలమునాటివే యని వేదములే చెప్పుచున్నవి. 7,9,10 నెలలు యజ్ఞములు చేయు సప్తగ్వులు, నవగ్వులు, దశగ్వులు—వీరందరు "నఃపూర్వే పితరః" మన పూర్వపితరులని వేదఋషులే ఖండితముగ చెప్పుకొనిరి. వేదములిట్లు నిష్కర్షగ చెప్పుచుండ పంచఋతు-పదినెలల-సాంప్రదాయము క్రొత్తదని భరతఖండవాదు లూహించుటకు కారణము గన్పట్టను. వీరిది కేవలము ఊహించి చెప్పినమాట. స్పష్టమగు నిదర్శనము గాన్పించుచున్నప్పుడు వట్టి ఊహాను ప్రమాణముగ నెవ రంగీకరింతురు?

"రాత్రికాలము అంతమొందదనియు, సూర్యోదయముకాదనియు, పూర్వకాలమందు ఋషులు భయపడెడివారు" అను ధ్రువఖండ దీర్ఘరాత్రిని సూచించు వేదవాక్యము "పురా-కల్ప" ము లోనిదని సాయనాచార్యుల

వారే యొప్పుకొనిరి. కావున, యీవేదవాక్యము వ్రాసిన నాటికే ధ్రువఖండ దీర్ఘరాత్రి పురాతనమై పోయినది.

### వృత్రగాధ, సప్తసింధువుల నిజస్వభావము.

ఇక యింద్రుడు వృత్రుని వధించి సప్తసింధువులను ప్రవహింపజేసెనను మాటను పట్టుకొని, యీసప్తసింధువులు మన పంజాబులోని యేడునదులేయని భరతఖండవాదు లనుచున్నారు. దీనికి ఉపబలముగ పారశీకుల "హప్త-హిందు" శబ్దమును చూపుచున్నారు. వృత్రగాధనుగూర్చి యీభరతఖండవాదులు చేసినంత సులభముగ ఒక్కచిటికెలో పరిష్కరించి సారాంశమును తేల్చివేయుటకు వీలులేదు. ఏలననగ:- దీనియంతరార్థమును జెప్ప విషయమై భారతీయ నైరుక్త పండితులే భిన్నాభిప్రాయులై యున్నారు. కొందరు పండితులీవృత్రగాధను మేఘసిద్ధాంతము చేతను, మరికొందరు ఉషస్సిద్ధాంతముచేతను సమర్థింపజూచిరి. వృత్రవధవలన ఒక్కజలమేకాదు. యింక మరిమూడు వస్తువులు ఆవులు (కిరణములు) ఉషస్సు, సూర్యుడు- మొత్తము యీనాలుగు యేకకాలమందే విడిపింపబడినవి. మేఘసిద్ధాంతము నీటిని, సూర్యకిరణములను సమర్థించుచున్నది. ఉషస్సిద్ధాంతము ఉషస్సును సూర్యుని సమర్థించుచున్నది. కాని, యీనాలిగింటిని యేకకాలమందు సమర్థించుసిద్ధాంత మింతవరకు లేదు. తిలక్ గారి ధ్రువసిద్ధాంత మొక్కటే యీనాల్గింటిని యేకకాలమందు సమర్థించుచున్నది. వృత్రవధ ధ్రువఖండములోని అఖండదీర్ఘ



రాత్రిని సూచించుచున్నది. అందు విడిపింపబడినట్లు చెప్పబడిన జలము మన మామూలు నీరుకాదనియు, అది 'దివ్యాః ఆపః' దివ్యజలమనియు (ఇదే సృష్టికిపూర్వము క్రింద, పైన, లోపల, యావత్తు యీవిశ్వమునంతను ఆవరించినట్లు చెప్పబడిన జలమనియు, దీనినే యిప్పటివారు 'ఈథర్' Ether అనుచున్నారనియు) అది ఆకాశమునుండి పాతాళములోనికి పాతాళమునుండి ఆకాశముపైకి నిలువు చక్రాకారముగ యెక్కి దిగుచు ప్రవహించుచుండుననియు, యీప్రవాహముల గతివల్లనే సూర్యచంద్రాదులు కూడ నడుచుచున్నారనియు, యీప్రవాహములు ఆగిపోయినచో సూర్యచంద్రాదుల చలనములుకూడ ఆగిపోవుననియు నెలల తరబడియున్న ధ్రువఖండ దీర్ఘరాత్రిలో వృత్రుడీదివ్యజలమును అధోలోకమందు బంధించివైచుటచే (నిరుద్ధ ఆపః) దానితోపాటు సూర్యచంద్రాదులుకూడ అధోలోకమందు నెలల తరబడి బంధింపబడిపోయిరనియు, అప్పుడార్యులు నెలల తరబడి రాత్రిక్రతువులొనర్చి, సోమరసమిచ్చి యింద్రుని ప్రోత్సహింపగ యింద్రుడావృత్రుని వధించి అధోలోకమందు బంధింపబడిపోయిన దివ్యజలమును పైకి (ఉదంచ) ప్రవహింపజేసెననియు, అప్పుడీదివ్యజలప్రవాహముల వెంట (యివే సప్తసింధువులు) సూర్యచంద్రాదులుకూడ ఆకాశముపై కెక్కి వచ్చిరనియు మున్నగు విషయములను తిలక్ గారు 62 పేజీలో కూలంకషముగ మధించి సారాంశమును తేల్చిరి. ఆవివరముల నన్నిటిని

యీ చిన్నవ్యాసమం దుదహరించుటకు వీలులేదు. కావలసిన వారు మూలమును చూడనగును.

ఈ సప్తవిధవిభాగము ధ్రువఖండములోని యేదుమాసముల సూర్యరశ్మినుండి యేర్పడినది. ఈ వివరమునసే సూచించు వృత్రగాధ ఒక్క మన వేదమందేగాక గ్రీకుపారశీకాది పాశ్చాత్య ఆర్యసాంప్రదాయములలో కూడ గలదు. కావున, యింత విరివిగనున్న సప్తవిధవిభాగము (పంచనదదేశమని వాజసనేయసంహితలో కూడ వివరింపబడిన పంజాబును యింక యేవో రెండు పిల్లనదులను చేర్చి సప్తనదదేశము జేసినను)–ఒక్క పంజాబులో నదులను చూచి చేసినదిగాదని స్పష్టమగుచున్నది. పైపెచ్చు ఆర్యులందరు ధ్రువఖండమందు నివసించిననాటి యీ సప్తవిధవిభాగమునే తదుపరి యిక్కడికి వచ్చిన తరువాత యీ యేడునదులకు తగిలించియుండవచ్చుననుట యెక్కువ సమంజసముగ గన్పట్టుచున్నది. ఆకాశమందు దివ్యజలప్రవాహముగ (దివ్యాపగా) నున్న గంగానదియే భూమిమీది కవతరించినప్పుడు, ఆకాశమందు సూర్యుని మోచికొనిపోవు సప్తదివ్యసింధువులు పంజాబులోని కవతరించుటలో ఆశ్చర్యమేమున్నది? పారశీకుల హప్త–హిందు శబ్దమున కిదియే అర్థము. హేతుబద్ధమగు సాక్ష్యమే ప్రధానము–పేర్లు అప్రధానమైనవి. బందోబస్తుగనున్న తదితరసాక్ష్యముచే ఒక సిద్ధాంతమును స్థాపించిన పిమ్మట, దానికి ఉపబలముగ పేర్లయొక్క సామ్యమును తీసికొనిరావచ్చును. వానియొక్క



విలువ అంతవరకే. అంతేగాని, ఒక్క పేర్ల సామ్యమునే ఆధారముగ పెట్టుకొని, యెకాయెకిని ఒక సిద్ధాంతమును నెలకొల్పదలచినచో, అది చాల అపాయకరము. దానికి తలతోకయుండక, మనల నే గోతిలోనికో తీసికొనిపోయి దింపును. భారతీయనైరుక్త పండితప్రకాండులయందే ఇంతటి వాదప్రతివాదములకు కారణమైన వృత్రవధగాధలోని ఒక్క సప్తసింధుశబ్దమును పట్టుకొని, అవి పంజాబులోని యేడునదులే యని యెకాయెకిని నిర్ధారణచేసివైచుట సిద్ధాంత ప్రతిపాదనమునకు లక్షణముకాదు.

వృత్రగాధ హిమయుగమునకు పూర్వమునాటిది.

వేదమంతటికి ప్రధానదేవత యింద్రుడు. అత డొనర్చిన మహాత్కృష్ట కార్యములలోని కెల్ల యీ వృత్రవధయే ప్రధానమైనది. వేదమంతయు యితని ఘనకార్యవర్ణనల తోడనే సరిపోవుచున్నది. మనమామూలు మేఘమును చీల్చి వర్షమిప్పించుటయే మహాఘనకార్యమని మనయార్యులు ఉబ్బితబ్బిబ్బులై, దానికొరకు నూరురాత్రులెడతెగకుండ క్రతువులు చేసి, నానాఅవస్థలుపడి, మహావేదగ్రంథమునంతను దీనితోనే నింపివేసియున్నచో, వారు వట్టి పిచ్చి వారనియే చెప్పవలసివచ్చును! వీరింత ఆదుర్దాపడినది వట్టివర్షముకోసమా? క్షణమాత్రముండిపోవు మన యీ దేశపు ఉషస్సును గూర్చియా వీరిన్ని అనువాకముల నింపినది? 12 గంటలలో మరలివచ్చు సూర్యునికోసమా వీరింత గాబరాపడినది? వీనిలో వేనికొరకైనను మన మిప్పు డింత ఆదుర్దాపడుచున్నామా?

ఈ ఋక్కును రచించిన ఋషియైనను యింత ఆదుర్దా పడినాడా? లేదే! తానుకాదు - తనపూర్వులు - పూర్వకాలములో తెల్లవారదేమో అని ఆదుర్దాపడేవారట. ఈఋషికి లేని ఆదుర్దా ఆయనపూర్వుల కేలగలిగెను? కారణము విదితమే. ఈఋషి ఇండియాలో నున్నాడు. ఈయనపూర్వులు ధ్రువఖండములోనుండేవారు. కాబట్టి ధ్రువఖండ దీర్ఘరాత్రిని చూచి యీ యనపూర్వికులు భయపడుచుండేవారు. 12 గంటలు మాత్రమే రాత్రిగల ఇండియాలో యీఋషియుండుటచే, యీతని కెంతమాత్రము భయములేదు. కావున, సప్త సింధువులు దివ్యజల సింధువు లనుకొనుటవల్లను, వృత్రుడు ధ్రువఖండ దీర్ఘరాత్రి యనుకొనుట వల్లను వేదములకెల్ల ప్రధానమైనయీవృత్రగాథకు చక్కని అంతరార్థము సమన్వయము కుదురుచున్నది. ఇంకొక రీతిని యీగాథను యింత ఆమూలాగ్రముగ సమర్థించుటకు వీలుగన్పట్టదు.

ధ్రువఖండ నివాసమే ప్రాచీనము.

భరతఖండ నివాసము అర్వాచీనము.

అంతమాత్రముచే యీ వేదఋక్కులు వ్రాసిననాటికి ఆర్యులు పంజాబులో లేరని తిలకుగారు చెప్పరు. ఏలననగ:- వేదములందు ధ్రువఖండ లక్షణములతోపాటు భరతఖండ లక్షణములుకూడ వివరింపబడి యున్నవి. కాని, ధ్రువఖండ లక్షణములన్నియు పూర్వకాలమునాటివనియు వానిని యీ ఉత్తరయుగమందు తపస్సుచే తాము చూచుచున్నామనియు (యః పశ్యాద్ ఉత్తరే యుగే) యీఋక్కులను రచించిన ఋషులే స్పష్టముగ చెప్పుకొనియున్నారు. ఇంద్రుడు, అశ్వినులు మున్నగుదేవతలే గాక వారొనర్చిన ఘనకార్యములుకూడ, "పూర్వ్యాణి, పూర్వ్వ, ప్రథమాని" అని స్పష్టముగ చెప్పబడినవి. ఇదిగాక, తాను రచించిన ఋక్కు క్రొత్తది (నవ్యసీ) అయినను, అందు వర్ణింపబడిన దేవతయు అతని కార్యములును పురాతనమైనవి (ప్రత్న) యని VI, 22, 7, 62, 4 ఋక్కును రచించిన ఋషియే స్పష్టముగ చెప్పుకొనుచున్నాడు. ప్రాత అభిప్రాయములను (ప్రత్నా ధీః) క్రొత్తమాటలలో (నవీయసీ గీః) చెప్పుచున్నానని VIII, 95, 4-5 ఋక్కును రచించిన (అజీజనత్) ఋషి చెప్పుకొనుచున్నాడు. కావున, ధ్రువఖండ నివాసమునాటి విషయములే చాలవరకు భారతదేశమున స్థిరనివాసము లేర్పరచుకొన్న పిమ్మట వేదసూక్తములుగ రచింపబడినవి.



ఉత్తరగిరి.

భారతదేశములో కూర్చుండి యీఋక్కును వ్రాయుట చేతనే కాబోలు మనువుయొక్క ఓడనుగూర్చి చెప్పుచు "ఏతం ఉత్తరం గిరిం" - (యీవుత్తరగిరి అని చేతితో చూపించుచున్నట్లు) ఉత్తరశబ్దమును ప్రయోగించినాడు. కావున, ఈ ఉత్తరశబ్దము ధ్రువసిద్ధాంతమునకు ప్రతిబంధకము కాజాలదు.

పారశీక వేదప్రమాణము, వలసక్రమము.

ఇండియాలోనున్న ఆర్యులలో కొందరు చీలిపోయి ఆర్యన్ వైజో (ఆర్యబీజ) దేశములోనికి పోయిరనియు అదే

యిప్పటి పరిషియా దేశమనియు, వారే పారశీలనియు భరతఖండవాదులు చెప్పుచున్నారు. పార్శీవేదమందు వర్ణింపబడిన ఆర్యన్ వైజో లక్షణములను వీరు ఒక్కసారి ఊరక తిలకించి మాత్రముండియున్నచో వీరింత పొరబడి యుండియుండరని నానమ్మకము. ఆర్యన్ వైజో లక్షణములన్నియు ధ్రువఖండమునే చెప్పక చెప్పుచున్నవి. కావున, ఆర్యన్ వైజో యెప్పుడును పారశీకదేశము కాజాలదు. ఇక ఆర్యన్ వైజో మొదలు హప్త-హిందూవరకు పేర్కొనబడిన 16 దేశములు పూర్వోత్తర సందర్భములనుబట్టి చూచినచో అవి క్రమముగ ఉత్తర ధ్రువమునుండి యిండియావరకు వచ్చిన ఆర్యులవలసక్రమమును తెలుపుచున్నవని స్పష్టము కాగలదు.

### మనోరథమా ? సత్యమా ?

భారతవర్షమే ప్రథమసృష్టి రంగమును, ఆర్యుల జన్మస్థానమును కావలయునని తిలక్‌గారికికూడ యెంతటి మనోరథమున్నను, పైన వివరించిన రీతిగ బలవత్తరమగు ప్రమాణములు గాన్పించుటచే వారు తమ మనోరథము నావలబెట్టి, కట్టెదుట గాన్పించుచున్న సత్యమును అంగీకరింపక తప్పినది కాదని వారే వ్రాసికొని యున్నారు. ఏమి ? భరతఖండమందు కంటె ధ్రువఖండమందు వారికి యెక్కువ ప్రీతి యున్నదందుమా ? అట్లుండుటకు యేమాత్రము కారణము గన్పట్టదే ! పైపెచ్చు, భరతఖండమందే వారి కెక్కువ ప్రీతియున్నట్లు వారిజీవితమే చెప్పక చెప్పుచున్నది. ఆవిషయమై యెవరును



పొరపడుటకు వీలులేదు. భరతఖండమం దింతటి అనురాగమున్న తిలక్‌గారికి యేమాత్రము సందుదొరికినను వారు దీనిని ఆర్యస్థానముగ చేయక పోయెడివారా ? కాని, యథార్థస్థితి అన్యథాయున్నప్పుడు - ప్రబలమగు సాక్ష్యమువలన కథ అడ్డముగ తిరిగినప్పుడు — వారేమి చేయగలరు ? కావున తమకున్న అభిమానమును దూరముగపెట్టి ఆర్యస్థానము ధ్రువఖండమేయని ఒప్పుకొనక తప్పినది కాదు.

ఇక సోమపానమునుగూర్చియు ఆర్యస్పర్థనుగూర్చియు వ్రాసిన భాగములలోని హేతువాదము లంతదృఢముగ లేవు. చదువుట కెంతయింపుగనున్నను సిద్ధాంత ప్రతిపాదనమున కవి యుపకరింపజాలవని నా నమ్మకము. అట్లే ఆర్యసామ్రాజ్యవైభవము, విదేశబాంధవ్యము, ఆర్యులవలసలు, ఆర్యుల విజ్ఞానములు మున్నగు భాగములు చదువుటకు చాలమనోహరములుగను, ఉత్తేజనకరములుగను, దేశాభిమానమును పురికొల్పునవిగను నున్నవి. కాని, భరతఖండ సిద్ధాంతమును స్థాపించుట కవి చాలవని నానమ్మకము.

### వేదాంత భౌతిక శాస్త్రసారాంశముల యేకీభావము.

వేదములయొక్క అనాదిత్వ, అపౌరుషేయత్వ, పునరుద్ధరణాది విషయములగూర్చి మనవారును, యిప్పటి పాశ్చాత్యభౌతిక శాస్త్రవేత్తలును చెప్పుదానితో భేదమేమియు గాన్పింపదు. ఎట్లనః—

| మన వేదాంతుల అభిప్రాయములు. | ఆధునిక భౌతికశాస్త్రవేత్తల అభిప్రాయములు. |
|---|---|
| 1. వేదములు: అనాదులు. అపౌరుషేయములు. | 1. హిమప్రళయాత్పూర్వము ధ్రువఖండమం దార్య సభ్యత యే నాటినుండి ప్రబలి యుండెనో నిర్ణయింప జాలము. దీని 'ఆది'కాలగర్భమం దెచ్చటనో లీనమై పోయినది. |
| 2. గతకల్పాంతమందు గలిగిన ప్రళయములో వేదములు నశించెను. | 2. ధ్రువఖండమందు గలిగిన హిమప్రళయమువల్ల ఆర్య సభ్యత చాలవరకు చెడిపోయెను. |
| 3. ప్రళయానంతర మందు ఋషులు తపశ్శక్తిచే తాము జ్ఞాపక ముంచుకొన్న వెనుకటి వేదములను కేవల మవే మాటలతో కాకపోయినను అవే అర్థములతో తిరిగి నిర్మించిరి. | 3. ప్రళయాత్పూర్వపు ధ్రువ సాంప్రదాయములను పారంపర్యముగ వాక్పేటికలయందు భద్రపరచి యుంచుకొని, ప్రళయానంతర యుగమందు ఆర్యులు వానిని వేదసూక్తములుగ రచించిరి. |

ఈరీతిగ ధ్రువసిద్ధాంతమువల్ల రెంటికి చక్కని సమన్వయ మేర్పడుచున్నది.

ధ్రువనివాసకాలము, దేవమానము.

ఇక యీ హిమప్రళయ మెప్పుడు జరిగినదను విషయ



మునుగూర్చి చర్చించుచు అమెరికా భూగర్భశాస్త్రవేత్తలు కనిపెట్టిన 10 వేల సంవత్సరములను తిలకుగా రంగీకరించిరి. ప్రళయానంతర మేర్పడిన కృత, త్రేత, ద్వాపర, కలియుగముల పరిమితి 4, 3, 2, 1– వెరశి పదివేలసంవత్సరములతో యిది సరిపోవుచున్నది. ఈ లెక్కప్రకారము మన మిప్పుడు కలిని దాటి తిరిగి కృతయుగములో నున్నామని యేర్పడు చున్నది! మన మిప్పుడు కృతయుగములో నున్నామను మాటను ఒప్పుకొనుటకు మనవారికి సరిపడక యీ చతుర్యుగములకు చెప్పబడిన సంవత్సరములు దేవమానమునకు సంబంధించినవని చెప్పి వానిని 360 రెట్లు పెంచిరనియు, ఇట్లు పెంచుటకు ఆధారము కానరాదనియు, యీసంఖ్య లేర్పరచిన వ్యాస, మనువు, లిరువురు యీ దేవమానమునుగూర్చి చెప్పనే లేదనియు తిలకుగారు వ్రాసియున్నారు. దీనికి బలముగ, పండిత రంగాచార్య, అయ్యరుగార్ల అభిప్రాయములనుకూడ తిలకుగారు ఉదహరించిరి. దీనికి మన పూర్వాచారపరాయణులంత తేలికగ సమ్మతింపరేమో! ఇది చాల వివాదగ్రస్తవిషయముగ గాన్పించుటచే దీని వివరములను తిలకుగారి మూలగ్రంథమందే చూచి పండితులు నిర్ణయించు కొందురుగాక. ఇప్పటికే యీ వ్యాసము నేననుకొన్నదానికంటె విపరీతముగ పెరిగిపోవుటచే, నింక విస్తరించి వ్రాయజాలను.

ఈ వేదరచనకంటె ధ్రువనివాసమే ప్రాచీనము.

ఈ కాలనిర్ణయము మాట యెట్లున్నను, స్థలనిర్ణయమును గూర్చి మాత్రము భేదాభిప్రాయమునకు తావు గన్పట్టదు. వేదములందు ధ్రువనివాసము వర్ణింపబడియున్నదను మాటను

ఉభయపక్షములు ఒప్పుకొనుచున్నవి ! కాని, ధ్రువనివాసము యిటీవలిదనియు, భరతఖండనివాసమే ప్రాచీనమైనదనియు ఈ "వేదభూమి" గ్రంథకర్తల యభిప్రాయము. కాని, దీర్ఘరాత్రి, దీర్ఘఉషస్సు మున్నగు ధ్రువనివాస లక్షణములను గూర్చి చెప్పుచు, యివి పురాతనయుగమునాటివని ఆ ఋక్కులను రచించిన ఋషులే చెప్పుకొనుచుండగ దానిని కాదనుట యెట్లు ? కావున, యీ వేదరచనకంటె ధ్రువనివాసమే ప్రాచీనమైనదని సిద్ధించుచున్నది. ఒకవేళ యీ వేదరచన, ధ్రువనివాసములకంటెకూడ పూర్వమెప్పుడో ఆర్యులు భరతఖండమందు ఉండిరేమో చెప్పజాలము. దానికి సాక్ష్యమేమియు కన్పట్టదు. కావున, యీ సాక్ష్యము కన్పట్టువరకు ధ్రువనివాసమే ప్రాచీనమనక తప్పదు.

సంస్కృతభాషయందును, వేదవాఙ్మయమందును నాకెంతమాత్రము పరిచయము లేకపోయినను, భ్రమప్రమాదములున్నచో ప్రాజ్ఞులు మన్నింపకపోరను ధైర్యముతో నుభయపక్షములందలి వాదప్రతివాదములను మాత్రమే యాధారముగగొని నిష్పాక్షికముగ పరిశీలించి చూచి నాకు సత్యమని తోచిన తీర్పును చెప్పితిని. కాని, అసలు సత్యము సత్యస్వరూపుడగు నీశ్వరునకే యెరుక. అవ్యక్తమును, అగాధమునునగు యీసత్యసముద్రమును — ప్రహ్లాదుడు వచించినట్లు — ఎంతటి పండితప్రకాండులకైనను తమ "దుస్తర్థ దాటగరాదు" గద.

మానికొండ సత్యనారాయణశాస్త్రి,
అనువాదకుడు.

# వైదిక నిలయము

## ( ఆర్యుల ఉత్తర ధ్రువ నివాసము )

### మొదటి అధ్యాయము.

#### పూర్వచారిత్రక యుగము.

మన మే దేశపు చరిత్రనైనను తెలిసికొన గోరినయెడల మన కాధారము లేమి ? ఆయా దేశములవారిచే వ్రాసియుంచబడిన చరిత్రగ్రంథములే ముఖ్యాధారములు. ఈ గ్రంథములు మనకుం గొంతవఱకే సహాయము జేయగలవు. కాని యంతకంటెను ఇంక పూర్వకాలపు చరిత్ర దెలిసికొన గోరినయెడల మన కీగ్రంథము లేవియును తోడ్పడజాలవు. ఈ చరిత్రగ్రంథముల మూలమున మన మెంతకాలమువఱకు తెలిసికొనగలమో ఆ కాలమునకు "చారిత్రకయుగము" అని పేరు పెట్టుదము. ఈ చారిత్రకయుగమును దాటిపోయిన పిమ్మట, మన మీ ప్రపంచస్థితి నెట్లు తెలిసికొనగలము ? అప్పటి ప్రజ లెట్లుండెడివారు ? ఏవిధముగ వర్తింపుచుండెడివారు ? వారి యాచారవ్యవహారము లెట్లుండెడివి ? వీని నన్నిటిని దెలిసికొనుటకు మన కాధారము లేమైన కలవా ?

ఆయా దేశములవారనాదినుండియు బహుభక్తిశ్రద్ధలతో గౌరవింపుచు బూజింపుచుండిన మతగ్రంథములు కొంతవఱకు మనకు దోడ్పడగలవు. వారి యాచారములును, వారు చెప్పుకొనుచుండు పూర్వగాథలును (Mythologies) కొంతవఱకు మనకు త్రోవ జూపును. ప్రపంచములో నుండు వివిధభాషలను పరీక్షించి చూచి, యొక భాషకును మఱియొక భాషకును గల తారతమ్యములను, భేదములను, పోలికలను, సంబంధ బాంధవ్యములను బాగుగ పరిశీలించుట (Comparative Philology) మూలమునగూడ పూర్వచారిత్రము కొంత తేటపడగలదు.

మన మింకను వీని నన్నిటిని గడచి ఇంకొక మెట్టుపైకి పోదము. ఈపైనజెప్పిన సాధనములద్వారా కొంతకాలము వఱకే ప్రపంచస్థితి మనకు తెలియగలదు. అంతకంటెను ఇంక పూర్వకాలపు చరిత్రను తెలిసికొనుట కేమైన నాధారములు గలవా? మన మెప్పుడైనను భూమిని త్రవ్వచుండగ బూర్వులచే బహుకాలము క్రిందట నుపయోగింపబడిన కొన్నికొన్ని చిత్రమైన వస్తువులు దొరకుచుండును. ఈ విధముగ భూమిలో నణగియున్న యనేకమైన వస్తువులను త్రవ్వి యెత్తి వానిని పరీక్షించుటవలన కూడ మనకు మన పూర్వుల చారిత్ర మొక్కింత బోధపడగలదు. ఇట్లు "భూమిలోనుండు వస్తువులను త్రవ్వి యెత్తి, వానిని పరిశోధించి, తన్మూలమున పూర్వకాలపు చరిత్రను తెలిసికొనగలుగుట" యనునది ప్రస్తుత మొక గొప్పశాస్త్రముగ బరిగణింపబడుచున్నది. దీనికే



"భూనిక్షేపపరిశోధకశాస్త్రము (Archaeology)" అని పేరు. ఈ శాస్త్రపరిశోధనలవలన బూర్వచారిత్రము మనము కొంతవఱకు దెలిసికొనగలము. కాని యంతకంటెను యొక బూర్వయుగములనాటిచరిత్రను దెలిసికొనుట కాధారము లేమైనగలవా? దీనిని తెలిసికొనుటకు "భూగర్భశాస్త్రము (Geology)" కొంతవఱకు సహాయము చేయగలదు. భూమిని మనము త్రవ్విచూచినయెడల ననేకవిధములగు రాళ్ళు, రప్పలు, యిసుక, మన్ను, బురద, లోహములు, ఖనిజములు, చీకిపోయిన కొయ్యలు, బొగ్గులు మొదలగు నవి పొరలు పొరలుగ గాన్పించును. వీనిని బరీక్షించిచూచి కూడ పూర్వభూగోళ మేస్థితిలో నున్నదో తెలిసికొనవచ్చును. దీనిని దాటిపోయిన పిమ్మట మన కింక నేమియు నాధారములు లేవు. ఈపైన చెప్పిన వివిధశాస్త్రపరిశోధనల వలన చారిత్రకయుగమునకు బూర్వ మీభూగోళ మేస్థితిలోనున్నట్లీయాధునికులు సిద్ధాంతీకరించిరో కొంచెము విచారించి చూచెదము.

భూగర్భశాస్త్రవేత్తలు భూమిలోనుండు వివిధమైన పొరలను పరీక్షించిచూచి, యీభూగోళము పుట్టినది మొదలు యీ ప్రస్తుతరూపమును ధరించువఱకు గడచిన కాలమును (ఆదిమపదార్థము గాక) 4 మహాయుగములుగ భాగించిరి. భూమియొక్క పై భాగమునుండి త్రవ్వుకొనుచు లోపలికి పోవుచున్నా మనుకొనుడు. అప్పుడు మన కీవిధముగ నీమైనయుగములనాటి పొరలును వరుసగ గాన్పించును.

| | భూగర్భ విభాగము | భూనిక్షేప విభాగము. |
|---|---|---|
| చతుర్థ యుగము | ప్రస్తుత రూపము | ఇనుప యుగము<br>కాంశ్య యుగము<br>ఉత్తరశిలా యుగము |
| | ......క్రీ॥ పూ॥ 10 వేలు......<br>మంచుయుగము, లేక<br>* గత హిమప్రళయము | పూర్వశిలా యుగము. |
| తృతీయ యుగము (మనుష్యారంభయుగము) | (1) సరిక్రొత్త పొర<br>(2) తక్కువ క్రొత్త పొర<br>(3) మరీతక్కువ క్రొత్త పొర<br>(4) అట్టడుగు పొర | |
| ద్వితీయ యుగము | (1) సీమసున్నపు రాతి పొర<br>(2) గులకసున్నపు రాతి పొర<br>(3) ఇంకొక రకపు రాతి పొర | |
| ప్రథమ యుగము | (1) ఎర్రయిసుకరాయి + మగ్నీషియం సున్నపు రాయి పొర<br>(2) రాతిసిబొగ్గు పొర [ పొర<br>(3) పాతయెర్రయిసుక రాతి<br>(4) పర్వతములు అణగి మణగిన పొర [ పొర<br>(5) పర్వతములు అణగి మణగిన | |
| | ఆదిమపదార్థము ( జీవోత్పత్తి ) | |

* ఇట్టిప్రళయము లనేకములు వచ్చెననియు ఒక ప్రళయమునకు యింకొక ప్రళయమునకు మధ్య సమశీతోష్ణస్థితి యుండెననియు కొందరిమతము.



భూగర్భశాస్త్రప్రకారము గావింపబడిన కాలవిభాగము ప్రక్క పట్టి చూచినయెడల తెలియగలదు. ఇక చతుర్థ యుగపునాటి మట్టిపొరలలో గాన్పించిన వివిధములగు వస్తుసామగ్రినిబట్టి భూనిక్షేపపరిశోధకశాస్త్రజ్ఞు లెట్లు కాలవిభాగమును చేసిరో చూచెదముగాక. మంచుయుగపు పొరలలోను, తత్పూర్వయుగపు పొరలలోను యిప్పుడు ప్రస్తుతము మనకు తెలిసియున్నట్టి జంతువులయెముకలు మొదలగునవి మట్టితో గలిసి యున్నట్లు భూగర్భశాస్త్రపరిశోధనలవలననే తెలియవచ్చినది. అదిగాక ఈ చతుర్థయుగములోను తత్పూర్వయుగములలోనుగూడ ఈ భూమిపై మనుష్యులు నివసించినట్లు సైతము సూచనలు గలవు. ఈ యుగములనాటి మట్టిపొరలలో దొరకిన వస్తుసామగ్రిని నిక్షేపములనుబట్టి భూనిక్షేపపరిశోధకశాస్త్రజ్ఞులు, ఆదిమమానవులకాలమును మూడు తరగతులుగ భాగించియుండిరి. (1) శిలాయుగము. (2) కంచు (కాంశ్య) యుగము. (3) ఇనుపయుగము. శిలాయుగములోని మనుష్యులకు లోహపుపనిముట్లు చేసికొనుట తెలియనందున, వారు రాతితోడను, కొమ్ములతోడను, కొయ్యలతోడను, తమ పనిముట్లను జేసికొనుచుండిరి. ఈ పనిముట్లు చాల మోటుగనుండెను. ఈ కాలమునాటి మట్టిపొరలలో కొయ్యతోడను రాతితోడను, చేయబడిన మోటుకత్తులు, అంబులు మొదలైనపనిముట్లు దొరకినవేగాని లోహసామగ్రి దొరకలేదు. అంతకంటె పైపొరలలో లోహసామగ్రి దొరకినది.

ఆ యా పొరలలో దొరకిన వస్తువులనుబట్టియే యీ పై విభజన గావింపబడినది.

ఈ శిలాయుగమును తిరిగి పూర్వశిలాయుగము, ఉత్తరశిలాయుగము అని రెండువిధములుగ భాగించిరి. (Palaeolithic) పూర్వశిలాయుగపు రాతిపనిముట్లు (Neolithic) ఉత్తరశిలాయుగపు పనిముట్లకంటె నెక్కువ మోటుగనున్నవి. పూర్వశిలాయుగపు పనిముట్లు, ఉత్తరశిలాయుగపు పనిముట్లకంటె క్రింది (ప్రాత) పొరలలో గనుపించినవి. పూర్వశిలాయుగపునాటి జంతువులు ఉత్తరశిలాయుగములో గాన్పించుటలేదు. ఉత్తరశిలాయుగము నాటికె ఆపెద్దజంతువు లన్నియు పూర్తిగ నశించినట్లు కనబడుచున్నది. ఈ రెండుయుగములకును మధ్య ననేకగొప్పమార్పు లీ భూగోళముమీద సంభవించినట్లు సూచనలు గలవు. అప్పటి శీతోష్ణస్థితి వేరు. అప్పుడు యీ గోళముమీద భూ, జలభాగము లీవిధముగ లేవు. అప్పటి సముద్రములు వేరు. అప్పటి దేశములు వేరు. ఇవన్నియు ఉత్తరశిలాయుగములో మారిపోయి నేటివఱకును ఒకేవిధముగ తిరిగి మార్పులేమియు లేక నిలిచియున్నవి. భూగర్భశాస్త్రపరిశోధనలకును, భూనిక్షేప శాస్త్రపరిశోధనలకును గల సంబంధమును కొంచె మిచ్చట విచారించి చూచెదము. పూర్వశిలాయుగములోని మానవులు మంచుయుగములోను, తత్పూర్వయుగములోను నివసించినట్లు గానబడుచున్నది. తత్పూర్వయుగములో దేశములోని శీతోష్ణ



స్థితి మిక్కిలి యనుకూలముగ నుండి మంచుయుగము వచ్చుటతోడనే ఉత్తరదేశమంతయు మంచుతో గప్పబడిపోవుటచేత, నచ్చటివారు బహు యిక్కట్టులపాలైనట్లు తోచుచున్నది. ఈ మంచుయుగములోనే దేశములోని జంతువులన్నియు నశించి నల్లించవలెను.

పూర్వశిలాయుగపు మనుష్యులలో కొందఱు మంచుయుగమును గడచి బ్రదికినట్లు కనబడుచున్నది. ఉత్తరశిలాయుగము, కాంశ్యయుగము, ఇనుపయుగము యీ మూడును మంచుయుగానంతర యుగములో ప్రబలినవి. దీనినిబట్టి చతుర్థయుగమునం దంతటను మనుష్యసంచార మున్నట్లు నిదర్శనములు గలవు. అదిగాక తృతీయ యుగములో సైతము మనుష్యసంచార మున్నట్లిప్పుడు నూతనపరిశోధనలవలన తేటపడుచున్నది.

ఈ మంచుయుగ మెన్ని సంవత్సరములక్రిందట ప్రబలినది? ఉత్తరశిలాయుగ మెప్పుడు ప్రబలినది? ఈ కాలనిర్ణయముల విషయమై యనేకు లనేక యభిప్రాయములను దెలిపి యున్నారు. ఉత్తరశిలాయుగపు మట్టిపొరలలో నక్కడక్కడ దొరకిన ఫర్, ఓక్ మొదలగు చీకుడు కఱ్ఱలనుబట్టి కొందఱు యీ యుగము క్రీ పూ. 5 వేల సంవత్సరముల క్రిందట బ్రబలిన ట్లూహించిరి. ఇక పూర్వశిలాయుగ మెప్పుడు ప్రబలినదో విచారింపవలెను. అనగా మంచుయుగము గతించి తదనంతరయుగ మెప్పుడు ప్రారంభమైనదో విచారింపవలెను.

మంచుయుగమునకు పూర్వము మనుష్యులీభూగోళముపై ఉత్తరదేశములలో సంచరించుచుండి, మంచుయుగము రాగనే, అతిచలిచేతను, అనేకవంద లడుగుల యెత్తువఱకును దేశమంతటను మంచుగడ్డలతో నిండియుండుటచేతను, నివాసయోగ్యముకాని యాఉత్తరభూములను వదలి దక్షిణముగా భూమధ్యరేఖ వైపునకు వచ్చిచేరినట్లు తెల్లమగుచున్నది. మొదట నివాసయోగ్యముగనుండి, పిమ్మట మంచుయుగము రాగానే దేశము పాడై ప్రజలు నివసించుటకు దుస్సాధ్యమయ్యెను. దేశమంతయు మంచుతో గప్పబడుటకు కారణమేమి? మంచుయుగము తటస్థించుటకు కారణమేమి? ఈ మంచుయుగము తటస్థించినందువలన దేశముయొక్క రూపము మారిపోవుటకుగల కారణమేమి? ఈ విషయములన్నిటిని ద్వితీయాధ్యాయములో జర్చించెదము. ప్రస్తుతము మనము విచారించవలసిన యంశమేమనగా, ఈ మంచుయుగ మెప్పుడంత మొందినది? ఈ మంచుయుగము తటస్థించుటవలన భూగోళముయొక్క పైభాగమంతయు మారిపోయినదని చెప్పియుంటిమి. విస్తారమైన పర్వతములవంటి మంచుగడ్డల బరువుచేత నిదివఱకు ఎత్తుగనున్న భూభాగములు పల్లములైనవి. పల్లముగనున్న భూభాగము లెత్తైనవి. ఈ పెద్దపెద్ద మంచుగడ్డలు పర్వతశిఖరములనుండి క్రింది లోయలలోనికి పర్వతపార్శ్వముల వెంబడి జారుటవలన పర్వతపార్శ్వము లన్నియు కోతవడినవి. ఇట్లు కోతవడుట కెంతకాలము పట్టును? ఈ విధముగ కొండ



లోయలలో బడిన మంచుగడ్డలపై తిరిగి కాలక్రమమున వండుమట్టి మొదలైన మట్టిపొరలు పేరుకొనుట కెంతకాలము పట్టును? వీని నన్నిటిని విచారించి లెక్కవేసి చూచి, యిదంతయు జరుగుటకు షుమారు 7, 8 వేల సంవత్సరములు పట్టునని అమెరికాదేశపు భూగర్భశాస్త్రవేత్తలు నిర్ణయించిరి. స్విట్జర్లండు దేశపు సరస్సులలో పేరుకొనిన వండుమట్టి పొరలనుబట్టి చూడఁగా పూర్వశిలాయుగ మంతమొంది (అనగా మంచుయుగ మంతమొంది), ఉత్తరశిలాయుగము ప్రారంభమై, షుమారు 7, 8 వేల సంవత్సరములైనదని నిర్ణయించిరి. ఈ రెండంశములు నొకేకాలమును సూచింపుచున్నవి.

ఆర్యులు ఉత్తరధ్రువమండలమందు ప్రళయాత్పూర్వము మహోన్నత నాగరికతయందుండగ, ఐరోపాలోనున్న ఆర్యేతరులు పూర్వశిలాయుగమునాటి మోటుతనములోనే యుండిరి. ప్రళయానంతర మార్యులు ధ్రువమండలమును విడచి, అనేక శాఖలుగ చీలి నూతన నివేశనములకై అనేకచోట్ల తిరుగాడుచుండిరి. ఈ ప్రళయముచేతను, యిండ్లు వాకిండ్లు లేక తిరుగాడుటచేతను, వీరు తమ పూర్వపు మహోన్నత నాగరికతను చాలవరకు గోల్పోయిరి. వీరిలో కొన్ని శాఖలవారు యెక్కువగ పోగొట్టుకొనిరి. మరికొందరు తక్కువగ పోగొట్టుకొనిరి. ఆశియాఖండములో క్రీ. పూ. ౫. ౬. సం॥ ల నాడు ఆక్ససు జక్సార్టీసు (మధ్యాసియా) నదీప్రాంతముల నిలిచిన ఆర్యశాఖ, ఆకాలమందే ఐరోపా

ఖండములోనికి దిగిన ఆర్యశాఖకంటె యెన్నియో మడుంగు లెక్కువ నాగరకస్థితియం దుండెను. ఐరోపాఖండములోనికి దిగిన ఆర్యశాఖ అచ్చట అప్పుడు కాపురమున్న పూర్వశిలాయుగపు మూడు ఆర్యేతరశాఖలకంటె కొంచె మెక్కువ నాగరికములో నుండెను. అనగా ఉత్తరశిలాయుగపు నాగరికములో నుండెను. పిమ్మట యీ యార్యానార్యజాతులు గలసి వృద్ధినొందజొచ్చెను. అనగ ఐరోపాలో ఉత్తరశిలాయుగములో 1 ఆర్యజాతియు, 3 ఆర్యేతరజాతు లున్నవన్నమాట. వీరికంటె ఎక్కువ నాగరికమున్న దేశములనుండి యిచ్చటికి కంచు వగైరా లోహ సామగ్రి వచ్చుచుండుటచే, యిచ్చట కంచుయుగమును, తదుపరి యినుపయుగమును యేర్పడెను. యూరపుఖండమందు ఉత్తరశిలాయుగపు మట్టి పొరలలో దొరికిన పుర్రెయొక్క పొడుగు, వెడల్పులను బట్టి, ఆకాలమం దచ్చట నాలుగు తరగతుల మనుష్యజాతు లున్నట్లు పండితులు సిద్ధాంతీకరించిరి. వీరిలో ఒక్కరు మాత్రమే ఆర్యులు. తక్కినవారు ఆర్యేతరులు. ఇప్పు డైరోపాలో నున్న యీ నాలుగుతరగతుల మనుష్యులును ఆ నాల్గుతరగతుల మనుష్యులనుండియే పుట్టిరి. అయితే ప్రస్తుతకాలమం దీ నాల్గుతరగతులవారును ఆర్యభాషలను మాట్లాడుచున్నారు. కావున యీ నలుగురిలో అసలు ఆర్యులనుండి పుట్టినవా రెవరు? ఇది వివాదాంశముగ నున్నది. మేమే, మేమే పూర్వార్యులనుండి వచ్చితిమని జర్మనులును, ఫ్రెంచివారును,



స్విస్సువారును తగాదాపడుచున్నారు. ఈ యంశముల బరీక్షించుటకీ పుర్రెల పరిశోధన చాలదు. ఇక యీవిషయము నటుంచి, మన ప్రస్తుతాంశమునకు వత్తము.

పూర్వ మొకప్పుడు ఉత్తరధ్రువప్రాంతదేశమంతయు తృణకాష్ఠజలసమృద్ధిగనుండి ప్రజలునివసించుటకు శీతోష్ణస్థితి బహు అనుకూలముగ నుండియుండుటవలన మన పూర్వులా కాలములో నచ్చట నివసించియున్నట్లును, పిమ్మట కొంతకాలమునకు మంచుయుగము వచ్చి దేశమంతయు మంచుతో ఘనీభవించుకొని పోగా వారచ్చట నివసించుట కనుకూలముగా లేనందున దక్షిణదేశములకువచ్చి చేరినట్లును భూగర్భశాస్త్ర, భూనిక్షేప పరిశోధక శాస్త్రసంబంధమైన నూతన పరిశోధనలవలన నిర్ధారణచేయబడినది. అదిగాక, మన పూర్వు లొకప్పుడు ఉత్తర ధ్రువప్రాంతదేశములలో నివసించినట్లు వేదములలో స్పష్టముగ గానబడుచున్నది. కాని, వేదభాష్యకారులకు యీ విషయములు తెలియనందువలనను, యీభూగోళముయొక్క శీతోష్ణాది స్థితు లెప్పుడును యిప్పుడున్నవిధముననే యుండి యున్నవని వా రభిప్రాయపడినందునను, వేదములలోని కొన్ని కొన్ని ఋక్కులకు అర్థము తేటతెల్లముగ పైకి గనబడుచున్నను వానిని విరిచి పెడార్థములను లాగి యేదో విధముగ అతుకులు పెట్టిరి. ఈ విషయముల నన్నిటిని ముం దధ్యాయములో విపులముగ చర్చించెదము.



# వైదిక నిలయము

## రెండవ అధ్యాయము.

### హిమయుగము, హిమప్రళయము.

ప్రస్తుతకాలమున యీభూగోళముపై వసంతగ్రీష్మాది ఋతువులుగలుగుచున్నవి. ఈ ఋతుభేదములు గలుగుటకు అనేకకారణము లున్నవి. వానిలో (1) భూమియొక్క యిరుసు రాసిచక్రమునకు సరిగ నిలువుగనుండక వంపుగ నుండుట ముఖ్యకారణమైయున్నది. భూమి సూర్యునిచుట్టు చేయువార్షిక ప్రదక్షిణములో యీభూమియొక్క ఉత్తరధ్రువము సూర్యునకు పెడమొగముగ నున్నప్పుడు ఉత్తరార్ధగోళమందు చలికాలము గలుగును. దక్షిణార్ధగోళమందు వేసవిగలుగును. ఇట్లే ఉత్తరధ్రువము సూర్యునకు అభిముఖముగ నున్నప్పుడు ఉత్తరార్ధమందు వేసవియు దక్షిణార్ధమందు చలియు తటస్థించును. ఋతుభేదముల కిది యొక్కటే కారణమై యున్నచో మనపని బహుసులభముగ నుండెడిది. భూగోళముపై ఋతువులనడక సదాయీరీతిగనే యుండితీరవలెనని మనము నిర్ధారణచేసియుందుము. కాని మనదురదృష్టవశాత్తు యీఋతువులనడకను నిర్ణయించుటకింక అనేకమైన కారణము



లున్నవి. వానిలో (2) భూమియొక్క నిమ్నోన్నతములును సముద్రమందును వాతావరణమందును బుట్టు మహాప్రవాహములును వివిధములగు శీతోష్ణభేదములను గలిగించుటకు కారణభూతములగుచున్నవి. ఉదాహరణము — "గల్ఫ్ స్ట్రీము" అను ఉష్ణజలప్రవాహమే లేకుండినచో ఐరోపాఖండపు వాయవ్యభాగమంతయు యిప్పుడు మంచుతో బిగుసుకొనిపోయెడిదే. మరియు (3) మన గోళముపైనున్న భూజలభాగముల విస్తీర్ణతనుబట్టికూడ శీతోష్ణస్థితులందు భేద మేర్పడును. పూర్వ మొకప్పుడు "ఆల్పుసు" పర్వతములు యెత్తులేని చిన్నగుట్టలుగ నుండెను. హిమాలయ పర్వత మింకను పైకిరాక భూగర్భమందే యణగియుండెను. ఆశియా, ఆఫ్రికా, ఖండము లింత పెద్దవిగ లేవు. అవి కేవలము సముద్రములో చెదురుగపడియున్న చిన్నచిన్న లంకల సమూహములుగమాత్ర ముండెను. ఈ కారణములచే ఆకాలమందు (ప్రథమయుగములో) యీ గోళమంతటిపైనను సరిసమానమగు మంచి సమశీతోష్ణస్థితియుండెను. కాని, ద్వితీయ తృతీయ యుగములందీ పరిస్థితి క్రమముగ మారజొచ్చినట్లు గాన్పించుచున్నది. ఈ రెండుయుగములలోని శీతోష్ణస్థితి మొదటియుగమందున్నంత సమానముగ లేదు. కొన్నిచోట్ల వేడిగను మరికొన్నిచోట్ల చల్లగను నుండుట తటస్థించెను. ఐనను యిప్పుడున్నంత ఖండితమైన ఋతువిభాగము లప్పటి కింకను యేర్పడలేదు. ఇప్పుడున్నట్లు విపరీతపు చలిగాని,

విపరీతపు వేడిగాని లేదు. కాని, తృతీయయుగ మంతమై పోగానే యీ గోళముపై మహావిపరీతపు శీతోష్ణస్థితు లేర్పడెను. అనేక హిమప్రళయములు తటస్థించెను. ఒక ప్రళయమునకును రెండవ ప్రళయమునకును మధ్యమాత్రము మంచి శీతోష్ణస్థితియుండెను. కాని యీ హిమప్రళయములు రాకపూర్వ మీ గోళముమీద—నవంబరు మొదలు మార్చివరకు సూర్యుడు క్షితిజముక్రిందకు గ్రుంకిపోవు ".స్పిట్సుబర్గ్ " మొదలగు ధ్రువప్రాంత దేశములలో కూడ— చక్కనిశీతోష్ణస్థితియుండెననియు, యిప్పుడు ఉష్ణమండలములలోను, సమశీతోష్ణ ప్రదేశములలోను మాత్రమే గాన్పించు నానావిధ తరు సంతానములుకూడ ఆకాలమం దచ్చట బహుదట్టముగ నుండెననియు భూగర్భశాస్త్రవేత్తలు నిర్వివాదముగ సిద్ధాంతీకరించినారు.

చతుర్థయుగమం దీ చక్కనిస్థితి మారిపోయి, ఆకస్మికముగ హిమప్రళయమువచ్చి దేశమంతయు భ్రష్టమైపోయెను. అంతటితో మంచుయుగము ప్రారంభమయ్యెను. ఈ భూగోళమం దిట్టి హిమప్రళయములు తటస్థించినమాట వాస్తవమే యని ఋజువుచేయుటకు కావలసిన సాక్ష్యమునంతయు యీ చిన్ని యధ్యాయమందు క్లుప్తముగ నైన వివరించుటకు సాధ్యపడదు. ఈ ప్రళయములయొక్క స్వభావమును మాత్ర మిచ్చట సూక్ష్మముగ సూచించుచు, అస లివి తటస్థించుటకు గల కారణములను గూర్చి భూగర్భాది భౌతికశాస్త్రవేత్త



లేమి చెప్పిరో కొంచెము వినెదముగాక. హిమయుగము వచ్చినదను విషయమై పండితులలో భిన్నాభిప్రాయము లేనే లేదు. కాని "యిదివచ్చుటకు కారణమేమి" యను విషయమై మాత్రము పండితులలో భిన్నాభిప్రాయము లున్నవి. మరియు రెండుప్రళయములా? లేక అనేక ప్రళయములా? యను విషయమైకూడ భిన్నాభిప్రాయములు గలవు.

ఇప్పటికిని యీ భూగోళముపై మంచుచే గప్పబడి యున్న ప్రదేశములు గలవు. మంచుయొక్క స్వభావమును గూర్చియు అదిచేయు పనినిగూర్చియు తెలిసికొనుటకు మన కిప్పు డవకాశములు లేకపోలేదు. ఉన్నవి. ఇప్పటికిని ఆల్ప్సు కొండల లోయలలోను, గ్రీన్‌లాండు వంటి ధ్రువసమీప దేశములలోను దట్టమైన మంచుపొర లున్నవి. వృక్షాదులు పెరుగుటకుగాని, మృగసంతానము నివసించుటకుగాని వీలు లేనంతటి దట్టమైన మంచుపొర లీప్రదేశములలో నేటికిని గలవు. ఈ ప్రదేశములలో మంచుచే గావింపబడుచున్న చర్యలన్నిటిని పరీక్షించి చూచి భూగర్భశాస్త్రవేత్తలు కొన్ని సారాంశములను తేల్చిరి. మిక్కిలి బరువైన మంచుగుట్టలు పర్వతశిఖరములనుండి జారుటచే ఆ వత్తిడికి, ఆ జాలువెంట, పర్వతపార్శ్వములమీద లోతైన గీట్లుపడును. కొన్నిచోట్ల గుండ్రగ నునుపుదేరును. ఈ నిదర్శనములనుబట్టి ఐరోపా, అమెరికాఖండములందలి ఉత్తరభాగము లొకప్పుడు వందలకొలది అడుగుల మందముగల మంచుపొరలక్రింద బహు

కాలము అణగిపడియున్నట్లు భూగర్భశాస్త్రవేత్తలు నిర్ణయించిరి. ఈ మంచుపొర లన్నియు ఉత్తరధ్రువమునుండి రాలేదు. మంచుగుట్టలు జారుటవలన పర్వతపార్శ్వములం దేర్పడిన గీరలయొక్క జాలును (Direction) బట్టి, ఇవన్నియు ఉత్తర ఐరోపా అమెరికాలయందచ్చటచ్చట చెదరిపడియున్న పర్వతశిఖరముల నుండియు, ఉన్నతప్రదేశముల నుండియు నానాముఖముల జారిపడినట్లు తెలియుచున్నది. అతిదట్టమగు మంచుపొర లిట్లు ఉన్నతప్రదేశముల నుండి జారుచు వచ్చి స్కాండినేవియా నంతటిని కప్పివేసెను. ఉత్తర సముద్రమునంతను పూడ్చివేసెను. గ్రేటు బ్రిటనులో థేమ్సు నదివరకు ముంచివేసెను. జర్మనీలో చాల భాగము నాక్రమించుటయేగాక రష్యాలో మాస్కోవరకును, తూర్పున ఊరల్ పర్వతములవరకును కూడ యెగదట్టెను. ఈ మంచుగుట్టలు జారిన యొరపిడికి కొండలు పిండియయ్యెను. ఇట్లు పిండియైన పొడుమంతయు మంచుగుట్టల ప్రవాహములవెంట కొట్టుకొని వచ్చి యూరపులో షుమారు పదిలక్షల చదరపు మైళ్ళ ప్రదేశమును పూడ్చివేసెను ఉత్తర అమెరికాలో ఇంతకెక్కువ ప్రదేశమే యీ పూడికక్రింద పడిపోయెను. ఈ పూడికనుబట్టియే పూర్వ మొకప్పుడు మంచుయుగము (హిమప్రళయము) తటస్థించెనని భూగర్భశాస్త్రవేత్త లిప్పుడు సిద్ధాంతము జేసిరి. భూగర్భమును త్రవ్వి పరీక్షింపగ ఇట్టి పూడికలు కనీసము రెండు పొరలుగ గన్పట్టుచున్నవి. కాబట్టి



పూర్వము కనీసము రెండు ప్రళయములు తటస్థించి యుండవలెను. ఇట్టి ప్రళయములు నాలుగు వచ్చెననియు, మధ్య మధ్య చక్కని సమ శీతోష్ణస్థితి యుండెననియు "గెయికీ" పండితుడు చెప్పుచున్నాడు. కాని, తక్కిన పండితు లీ యభిప్రాయము నంగీకరింపలేదు. ఏది యెట్లున్నను కనీసము హిమప్రళయములు రెండైనను వచ్చెననియు, యీ రెంటికిని మధ్య చక్కని శీతోష్ణస్థితి యుండెననియు, పండితు లెల్ల రంగీకరించుచున్నారు. ఈ విషయములో అభిప్రాయభేదము లేదు.

మంచుయుగములో దేశమంతయు (మంచుచే) యెత్తుగను అతివిస్తారమైన చలిగను ఉండును. మధ్యయుగములో మంచు కరగిపోగానే అదివరకు మంచుయొక్క బరువువల్ల పడిన గోతులు కనుపించును. సమశీతోష్ణము లుండును. ధ్రువప్రాంతములుకూడ మానవ నివాసమున కనుకూలముగ నుండును. పైనచెప్పిన రెండు ప్రళయములవల్ల కలిగిన రెండు పూడికల పొరల మధ్యభాగమందు పూర్వ శిలాయుగ మానవుల నిక్షేపములు గాన్పించెను. కాబట్టి చతుర్థ యుగమందు తప్పక రెండు ప్రళయములు వచ్చెనని సిద్ధించుచున్నది. ఈ రెండు ప్రళయములకు మధ్యకాలములో నులి వెచ్చని శీతకాలమును, హాయియైన వేసవియు నుండెను. అందుచే వసంత సమయోచితమగు వృక్షాదులు, ఏనుగులు, ఖడ్గమృగములు, నీటిగుఱ్ఱములు మొదలగు క్రూరమృగములును

ఉత్తరధ్రువ మండలమం దంతటను స్వేచ్ఛగ చరింపుచుండెను. నరమాంసభోజులగు యిన్ని క్రూరజంతువు లున్నప్పటికిని బూర్వశిలాయుగ మానవున కెట్టి యిబ్బందియు లేకుండెను"—అని "గెయికీ" పండితుడు చెప్పుచున్నాడు.

హిమప్రళయము వచ్చినదని పండితులెల్ల రంగీకరించినను యిది వచ్చుటకుగల కారణమును గూర్చి వారిలో వారికేకాభిప్రాయము కుదురలేదు. అనేకు లనేక సిద్ధాంతములను జేసియుండిరి. ఎవ రెన్ని సిద్ధాంతముల జేసినను రెండు ప్రధానాంశములను మాత్రము గమనించితీరవలెను. ఉత్తర ఐరోపా, అమెరికాఖండములను ముంచివేయగలిగినంత మంచు ఊరక — అకారణముగ — పుట్టియుండదుగద. మొట్టమొదట, దీనికి కావలసిన నీటియావిరిని కల్పించుటకు తగినంత వేడి యీగోళమం దెచ్చటనో యుండితీరవలెను. అచ్చటబుట్టిన ఈ యావిరిని శీతలప్రదేశములకు గొంపోయి అచ్చటమంచుగ వర్షింపజేయగలిగినన్ని వాయుతరంగము లుండితీరవలెను. హిమప్రళయము సంభవించుట కివిరెండును ప్రధానకారణములు. ఈ ప్రధానకారణముల రెంటిని గుర్తింపకుండ చేసిన సిద్ధాంతము లెందునకును పనికిరావు. అదిగాక, ఒక్కప్రళయమేగాక, అనేక ప్రళయములేల వచ్చెనోకూడ చెప్పవలెను.

హిమప్రళయము లేలవచ్చెనో దెలుపు సిద్ధాంతము లిప్పుడు షుమారు 7 గలవు. వాని నిట క్లుప్తముగ వివరించెదను.



1. బహుశః పెనామాభూసంధియొకప్పుడు సముద్రములో మునిగియుండి యుండవచ్చును. అందువలన "గల్ఫుస్ట్రీము" అని యిప్పుడు చెప్పబడు ఉష్ణసముద్ర జలప్రవాహము ఉత్తరదేశములవైపునకు బోక దక్షిణముగ ప్రవహించుచుండెడిదిగాబోలు. ఆ కారణముచేత ఉత్తరధ్రువప్రాంతదేశములు మంచుతో ఘనీభవించుకొనిపోయి యుండవచ్చును. అనికొందరు చెప్పిరి. కాని పెనామాభూసంధి సముద్రములో పూర్వ మొకప్పుడు మునిగియున్నట్లు నిదర్శనము లెంతమాత్రమును లేవు. కాన యీ సిద్ధాంతమును తోసివేసిరి. (2) మరియొక రింకొకసిద్ధాంతమును బయలుదేర దీసిరి. ఈ భూగోళము యీ బ్రహ్మాండగోళములో తిరుగుచున్న సమయములలో ఒకప్పుడు బహుశీతల ప్రదేశములగుండను మరియొకప్పుడు ఉష్ణప్రదేశములగుండను సంచారముచేసి యుండవచ్చును. అందువలన ఒకప్పుడు మంచుయుగము, మరియొకప్పుడు సమశీతోష్ణస్థితియు తటస్థించి యుండవచ్చును. కాని, భూగోళ మీవిధముగ తిరిగినదని చెప్పుట కెంతమాత్రమును నిదర్శనములులేవు. కాన యీసిద్ధాంతమును గూడ తోసివేయవలసినదే. (3) ఇక మూడవసిద్ధాంతమును విచారించుదము. భూగోళమునకు కావలసిన ఉష్ణము సూర్యమండలమునుండి వచ్చుచున్నది. ఇది అందరికిని తెలిసిన విషయమే. ఇట్లు సూర్యమండలమునుండి వచ్చు ఉష్ణములో హెచ్చుతగ్గులుండి యుండవచ్చును. ఒకప్పుడు ఉష్ణ మధికముగను, మరి

యొకప్పుడు తక్కువగను సప్లయిఅయిన కారణమున మంచు యుగములును సమశీతోష్ణయుగములును తటస్థించి యుండ వచ్చును. కాని యీసిద్ధాంతమును ఋజువుపరచుట కేమి యును ఆధారములులేవు. కాబట్టి దీనినికూడ త్రోసిరా జన వలసినదే. (4) ఇంకొక సిద్ధాంతమును విచారించెదము. ఈ భూగోళమొక ఇరుసుమీద తిరుగుచున్నట్లు తిరుగుచున్నదని అందరికిని తెలియును. మొదటనున్న యిరుసు ఆకస్మికముగ మారిపోయి మధ్య మరియొక యిరుసుమీద భూమి తిరుగ నారంభించినయెడల, శీతోష్ణస్థితియం దిట్టి మార్పులు కలుగ వచ్చును. కాని మొదటి ఇరుసు మారిపోయి, రెండవ ఇరుసు వచ్చినయెడల యీ రెండవ ఇరుసుతోబాటు, రెండవ భూ మధ్యరేఖయు, యీ రేఖచుట్టును భూమి యుబ్బినట్లు ఉబ్బును ఆకారమును కూడ తటస్థింపవలెను. కాని అట్టి రెండవ యుబ్బుడు ఆకారమేమియు కానబడదు. కాన దీనిని నమ్ము టకు వీలులేదు. (5) ఈ భూగోళము మొదట (సూర్యమండ లమువలె) మంటలు మండుచున్న అగ్నిగోళమువలె నుండె ననియు, పిమ్మట క్రమక్రమముగ చల్లబడి ఇప్పు డీస్థితికి వచ్చె ననియు ప్రకృతిశాస్త్రవేత్తలు తలంచుచున్నారు. ఇట్లీభూమి కాలక్రమమున చల్లబడుటలో తక్కినప్రదేశము లన్నిటికంటె ఉత్తరధ్రువప్రాంతభాగములు ముందు చల్లారెననియు, అట్లు చల్లారుటవలన వృక్షములు మృగములు, మనుష్యులు మొద లగు ప్రాణికోట్లుద్భవించి యచ్చట వాసయోగ్యముగ



నుండుటవలన నచ్చట నివసింపసాగె ననియు, మరి కొందరు చెప్పిరి. ఇది నిజమని మన మొప్పుకొన్నను, 4, 5 మంచు యుగములు వరుసగ నెట్లు తటస్థింపగలవు? కొంతకాలము మంచు యుగములును, మధ్యమధ్య మరి కొంతకాలము సమ శీతోష్ణయుగములును, తటస్థించు టెట్లు? కనుక, ఈ సిద్ధాంత మునుకూడ మన మొప్పుకొనజాలము. ఇట్లీ సిద్ధాంతముల నన్నిటిని త్రోసివేయగ, నింకను మిగిలినవి రెండు గలవు. ప్రస్తుత మొకవిధముగ నిలిచియున్న వీ రెండు సిద్ధాంతములే. (6) వీనిలో "లయల్" పండితుని సిద్ధాంత మొకటి. "భూ గోళముపైనున్న భూ, జల భాగములయొక్క విస్తీర్ణతయందు మార్పులు గలుగుచుండును. పెద్దపెద్ద భూభాగములు కొంతకాలమునకు సముద్రములోనికి క్రుంగిపోవుచుండును. క్రొత్తక్రొత్త భూభాగములు సముద్రగర్భమునుండి పైకి లేచుచుండును. హిమప్రళయములు సంభవించుటకు కావల సిన శీతోష్ణములు పుట్టుట కిట్టి మార్పు లొక్కటే చాలు"నని "వాలెస్" పండితుడు చెప్పుచున్నాడు. కాని, యింతపెద్ద భూభాగములు సముద్రములోనికి క్రుంగిపోవుటకును, క్రొత్తవి లేచుటకును యెన్నియో లెక్కలేనన్ని వేలసంవత్సరములు పట్టును. షుమారు రెండులక్షల సంవత్సరములకు తక్కువ పట్టదని యీ సిద్ధాంతవాదులలో కొందరు తలంచుచున్నారు. అనగ, మంచుయుగముయొక్క పరిమితి రెండులక్షలని చెప్పుచున్నారు. వీరిలోనే మరికొందరు 20, 25 వేల సంవత్స

రములకంటె యెక్కువ యుండదని చెప్పుచున్నారు. ఈ రెండంకెలకును చాల భేద మున్నది. ఏది సరియైనదో చెప్పజాలము. కాని మన మింతవరకు మాత్రము చెప్పగలము. ప్రళయానంతర మిప్పటివరకు గడచిన కాలమునకంటె యెన్నియో రెట్లు యెక్కువ కాలమని మాత్రము చెప్పగలము.

ఇక చిట్టచివరది (7) క్రోలుగారి సిద్ధాంతము. వీరి సిద్ధాంతము ఖగోళాంశములమీద నాధారపడి యున్నది. ఒకటికంటె యెక్కువ ప్రళయము లేలవచ్చునో చెప్పుచున్నది.

PQ' AQ [Block No. 1] అను నది భూమి సూర్యుని చుట్టు వార్షిక ప్రదక్షిణముచేయు బాట. ఈ బాట గుండ్రముగ లేదు. అండాకారముగ అనగ, (కోడిగ్రుడ్డు ఆకారముగ) నున్నది. సూర్యు డీ అండమునకు మధ్య బిందువైన C యందుండక, కేంద్రస్థానములైన S, ర ల రెంటిలో నేదేని యొక దానివద్దమాత్రమే యుండును. కనుక సూర్యుడు S వద్ద నున్నాడనుకొందము. అప్పుడు భూమి P వద్ద నున్నచో రవి భూములకుగల దూరము హ్రస్వతమముగ నుండును. A వద్దనున్నచో దీర్ఘతమముగ నుండును. (కావున యీ P,A యను రెండు బిందువులకును హ్రస్వాంతరము, దీర్ఘాంతరము అని పేర్లు పెట్టుదము) భూమియొక్క యిరుసు తన బాటయొక్క వలయతలమునకు ( plane కు ) నిలువుగ నుండక వంపుగ నుండును. మరియు, భూమి సూర్యునకు ప్రదక్షిణ మొనర్చు

బ్లాకు 1.



బ్లాకు 2.



టలో దాని యిరుసు సదా ఒకే దిక్కున కుండునుగాని యింకొక ప్రక్కకు మారదు. ఈ రెండు కారణముల చేత ఋతుభేదములు కలుగుచున్నవి. ఎట్లనగ, భూమి P వద్ద, యిరుసు సూర్యునకు విముఖముగ నిలుచున్నప్పుడు ఉత్తరార్ధగోళమందు చలికాలము వచ్చును. అట్లేభూమి A వద్ద, యిరుసు సూర్యునకు అభిముఖముగ నిలుచున్నప్పుడు ఉత్తరార్ధగోళమందు వేసవికాలము వచ్చును. భూమియొక్క యిరుసునకు చలనములేకుండ స్థిరముగనున్నచో, ఉత్తరార్ధ గోళమందు హేమంత గ్రీష్మర్తువులు సదాక్రమముగ P, A ల వద్దనే తటస్థింపుచుండెడివి. కాని, దైవవశాత్తు, యిరుసు స్థిర మైనదికాదు. దానికిగూడ బహుసూక్ష్మమైన చలనముగలదు. అది రాశిచక్రధ్వజముచుట్టు 25 వేల 8 వందల 68 సంవత్స రములకొక * ప్రదక్షిణము చేయును. కావున, భూమియొక్క యిరుసునకును దానిబాటయొక్క ♦ (లేక రాశిచక్రము యొక్క) వలయతలమునకునుగల వంపు యీ 25,868 సంవత్సరముల యవధిలో సర్వదా సమానముగనుండక మారుచుండును. (పటముచూడుడు) అందుచేత యీమహాయవధిలో ఋతువులు భూప్రదక్షిణములో సదా ఒకేనిర్దిష్ట ప్రదేశ మందురాక, వేర్వేరుస్థలములందు వచ్చుచుండును. ఉదాహరణ - ఈమహాయవధిలో ఒకానొకకాలమందు భూమి P

---

* ఇదియే విషువద్బిందుచలనమునకు గూడ కారణమగుచున్నది.

♦ భూమియొక్కబాటయు, రాశిచక్రమును ఒక్కటేయని గ్రహించునది.

వద్దనుండగ ఉత్తరార్థగోళమందు శీతకాలము తటస్థించినచో, మరియింకొకకాలమం దది *p* వద్దనుండగ రావచ్చును. మరి యింకొకకాలమునకు A వద్దనుండగ రావచ్చును. ఇట్లు పోగా పోగా **25868** సం॥ పూర్తియగునప్పటికి తిరిగి P వద్దనుండగ రావచ్చును. ఈక్రమమునే ఉత్తరార్థగోళమందు వేసవిభూమి A వద్దనుండగ రావచ్చును. ఇంకొక కొంతకాలమునకు *a* వద్దనుండగ రావచ్చును, లేదా P వద్దనుండగరావచ్చును. ఇట్లుపోగాపోగా **25,868** సం॥ పూర్తికాగానే తిరిగి A వద్ద నుండగ రావచ్చును. (ఈక్రమమే విషువద్బిందువులకుగూడ వర్తించును.)

ఇక ప్రస్తుతాంశమునకు వత్తము. భూమి *p* వద్దనుండగ ఉత్తరార్థగోళమందు శీతకాలము వచ్చిన దనుకొందము. భూమి P వద్ద నున్నప్పటికంటె యిప్పు డది సూర్యునకు యెక్కువ దూరములోనున్నదని మనము తప్పక గ్రహించవలెను. ఇట్లుపోగాపోగా, ఒకానొకసమయమందు భూమి A వద్దనుండగ ఉత్తరార్థగోళమందు శీతకాలమువచ్చును. అప్పుడు భూమికిని సూర్యునకును మధ్యదూరము దీర్ఘతమమగును. భూమి P వద్దనుండగ శీతకాలము వచ్చుటకును, A వద్దనుండగ వచ్చుటకును యెంతోభేదమున్నది. P వద్దనుండగ భూమి సూర్యునకు బహు సమీపమం దుండుటచే శీతకాల మంత తీవ్రముగనుండదు. కాని, A వద్దనుండగ శీతకాలమువచ్చినచో —భూమి సూర్యునకు బహుదూరమందుండుటచే—శీతకాలము



భరింప శక్యముగానిదిగ నుండును. ఎట్లయినను, యీ **25868** సంవత్సరములలో ఒక్కమారైనను శీతకాల మీభూమి A వద్దనుండగ వచ్చితీరవలెను. కాబట్టి శీతకాలము P వద్దనుండి A వద్దకు నడచుటకు సాధారణముగ **25868/2=12934** సం॥రములు పట్టును. కాని, హ్రస్వాంత దీర్ఘాంత బిందువులు (P, A లు) మాత్రము స్థిరమైనవా? వానికికూడ బహుసూక్ష్మమైన వెనుకనడక గలదు. కాబట్టి, మనము పైనచెప్పిన **25868** సం॥ల యవధిని **20,984** సంవత్సరములకు (అనగ షుమారు **21,000** సం॥లకు) తగ్గించుకొనవలెను. అనగ, భూమిహ్రస్వాంతరమగు P వద్దనుండగ యిప్పు డొకప్రదేశమందు శీతకాలము వచ్చినచోయింక **10,500**సం॥ లకు ఆప్రదేశమందే శీతకాలము భూమి దీర్ఘాంతరమగు A వద్దనుండగ వచ్చును. మనమిచ్చట నొక సంగతి తెలిసికొన వలెను. ఆన **1250** సం॥లో భూమి P వద్ద నుండగ ఉత్తరార్ధగోళమందు శీతకాలము వచ్చెను. కాబట్టి (1250 + 10500)=ఆన **11750**వ సం॥లో భూమి A వద్దనుండగ భరింపశక్యముగాని శీతకాలము ఉత్తరార్ధగోళమందు రాబోవుచున్నది. ఈప్రకారమే, వెనుకకు లెక్కవేసికొని వెళ్లగ (1250-10500=9250) క్రీ॥పూ॥ **9250** సం॥ల నాడు భూమి A వద్దనున్నప్పుడు భరింపశక్యముగాని శీతకాలము వచ్చెను.

సూర్యుడు అండాకారమునకు సరిగ మధ్యనుండక ఒక ప్రక్క నుండును. మరియు యీయండాకారమైనను సదా

యేకరూపముగనే యుండక, ఒక్కొక్కప్పుడు లావుగ ఉబ్బుచుండును, మరియొకప్పుడు సన్నగిలుచుండును. ఈ రెండు కారణములచే వేసవి శీతకాలముల యవధులలో చాలభేదములు గలుగును. ఈ అండము బాగుగ సన్నగిల్లినప్పుడు భూమి P వద్దనుండగ శీతకాలము వచ్చినచో అది ఆ సంవత్సరమువచ్చు వేసవికంటె 33 దినములు తక్కువగ నుండును. కాని, 10500 సం॥ లు దాటినపిమ్మట శీతకాలము భూమి A వద్దనుండగ వచ్చును. అప్పుడు శీతకాలము ఆ సంవత్సరమందు వచ్చు వేసవికంటె 33 దినము లెక్కువగ నుండును. ఇది కూడ శీతకాలమును దుర్భరముచేయుటకు తోడ్పడును. ఈ ప్రకారము వేసవి, శీతకాలములకుగల భేదము-అండాకారము యొక్క కొలతనుబట్టి- 7½ మొదలు 33 రోజులవరకు మారుచుండును. 33 రోజులు మించదు.

శీతకాలమును దుర్భరముచేయు పరిస్థితి యింకొకటి గలదు. ఇరుసుయొక్కవంపు షుమారు 23°-27′ లుగ గ్రహించి సర్ రాబర్టుబాల్‌గారు లెక్కవేసి చూచి తేల్చిన సారాంశమేమనగ - సూర్యునివల్ల యీ భూమిమీదికి సంవత్సరమునకు సగటున 365 మాత్రలవేడి వచ్చుననుకొందము. వీనిలో ప్రతి అర్ధగోళమునకు వేసవిలో 269 మాత్రలును, శీతకాలములో 136 మాత్రలును మాత్రమే లభించును. దీనినిబట్టి ఉత్తరార్థగోళమందు అతిదీర్ఘమైన శీతకాలమునకు 136 మాత్రల వేడిని మాత్రమే పంచిపెట్టవలసి వచ్చినప్పుడు అచ్చటవేడికి



యెంత కరువువచ్చునో గ్రహింపుడు. ఇట్టిస్థితిలో కొద్దికాలము నులివెచ్చని వేసవియు, దీర్ఘకాలము అతిచలితోగూడిన శీతకాలమును తటస్థించును.

ఈ శీతకాలములో పేరుకొన్న మంచును కరగించుటకీ కొద్దిపాటి నులివెచ్చని వేసవి యెంతమాత్రమును చాలదు. కావున సంవత్సరములు గడచినకొలది మంచుగుట్టలు పేరుకొనుచుండును. ఇదియే మంచుప్రళయము. ఈరీతిగనే మంచుయుగము వచ్చును.

పైనచెప్పినప్రకారము 21000 సం॥ లకొకపర్యాయము భూమి A వద్దనున్నప్పుడు ఉత్తరార్థగోళమందు శీతకాలము వచ్చుచుండును. అప్పుడే మంచుయుగము తటస్థించును. ఈరీతిగ షుమారు 21000 సం॥ లకొకపర్యాయము హిమప్రళయము వచ్చుచుండును.

క్రోలుగారి సిద్ధాంత మింతవరకు బాగుగనే యున్నది. దీనిని అంగీకరించిరనియే చెప్పవచ్చును. కాని, వారేవో కొన్నిలెక్కలను వేసిచూచి క్రిందటి హిమప్రళయము గతించి యిప్పటికి 80 లేక 100 వేల సంవత్సరములైనదని చెప్పిరి. ఈ లెక్కలు సరియైనవికావని తక్కిన పండితులు చెప్పుచున్నారు. అదిగాక, మొదటి అధ్యాయములో అమెరికను భూగర్భశాస్త్రవేత్తలు తేల్చిన 8 లేక 10 వేల సంవత్సరముల కంటె యిది చాల యెక్కువగ నున్నది.

క్రోలుగారి అంకెలెట్లున్నను మనమింతవరకు మాత్రము గ్రహించవచ్చును. A వద్ద శీతకాలము వచ్చుటయు, లయల్ మొదలగు వారు చెప్పిన భూ, జలవిభాగము లనుకూలముగ నుండుటయు—ఈ రెండును హిమప్రళయముల గల్పించుటకు చాలును. 21000 సం॥ల కొకపర్యాయము A వద్ద శీతకాలము వచ్చును.

ఈ లెక్కల నింతటితో నిలుపుదము. ఆర్యులు ఐరోపాయందును, ఆకసను జక్సార్టీసు, సింధునదీ ప్రాంతములందును నివసించుటకు పూర్వమం దెచ్చటనుండిరో వేదప్రమాణ సహితముగ కనుగొనుటయే నాకీగ్రంథమందు కర్తవ్యమైయున్నది. కావున, యీ కర్తవ్యమునకు సంబంధించినంతవరకు, యీ రెండధ్యాయములలో చర్చించిన సారాంశమిట క్లుప్తముగ వివరించెదను.

(1) ఆర్యభాషల మాట్లాడు నిప్పటి యూరోపియన్ జాతుల పూర్వజులచేత ఉత్తరశిలాయుగారంభమందే ఐరోపా ఖండము నిండియుండెను.

(2) ఉత్తరశిలా యుగారంభమందే ఐరోపాలో ఆర్యజాతి యొకటియుండెను. గావున వీరు ప్రళయానంతరమందు ఆశియానుండి యూరోపుకు వచ్చినవారు కారు. అయినను, వీరేదేశమునుండియు రాక ఆగడ్డలోనే పుట్టినారని చెప్పుట



కును వీలు లేదు. ఇంతమాత్రముచే వీరిమూలస్థాన మెద్దియో నిర్ణయము కాలేదు.

(3) లోహాయుగము యూరోపులోనికి పరదేశస్థుల వలన తీసికొనిరాబడినట్లు తెలియుచున్నది.

(4) ఇనుప, కంచు, శిలాయుగములు అన్ని దేశముల లోను సమకాలికములుగావు. ఈజిప్టులో మహోన్నత నాగరిక మున్న సమయమందే యూరపులో ఉత్తరశిలా యుగపు మోటతనముండుట అసంభవముకాదు.

(5) ఆధునిక భౌతిక శాస్త్రప్రమాణరీత్యా క్రిందటి హిమప్రళయమువచ్చి యిప్పటికి పదివేలసంవత్సరములు(లేక క్రీ॥పూ॥8000ల) కంటె యెక్కువకాలేదని సిద్ధించుచున్నది.

(6) మనుష్యుఁడు హిమప్రళయానంతరమే పుట్టెనని యిదివరకు పండితులు తలంచిరి. కాని, యిదిసరికాదనియు, మానవుడు చతుర్థయుగమందంతటను,- తృతీయయుగములో కూడ - నుండెనని తెలియుచున్నది.

(7) కనీసము హిమప్రళయములు రెండైనను వచ్చెను. ఈ రెంటికినిమధ్య చక్కని సమశీతోష్ణస్థితి యుండెను. ఆ కాలమందీ గోళములోనున్న భూజలభాగములు యిప్పటి కంటె చాల వేరుగనుండెను.

(8) ఈ మంచుయుగములలో శీతోష్ణస్థితులు చాల హెచ్చుతగ్గులుగ నుండెను. హిమప్రళయములలో అతి చలిగ నుండెను. మధ్యకాలములో సమశీతోష్ణముగ నుండెను.

(9) ఆశియా ఐరోపా, ఖండములలోనున్న ఉత్తర ధ్రువ మండలములలో క్రిందటి ప్రళయాత్పూర్వము హాయియైన వేసవియు నులివెచ్చని శీతకాలమునుండెను. అది ఒక విధముగ "సంతత వసంతసమయము" గ నుండెనని హర్షెల్ పండితుడు చెప్పుచున్నాడు. నవంబరు మొదలు మార్చి వరకు సూర్యుడు క్షితిజము క్రిందికి గ్రుంకియుండు స్పిట్సు బర్గె మొదలగు ధ్రువప్రాంతములలో సైతము యిప్పుడు ఉష్ణమండలములలో మాత్రమే పెరుగు తరులతాదులు దట్టముగ పెరిగియుండెను.

(10) హిమప్రళయము వచ్చుటచేతనే యీచక్కని దేశము పాడైపోయెను. ఉష్ణమండలములలో పెరుగు చెట్లుగాని, మృగములుగాని నివసించుటకు వీలులేకపోయెను.

(11) ఈ హిమప్రళయ మేలవచ్చెనో తెలిసికొనుటకు మనకు ఖగోళశాస్త్రప్రమాణములే యెక్కువ విశ్వసనీయములుగ నున్నవి. కాని, దీని కాలనిర్ణయ మొనర్చుటకు మాత్రము భూగర్భశాస్త్రప్రమాణముల నాధారముగ గొనుట యెక్కువ శ్రేయస్కరము.

(12) "గెయికీ" గారి సిద్ధాంతమునుబట్టి రెండుగాక 4, 5, ప్రళయములుగూడ వచ్చినట్లు తెలియుచున్నది.

(13) ఒక్క ఆర్యులేగాక, తక్కిన మానవకోటి కంతకును ఉత్తరధ్రువమండలమే పురిటియుయ్యెల ( శైశవ



డోలిక ) యయ్యెనని చాలమంది పండితులు చెప్పుచున్నారు. వృక్షములు, జంతువులును ఆదియం దచ్చటనే పుట్టుకగాంచెనని చాలమంది శాస్త్రవేత్తలు చెప్పుచున్నారు.

వేదములందు ఉత్తరధ్రువనివాసమును సూచించుటకు ప్రమాణము లేమైన గాన్పించినచో, అవి యిప్పటి భౌతికశాస్త్రప్రమాణములకు విరోధముకాజాలవని తెలిసికొనవలెను. విరోధముకాకపోవుటయే గాక అవి యీసిద్ధాంతమునకు చాల అనుకూలముగకూడ నున్నవి.



# వైదిక నిలయము

## మూడవ అధ్యాయము.

### ధ్రువప్రాంత లక్షణములు.

హిమయుగమునకు పూర్వయుగములలో యీ భూమి యొక్క పైయాకారము యిప్పటివలె లేక వేరుగ నుండెననియు, అప్పటి భూజలభాగములు వేరుగనుండెననియు, చెప్పియున్నాము. ఈ సిద్ధాంతము భూగర్భశాస్త్రపరిశోధనల వలన ధ్రువపరుపబడినది. దీనిని త్రోసివేయుటకిక వీలుకాదు. కనుక పూర్వయుగములలో నుత్తరధ్రువమునుచుట్టి కొంత భూభాగముండెనని మనముతలంపవచ్చును. ఈ విషయమును కూడ భూగర్భశాస్త్రమే ఋజువుపరుచుచున్నది. ఇప్పు డుత్తర ధ్రువముచుట్టునున్న "నోవాజంబ్లా" "స్పిట్సుబర్గెన్" మొదలగు లంకలన్నియు, పూర్వము సముద్రముపైకి కనబడుచుండిన భూభాగముమీది పర్వతశిఖరములనియు, ఆభాగము నీటిలో మునిగిపోగా యీపర్వత శిఖరములు మాత్రము పైకి కనబడుచు సముద్రము మధ్య లంకలవలె నిలిచియున్నవనియు భూగర్భశాస్త్రవేత్తలు నిర్ధారణచేసిరి. మరియు చతుర్థయుగమందంతటను యీయుత్తరధ్రువప్రాంత భూభాగములపై పశుపక్ష్యాదులును, నరులును నివసించుచుండినట్లు



కూడ భూగర్భశాస్త్రపరిశోధనలవలన ఋజువైనది. ఇకనిచ్చటి శీతోష్ణస్థితి విషయమై ప్రజలు నివసించుట కనుకూలముగనే యుండెనని రెండవ అధ్యాయములో చెప్పియుంటిమి. అచ్చట శీతోష్ణస్థితి "సంతతవసంతసమయ" (Perpetual Spring) మన్నట్లుండెనని కొందరు శాస్త్రవేత్తలు పలికియున్నారు.

ఉత్తరధ్రువముచుట్టును పూర్వమొకప్పుడు ప్రజలు నివసించుటకనుకూలమైన శీతోష్ణాది స్థితులుగల భూభాగముండెనని మన మొప్పుకొంటిమి. అంతమాత్రముచేత ఆర్యసంతతివా రాకాలములో నాదేశములలో నివసించుచుండిరని మన మెట్లు చెప్పగలము? దీనికై మనవేదములను పరీక్షించి చూడవలెను. ఉత్తర ధ్రువప్రాంతదేశలక్షణము లేవైన యీ పూర్వగ్రంథములలోను, వారి యాచారములలోను వారి గాథలలోను కనుపించినయెడల మనవారొకప్పు డచ్చట నివసించియుండి యుండవలెనని మనము నిర్ధారణ పరుపవచ్చును. ఋగ్వేదమునందు కొన్నికొన్ని చిత్రమైన అంశములును, గాథలునుగలవు. వీనికన్నిటికిని చాలభాగ మేదోవిధముగ అతుకులుపెట్టి ప్రాచీన భాష్యకారులు అర్థమును చెప్పిరి. ఈయర్థము లెంతమాత్రమును తృప్తికరముగ లేవు. అదిగాక, యేవిధముగ విరిచి అతుకులుపెట్టి అర్థము చెప్పుదమన్నను సాధ్యపడని కొన్ని కొన్నియంశము లింకను ఋగాది వేదములందు మిగిలియే యున్నవి. పోనీ యీఋక్కులయం దేమైన పద కాఠిన్యముగాని, అర్థకాఠిన్యముగాని యున్నదేమో యనిన అది

యును లేదు. పైకి చూడబోయిన అన్నియును తెలిసిన మాటలే, అన్నియు తేలికమాటలే కాని వాని నిజభావ మేవిధముగ జూచినను మన యీదేశకాల పాత్రములతో సమన్వయింపజాలము. కాని యీబుక్కులలోని యంశములనే ఉత్తరధ్రువప్రాంతదేశములతో బోల్చిచూచినప్పుడు మాత్రము సర్వమును సంపూర్ణముగ సమన్వయమగును. ఆవర్ణనలు ఆ దేశకాలాదివ్యవహారములు, ఆ చిత్రవిచిత్రములగు రాత్రింబవళ్ళ తారతమ్యములు అన్నియును ఉత్తరధ్రువదేశములకే సరిపోవును గాని, మన హిందూదేశము మొదలగు దక్షిణ భూభాగముల కెంతమాత్రమును సరిపోవు. పూర్వ మెకప్పుడు మనయార్యు లీ ఉత్తరధ్రువప్రాంతదేశములలో నుండిరను అనుమానము మన భాష్యకారుల మనస్సునకు తట్టనందున, పైకి బహు తేలికగ గనుపడుచున్న కొన్నికొన్ని వేదవాక్యములకు నిజార్థమును చెప్పలేక వారు ఉక్కిరిబిక్కిరియైరి. ఈకీలకము నెరిగినయెడల వీనికన్నిటికిని అర్థము కరతలామలకమగును. కనుక యీ వేదవాక్యము లన్నిటినిగూర్చి విచారించుటకు ముందు ఉత్తరధ్రువలక్షణము లేవియో, దాని చుట్టునుండు భూభాగముయొక్క లక్షణము లేవియో, వీనికిని దక్కినవానికిని భేదము లేవియో కొంచెము దఙ్మాత్రముగ నీయధ్యాయములో సూచించెదను.

ఈభూమి గుండ్రని మట్టిముద్దవలెమున్నది. ఈమట్టిముద్దమధ్య నొకపుల్లను గ్రుచ్చినట్లైన నది రెండువైపులకును



పొడుచుకొనివచ్చునుగద. ఈపుల్లయే యిరుసు. ఉత్తరదక్షిణములుగ నున్నది. ఈయిరుసు నాధారముచేసికొని ఈభూగోళము పడమరనుండి తూర్పునకు 24 గంటలకొక చుట్టు చొప్పున సంవత్సరమునకు 360 చుట్లు తిరుగుచున్నది. ఈయిరుసు భూమియొక్క పైభాగమునకు పొడుచుకొనివచ్చు రెండుచోటులకు ధ్రువములని పేరు. ఉత్తరపువైపున నున్నది ఉత్తరధ్రువము, దక్షిణమున నున్నది దక్షిణధ్రువము. ప్రస్తుతము మనము ఉత్తరధ్రువలక్షణములను గూర్చియే విచారింపవలసి యున్నది. ఈ భూగోళ మెప్పుడును ఒక ఇరుసుమీదనే తిరుగుచున్నదిగాని, యీ ఇరుసు మారిపోలేదని ఇదివరకే చెప్పియుంటిమి. మన యీ చిన్నిభూగోళము అనంతమైన యీ బ్రహ్మాండగోళములో కొన్నికొన్ని నియమములననుసరించి తిరుగుచున్నది. ఈ భూభ్రమణమువలన బ్రహ్మాండగోళములోని సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు మొదలగునవన్నియు తూర్పునుండి పడమరకు నడుచుచున్నట్లు మన కండ్లకు కనుపించుచున్నవి. కాని, యీ ఇరుసునకు సూటిగ నుత్తరదిశనున్న నొకానొక నక్షత్రముమాత్రము కదలక ఒకే చోట నిలిచియున్నట్లు కనిపించును. దీనికే ధ్రువనక్షత్రమని పేరు. ఈ ధ్రువనక్షత్రము నాధారముచేసికొని తక్కిన నక్షత్రాదులన్నియు దానిచుట్టును తిరుగుచున్నట్లు కనుపించును.

మన మెవరమైనను భూమిపైనున్న ఉత్తరధ్రువము వద్దకు పోయి, అచ్చట నిలువబడి చూచినట్లయిన మన కేమి

గాన్పించును ? ఉత్తరధ్రువనక్షత్రము సూటిగ మన నెత్తిమీద గాన్పించును. తక్కిన నక్షత్రాదు లన్నియు యీ దేశములోవలె తూర్పున నుదయింపక ఆ ధ్రువనక్షత్రముచుట్టును అడ్డముగ కుమ్మరిసారెవలె గిరగిర తిరుగుచుండును. ఖగోళములో ఉత్తరార్ధగోళముమాత్రమే కాన్పించును. దక్షిణార్ధగోళమంతయు సదా పూర్తిగ మరుగుపడి యుండును. అనగ మనకు సూటిగ నెత్తిమీద నున్నదే ఉత్తరదిశయగును. మనకు అధోభాగమందు భూమిక్రింద నున్నదే దక్షిణదిశయగును. అచ్చట సూర్యుడు దినదినమును నుదయింపడు. ఒకసారి యుదయించిన పిమ్మట ఆరు నెలలవరకును అస్తమింపడు; అస్తమించిన తిరిగి ఆరు నెలలవరకును ఉదయింపడు. అనగ, ఆరు నెల లెడతెగని పగలును, దానివెంట యెడతెగని రాత్రియు నుండును. ఆరు నెలల దీర్ఘరాత్రి యనంతరము సూర్యుడు దక్షిణార్ధగోళములోనుండి పైకి ఉత్తరార్ధగోళములోనికి వచ్చుచుండగ సూర్యుడు "దక్షిణమునుండి యుదయించుచున్నట్లు" చెప్పవలసి వచ్చును ! ఇది ఉత్తరధ్రువమువద్దనున్న గొప్ప వింత.

సూర్యోదయమునకు పూర్వము ఉషఃకాల ముండును గద. అనగ, వెలుతురు కొద్ది కొద్దిగ వచ్చుటకు ప్రారంభించినది మొదలుకొని పూర్తిగ సూర్యబింబము పైకివచ్చువరకును గల కాలము ఉషఃకాల మనబడును. ఈ యుషఃకాలము సుమారు ముప్పదిదినము లెడతెగక యుండును. మొదట నీ వెలుతురు భూమియు ఆకాశమును కలిసినట్లు కనబడుచోట



కాన్పించి, ఆ యంచుచుట్టును దినమునకొకసారి గిర్రున తిరుగుచుండును. ఈ వెలుతు రిట్లు దినమున కొకసారి యొక చుట్టు చొప్పున తిరుగుచు, దినములవరుసను పైకి వచ్చుచుండును. ఇట్లు క్రమక్రమముగ ఉషస్సులు పైకి వచ్చుచుండగ, 30 దినములైన పిమ్మట సూర్యబింబము పైకి గాన్పించును. ఈ సూర్యబింబముకూడ నిదేవిధముగ అంచుచుట్టును తిరుగుచు క్రమముగ దినములవరుసను పైకి వచ్చుచుండును. ఇట్లు క్రమముగ 23½ డిగ్రీలయెత్తువరకు పైకిపోయి, తిరిగి క్రమముగ క్రిందికి దిగి, ఆరునెలలైన పిమ్మట బింబము క్రుంకును. బింబము క్రుంకినను సాయంకాలపు "యీరెండ" (సంధ్యారాగము) యుండునుగద. ఉదయకాలపు ఉషస్సువలెనే యీ "యీరెండ" కూడ సుమారు ముప్పదిదినము లుండును.

మన యీదేశములోని ఉషఃకాలము కొన్ని నిమిషములు మాత్రమే యుండును. కాని, ధ్రువమువద్ద అది సుమారు 30 దినము లెడతెగక యుండును. దీర్ఘ నిశానంతరమువచ్చు యీదీర్ఘ ఉషస్సు అచ్చటి ప్రజల కెంత ఆనందసంధాయకముగ నుండునో వేరుగ చెప్పవలెనా ? "స్వర్గము దొరికె" నను పుస్తకములో డాక్టర్ రేగా రీధ్రువ ఉషస్సును గూర్చి యిట్లు వర్ణించియున్నారు:—

"మొట్టమొదట క్షితిజమువద్ద తమసావృతమగు ఆకాశభాగమందు క్రిందుగ కొంచెము వెలుగు కనుపడి కనుపడనట్లుగతోచును. ఈ వెలుగువలన రేవో కొన్నిచిన్న

నక్షత్రముల కాంతిమాత్రమే కొంచెము కనుమాయును. కాని, కొంచెముసేపటికే యీ వెలుగు క్రమముగ వృద్ధియగుచు అప్పటి కింకను చీకటిగ నున్న క్షితిజపు అంచుచుట్టు మెల్లగ తారుచు ప్రాకిపోవుచున్నట్లు గాన్పించును. 24 గంటలగునప్పటి కీవెలుగు మనచుట్టు పూర్తిగ ఒకప్రదక్షిణము చేసి యథాస్థానమునకు చేరుకొనును. ఇప్పటి కీవెలుగు యెక్కువై, యింకచాల నక్షత్రముల కాంతిని మాపివేయును. ఈ వెలుగు క్రమముగ వృద్ధియగుచు, ముత్యపుకాంతులను ఆకాశమందంతటను వెదజల్లుచు క్షితిజపు అంచుచుట్టు గిరగిర తిరుగుచు పోవుచుండును. ఈరీతిని మహావైభవముతో క్షితిజమునకు ప్రదక్షిణముచేయుచు పోవుచుండు యీ జ్యోతి రానురాను ఎర్రని రోజారంగులోనికి మారును. ఈరోజా రంగుచుట్టు ఊదా, బంగారు రంగులు అందముగ అంచులు దీరియుండును. ఈప్రకారము రోజులు గడచినకొలది చిత్రవిచిత్రవర్ణములతో మహావైభవముగ ప్రదక్షిణములొనర్చు యీయుషఃకాంతి వాతావరణ పరిస్థితుల ననుసరించి హెచ్చుచు, తగ్గుచు, అంచుక్రింద దాగియున్న సూర్యబింబము అంచును సమీపించుచున్నకొలది మరింతహెచ్చుచు పోవుచుండును. ఈరీతిని రెండుమాసములవరకు తననెచ్చెలియగు ఉషాకన్యకను చిత్రవిచిత్రవర్ణములతో పలుకాంతులతో శోభాయమానముగ గిరగిర క్షితిజముచుట్టు నాట్యమాడించి యాడించి, మానవలోకమును ఊరించి ఊరించి, తుట్టతుదకు సూర్య



భగవానుడు తనదీర్ఘవిశ్రాంతినుండి మేల్కొని, తనకొరకై పరితపించుచున్ననరులకంటియెదుట బింబరూపముతో ప్రత్యక్షమగును. ఒకటిరెండుచుట్లు తిరుగగనే, మిరుమిట్లుగొల్పు సూర్యబింబపు అంచు క్రమముగ పెద్దదియై తుదకు పూర్ణబింబము—నిండుకాంతులతో పైకివచ్చును. అంతట, దూరమందున్న పర్వతశిఖరములన్నియు తమస్సును వీడి, నిజకాంతులతో ప్రత్యక్షమగును. అప్పటినుండి సూర్యబింబము పూర్తిగ ఆరుమాసములవరకు మానవుల కండ్లయెదుట ప్రత్యక్షముగ గాన్పించుచు, గిరగిర అడ్డముగ కుమ్మరిసారెవలె తిరుగుచు పోవుచుండును; ఈ ఆరుమాసములలో అంధకారరాక్షసిని ఒక్కనిమిషమైనను తనప్రియభూమియగు మేరుభూమిపై పడకుండ జేయును. ఆరుమాసములయనంతరము సూర్యుడు క్షితిజముక్రిందికి పోవునప్పుడు సైతము యిదేరీతిని తాను ఉదయించునప్పుడెట్టి చిత్రవిచిత్రకాంతులను చూపెనో అట్టి కాంతులనే నానారీతుల ప్రదర్శించుచు, తానిప్పుడీలోకమును వదలిపోవుచున్నను తిరిగిమరలివచ్చెదనని లోకుల కభయమిచ్చుచున్నాడో యన్నట్లు మిణుకు మిణుకుమను కాంతులతో సూర్యభగవానుడు క్రుంకును. ”

ధ్రువమువద్ద సంవత్సరలక్షణము లెట్లుండునో కెప్టెన్ పిమ్ అను నతడు వర్ణించియున్నాడు:—

జనేవరి 29 వ తేదీన మొట్టమొదట వెలుగు కాన్పించును. ఈ వెలుగే ఉషఃకాంతి. ఈ ఉషస్సు 47 దినము

లుండును. అనంతరము అనగ మార్చి 16 వ తేదీన సూర్య బింబోదయమగును. సెప్టెంబరు 25 వ తేదీన సూర్యబింబము క్రుంకును. కాని, తరువాత 48 రోజులవరకు "యీరెండ" యుండును. 48 వ నాడు అనగ నవంబరు 13 వ తేదీన లోక మంతయు గాఢాంధకారమందు మునిగిపోవును. 76 రోజుల వరకు సూర్యుడు కనుపింపడు. ఈ దీర్ఘరాత్రి ముగియగనే, దీర్ఘదివసము వచ్చును. సూర్యుడు 194 రోజులు క్షితిజముపై నుండును. కాబట్టి ధ్రువమువద్ద సంవత్సరము యీరీతిగ నుండును.

(1) 29 జనేవరి మొ॥ మార్చి 16 వరకు ఉషస్సు 47 రోజులు.
(2) 16 మార్చి మొ॥ సెప్టెంబరు 25 వరకు (సూర్యుడు క్షితిజముపై నుండుకాలము) } దీర్ఘదివసము 194 రో
(3) సెప్టెంబరు 25 మొ॥నవంబరు 13 వరకు యీరెండ. 48రో
(4) నవంబరు 13 మొ॥ 29 జనేవరివరకు దీర్ఘరాత్రి 76 రో
వెరశి సం॥ 365 రోజులు.

దీనినిబట్టి సూర్యుడు 194 రోజులు క్షితిజముపైనను, మిగత 171 రోజులు క్షితిజముక్రిందను నుండును. అయినను, ఇందులో సూర్యసంబంధమగు వెలుగులేని చీకటి 76 రోజులు మాత్రమే. ఈ చీకటిలోకూడ చంద్రకాంతి, నక్షత్రకాంతి "అరోరాబోరియాలిస్" (Aurora Borealis) అను జ్యోతి యొక్క కాంతి యుండుటచే దీర్ఘనిశి మన మనుకున్నంత దుర్భరముగ నుండనక్కర లేదు. మన పూర్వులీ 4 మాసముల



కటికిచీకటిలో నెట్లు బ్రతుక గలిగిరని మన మాశ్చర్యపడ నక్కరలేదు. ఉత్తరధ్రువమువద్ద (మేరువువద్ద) నూటిగ నెత్తి మీద బంగారు కాంతులను విరివిగ వెదజల్లు పెద్ద జ్యోతి యొక్కటి గలదు. దీనినే ("Aurora Borealis") అందురు. (ఈ జ్యోతియొక్క బంగారుకాంతులతో వెలుగొందుచుండుట చేతనే, మేరుపర్వతము బంగారుకొండ యైనది )

కేవలము ధ్రువమువద్దనున్న స్థితిగతు లివి. ధ్రువ మనునది కేవల మొక్కబిందు వే (Point) అను సంగతిని మరువ కూడదు. ఆర్యు లొకప్పు డచ్చట నున్నారన్నచో, అందరు గుమిగూడి ఆ బిందువుమీదనే కూర్చుండిరని అర్థముకాదు. ఈ ధ్రువబిందువును చుట్టియున్న భూభాగమును వారాక్రమించు కొనియుండిరని భావము. కాని, కేవల ధ్రువబిందువువద్ది లక్షణములకును, ధ్రువమును చుట్టియున్న భూభాగలక్షణము లకును కొంత భేదముండును. ధ్రువమునకును, దిగువనున్న ధ్రువరేఖకును మధ్యగల భూభాగమునకు ధ్రువమండల మని పేరిడుదము. ఆర్యులీధ్రువమండలములో నుండిరని మా సిద్ధాంతము.

ధ్రువబిందు లక్షణములను బట్టియే ధ్రువమండల లక్షణములుకూడ, కొన్నిమార్పులతో, సంపాదితము లగుచున్నవి. కావున, వాని నిట క్లుప్తముగ వివరించెదము.

ధ్రువమువద్దనున్న మనుష్యులకు ధ్రువనక్షత్రము నూటిగ నెత్తిమీద గాన్పించుననియు, తక్కిన నక్షత్రాదు

లన్నియు దాని నాధారముచేసికొని, కుమ్మరిసారెవలె, అడ్డ వలయములు తిరుగుననియు చెప్పియుంటిమి. కాని, ధ్రువమును వదలి దిగువకు వచ్చినచో ధ్రువనక్షత్రము మన నెత్తి మీాదనుండక, ప్రక్కకు దిగును. దాని ననుసరించియే నక్షత్రాదులు తిరుగు వలయములుకూడ సరిగ అడ్డముగ నుండక, ఒక ప్రక్కకు ఒరుగును. ఈ ఒరుగుడుచేత, ఇదివరకు క్షితిజముతో సమముగ అడ్డముగ నున్న వలయము లిప్పుడు కొంత భాగము క్షితిజముపైకిని, మరి కొంత భాగము క్షితిజము క్రిందకును ఒరిగి యుండుట తటస్థించును. అందుచే, సూర్యుని వార్షికగమనములో కొన్ని మార్పులు గాన్పించును. ధ్రువమువద్ద ఆరునెలలుగనున్న దీర్ఘరాత్రియు, దీర్ఘదివసమును మార్పుజెంది, క్రిందికి వచ్చినకొలది 5, 4, 3, 2, 1, నెలలవరుసను క్రమముగ తగ్గిపోవును. ధ్రువరేఖనుదాటి, సమశీతోష్ణమండలములోనికి రాగానే, దీర్ఘరాత్రియు, దీర్ఘదివసమును పూర్తిగ మాయమైపోయి, అన్నియు 24 గంటల పరిమితిగల మన మామూలు అహోరాత్రములే యేర్పడును.

కేవలము ధ్రువబిందువుమీాదనే గాక ధ్రువమండలములో నివసించు మానవునకు సంవత్సరము మూడు ముఖ్యభాగములుగ విభజింపబడియుండును. (1) దీర్ఘరాత్రి (2) దీర్ఘదివసము. (3) వివిధపొడవులు గలిగి మొత్తము 24 గంటలకు మించని అహోరాత్రములు. దీర్ఘరాత్రి ఆరునెలలకంటె



తక్కువగను, 24 గంటలకంటె యెక్కువగను ఉండును. దీర్ఘదివసముకూడ అట్లే ఆరునెలలకు తక్కువగను 24 గంటలకు యెక్కువగను ఉండును. సంవత్సరమునకు ఒకకొనయందు దీర్ఘరాత్రియు, రెండవకొనయందు దీర్ఘదివసమును ఉండును. మధ్యభాగమందు మొత్తము 24 గంటలకుమించని అహోరాత్రము లుండును. గ్రీష్మసంక్రమణము దీర్ఘదివసమునకు సరిగ మధ్యబిందు వగును. అట్లే హిమసంక్రమణము దీర్ఘరాత్రికి సరిగ మధ్యబిందు వగును. సంవత్సరమం దేర్పడిన యీ త్రివిధవిభాగము బహుచమత్కారముగ నున్నది. కావున దీనిని తెలిసికొనుట కొక ఉదాహరణ నిచ్చెదను.

ధ్రువబిందువును దాటి దక్షిణముగ కొంతదూరము వచ్చితి మనుకొనుము. అప్పుడు ధ్రువమువద్దనున్న ఆరునెలల దీర్ఘరాత్రియు క్రమముగతగ్గి అక్కడరెండునెలల దీర్ఘరాత్రియే యయ్యె ననుకొనుము. హిమసంక్రమణము దీర్ఘరాత్రికి మధ్యబిందు వని చెప్పితిమిగాన యీ రెండునెలల దీర్ఘరాత్రిని రెండుసమభాగములుగ చీల్చినచో ఒకనెల హిమసంక్రమణమునకు ముందుగను, మరి యొక నెల హిమసంక్రమణమునకు వెనుకను దీర్ఘరాత్రి వ్యాపించి యుండును. హిమసంక్రమణము డిశంబరు 21 వ తేదీన వచ్చును. కావున, డిశంబరు 21 వ తేదికి ఒకనెల ముందుగను, ఒక నెల వెనుకను, దీర్ఘరాత్రి యుండును. ఇట్లే దీని కనుగుణ్యముగ జూను 21 వ తేదీకి (అనగ, గ్రీష్మసంక్రమణమునకు) ఒకనెల ముందును,

ఒకనెల వెనుకను దీర్ఘదివస ముండును. ఈ రీతిగ దీర్ఘరాత్రి, దీర్ఘదివసముల పరిమితి నాలుగునెలలుపోగా, యింక సంవత్సరములో 8 నెలలే మిగులును. ఈ 8 నెలలలో ఒక్కొక్కటి 24 గంటలకు మించని అహోరాత్రము లుండును. దీర్ఘరాత్రి అంతమొందగనే ( జనేవరి 22 వ తేదీన ) యీ 24 గంటల అహోరాత్రముల వరుస ప్రారంభ మగును. ఈ 24 గంటల అహోరాత్రములలో మొట్టమొదట రాత్రిభాగమే బహు యెక్కువగ నుండును. క్రమముగ సూర్యు డుత్తరమునకు పోయినకొలది రాత్రిభాగము క్రమముగ తగ్గిపోవుచు పగటి భాగ మెక్కువగుచు వచ్చును. ( కాని యీ రాత్రింబవళ్ళు రెండు కలిసి మొత్తమువిూద 24 గంటలకు మించవు. ) ఈ రీతిగ, పగటిభాగ మెక్కువగుచు వచ్చి వచ్చి, నాలుగుమాసము లగునప్పటికిని 24 గంటలును పగలే యగును. రాత్రి భాగము పూర్తిగ మాయ మగును. అనగ, దీర్ఘదివస మేర్పడును. ఈ దీర్ఘదివసము రెండు నెల లుండు.

ఈ దీర్ఘదివసానంతరము ( అనగ జులై 22 వ తేదీనుండి ) తిరిగి 24 గంటలకుమించని అహోరాత్రము లేర్పడును. మొట్టమొదట యీ 24 గంటలలో పగటి భాగమే బహుయెక్కువగనుండి రాత్రిభాగము కొద్దికొద్దిగనుండును. క్రమముగసూర్యుడు దక్షిణమునకు పోయినకొలది అంతకంతకు రాత్రిభాగ మెక్కువగుచువచ్చి నాలుగు మాసము లగునప్పటికి



పగటిభాగమును పూర్తిగ ముంచివేయును. అనగ, దీర్ఘరాత్రి యేర్పడును. ఈ దీర్ఘరాత్రి హిమసంక్రమణమువద్ద రెండు నెల లుండునని చెప్పియుంటిమి.

ఇదేవిధముగ ధ్రువబిందువును చేరబోయినకొలది దీర్ఘరాత్రి 3, 4, 5, మాసములగుచువచ్చును. తదనుగుణముగనే దీర్ఘదివసమును 3, 4, 5, మాసములగును. ఈరీతిగ దీర్ఘదివస దీర్ఘరాత్రములు వృద్ధిజెందినకొలది పాపము మధ్యనున్న యీ 24 గంటల అహోరాత్రములకు చోటుతగుచు వచ్చును. కొసలయందున్న యీ దీర్ఘదివసదీర్ఘరాత్రముల మధ్యపడి యీ 24 గంటల అహోరాత్రములు నలిగి సన్నగిలి పోవుచు వచ్చును. తుట్టతుదకు ధ్రువబిందువు విూదికిచేరినప్పుడు దీర్ఘరాత్రివచ్చి ఆరుమాసములును దీర్ఘదివసమువచ్చి మిగత ఆరుమాసములను వెరశి పన్నెండుమాసములను ఆక్రమించుకొనుటచే మన 24 గంటల అహోరాత్రములకు — పాపము — తావేలేకపోవును. అవి పూర్తిగ మాయమై పోవును. అనగ ధ్రువమువద్ద 6 నెల లెడతెగని రాత్రియు, 6 నెల లెడతెగని పగలును ఉండును. ఈ సంగతిని మొదటనే వివరించియుంటిమిగద.

ధ్రువమునకు దక్షిణముగ దూరముపోయిన కొలది దీర్ఘరాత్రిసన్నగిల్లును. ధ్రువమువద్ద 6 నెలలుగనున్న దీర్ఘరాత్రి దక్షిణమునకువచ్చినకొలది 5, 4, 3, 2, 1 నెలలుగ తగ్గుచువచ్చును. అనగ మధ్యనున్న 24 గంటల అహోరాత్రము లెక్కువగుచువచ్చును. తుదకు ధ్రువరేఖను దాట

గనే సమశీతోష్ణమండలము (Temperate zone) లోనికి రాగానే — దీర్ఘరాత్రియు, దాని ననుసరించి దీర్ఘదివసమును పూర్తిగ మాయమైపోయి సంవత్సరము పొడవునను మన మామూలు 24 గంటల అహోరాత్రములే యేర్పడును.

మనకు యీ దేశములో సంవత్సరముపొడవునను ప్రతి దినము కొద్దిగనో గొప్పగనో సూర్యుడు కనుపించును. కాని ధ్రువమండలములో సంవత్సరములో కొన్ని రోజులవరకు యెడతెగకుండ సూర్యుడు క్షితిజముక్రింద గ్రుంకియుండి పైకి కనిపించనే కనిపించడు. దీనినే దీర్ఘరాత్రియంటిమి. కన్నులేనిది కలియుగమే లేదన్నట్లు సూర్యరశ్మిలేనిరోజులు రోజులేకావని లెక్కవేసికొన్నచో ధ్రువమండల సంవత్సరపరిమితి ఆరు మొదలు పదకొండుమాసములే యని చెప్పవచ్చును. అనగ ధ్రువమండలసంవత్సరములో మనకువలె 12 నెలలుగాక, 6 మొదలు 11 నెలలేయున్నవని చెప్పవచ్చును. (షరా:— ఆరవఅధ్యాయములోని పటములను చూడుడు) ఇక ఉషస్సును గూర్చి—ధ్రువమువద్ద ఉషస్సు రెండునెల లుండునని చెప్పితిమి. క్రిందికి దిగినకొలది దీర్ఘరాత్రితోపాటు యీ దీర్ఘఉషస్సు కూడ తగ్గిపోవును. ధ్రువరేఖనుదాటి మన సమశీతోష్ణమండలములోనికి రాగానే, ఉషస్సుకూడ బహుస్వల్పకాలమేయుండును. ధ్రువమువద్ద రోజులుతరబడి యెడతెగకయున్న ఉషస్సు దక్షిణమునకు వచ్చినకొలది కొన్నిగంటలో, లేక కొన్ని నిమిషములో మాత్ర ముండును.



ధ్రువమువద్ద గ్రీష్మఋతువు దీర్ఘదివసమప్పుడును, హేమంత ఋతువు దీర్ఘరాత్రమప్పుడును సంభవించును.

ఇంతవరకు జెప్పినదానినిబట్టి కేవలము ధ్రువబిందువు వద్దిలక్షణములకును, ధ్రువమండలలక్షణములకును భేద మున్నట్లు స్పష్టపడగలదు. కావున యీ రెండులక్షణములను యిచట వేర్వేరుగ వివరించెదము.

ధ్రువబిందువువద్ది లక్షణములు.

(1) సూర్యుడు దక్షిణమున ఉదయించును.

(2) నక్షత్రములు యీ మనదేశములోవలె ఉదయించి అస్తమింపవు. అవి అడ్డముగ కుమ్మరిసారెవలె 24 గంటల కొకచుట్టుచొప్పున గిరగిర (మన నెత్తిమీదటోపీవలె) తిరుగును. బ్రహ్మాండగోళములోని పై ఉత్తరార్థగోళముమాత్రమే గాన్పించును క్రిందనున్న దక్షిణార్థగోళము యెన్నడును గాన్పించనే గాన్పించదు.

(3) సంవత్సరమంతయు ఆరునెలలు యెడతెగని దీర్ఘరాత్రిచేతను, ఆరునెల లెడతెగని దీర్ఘదివసముచేతను ఆక్రమింపబడును.

(4) సంవత్సర మంతటిలో ఒక్కఉదయము, ఒక్కసాయంకాలనుమాత్రమే యుండును. అనగ, సూర్యుడు సంవత్సరమున కొకసారియే ఉదయించును. ఒకసారియే అస్తమించును. కాని, యీ ఉదయాస్తమయములందున్న ఉషస్సు యెడతెగకుండ షుమారు రెండునెల లుండును. సాయంకాల

ముందుగాని, ఉదయమందుగాని, ఉన్న యీ యెఱ్ఱని ఉషః కాంతి మన యీ దేశములోవలె ఒక్కతూర్పుననో, ఒక్క పడమరనో, మాత్రమే అంటియుండదు. అక్కడనున్న తక్కిన నక్షత్రములతోపాటు క్షితిజపుఅంచుచుట్టు 24 గంటల కొక చుట్టుచొప్పున అడ్డముగ కుమ్మరిసారెవలె గిరగిర తిరుగును. ఉషస్సుయొక్క యీ యెఱ్ఱనికాంతి యిట్లు అడ్డవలయములు తిరుగుచు రోజులు గడచినకొలది క్రమముగ ఆకాశముపై కెక్కుచువచ్చి 2 నెల లగునప్పటికి రక్తారుణమైన యెఱ్ఱని గుండ్రని సూర్యబింబమును క్షితిజముపైకి తెచ్చును. ఈ సూర్యబింబముకూడ యిదేగతిని అడ్డముగ తిరుగుచు ఆరు నెలలులోపుగ యెన్నడు అస్తమింపదు.

## 11 ధ్రువమండల లక్షణములు.

(1) సూర్యుడు సదా నడినెత్తికిదిగువను దక్షిణభాగ మందు గాన్పించును. కాని, ధ్రువమండలమునుదాటి మన సమశీతోష్ణమండలములలోకూడ సూర్యు డదేవిధముగ గాన్పిం చుటచే దీనినొక ప్రత్యేకధ్రువమండల లక్షణముగ చెప్పుటకు వీలులేదు.

(2) చాలనక్షత్రములు యెన్నడును క్రుంకక, పైకి గాన్పించుచునే ధ్రువనక్షత్రముచుట్టును గిరగిర తిరుగుచుం డును. కొద్దినక్షత్రములు మాత్రము మన యీ దేశములో వలెనే ప్రతిదినము ఉదయించుచు క్రుంకుచు నుండును. కాని, మనదేశములో నక్షత్రములకంటె యివి చాల బరువుగ తిరుగుచుండును.



(3) సంవత్సరమును మూడు భాగములుగ విభజింప వచ్చును.

(i) దీర్ఘరాత్రము-ఇది ఆయా ప్రదేశములకును ధ్రువ బిందువునకునుగల దూరమునుబట్టి 24 గంటలకంటె యెక్కువ గను 6 నెలలకంటె తక్కువగను ఉండు యెడతెగని-సూర్యుడు లేని-చీకటికాలము. ఇది హిమసంక్రమణమువద్ద తటస్థించును.

(ii) దీర్ఘదివసము- పైనజెప్పిన దీర్ఘరాత్రి కిది ప్రతి. ఇదియు 24 గంటల కెక్కువగను, 6 నెలలకు తక్కువగను గల యెడతెగని-సూర్యుడుగల-పగటికాలము. ఇది గ్రీష్మ సంక్రమణమువద్ద తటస్థించును.

(iii) సంవత్సరములో యీ దీర్ఘరాత్రి, దీర్ఘదివసముల కాలము పోగా మిగిలినకాలములో ఒక్కొక్కటి మొత్తము 24 గంటలకు మించని వివిధపాడవులుగల మన మామూలు అహోరాత్రముల వరుస. దీర్ఘరాత్రి ముగియగనే మామూలు అహోరాత్రములు ప్రారంభమగును. కాని, వీనిలో మొట్ట మొదట రాత్రికాల మెక్కువగను పగటికాలము బహు కొద్దిగను ఉండును. రోజులు గడచినకొలది యీ 24 గంట లలో పగటికాల మెక్కువగుచు వచ్చి తుదకు 24 గంటలును పగలే యగును. అనగ దీర్ఘదివస మేర్పడును. దీర్ఘదివసా నంతరము తిరిగి 24 గంటల అహోరాత్రములు ప్రారంభ మగును. మొట్టమొదట పగటికాలమే యెక్కువగ నుండి రాత్రికాలము చాల తక్కువగ నుండును. రానురాను రాత్రి భాగ మెక్కువై తుదకు 24 గంటలును రాత్రియే యగును.

అనగ, దీర్ఘరాత్ర మేర్పడును. దీర్ఘనిశాంతముతో వత్సరాంత మగును. ఈరీతిని చర్విత చర్వణముగా వార్షికచక్రము తిరుగును.

(4) దీర్ఘరాత్రి దీర్ఘదివసాంతమం దేర్పడు ఉషఃకాంతి కొన్నిరోజులవర కుండును. కాని, ధ్రువబిందువువద్ద ఉషఃకాలమునకంటె తక్కువగనే యుండును. ధ్రువబిందువువద్ద నున్నంత దీర్ఘకాలము కాని, అంత అద్భుతప్రదర్శనములతోగాని యుండదు. అఖండమగు యీ దీర్ఘదివసమందు సూర్యుడు సదా క్షితిజము పైననేయుండును. అసమింపడు. కాని, ధ్రువబిందువువద్దవలె సరిగ అడ్డవలయములు తిరుగక కొంచెము ఒరుగుడువలయములుగ తిరుగును. అట్లే అఖండమగు యీ దీర్ఘరాత్రమందు సూర్యుడు సదా క్షితిజము క్రిందనే క్రుంకియుండి కనిపింపడు. దీర్ఘదివస, దీర్ఘరాత్రములు మినహాయింపగా మిగతకాలములో సూర్యుడు ప్రతిదినము ఉదయాస్తమయముల పొందును. 24 గంటలలో ఎప్పుడో ఒకప్పుడు—కొంతకాలము సూర్యుడు క్షితిజముపైన నుండును.

పైన రెండుతరగతులుగ వర్ణించిన ధ్రువ, ధ్రువమండల లక్షణములు ఆ ప్రదేశములకే ప్రత్యేకముగ చెల్లుబడియగును గాని అట్టివి ప్రపంచములో మరియెం కెచ్చటను లేవు. మరియు, ధ్రువమండల శీతోష్ణస్థితులు కాలగతినిబట్టి మారినను, యీ భూగోళముపైనున్న ధ్రువబిందువుమాత్రము మారలేదు. కావున, పైనవర్ణించిన ఖగోళసంబంధమగు ధ్రువలక్షణములు శాశ్వతప్రదమైనవి. ఎన్నడును మారనివి. కావున, యిట్టిలక్ష



ణము లేవైన వేదఋక్కులందుః గానిపించినచో అవితప్పక ధ్రువప్రదేశమునే సూచించుచున్న వని మనము సిద్ధాంతపరుప వచ్చును. అదృష్టవశమున యీ లక్షణములను సూచించు ఋక్కులు వేదములందు చాలగలవు. అట్లే, వీనికి సంబంధించిన వైదికగాధలును గలవు. నేరుగ యీ లక్షణములను ఉదాహరించు ఋక్కులు చాలప్రధానమైన వగుటచే, రాబోవు అధ్యాయములో వీనినిగూర్చి వివరించెదము. తక్కినగాధలనుగూర్చి పిమ్మటి అధ్యాయములలో విచారించెదము.



# వైదిక నిలయము

## నాలుగవ అధ్యాయము.

### వేదగతధ్రువప్రాంత లక్షణములు.

తృతీయాధ్యాయములో ఉత్తరధ్రువప్రాంతదేశముల యొక్కలక్షణములను చెప్పియుంటిమి. ఇట్టిలక్షణము లేవైన వేదములయందు వర్ణింపబడియున్న వేమో విచారింపుదము.

ధ్రువనక్షత్రము సూటిగ నెత్తిమీద నుండుననియు, ఆ నక్షత్రముచుట్టును యీ బ్రహ్మాండగోళములోని నక్షత్రములు, గ్రహములు, మొదలగున వన్నియు మన నెత్తిమీద టోపీ తిరిగినట్లుగ గిరగిర కుమ్మరసారెవలె తిరుగుచుండు ననియు చెప్పియుంటిమి. మన యార్యు లొకప్పు డచ్చట నివసించి యుండియుండినయెడల వారి కీ విషయము తెలిసియుండవలెను గద. వారి కావిషయము పూర్తిగ తెలిసియున్నట్లు ఋగ్వేదము పదియవమండలము 89 అనువాకములో, 4 వ సూక్తములో ప్రమాణముగలదు. “ రథచక్రములు రెండును యిరుసుచే నేవిధముగ నటునిటు చెదరకుండ పట్టుకొని యుంచబడినవో, ఆ విధముగనే యింద్రుడు భూమ్యాకాశముల రెంటిని తనబలముచేత వేర్వేరుగ నిలిపియున్నాడు ” ( యో అక్షేణేవ చక్రియాశచీభి ర్విష్వక్త స్తంభ పృథివీ ముత ద్యాం )



ఈ భావమే మరికొన్నిచోట్ల తెలియపరుపబడియున్నది. “ ఏవిధమైన స్తంభముయొక్క ఆధారము లేకుండగనే యింద్రు డీ యాకాశమును నిలువబెట్టె ” నట్లు వర్ణింపబడియున్నది. ఇంద్రునియొక్క యపారబలమున కిది యొకనిదర్శనముగనున్నది. ( అవంశే ద్యా మస్తాభయత్ ॥ IV 56 3 య ఇమే ద్యావాపృథివీ జజాన ఉర్వీగభీరే రజసీసుమేకే అవంశే ధీరః శచ్యా సమైరత్ )

[ X 89. 2 ] ( స సూర్యః పర్యురూవరాం స్యేంద్రో వవృత్యాద్రథ్యేవచక్రా ) లో నింద్రుడు సూర్యునితో పోల్చబడియెను. ఇంద్రు డీ “యనంతమైన ఆకాశమును రథచక్రముల వలె త్రిప్పుచున్నట్లు ” వర్ణించియున్నారు. ఈ సూక్తములో నుండు “ వరాంసి ” యను పదమునకు “ నక్షత్రములు ” లేక “ వెలుతురులు ” అని శాయనులవా రర్థమును చెప్పిరి. మన మే యర్థమును చెప్పినను దీనిలో భావ మొక్కటే. ఆకాశము రథచక్రములవలెతిరుగుచున్న దనుమాట స్పష్టము. మన యీ దేశములలోగూడ నక్షత్రము లన్నియును తూర్పున నుదయించి, చక్రమువలె తిరుగుచు, పశ్చిమమున నస్తమింపుచున్న వనుమాట సత్యమేకాని ఆకాశ మంతయు నొకస్తంభము నాధారము చేసికొని పైన నిలచి యున్న దని యీ దేశములలోని యాకాశమును చూచి చెప్పుటకు వీలులేదు. ఆ వర్ణన యిచ్చట వర్తింపదు. ఆకాశ మంతయు నొకస్తంభము నాధారము చేసుకొని నిలచియున్న దని మనము చెప్పినప్పుడు, ఆ స్తంభము పైకొన ధ్రువనక్షత్రమై యుండవలెను. మరియు

ఆ ధ్రువనక్షత్రము సూటిగ మన నెత్తిమీద నెత్తుగ—కనిపించుచుండవలెను. కాని మన యీ దేశములలో ధ్రువనక్షత్రము ఉత్తరపువైపుగ కనిపించునుగాని సూటిగ మన నెత్తిమీదికి కనుపింపదు. ధ్రువనక్షత్ర మిట్లు సూటిగ నెత్తిమీద కనుపించుదేశము ఉత్తరధ్రువప్రాంతదేశమేగాన, యీ వర్ణన ఆ దేశమునకే వర్తించును. ఆకాశ మంతయు నొకస్తంభము నాధారము చేసికొని నిలచియున్న దనియును, చక్రము తిరిగినట్లు తిరుగుచున్న దనియును వర్ణింపబడిన యీ రెండంశములను కలిపిచూచినయెడల తప్పక యిట్టివర్ణన ఉత్తరధ్రువప్రాంతదేశలక్షణములను చూచిగాని, యెరింగిగాని, పెద్దలచే వినిగాని, చేసినదే యని స్పష్ట మగుచున్నది. ( ఋ 1-24-10. అమీయ ఋక్షా నిహితాస ఉచ్చా నక్తం దదృశ్రే కుహచిద్దివేయుః ) లో సప్తర్షిమండలము చాల ఎత్తుగ (ఉచ్చగ) నున్న దని వర్ణించియున్నారు. అదిగాక, యీ మండల ముదయించు ననిగాని, అస్తమించు ననిగాని, వర్ణింపక, పగలు కాన్పింప దనియు, రాత్రియందు గాన్పించు ననియును మాత్రము చెప్పియున్నారు. కాని యీ మండల మెల్లప్పుడును ధ్రువనక్షత్రము చుట్టును, తిరుగుచుండుటయేగాని, ఉదయాస్తమయము లెరుంగ దనియును తెల్ల మగుచున్నది. ఇది కేవల ముత్తరధ్రువప్రాంత లక్షణమేగద! అదిగాక మన ముత్తరధ్రువప్రాంతములకు బోయి చూచిననేగాని సప్తర్షిమండలము మనకు నెత్తిమీదుగ గాన్పింపదు. కాన నిది యొకబలవత్తరమైనదృష్టాంతము.



ఉత్తరధ్రువమువద్ద ఆరునెల లెడతెగని పగలును, మిగిలిన ఆరునెల లెడతెగని రాత్రియు నుండు నని చెప్పియుంటిమి. ఈ లక్షణ మేమైన వేదములయందుగాన్పించునేమో విచారింపుదము. దేవతలకు పగటికాల మారునెల లనియును, రాత్రికాల మారునెల లనియును, మన పూర్వగ్రంథములయందెప్పుడు జూచినను గాన్పించును. దీనికై వెదుక పనిలేదు. కాన నీయంశ మేమియో కొంచెము జాగరూకతతో పరీక్షింపుదము. వేదములయందును, వేదకాలమున కిటీవల వ్రాయబడిన పురాణాదులయందును, ఖగోళ, జ్యోతిశ్శాస్త్రగ్రంథములయందును యీ విషయము స్పష్టముగ వివరింపబడియున్నది. ఇట్టి విషయములను విచారింపవలసివచ్చినపుడు పురాణాదులకంటె ఖగోళశాస్త్రగ్రంథములే యెక్కువ ప్రమాణములుగాన నీ ఖగోళశాస్త్రములో మనవా రేమి చెప్పియున్నారో ముందు విచారింపుదము. ఈ భూగోళమునకు ఉత్తరధ్రువము మేరుపర్వత మని మనవారు తెలిపియున్నారు. మరియు " సూర్యసిద్ధాంతము " 12 వ యధ్యాయము, 67 వ శ్లోకములో నీ విధముగ వర్ణింపబడియున్నది. " మేరుపర్వతమువద్ద దేవతలకు మేషసంక్రమణమునాటి సూర్యోదయ మొక్కటియే సూర్యోదయము. ఆ దినము మొదలుకొని " సూర్యునియొక్క అర్ధావృతమువరకు అనగా ( ఆరునెలలవరకును ) వారు సూర్యుని చూచుచునే యుందురు. " మేరుపర్వతము దేవతలకు నివాసస్థానముగాన, పై దానినిబట్టి వారికి ఆరునెలలపగలును, ఆరునెలల రాత్రియు కలదని చెప్పినదాని

కర్థము తెల్ల మగుచునే యున్నది. మనవా రందరును దీనికి సమ్మతించియే యున్నారు. మేరుపర్వతమువద్ద మేషసంక్రమణమునాడు సూర్యోదయ మగును. తిరిగి పిమ్మట ఆరునెలల వరకును అనగ తులాసంక్రమణమునాటివరకును సూర్యుడాకాశమున వెలుంగుచునే యుండును. తులాసంక్రమణముతో నస్తమయ మగును. ఇదియే మేరువువద్దనుండు దేవతలకొక పగ లగును. తిరిగి తులాసంక్రమణము మొదలుకొని మేషసంక్రమణమువరకు సూర్యుడడుగునకు క్రుంకుటవలన చీకటి వ్యాపించును. ఈయారు నెలలును మేరువువద్ద రాత్రికాలము. ఇదియే దేవతలకు రాత్రికాలము. మేషసంక్రమణము మొదలు తులాసంక్రమణమువరకును ఉత్తరాయణము. తుల మొదలు తిరిగి మేషమువరకును దక్షిణాయనము. అందువలననే "ఉత్తరాయణకాలము దేవతలకు పగ లగుచున్నది" అని చెప్పబడి యున్నది. కాని భాస్కరాచార్యులగారికాలములో ఉత్తరాయణ దక్షిణాయన సంజ్ఞలను మార్చిరి. మకరసంక్రమణము మొదలు, కర్కాటకసంక్రమణమువరకుగల కాలమును ఉత్తరాయణ మని యిటీవలివారు మార్పుచేసికొనిరి. ఉత్తరాయణ మనగ పూర్వకాలములో మేషము మొదలు తులవరకునుగల కాల మని భాస్కరాచార్యులగారికి తెలియనందున "ఉత్తరాయణకాలము మేరువువద్ద నుండు దేవతలకు పగ లెట్లగును?" అని శంకించిరి. ఉత్తరాయణ మను మాటకు పూర్వకాలమునందుండు అర్థము వీరికి తెలియని కారణముచే తమ కాలమునాటి యర్థమునుబట్టి జూచుకొనగ వీరికీ శంక గలిగెను. "ఉత్తరా

బ్లాకు 3.



యణము దేవతలకు పగలు " అను పూర్వగ్రంథములలోని "ఉత్తరాయణ" శబ్దమున కర్థ మేమి ? సూర్యుడు "ఉత్తర దిక్కునకు నడచునడక " అని వాక్యార్థము. సూర్యుడు రాశి చక్రమున, ఉత్తరార్ధగోళములో మేషసంక్రమణము మొదలు, తులాసంక్రమణమువరకును నడచుకాలము ఉత్తరాయణకాల మగుచున్నది. "ఉత్తరాయణము దేవతలకు పగ లగును " అనువాక్యము పూర్వకాలపు ఖగోళశాస్త్ర, సంహితగ్రంథ ములలో కల దని భాస్కరాచార్యులవారు చెప్పియున్నారు. అంతకుపూర్వము వేదకాలమునాటి ప్రజలకు తెలిసినయంశ ములే ఈ సంహితాకాలములలో సైతము, అనుశ్రుతముగ, వచ్చియుండవచ్చును.

దీని కింకను మనుధర్మశాస్త్రము ( 1. 67. లో "దైవేరాత్ర్యహానీ వర్షం ప్రవిభాగ స్తయోఃపునః అహ స్తత్రోదగయనం రాత్రిః స్యా ద్దక్షిణాయనం ) అని ప్రమాణ మున్నది. "ఒక (మనుష్య) సంవత్సరము దేవతల కొకరాత్రిం బగ లగుచున్నది. తిరిగి యీ రెండు నీ విధముగ విభజింపబడి యున్నవి. ఉత్తరాయనకాలము పగ లగును, దక్షిణాయనము రాత్రికాల మగును. కల్పములవంటి పెద్దకాలములను లెక్క వేయవలసివచ్చినపుడు దేవతలయొక్క రాత్రింబవళ్ళను కాల మానము ( లేక మూలము ) గ దీసికొనెదరు. ఈ యంశము సర్వసాధారణముగ పూర్వకాలపు గ్రంథములయం దన్నిటను ఎక్కడజూచిన నచ్చట గాన్పించుచున్నందున మనవారు పూర్వ మొకప్పు డీ యంశమును కండ్లార చూచియుండి

యుండవలె నని స్పష్టముగ తేలుచున్నది. ఇక మహాభారతము వనపర్వము 163, 164 అధ్యాయములలో అర్జునుడు మేరు పర్వతమువద్దకుబోయియుండిన సందర్భములో ఆ పర్వతరాజ మునుగూర్చి యీ విధముగ వర్ణింపబడియున్నది. ( ఏనం త్వ మారహ శ్మేరుం సూర్యాచంద్రమసౌ ధ్రువం ప్రదక్షిణ ముపావృత్య కురుతః కురునందన జ్యోతింషిచా ప్యశేషేణ సర్వాణ్యనఘ సర్వతః పరియాంతి మహారాజ గిరిరాజం ప్రదక్షిణం. ( 163 37. 38. శ్లో॥ స్వతేజసాతస్యనగోత్తమస్య మహౌషధీనాంచతథాప్రభావాత్ విభక్తభావో న బభూవ కశ్చి దహోనిశానాం పురుషప్రవీర॥ బభూవ రాత్రి ర్దివసశ్చ తేషాం సంవత్సరేణైవ సమానరూపః ) అర్థము "మేరుపర్వతమువద్ద సూర్యచంద్రులును, నక్షత్రములును, ప్రతిదినమును ప్రదక్షిణము చేయుచుండును. ఆ పర్వతము తనయొక్క కాంతిచేత చీకటిని పారదోలి రాత్రింబవళ్ళకు భేదము తోపనీయదు. మేరుపర్వతనివాసులకు ఒకపగలును, రాత్రియును కలిసి సంవత్సర మగుచున్నది." వీనినిబట్టి మహాభారతకాలమునాటికి మనవారికి ఉత్తరధ్రువప్రాంతదేశములయొక్క లక్షణములు వివరముగ తెలియు నని తేటపడుచున్నది. ఆ పర్వతమునకు విశేషమైనకాంతి గలదనియు అచ్చట నొక "జ్యోతి" వెలుంగుచుండు ననియు సూచింపుటవలన మూడవయధ్యాయములో చెప్పిన అరోరాబోరియాలిస్ అను పెద్దవెలుతురునకును యీ "జ్యోతి" వర్ణనకును సరిపోవుచున్నది. ఈ విషయము లన్నియును మన సిద్ధాంతమును బలపరచుచునే యున్నవి.



ఇక వేదగ్రంథములను విచారింపుదము. తైత్తిరీయ ఆరణ్యకము. 1. 7. 1 లో మేరుపర్వతశిఖరమువద్ద యేడుగురు ఆదిత్యులు కలరనియు, కశ్యపు డనబడు ఎనిమిదవఆదిత్యుడు మహామేరువు నెప్పుడును వదలక యుండు ననియు చెప్పియున్నారు. ఈ కశ్యపుడు తక్కిన 7 గురు ఆదిత్యులకును కాంతి నిచ్చుచుండును. మహామేరుపర్వతము నెప్పుడును ప్రకాశమానముగ వెలుగునట్లు చేయుచుండును. మన సంవత్సరకాలము దేవతలకు ఒకరాత్రియు, ఒకపగలును అగుచున్నది. అను వాక్యముమాత్రము తైత్తిరీయబ్రాహ్మణము III_9_22_I ( ఏకంవా ఏత ద్దేవానా మహః యత్సంవత్సరః) లో కనబడుచున్నది. ఈవాక్యము బహుస్పష్టముగ నున్నందున దీని కర్థము చెప్పుట కేమాత్రమును కష్టములేదు. ఇట్టి యర్థమునే యిచ్చువాక్యములు మొదట నాకు మరియెచ్చటను కాన్పింపలేదు. ముఖ్యముగ ఋగ్వేదసంహితయందు గాన్పింపలేదు. పైనచెప్పిన తై. బ్రా. లోని యీయొక్క వాక్యమునే ఆధారముచేసికొని, "పూర్వము మనవారు ఉత్తరధ్రువమువద్ద నున్నారు" అని సిద్ధాంతీకరించుట బహుసాహస మని తలంచితిని. అందువలన అప్పటి ఉత్తరాయణ దక్షిణాయనసంజ్ఞలయొక్క నిజార్థమును పూర్ణముగ కనుగొనకపోతిని. కాని కొన్నిగ్రంథములను తరచిచూడగ చూడగ మనవా రొకప్పు డుత్తరధ్రువమువద్ద నివసించియుండి రను సిద్ధాంతమును ఒప్పుకొనక తీరినదికాదు. ఈ పైవాక్య మిటీవలి పురాణాదులలోను ఖగోళశాస్త్రగ్రంథములలోనుమాత్రమేగాక తైత్తిరీయబ్రాహ్మ

ణములో సైతముండుటవలన, ఆకాలములో మనవారీయంశ మును కండ్లార చూచియైన నుండవలెను, లేదా తమపూర్వులు చెప్పుకొనుచుండగ వినియైన నుండవలెను. ఖగోళశాస్త్ర ప్రకారమప్పటివారు లెక్కవేసి చూచి యీ విషయమును (తమ కండ్లార చూడకయే, వినికయే) కేవలము మేధాశక్తి వలన కనుగొనిరని కొందరూహింపవచ్చును. కాని దీనిని నమ్ముటకు వీలులేదు. ఏలననగ, ఖగోళశాస్త్రమును, తత్సంబంధమగు గణితమును సంహితాబ్రాహ్మణకాలముల కిటీవలనే వృద్ధినొందినవి. బ్రాహ్మణకాలమునాటివారి కీగణితము తెలియునని నమ్ముటకు వీలులేదు. కాన నీవిషయమును వారు కండ్లార చూచియైన నుండవలెను. లేదా తమతాతముత్తాతలు చెప్పుకొనుచుండగ వినియైన నుండవలెను.

మన మతగ్రంథములలోనేగాక పారశీకుల గ్రంథములలో సైతము కేవల మీయర్థమునే యిచ్చువాక్యములు గలవు. "వెండిడాడ్" అను పార్సీగ్రంథము 2 వ అధ్యాయములో నీవిధముగ నున్నది. "మనకు సంవత్సరమైన దానిని వారు ఒక దినముగ భావింతురు" తైత్తిరీయబ్రాహ్మణములోని దాని కిది సరియైన యర్థమగుచున్నది. రెంటికిని ఒకే అర్థము. అదిగాక పార్సీగ్రంథములోని యీ పైవాక్యము యొక్క పూర్వోత్తరసందర్భములను విచారించినయెడల యీ వర్ణన తప్పక ఉత్తరధ్రువప్రాంతదేశమునకే వర్తించు నని తెల్లముగాగలదు. పార్సీమతస్థులకు పరమదైవము "అహూరమజ్దా." "ఇమ" యను నాతడు మనుష్యలోకమునకు



మొదటిరాజు. ఈ రాజు "ఐర్యానావెయాజో" యను పారశీకుల స్వర్గలోకములో నివసింపుచుండును. ఒకానొకప్పుడు "అహూరామజ్దా" అను దైవము "ఇమ" రాజుదగ్గరకు వచ్చి, ముందుగొప్పశీతకాలము రాబోవుచున్నదనియు, ప్రపంచమంతయు ననేకవేలయడుగులయెత్తువరకు మంచుతో ఘనీభవించుకొని పోవుననియు, ఆకారణముచే భూమిపై సంచరించు జంతుజాలము లన్నియు, నశించుననియు, భవిష్యత్తునంతను తెలియజెప్పెను. మరియు యీ మంచుయుగము (హిమవత్ప్రళయము) రాకముందే పెద్దభవనము నొకదానిని నిర్మించి సకలజంతువులను సకలబీజములను సంగ్రహించి యుంపవలసిన దనియు రాజున కా దేవుడు సలహా జెప్పెను. ఆప్రకారమే రాజొక భవనమును నిర్మించి "ఓజగత్కారణా! ఓ మహానుభావా! నేను నిర్మించిన యీ భవనమును వెలిగించుట కేమిదీపములు గలవు?" అని యడిగెను. దేవుడీ విధముగ ప్రత్యుత్తర మిచ్చెను. "చేతనము లనియు అచేతనము లనియు రెండువిధము లైన దీపములు గలవు. సూర్యచంద్రులు (సంవత్సరమున) కొకసారియే యుదయించి, యొకసారియే యస్తమించుచున్నట్లు కనిపింతురు. మరియు ఒకసంవత్సర మొకదినముగ గాన్పించును." ఈ వాక్యము లన్నియు మన కనేకభావములను వెల్లడింపుచున్నవి. (1) పారశీకులు పూర్వకాలమున నివసించిన "ఐర్యానావెయాజో" యను ప్రదేశము కొంతకాలమునకు మంచుతో ఘనీభవించుకొని పోయినందున ప్రజలు నివసించుట కనుపయోగ మయ్యెను.

(2) ఆ దేశములో సూర్యుడు సంవత్సరమున కొకసారియే యుదయించుననియు, ఒకసారియే యస్తమించుననియు, అచ్చటివారికి ఒకసంవత్సర మొకదినముగ నుండె ననియు తెలియుచున్నది. మంచుయుగము సంభవించుటనుగురించి పైన చెప్పిన వాక్యములను తరువాత నెమ్మదిగ విచారించుదము. ప్రస్తుతము రాత్రింబవళ్ళనుగూర్చి యీ పార్శీగ్రంథములో చెప్పిన యంశము తైత్తిరీయబ్రాహ్మణములో చెప్పినయంశముతో పూర్తిగసమన్వయ మగుచున్నది. సూర్యుడు సంవత్సరమున కొకసారియే యుదయించి యొకసారియే యస్తమించుట యనునది కేవలము ఉత్తరధ్రువప్రాంతదేశ లక్షణమే. కనుక పార్శీగ్రంథములో చెప్పిన "ఐర్యానావెయాజో" యను ప్రదేశమును దానిలోని భవనమును కేవలము ఉత్తరధ్రువదేశములోనివైయుండితీరవలెను. ఆవిధముననే తైత్తిరీయబ్రాహ్మణములోని వాక్యములు కేవల ముత్తరధ్రువ ప్రాంతదేశవాసుల సంవత్సరమునే సూచింపుచున్నవి. ఆర్యసంతతులవారైన హిందూ, పారశీ, దేశస్థుల యుభయులగ్రంథములలో నీవిషయ ముండుటవలన వీరు కేవలము గణితమువేసి చూచి యీ విషయమును వ్రాసిరని చెప్పుసిద్ధాంతమును త్రోసివేసితీరవలెను. కనుక వీరు "తమ కండ్లార నీసృష్టివైచిత్ర్యమును చూచియేయుండవలె" నని సిద్ధించుచున్నది.

ఈపైన మనము చర్చించినవాక్యములుగాని, యీయర్థమునేయిచ్చు మరి యితరవాక్యములుగాని ఋగ్వేదములో నచ్చటను గాన్పింపవనుమాట సత్యమే. కాని ఉత్తరధ్రువప్రాంత



దేశములయొక్క యితరలక్షణములను స్పష్టముగ వివరించిన వాక్యము లనేకములు ఋగ్వేదములో గలవు. ఇట్లు ఋగ్వేదములో వర్ణింపబడిన వర్ణనలన్నియు పైవాక్యములను బలపరచుచున్నవి. మన మిచ్చట నొక ముఖ్యవిషయమును విచారింపుదము. బహుపురాతన వేదగ్రంథములలో చూచినయెడల సంవత్సరమును "దేవయానమని" యును "పితృయానమని" యును రెండుభాగములుగనే విభజించినట్లు కన్పట్టుచున్నది. ఈరెండును దేవతలకు పగలును రాత్రియు ననబరగు ఉత్తరాయణ దక్షిణాయనములతో సరిపోవుచున్నవి. దేవయానపదము ఋగ్వేదసంహితలో ననేకచోట్ల కనుపించుచున్నది. దీనికి "దేవతల త్రోవ లేక మార్గము" అని అర్థము. ఋ 1. 72-7 లలో అగ్నికి దేవయానమార్గము తెలియునని చెప్పబడియున్నది. మరియు ఋ 1. 183-6, 184-6 లో నీ విధముగనున్నది. "ఓ అశ్వినీదేవతలారా! మేమిప్పుడు "చీకటియొక్క అంతము" వద్దకు వచ్చినాము; దేవయానమార్గము వెంబడి మీరు మావద్దకు రావలసినది" (అతారిష్మ తమసస్పార మస్యప్రతివాం స్తోమో అశ్వినావధాయి ఏహయాతం పథిభి ర్దేవయానైః)

ఋ. VII 76,2 లో మరియు నిట్లువర్ణించియున్నారు. "దేవయానమార్గము నాకు దృగ్గోచరమగుచున్నది.... ఉషఃకాలముయొక్క కేతువు (లేకపతాకము, లేక జెండా) తూర్పుదిక్కున కనబడుచున్నది" (ప్రమేపంథా దేవయానా అదృశ్రన్ ........ అభూదు కేతు రుషసః పురస్తాత్.)

ఈవాక్యము లన్నియు నొకేయర్థమును సూచింపుచున్నవి. చీకటియంతయు పోయి ఉషఃకాల ముదయముకాగానే దేవయానమార్గము ప్రారంభమగుచున్నదని తెలుచున్నది. మరియు అగ్ని, అశ్వినీదేవతలు, ఉషస్సు, సూర్యుడు మరియితర ఉదయకాలపు దేవతలందరును యీ దేవయానమార్గముగుండనే యాకాశముమీద ప్రయాణము చేయుచున్నట్లును కూడ స్పష్టమగుచున్నది. ఇక X, 18-1 లో, పితృయానము దేవయానమునకు వ్యతిరేకముగ నుండుననియు, నిది "మరణమార్గమని"యు వర్ణించియున్నారు. ఋ. X, 88-15 ను వ్రాసిన ఋషి దేవపితృయానములనుగూర్చి చెప్పుచు, "దేవతలకొకమార్గమును, పితరులకొకమార్గమును రెండుమార్గములు కలవ"ని తాను "విన్నాన"ని చెప్పియున్నాడు. ఉషఃకాలముతో దేవయానమార్గము ప్రారంభమైనయెడల చీకటి గ్రమ్మగనే పితృయానమార్గము ప్రారంభమగునని మనము తలంపవలెను. ఒకవేళ ఇకనీదేవపితృయాన మార్గములు మనముజూచు పగటికిని రాత్రికిని యర్థమిచ్చునని తలంచితిమేని మనపూర్వఋషుల కీరెండుమార్గములేతప్ప నితరములు తెలియవని చెప్పుటలో నేమి విశేషమున్నది. ఈపైనచెప్పిన రెండుమార్గములలో నొక్కొక్క-దానిలో మూడుఋతువులు కలవనియు, వానిలో మొదటిఋతువు వసంతఋతువనియు (శతపథబ్రాహ్మణము. 11, 1. 3) వర్ణించియున్నారు. ఈపితృదేవయానమార్గములు రెండును మనము ప్రతిదినమును జూచు రాత్రింబవళ్లకర్థమని మనముచెప్పినయెడల శతపథబ్రాహ్మణములోని



యీ పై వాక్యముల కర్థమేమి చెప్పగలము? వాని ప్రయోజనమేమి? వానినెట్లు సమర్థింతుము? కనుక యీదేవపితృయానమార్గములు రెండును ఉత్తరధ్రువప్రాంతదేశ లక్షణములను జూచి వర్ణించిన వర్ణనలై యుండవలెను. వానిలో నెడతెగని యారు నెలల వెలుతురును దేవయానమనియు; మిగిలిన ఆరు నెలల చీకటిని పితృయానమనియు వర్ణించిరి. ఉత్తరధ్రువప్రాంతదేశములను వదలి దక్షిణప్రదేశములకు వచ్చిచేరిన పిదప నీవర్ణన యిచ్చట పరిస్థితులకు సరిపోకపోయినను పూర్వమునుండియు గ్రంథస్థములైయున్న యీ విషయమును త్రోసివేయ నేలయని వారు దానినే వాడుకొనుచుండిరి. ఋగ్వేదములో చెప్పబడిన యీ దేవపితృయానముల యర్థమును విచారించి చూడగ "మనకు సంవత్సరమైన కాలము దేవతల కొక దినమగుచున్నది" అను తైత్తిరీయ బ్రాహ్మణవాక్యముతో సరిపోవుచున్నది. ఈ రెండు నొకే భావమును దెలుపుచున్నవి.

"దేవతలమార్గము" (దేవయానము) అను నీ పదము పార్శీగ్రంథములలో సైతము కానగును. వారి పితృదేవతలు సూర్యచంద్రాదులకు "దేవనిర్మితమార్గము"ను చూపించినట్లు వారి గ్రంథములలో చెప్పబడి యున్నది. ఏ రీదేవయానమార్గమును చూపక పూర్వము, సూర్యచంద్రాదులు రాక్షసులచే బంధింపబడి, అటు నిటు కదలజాలక యొక-చోటనే నిలచియున్నట్లుకూడ వర్ణింపబడియున్నది. ఈ రెండు వర్ణనలను బట్టి చూడగ, మన మతగ్రంథములలో వర్ణింపబడిన దేవయాన

మును పార్సీగ్రంథములలో వర్ణింపబడిన దేవయానమును రెండు నొకటే యని సిద్ధించుచున్నది. ఈ రెండు మార్గములును చీకటి యంతమైన పిమ్మటను, ఉషఃకాలము ప్రారంభించుటతోడను ప్రారంభమగునని స్థిరపడుచున్నది. హిందూ పారశీవంశస్థుల పూర్వులు నివసించిన ప్రదేశములలో సూర్యుడు ఆరునెల లాకాశమున వెలుంగుచున్నట్టును తక్కిన ఆరునెలలును సూర్యుడు క్షితిజముక్రిందికి అస్తమించిన కారణమున చీకట్లు క్రమ్ముకొని యుండినట్లును స్పష్టమగుచున్నది.

హిందూ, పారశీగ్రంథములలోని పోలిక లింతటితో నాగలేదు. ఎవరైనను దక్షిణాయన అనగ పితృయానకాలములో చనిపోవుట అశుభసూచకమని మన హిందువు లెన్నుదురుగద. మహాభారత యోధవీరుడైన భీష్ములవారు దక్షిణాయనకాల మంతయుండి, ఉత్తరాయనపుణ్యకాలము వచ్చువరకును, ప్రాణములను విడువక అంపశయ్యమీద నిరీక్షింపుచుండెనని మన కందరకును తెలిసిన విషయమే.

(మహాభారతకాలమునాటికి ఉత్తరాయణసంజ్ఞ యొక్క యర్థము మారిపోయి, ఉత్తరాయణ మనగ మకర, కర్కాటక సంక్రమణముల మధ్యనుండు కాలమను అర్థము వచ్చినది. కాని అంతకుపూర్వ మీ యర్థము లేదనియు, మేష తులా సంక్రమణముల మధ్యకాలమే ఉత్తరాయణమనియు నిదివరకే చెప్పియున్నాము.) ఏది యెట్లున్నను దక్షిణాయన మనగ పితృయానకాలములో చనిపోవుట యశుభసూచక మనుమాట



స్పష్టము. ఈభావమునే ఉపనిషత్తులలోకూడ కానవగును. దేవయానకాలములో చనిపోయినయెడల ఆత్మకు మంచిగతి గలదని యుపనిషత్తులలో చెప్పియున్నారు. ఈ వాక్యములన్నియు మనకు కావలయుననిన బ్రహ్మసూత్రములపైన శ్రీ శంకరాచార్యులవారు వ్రాసిన భాష్యములో కానవగును. (బ్ర. సూ. IV. 2 18-21) (౧౮) రశ్మ్యనుసారీ, (౧౯) నిశి నేతిచేన్న, సంబంధస్యయావద్దేహ భావిత్వాద్దర్శయతిచ (౨౦) అతశ్చాయనేపి దక్షిణే (౨౧) యోగినః ప్రతిచస్మర్యతే స్మార్తేచైతే.) పితృయానమనగ ఆరునెలలెడతెగని చీకటియను పూర్వగ్రంథములలోని భావమునుబట్టి విచారించి చూచినయెడల, పితృయానములో చనిపోవుట యెంత యశుభ సూచకమో తేటపడగలదు. చీకటికాలములో (పితృయానములో) చనిపోయినయెడల, తిరిగి దేవయానము అనగా వెలుతురు వచ్చువరకును అపరకర్మలను చేయుటకు వీలుండదు. అంతకాల మీకర్మలను చేయకుండ నిలిపియుంచుటయే చనిపోయినవానియాత్మకు యశుభదాయకము. ఎప్పటిమాటలో యేల, యీ కాలములోసైత మెవరైన రాత్రికాలములో చనిపోయిన యెడల వది యశుభమనియే మనమెంచుదుముగద. దహనాది క్రియలన్నియును సూర్యోదయ కాలమువరకు నాపియుంచుదుముగద. ఇట్టిసందర్భములో పితృయానకాలములో చనిపోవుట యశుభసూచకమని మనపూర్వులు తలంచుటలో నేమియును వింతలేదు.

ఈ విషయమే పార్సీగ్రంథములలో మరింతస్పష్టముగ వర్ణింపబడియున్నది. "ఎవరైనను శీతకాలములో చనిపోయిన యెడల భగవద్భక్తుడైనవా డేమి చేయవలయును?" అను ప్రశ్నకు భగవంతు డీవిధముగ ప్రత్యుత్తరమిచ్చుచున్నాడు. "అట్లు సంభవించినయెడల, ఇంటిలో నొక గొయ్యితీసి, ఆశవమును ఆగోతిలోనుంచి పక్షు లటునిటు ఎగుర నారంభించువరకు, చెట్లు పెరుగ నారంభించువరకు, నీటిప్రవాహములు పార నారంభించువరకు, గాలివచ్చి భూమిమీదనుండు నీటినం తను పీల్చుకొనువరకు, రెండురాత్రులుగాని, మూడురాత్రులుగాని లేక ఒకనెలగాని, ఎంతకాలముపట్టునో అంతకాలమువరకు దానినట్లే గోతిలో నుంచవలెను." ఈసందర్భములో పార్సీమతస్థుల యాచారమునుగూర్చి చెప్పవలెను. వారు తమ శవములను పాతిపెట్టరు. దహనముచేయరు. మొదట శవమును సూర్యరశ్మిలోనుంచి పిమ్మట గాలిగోపురమువంటి యెత్తైన ప్రదేశములోనుంచి, పక్షుల కాహారముగ వదలివేయుదురు. దీనినిబట్టి విచారింపగ శవమును నెలదినములవరకును గోతిలో నేలయుంచవలెనో తెలియగలదు. ఆ నెలదినములును యెడతెగని చీకటియే యుండుటవలన శవమును సూర్యరశ్మిలోనుంచుట యెట్లు తటస్థింపగలదు? ఆకారణముచేతనే సూర్యరశ్మి వచ్చువరకును యెన్నిదినములైననుసరే శవమును గోతిలోనే యుంచవలెను. సూర్యోదయమైన పిమ్మట శవమును బయటికిదీసి కొంతసేపువరకు సూర్యరశ్మి శవము



నకు తగులునట్లుచేసి, పిమ్మట పైనచెప్పినవిధముగ దానిని పక్షులకాహారముగ వదలివేయుదురు. అదిగాక, "పక్షులెగురుట" "నీటిప్రవాహములు పారుట" మొదలగు నీవర్ణనలన్నియు ఋగ్వేదములో వర్ణింపబడిన ఉషఃకాలవర్ణనలను పోలియున్నవి. ఈరెండు నొకేవిధమైన ప్రకృతిచిత్రములను వర్ణింపుచున్నవి. పైదానినిబట్టి దేవతలయొక్క రాత్రింబవళ్లను గూర్చిన వర్ణనలు పార్సీ హిందూగ్రంథములలో నొక విధముననే యున్నవనియు యీయుభయగ్రంథములలోని వర్ణనలు ఉత్తరధ్రువప్రాంతదేశలక్షణములనే తెలుపుచున్నవనియు స్పష్టమగుచున్నది.

ఉత్తరధ్రువప్రాంతలక్షణము లీహిందూపార్సీగ్రంథములలోనే గాక గ్రీకు, నార్వేదేశపు పూర్వగ్రంథములలో సైతము కాననగును. "పూర్వకాలములో ఆకాశమంతయు ఒకమనుష్యుని నెత్తిమీద టోపీ తిరిగినలాగున తిరుగుచుండెడిదని"యు, "ఆదికాలమునందు ధ్రువనక్షత్రము సదా సూటిగ నెత్తిమీద గనిపించెడిదని"యు గ్రీకుగ్రంథకారులు వర్ణించియున్నారు. "ఇలియడ్" "ఒడెస్సే" యను గ్రీకు పురాణములలోకూడ రెండురకముల "దినము" లనుగూర్చి వర్ణించియున్నారు. దేవతలచర్యలనుగూర్చి చెప్పినప్పుడు సంవత్సరపరిమితిగల రాత్రింబవళ్లనుగూర్చియు, మనుష్యుల చర్యలనుగూర్చి చెప్పినప్పుడు ౨౪ గంటల పరిమితిగల రాత్రింబవళ్లనుగూర్చియు గ్రీకుపురాణములలో వర్ణించియున్నారు. ఈరీతి

గనే, నార్వే దేశపు పురాణగాథలలోకూడ దీర్ఘములగు అహో రాత్రములనుగూర్చిన వర్ణనలు గలవు. ఆరునెలలరాత్రిని ఆరు నెలలపగటినిగూర్చిన వర్ణనలు "ఇండోఐరేనియను"లలోనే గాక, "ఇండోజర్మను"లలోగూడగలవు. కనుక మొట్టమొదట ఆర్యులందరును కలిసి నివసించుచున్నప్పుడే యీవర్ణనలు బయలుదేరియుండవలెను. ఈవర్ణనలు ఉత్తరధ్రువప్రాంతమునే సూచించును గనుక మనయార్యులొకప్పు డచ్చట నివసించి రని చెప్పుట కొక్క యీవర్ణనలే చాలును. కాని క్రిందటి యధ్యాయములో సూచించిన ధ్రువలక్షణము లన్నిటిని ఋజువు పరచుటకును మనకు వేదాదులలో కావలసినంత సాక్ష్యమున్నది. ఉషస్సులు దీర్ఘకాలము క్షితిజముచుట్టును తిరుగుచుండు లక్షణమునుగూర్చి వేదప్రమాణ సహితముగ రాబోవు అధ్యాయములో చర్చించెదము.



బ్లాకు 4.

## వైదిక ఉషా.




సూర్యుడు క్షితిజముక్రింద షుమారు 16 డిగ్రీల దూరములో నున్నాడు. ప్రాతఃకాలమందు గాన్పించు వెలుతురులు క్షితిజముయొక్క అంచుచుట్టు 24 గం॥ ల కొకసారి, బాణము చూపినవైపుగ, గిరగిర తిరుగును. తదుపరి సూర్యబింబము క్షితిజముపైకి వచ్చును.

# వైదిక నిలయము

## ఐదవ అధ్యాయము.

### వైదిక ఉష.

ఆరునెలల పగలును ఆరునెలలరాత్రిని గూర్చిన స్పష్టమైన వర్ణనలు ఋగ్వేదమునందంతగ గాన్పింపకున్నను ఉత్తరధ్రువనివాసమును దెలుపుట కింతకంటె ముఖ్యమైన యితరలక్షణములను గూర్చిన వర్ణనలనేకములు గలవు. వానిలో ముఖ్యమైనది ఉషఃకాల వర్ణన. ఉత్తర ధ్రువము వద్ద ఉషఃకాలము సుమారు నెలదినములుండుననియు యీ యుషఃకాలము యొక్క వెలుతురు నేత్రోత్సవదాయకముగ నుండి దిక్చక్రముయొక్క అంచు చుట్టును దినమున కొకచుట్టు చొప్పున గిరగిర తిరుగుచు క్రమముగ పైకివచ్చుననియు పిమ్మట-నెలదినములైన *పిమ్మట-సూర్యబింబము పైకి గాన్పించుననియు మూడవ యధ్యాయములో చెప్పియున్నాము. కాని, భూమధ్యరేఖ వద్దనున్న మనదేశములలో ఉషస్సు యింతదీర్ఘకాలముండదు. ఇంత చిత్రవిచిత్రములుగ నుండదు. వేదములలో ఉషఃకాలమును గూర్చిన వర్ణనలనేకములు గలవు. ఇది యొకముఖ్యమైన దేవత. ఇట్టిహృదయాహ్లాదకరములగు వర్ణనలు, సృష్టిసౌందర్య మహిమలను గానముచేయు

గీతములు, ఒక వేదములలోనేతప్ప ప్రపంచములో మరియే యితరదేశపు గ్రంథములలోను వాఙ్మయములలోను గాన్పింపవు. ఒక్క మనభారతీయులనే గాక ప్రపంచములోనుండు ఖండఖండాంతరములనుండు సమస్తజాతులవారిని మోహింపజేసిన యిట్టి సృష్టిగీతములను వేదగానములను మనవా రెట్లు వ్రాయగలిగిరి? ముహూర్తమాత్రము తూర్పుదిక్కున నగుపించి అంతలో మాయమైపోవు మనదేశపు ఉషఃకాలమును చూచియా మనవా రిట్టి వర్ణనలను గావించినది? ఇదెంత మాత్రమును సంభవముకాజాలదు. అంతగా వర్ణించుటకు మనమిక్కడ ప్రతిదినముజూచు ముహూర్తమాత్ర జీవనముగల యీ యుషఃకాలములో నేమివిశేషమున్నది? ఏమి చిత్రములున్నవి? ఈ వేదగానమునకు సరిపోవు చిత్రవిచిత్రములు ప్రకృతి సౌందర్యములన్నియును ఉత్తరధ్రువప్రాంత దేశములోని దీర్ఘఉషఃకాలమునకే సరిపోవును గాని మన ఉషఃకాలమునకు సరిపోవు. (అదిగాక, కొన్నిచోట్ల ఉషఃకాలమును యేకవచనముగను, కొన్నిచోట్ల బహువచనముగను వర్ణించియున్నారు. దీని ప్రయోజనమును పిమ్మట విచారింతము.)

ఉషఃకాలము బహుదీర్ఘకాలమనుటకు మొదటి నిదర్శనము ఐతరేయ బ్రాహ్మణము IV. 7 లో కలదు. "గవాం అయనమ్" అను క్రతువును ప్రారంభించుటకు పూర్వము ఒక వెయ్యి శ్లోకములను హోత్రియగు బ్రాహ్మణుడు పఠింపవలెను. ఇట్లు పఠించుటకు దీర్ఘకాలము పట్టునుగద. ఈ శ్లోకములకు "అశ్వినశాస్త్ర" మని పేరు. రాత్రి యంతమొంది పగలు ప్రారంభమగు సంధికాలమున కధిష్ఠానదేవతలుగనుండు అగ్ని, ఉషస్సు, అశ్వినులు మొదలగు దేవతలనుగూర్చి యీ శ్లోకములు పఠింపబడును. హోత్రి పఠింపవలసిన పఠనలన్నిటిలోను యీ యశ్వినశాస్త్రపఠనమే యతిదీర్ఘమైనది. సగము రాత్రి గడచిపోయి "ఉషఃకాలపు వెలుతురు కొద్దికొద్దిగ కనుపడ ప్రారంభించుచున్నప్పుడు" హోత్రి యీ పఠనమును ప్రారంభించవలెను [అ. శా. సూత్ర VI. 5, 8. తయోఃకాల ఊర్ధ్వమర్ధరాత్రాత్ప్రకాశీ భావస్యాను విష్టంభమ్॥] ఈకాలమే ఋ VII. 62. 2,3 లో సూచింపబడినది. పఠింపవలసిన శాస్త్రము బహుదీర్ఘకాలము పట్టును గాన దానివలన కలుగు అలసటను తీర్చుకొనుటకై హోత్రి యీ శ్లోకములను పఠించుటకు పూర్వము వెన్నను బాగుగ కాచి, మూడాహుతులను ముందగ్నిలోనుంచి, తక్కినదానిని తాను త్రాగవలెను. [ఐ బ్రా. IV. 7. అ. శా. సూత్ర VI. 5, 8.] ఐతరేయ బ్రాహ్మణములో నీవిధముగ నున్నది:— "హోత్రి తాను పఠింప మొదలిడుటకు పూర్వము బాగుగ నేయి త్రాగవలెను. బండికి తారు వేసినయెడల నది యేవిధముగ సుళువుగ బోవునో అట్లే నేయి త్రాగినయెడల హోత్రియొక్క పఠనము బహు తేలికగ సాగిపోవును" ఈ పఠనము సూర్యోదయము కాకపూర్వమే ముగియవలెననిన రాత్రి రెండుజా

ములుదాటి యింకను చీకటి యుండగనే ప్రారంభింపనైన ప్రారంభింపవలెను, లేదా, యుషఃకాల పరిమితి బహుదీర్ఘముగనైన నుండవలెను. ఈరెంటిలో మొదటిదానిని ఒప్పుకొనుటకు వీలులేదు. ఏలయనగ, చీకటిపోయి క్రమక్రమముగ వెలుతురు రా ప్రారంభమగువరకును యీ శాస్త్రపఠనమును మొదలు పెట్టకూడదని స్పష్టముగ నిషేధించియున్నారు. కనుక మొదట కను వెలుగు కనుపడుటకును, పిమ్మట సూర్యోదయమగుటకును మధ్య తగినంత దీర్ఘకాలము- వెయ్యిశ్లోకములు పఠించుటకు తగినంత దీర్ఘకాలము- అవకాశముండి యుండవలెనని స్థిరపడుచున్నది. అదిగాక, ఒక్కొకప్పుడు సరియైనవేళకు పఠన మొదలిడినను సూర్యోదయమగుటకు చాలకాలము ముందుగనే పఠనము ముగిసిపోయెడిదని తైత్తిరీయసంహిత II. I, 10, 3 లో చెప్పియున్నారు. అట్టి సమయములో సూర్యోదయమగులోపల నొక పశుబలి నర్పింపవలసినదనికూడ సంహితలో చెప్పబడి యున్నది; మరియు, అట్టి సమయములో సూర్యోదయ మగువరకును యేవియో యితరములగు వేదబుక్కులను పఠింపుచుండవలసినదని అశ్వలాయనసూత్రములు చెప్పుచున్నవి. [ అశ్వ. సూ. VI, 5, 8 ప్రాతరనువాకన్యాయేన తస్యైవ సమామ్నాయస్య సహస్రావ మమోదేతేః శంసేత్ ॥ ] అవసరమైనయెడల నట్టి సమయములో పశుబలి నర్పించుటయేగాక ఋగ్వేదములోని పది మండలములను సైతము పఠింపవలసిన



దని ఆపస్తంబసూత్రములు పలుకుచున్నవి. ఆప. సూ. XIV. 1. 2. యస్యాశ్వినే శస్యమానే సూర్యో నావిర్భవతి సౌర్యాం బహురూప మాలభేత్. సర్వా అపి దాశతయీ రనుబ్రూయాత్.] పై ప్రమాణములనుబట్టిఆదినములలో కను వెలుతురు కనిపించిన పిమ్మట చాలకాలమునకుగాని సూర్యు డుదయమయ్యెడివాడు కాడనియు, సూర్యోదయ మెప్పుడగునాయని యప్పటివారందరు నిరీక్షింపుచుండెడివారనియు, వారనుకొన్న కాలముకంటె నింకను విశేషకాలము గడచిపోయినగాని సూర్యోదయమగుచుండెడిది గాదనియు తేటపడుచున్నది. వారనుకొన్న సమయమునకు సూర్యోదయము కాలేదు గనుక వారందరును దానికై "ప్రాయశ్చిత్తము" కూడ చేసికొనెడివారనియు తైత్తిరీయ సంహితలో ననేకచోట్లచెప్పబడియున్నది. ( తై. సం. II. I, 94. అసావాదిత్యో నవ్యారోచత తస్మై దేవాః ప్రాయశ్చిత్తి మైచ్ఛన్. )

(2) దీర్ఘఉషఃకాలమును సూచించు నిదర్శనమింకొకటి [ తై. సం. VII. 2. 20- ఉషసే స్వాహా వ్యుష్ట్యై స్వాహోదిష్యతే స్వా హోద్యతే స్వా హోదితాయ స్వాహా సువర్గాయ స్వాహా లోకాయ స్వాహా.]-లో కలదు. దానిలో యేడు బలు లర్పింపవలసినదని చెప్పియున్నారు.

(1) ఒకబలి "ఉషస్సు" నకును (2) ఒకటి "వ్యుష్టి" కిని (3) ఒకటి "ఉదేష్యత్" నకును (4) ఒకటి "ఉద్యత్" నకును (5) ఒకటి "ఉదితా" కును (6) ఒకటి "సువర్గ"

కును (7) మరియొకటి "లోక" కును — యీ విధముగ యేడు బలులనుగూర్చి చెప్పియున్నారు. వీనిలో అయిదు బలులు కేవలము అయిదు రూపాంతరములను ధరించిన ఉషఃకాలముననే వర్తించును. మొదటి రెండు బలులనుగూర్చి [ తై. బ్రా. III. 8,16, 4 లో యీ రీతిగవర్ణించియున్నారు. ఉషసే స్వాహా వ్యుష్ట్యై స్వాహేత్యాహ రాత్రిర్వా ఉషాః అహర్వ్యుష్టిః అహోరాత్రే ఏవావరున్ధే అథో అహోరాత్ర యోరేవ ప్రతితిష్ఠతి తాయదుభయోర్దివా వా నక్తం వా జుహుయాత్ అహోరాత్రే మోహయేత్ ఉషసే స్వాహా వ్యుష్ట్యై స్వాహేత్యుదేష్యతే స్వాహేత్యుద్యతే స్వాహేత్యనుదితే జుహోతి. ఉదితాయ స్వాహా సువర్గాయ స్వాహా లోకాయ స్వాహేత్యుదితే జుహోతి॥ ]. "ఉషస్సు" అనగ రాత్రియొక్క చివరభాగమనియు, "వ్యుష్టి" అనగ పగటియొక్క మొదటిభాగమనియు చెప్పియున్నారు. దీనికి మనము సమ్మతించినను ఉషఃకాలమును గూర్చి చెప్పిన మిగిలిన మూడు బలులను యెట్లు సమర్థింపనగును? ఒక బలి "ఉదేష్యత్" అనగ ఉదయింపబోవుచున్న ఉషఃకాలమునకును, రెండవబలి "ఉద్యత్" అనగ ఉదయించుచున్న ఉషస్సునకును, మూడవబలి "ఉదితా" అనగ ఉదయించిన ఉషస్సునకును అర్పించవలసినదని చెప్పియున్నారుగద. ఈ మూడింటిలోను మొదటి రెంటిని సూర్యోదయముకాక పూర్వమే యర్పింపవలయునని తైత్తిరీయ



బ్రాహ్మణము చెప్పుచున్నది. భూమధ్య రేఖవద్దనున్న మన దేశములో ఉషఃకాలము బహుకొలదికాలమే యాకాశమున గాన్పించు ననుమాట మన కందరకు తెలిసియేయున్నది. ముహూర్తమాత్రముండిపోవు నీ ఉషఃకాలములో—ఉదయింపబోవుచున్న, ఉదయించుచున్న ఉదయించిన — అని మూడు భాగములుగ విడదీసి ఒక్కొక్కదాని కొక్కొక్క బలి నర్పించుట యెట్లు సాధ్యముకాగలదు? అంతస్పష్టముగ, మూడుభాగములుగ, విభజించుట కవకాశమేది? మన మిక్కడ ప్రతిదినముజూచు ఉషఃకాలములో నిన్నివివరములను గుర్తించుట కంత సాధ్యముకాదు. అయిదు భాగములుగ విడదీసి ఒక్కొక్కదానికి ప్రత్యేక ప్రత్యేకముగ బలుల నర్పింపగలుగుటకు అప్పటి యుషస్సు బహుదీర్ఘకాల మాకాశమున గాన్పించునదై యుండియుండవలె ననుమాట స్పష్టము.

ఉషఃకాలమును గూర్చిన యీ మూడు భేదములును ఋగ్వేదఋషులకు సైతము తెలిసినవిషయమే. [ ఋ vii 41, 3. సకుపః పరిమస్వతే......తస్య వేసీరను వ్రత ముష స్తిస్రో అవర్ధయన్. ] లో వరుణినియొక్క "ప్రియులు తనకుగాను మూడు ఉషస్సులను వృద్ధిబొందించి" నట్లు చెప్పబడియున్నది. i 174–7 లో "తిస్రః దాను చిత్రాః" అను పదమువలన "మూడుకాంతులు" గల ఉషస్సును సూచించినట్లు కనబడుచున్నది. [ ఋ v. 79–9 లో—వ్యుచ్ఛాదుహితర్దివోమాచిరంతనుథా అపః నేత్త్వా స్తేనం యథా రిపుం

తపాతి సూరో అర్చిషా. ] "ఓ ఉషస్సా! నీవు ఆకాశము మీాద విశేషకాల ముండవద్దు. నీ వచ్చుటనే విశేషకాల మున్నచో సూర్యుడు వచ్చి దొంగనుకాల్చినట్లు నిన్నుకాల్చి వేయును." ii. 15-6 లో ఉషస్సుయొక్క గుఱ్ఱములు బహు నెమ్మదిగ నడచుచున్నవి (అజవసః) అని చెప్పి యున్నారు. ఈవాక్యములనన్నిటినిబట్టి చూచిన ఉషఃకాలము ఆకాశము మీాద విశేషకాలముండెడిదనియు, ఆకారణముచేత అప్పటివారి కది బహువిసుగు బుట్టించుచుండెడిదనియు స్పష్టమగుచున్నది. వీని యన్నిటికంటె బలవత్తరమైన ప్రమాణ మింకొకటి గలదు. [ ఋ i. 113, 137. శశ్వత్పురోషా వ్యువాసదేవీ. ] "ఉషాదేవత పూర్వకాలములో (పురా) యెల్లప్పుడును యెడతెగక (శశ్వత్) ప్రకాశింపుచునే యుండెడిది" అని స్పష్టముగ కనబడుచున్నది. i. 118-11 లో - "శశ్వత్-తమా" అనగ "అన్నిటికంటె విశేషకాల ముండెడిది" యను విశేషణమును ఉషస్సునుగూర్చి చెప్పి యున్నారు. అదిగాక, "ఉషస్సు" అనియు "వి+ఉష్టి" అనియు రెండు పదములుండుటయే దీర్ఘమైన ఉషఃకాలమును సూచింపుచున్నది. ఉషస్సు ముహూర్తకాలము మాత్రమే యుండి మాయమైపోయిన యెడల "వి+ఉష్టి" లేక "బాగుగ వికసించిన" యను విశేషస్థితిని సూచింపవలసిన యవసరమేయుండదు. ఇట్టివిశేషస్థితిని ఋగ్వేదములో ననేక తావులలో సూచించియున్నారు. "ఉషసాఃవి—ఉష్టా" అను



పదము ఋగ్వేదములో ననేక పర్యాయములు ప్రయోగింపబడి యున్నది. దానికి మనవారు "ఉషస్సు ప్రకాశింపగనే" యను అర్థమును జెప్పిరి. కాని, కేవలమొక భావమునే తెలుపుటకై రెండుపదముల నేల ప్రయోగించి రనుసంశయము మనవారి కెవరికి గలుగలేదు. అదిగాక, మొదటి పదము "ఉషస్సు." దీనికి—"వి" యను ప్రత్యయముజేర్పగ వచ్చినమాట "వి-ఉష్టి." ఇది రెండవ పదము. రెండుభావములను దెలుపుటకై యీా రెండుమాటలను ప్రయోగింపని యెడల వీని ప్రయోజనమేమి? అందుముఖ్యముగ ఆదినములలో మాటలను నిష్ప్రయోజనముగ వాడిరని యూహించుటకు వీలులేదు. ఒకభావమును దెలుపుటకే యీా రెండు పదములను పునరుక్తిగ వాడిరని చెప్పుటకు వీలులేదు.

ఇంకను కొన్ని ఋక్కులను విచారించి చూచెదము. [ ఋ I. 113-10 : కి యాత్యాయత్సమయాభవాతి యావ్యూషుర్యాశ్చనూనమ్వ్యుచ్ఛాన్ అనుపూర్వాఃకృపతేవావశానా పాదీధ్యానాజోషమన్యాభిరేతి॥ ] దీనిలో మొదటిపాదమున కర్థము చెప్పుట బహుకష్టమైనపని. అనేకు లనేకవిధములుగ దీని కర్థమును జెప్పియుండిరి.

(1) శాయనాచార్యులవారి ననుసరించి చెప్పబడిన యర్థము:—ఉషస్సు లుదయించి యిప్పటి కెంతకాలమైనది? అవి యింక నెంతకాలమువరకు నుదయింపుచుండును? మన కింకను వెలుతురు నొసంగవలెనను కోరికతో నిదివర కుదయిం

చిన యుషస్సులవెంట నంటిపోవుచు, తమవెనుక నింక నుద యింపబోవు ఉషస్సులతోగూడ ప్రకాశమానముగ ముందు నకు సాగిపోవుచున్నవి.

(2) మాక్సిముల్లరు ననుసరించి చెప్పినయర్థము:—ఇది వరకు వెలిగిన ఉషస్సులును, ఇకముందు వెలుగబోవు ఉష స్సులును— ఇవి యెంతకాలము-ఎంతకాల మివి కలిసియుం డును ? ఇదివరకు వెలింగిన యుషస్సులకొర కాశించుచు, మిగిలిన (వెనుకవచ్చు) వానితో నీ యుషఃకాలము సంతోష ముగ ముందునకు సాగిపోవుచున్నది.

(3) మూడవయర్థము:—ఇదివర కుదయించిన యుష స్సులకును, యిక నుదయింపబోవు ఉషస్సులకును మధ్యకాల మెంతదీర్ఘముగనున్నది ? ఈ యుషఃకాలము యిదివరలో నుదయించిన యుషస్సులకై యాశించి (వానివెంట) బోవు చున్నది. మరియు, తనవెనుక నుదయింపబోవు యుషస్సు లతో సహా సంతోషముతో ముందునకు సాగిపోవుచున్నది.

ఈ మూడర్థములలో మన మేయర్థము నంగీకరించినను భావమొక్కటే తేలుచున్నది. రెండురకముల ఉషస్సులు—ఇది వర కుదయించినవి, యికముం దుదయింపబోవునవి—కలవనుట స్పష్టము. మొదటి రెండర్థములను మనము ఒప్పుకొన్నచో, యీ రెండుతరగతుల యుషఃకాలములును కలిసి విశేషకాల మాకాశమున వెలుంగుచుండుటచేత, వీనితో విసుగుబుట్టి—



"ఇవి యింకను యెంతకాల మిట్లు కలిసి యుండును"— అను శంకను పుట్టించుచున్నవి. అనగ దీర్ఘమైన యుషఃకాలమును సూచింపుచున్నది. ఇట్టి వర్ణన ఉత్తరధ్రువప్రాంతదేశపు ఉషః కాలమునకే వర్తించునుగాని, మనదేశపు ఉషఃకాలమునకు వర్తింపదు. ఇక మూడవ యర్థమును విచారించుదము. దీనిని బట్టి మొదట నుదయించిన యుషస్సులకును, ఇకముం దుద యింపబోవు నుషస్సులకును మధ్య చాల విరామ మున్నట్లు స్పష్టముగ జెప్పబడియున్నది. ఇట్టి సృష్టివైచిత్ర్యము ఉత్తర ధ్రువమువద్ద తప్ప ఇతరచోట్ల సాధ్యముకాదు. కనుక మన మేయర్థమును ఒప్పుకొన్నను మన సిద్ధాంతమునకు సరిపోవు చునే యున్నది. పూర్వోత్తరసందర్భముల నన్నిటిని విచారించి చూడగ శాయనాచార్యులవారును, మాక్సిముల్లరు ననుస రించి చెప్పిన యర్థములే సరియైనవని తేలుచున్నది. కొన్ని ఉషస్సులు గలవు. అవి రెండు తరగతులుగ విభజింపబడి యున్నవి. ఇదివర కుదయించినవి, ఇకముం దుదయింపబోవు నవి. ఈ రెండు తరగతుల యుషస్సులును కలిసి విశేషకాలము ఆకాశమున వెలుంగు చుండును. — ఈ ఋక్కులో నున్న సారాంశ మిది. మన మిప్పుడు చర్చించిన ఋక్కు పదియవది. ఇక 13 వ ఋక్కును విచారించిచూచినచో "పూర్వకాల ములో ఉషాదేవత సంతతమును వెలుంగుచుండెడిది" అని చెప్పబడియున్నది. దీనిని బట్టి ఉషఃకాలము బహు దీర్ఘకాల ముగ నుండెడిదని స్పష్టముగ దెలుపబడినది.

ఋగ్వేదము 7 వ మండలములో ననేక ఉషఃకాల గీతములు గలవు. [VII, 76–1,2] లో ఉషస్సులు యెప్పటి వలెనే అనేక సౌందర్యవిశేషములతో తమ ధ్వజమును దిక్చక్రముపై కెత్తినవని చెప్పుచు, VII 76, 3 లో మొదట ఉషస్సుకనుబడి తిరిగి సూర్యోదయమగులోపల ననేకదినములు గడచెనని స్పష్టముగ వక్కాణించి యున్నారు. ఈ VII 76–3 మిక్కిలి ముఖ్యమైనదిగాన నీక్రింద వివరించెదము.

" తానీ దహాని బహులాన్యాసన్, యాప్రాచీనముదితా సూర్యస్య । యతఃపరిజారఇ వాచరంత్యుషో దదృక్షే న పునర్యతీవ ॥

| | | | | |
|---|---|---|---|---|
| తాని | ఇత్ | అహాని | బహులాని | ఆసన్ |
| (ఆ) | (నిజముగ) | (దినములు) | (అనేక) | (ఉండెను) |
| యా | ప్రాచీనమ్ | ఉద్-ఇతా | | సూర్యస్య |
| (యే) | (పూర్వము) | (ఉదయమునకు) | | (సూర్యునియొక్క) |
| యతః | పరి | జార-ఇవ | | ఆ-చరంతి |
| (దేని) | (వెంబడి) | (ప్రియునివైపున కు వలె) | | (కదలిపోవుచు న్నది) |
| ఉషసః | దదృక్షే | న | పునః | యతీ-ఇవ |
| (ఓఉష స్సా!) | (కనుబడుచు న్నది) | (కాదు) | (తిరిగి) | (వదలుచున్న స్త్రీ వలె) |

దీనికర్థమిది :– " నిజముగ సూర్యోదయమునకు పూర్వము అనేక దినములుండెను. ఓ ఉషస్సా ! నీవాదిన



ముల వెంబడి (నీ) ప్రియునివైపునకు సాగిపోవుచున్నట్లు కనబడుచున్నావు; గాని, ప్రియునివదలి వెళ్ళిపోవు స్త్రీవలె కనిపించుటలేదు " దీనిలో నుండు ఒక్కొక్క వాక్యమును విడదీసి చూచెదము. " ఆదినములు చాలదినములు " అనునది ప్రధాన వాక్యము. ( తాని లేక ) ఆదినమ్ము లనగ యేదినములు ? దీనికి రెండు విశేషణములు గలవు. " యా ప్రాచీనమ్... " అనునది యొకటి. " యతః పరి... " అనునది మరియొకటి. ఆదినములు " సూర్యోదయాత్పూర్వకాలమును సూచింపుచున్నవని " మొదటి విశేషణమువల్ల స్పష్టమగుచున్నది. సూర్యోదయాత్పూర్వమైనచో నవి చీకటిదినములు కాకూడదా యని కొందరికి సందియము తోపవచ్చును. కాని, " యతఃపరి... " యను రెండవ విశేషణమువల్ల నీ సందేహము తీరగలదు. ఏలననగ : ఈదినములు సూర్యోదయాత్పూర్వదినములైనను, " ఉషస్సు ఆ దినముల వెంట తన ప్రియునివద్దకువలె సాగిపోవుచున్నవిగాని ప్రియుని వద్దనుండి మరలిపోవుట లేద"ని స్పష్టముగ సూచింపుటవలన, ఆదినములలో ఉషఃకాలపు వెలుతురు కలదనియు, ఆ యుషఃకాలము బహు దినములుండెడిదనియు సిద్ధించుచున్నది. దీని వలన రెండంశములు స్థిరపడుచున్నవి. (1) మొదట ఉషఃకాలపు కను వెలుగు కనుబడుటకును తదుపరి సూర్యోదయమగుటకును మధ్య ననేకదినములు (బహులాని అహాని) గడచెననియు (2) ఈ దినములన్నిటియందును ఉషస్సను స్త్రీ తన

ప్రియుని (సూర్యుని) కలిసికొనుటకుగాను బహు భక్తిశ్రద్ధలతో కనిపెట్టుకొని యుండి యాదినములవెంబడి క్రమముగ తన ప్రియుని చేరుచుండెననియు, అనగా ఆదినములలో యెడ తెగని ఉషస్సు వెలుగుచుండెననియు స్పష్టమగుచున్నది.

ఈ ఋక్కున కర్థము జెప్పుటలో భాష్యకారు లందరును ఉక్కిరిబిక్కిరి యైరి. ఇక్కడ వచ్చిన గొప్ప చిక్కేమి యనగా:- సూర్యోదయమునకు పూర్వము అనేకదినములు గడచు టెట్లు? మనదేశములలో నిది సంభవము కానేరదు. శాయనులవారికిని తదితర భాష్యకారులకును ఉత్తరధ్రువ సిద్ధాంతమను యీకీలకము తెలియనందున వా రేదోవిధముగ మనదేశపు స్థితిగతులకు ముడివెట్టజూచిరి. పైకి బహు తేలికగ గన్పట్టుచున్న వాక్యములకు స్వభావసిద్ధమైన యర్థములను వదలివైచి, యేవియో మూలమూల నున్నట్టియు, పూర్వోత్తర సందర్భములకు అతుకనట్టియు, యెంతదూరమో త్రవ్వినగాని యచ్చటి భావమునకు సరిపోనట్టియు పెడార్థముల్లను జెప్పి అతుకులు బెట్టవలసినవారైరి. కాని మన మొక్కసారి యీ కీలకమును మనస్సునం దుంచుకొన్నచో యీ వాక్యములన్నియును సులభముగ బోధపడగలవు. పై ఋక్కులలో సమర్థింపవలసిన మాట "అహాని" అనగ దినములు. ఇది బహువచనము. దీనిని సమర్థించు టెట్లు? సూర్యోదయమునకు పూర్వము అనేక దినము లెట్లు గడువగలవు? కాన దీని కర్థమును చెప్పుటకై యీ మాటయొక్క మూలములోనికి దిగిరి. "అహన్" అనునది "అహ్" అను మూలములో నుండి పుట్టినది. "అహ్" అనగ "మండుట," "వెలుగుట" అని అర్థము. కనుక "అహన్" అనగ "కాంతి," "వెలుతురు," "ప్రకాశము" అను అర్థము వచ్చినది. దీనినిబట్టి "అహాని" అనగ "కాంతులు" అను నర్థము చెప్పవచ్చును. కాని యీ యర్థములో యీ మాట నెచ్చటను ఋగ్వేదములో ప్రయోగింపలేదు. "అహాని" అనగ దినములనియే ఋగ్వేదములోని సాధారణార్థము. "అహాని" అనగ "కాంతుల" ని యిచ్చట చెప్పుట కేవలము స్వభావ విరుద్ధము. అదిగాక, "అహన్" అను పదము కేవలము వెలుతురుగ నున్నకాలమునకే వర్తించునని శాయనులవారి మతము. కాని ఋగ్వేదములో నట్లెచ్చటను చెప్పియుండలేదు. మరియు, "నల్లని" దినము (అహః) అనియు, "తెల్లని" దినము (అహః) అనియు రెండు విధములైన (అహః) దినములు గలవని ఋ. VI. 9-1 లో స్పష్టముగ జెప్పియున్నారు. [అహశ్చకృష్ణ మహార్జునమ్ చ వివర్తతే రజసీ వేద్యాభిః] ఈ విషయమంతయు శాయనులవారికి పూర్తిగ తెలియును. "అహః" అను పదము రాత్రికాలమునకుకూడ వర్తించునని తామే I. 185-4 లో స్పష్టముగ వ్యాఖ్యానము చేసియున్నారు. కాని వారికి తటస్థించిన కష్టము వేరు. సూర్యోదయమునకు పూర్వ మనేక దినము లెట్లు గడువగలవు? ఈ బాధనుండి తప్పించుకొనుటకై

యేదియో యతుకువెట్టజూచిరి. పాశ్చాత్య భాష్యకారులకుకూడ యీ చిక్కే తటస్థించినది. కాని యీ వర్ణనను ఉత్తర ధ్రువప్రాంతదేశములకు వర్తింప జేసినయెడల యీ చిక్కులన్నియు మాయమగును. ఏలననగ, అచ్చట ఉషఃకాలము బహుదినములు, కొన్నిసమయములలో నెలదినములుసైత ముండునని యిదివరకే చెప్పియుంటిమి. ఇది కేవలమచ్చటి ఉషఃకాలమును గూర్చియే చెప్పబడినది. కావలయుననిన మనముకూడ యిప్పుడుత్తరధ్రువము వద్దకుపోయి యీ సృష్టివైచిత్ర్యమును కండ్లార గాంచవచ్చును.

సూర్యుడే లేనప్పుడు దినములు లెక్కపెట్టుటెట్లని కొందరు శంకింపవచ్చును. కాని సూర్యుడు లేనిసమయములలో సప్తర్షిమండలము మొదలగు నక్షత్రములు తిరుగుచుండును. అదిగాక, యీ యుషస్సుయొక్క కాంతియే దిక్చక్రముయొక్క అంచువెంబడి తిరుగుచుండును. పూర్తిగనొక చుట్టు తిరిగినయెడల నది యొకదినమగుచున్నది. ఇట్లెన్నియావృతములు తిరిగిన నన్నిదినములు గడచెనని లెక్కవేయ వచ్చును. ఉషస్సు ఉదయించి యిన్ని దినములైనదనియు, మరి యింక కొన్నిదినములు గడచిన గాని యీ యుషస్సు పూర్తిగ సూర్యోదయముగ వికసింపదనియు లెక్కవేయ వచ్చును. II. 28—9 లో చెప్పినట్లుగ నిన్నిదినముల పరిమితిగల యుషఃకాలము గడచినను యింకను సూర్యోదయము కాలేదని లెక్కవేయవచ్చును.



[పరఋణాసా వీర ధమత్కృతాని మాహంరాజ న్నన్యకృతేన భోజం। అవ్యుష్టాఇన్ను భూయసీ రుషాస ఆనో జీవా న్వరుణ తానుశాధి] దీనియర్థము:— "నాచేత చేయబడినటువంటి ఋణములను (అనగ పాపములను) అన్నిటిని తొలగింపుము. ఓ రాజా! ఇతరులక్రియలవలన నేను అంటబడకుండునట్లు చేయుము. నిజముగ అనేకఉషస్సులు వికసింపలేదు. ఓవరుణా! మే మాఉషస్సులలో జీవించియుండునట్లనుగ్రహింపుము." మొదటిరెండుపాదములలోను అన్వయకాఠిన్యమేమియును లేదు. మూడవపాదమే వివాదాంశము. "భూయసీః ఉషాసః అవ్యుష్టాః" అనుపదముల కర్థమేమి? మొదటి రెండుపదములకును అర్థము "భూయసీః ఉషాసః" =(అనగ) "అనేకఉషస్సులు" అని తేలుచున్నది. ఇకమిగిలినది "అవ్యుష్టాః" అనుపదము. "అవ్యుష్టాః" అనునది "వ్యుష్టాః" అనుదానికి వ్యతిరేకార్థమును దెలుపుపదము. "వ్యుష్టాః" అనునది "ఉష్టాః" అనుదానికి — "వి" — యను ప్రత్యయము జేర్పగవచ్చిన పదము. "ఉషస్", "వ్యుష్టి" యను రెండు పదములకుగల భేదమును ఉషఃకాలము యొక్క 3. 5 రూపాంతరములనుగూర్చి చర్చించిన సందర్భములో నిదివరకే చెప్పియుంటిమి. తై. బ్రా. లో "వ్యుష్టి" యనగ "దినము" అనియు లేక "ఉషస్సు పూర్తిగ వికసించి సూర్యోదయమగుట" యనియు అర్థము చెప్పియున్నారు. కనుక "అవ్యుష్టాః" అనగ "అ + వి + ఉష్ట" అనుదానికి "పూర్తిగ సూర్యోదయరూపము

లోనికి వికసింపని, ప్రజ్వలింపని" యని తాత్పర్యము కాని
"ఉషస్సు," "వ్యుష్టి"-యీ రెండు మాటలకును గల
తారతమ్యమును శాయనులవారును తదితరవ్యాఖ్యాతలును
గమనించినట్లు కన్పించదు. ఒకవేళ వారు దీనిని గమనించినను
సూర్యబింబము పైకి కనబడులోపల నిన్నిదినముల యుషఃకాల
ముండుననుయనుమానము వారి మనస్సునకు తట్టియుండదు.
ఆకారణముచేత, "భూయసీః ఉషాసః అవ్యుష్టాః" = అనేక
ఉషస్సులు పూర్తిగ సూర్యోదయరూపములోనికి వికసింపలేదు,
"ప్రజ్వలింపలేదు" అను భావము వారికి యసందర్భముగ
గాన్పించెను. ఏలననగ :— ప్రతిదినమును ఉషఃకాలము
వెంటనంటి పూర్తిగ సూర్యోదయమగుట వారు తమ కం
డ్లార చూచుచునే యుండిరి. అట్టి సందర్భములలో "అనేక
ఉషస్సులు పూర్తిగ సూర్యోదయరూపము లోనికి వికసింప
లేదు, ప్రజ్వలింపలేదు" అనిచెప్పుమాటలు వారికిమిక్కిలి
యసందర్భముగ గాన్పించెను. కనుక దీని నేదో విధముగ
సమర్థింపజూచిరి. కండ్లకెదురుగ గనుపడు నంశములను
గూర్చి వర్ణింపుచున్న "అవ్యుష్టః" యనుపదమునకు
భవిష్యదర్థమును కల్పించిరి. "ఇంకను ఉదయింపని ఉషస్సు
లలో" అనగ "ముందురాబోవుదినములలో" ననియర్థమును
చెప్పిరి. ఈయతుకు యతుకుగనే గాన్పించుచున్నది. ఏలననగ
యీఋక్కునువ్రాసిన ఋషి తానప్పుడు కండ్లారచూచుచున్న
విషయములను వర్ణింపుచున్నాడేగాని ముందురాబోవువానిని



గూర్చిచెప్పుటలేదు. దీనినిజార్థమిది. "అనేక ఉషస్సులు,అనగ
దినములపరిమితిగల యనేక ఉషస్సులు గడచినను యింకను
"వ్యుష్టి" కాలేదు. అనగ, పూర్తిగ సూర్యోదయము
కాలేదు. అనగ సూర్యబింబము పైకి రాలేదు. కాన యీసమ
యములో వరుణుడు భక్తుని రక్షించుగాకయని ప్రార్థన.
ఈభావమునే బలపరుచుట కింకను ఋగ్వేదములో ప్రమాణ
ములుగలవు. పైఋక్కులోని "భూయసీః" యనుపదమునకు
సమానార్థముగల "పూర్వీః" (అనేకము) అనుపదము IV.
19, 8; VI. 28, 1 లోను కలదు. ఒక్కఉషస్సేగాక అనేక
ఉషస్సులు గలవని సూచింపఁబడినది. అదిగాక ఋగ్వేద
ములో ఉషస్సును తరుచుగ బహువచనము ప్రయోగించిరి.
I. 92 లో ఉషఃకాలమునుగూర్చినగీతమును పా[illegible]
"ఇవిగో! దిక్చక్రముపైనగాన్పించు యీ (ఏతాః) ఉషస్సులే
ఆ (త్యాః) ఉషస్సులు (ఉషసాః)!" అని బిగ్గరగ తన హృద
యాహ్లాదమును వెలిబుచ్చెను. ఈవాక్యమే VII. 78-3 లో
కూడగలదు. ఈబహువచనమును గౌరవచిహ్నముగ ప్రయో
గించిరని యాస్కాచార్యులవారు సమర్థింపజూచిరి. ఉదయ
కాలమునకు అధిష్ఠాన దేవతలుగనున్న యనేకదేవతలనుగూర్చి
యీ బహువచనము ప్రయోగింపబడినదని శాయనులవారు
సమర్థింపజూచిరి. పాశ్చాత్యభాష్యకారు లేమియు నింతకంటె
యెక్కువ చెప్పలేకపోయిరి. గౌరవచిహ్నముగ బహు
వచనము నుపయోగించిరని మన మొకవేళ నొప్పుకొన్నను,

పిమ్మట తిరిగి యేకవచన మేల ప్రయోగింపవలెను? ఉషస్సు లుదయించుటను గూర్చి వర్ణింపుచు ననేక ఉపమానములను చెప్పిరి. కొన్నిచోట్ల వీనిని "యోధవీరుల" కు (ధృష్ణవః) పోల్చి యున్నారు. కొన్నిచోట్ల తమ తమ పనుల నన్నిటిని బహు చాకచక్యముతో నిర్వర్తించుకొను స్త్రీలతో (నారీః) పోల్చిరి. "నీటితరంగములవలె (అపాం న ఉర్మయః) దిక్చక్రముపై గాన్పించు" నని వర్ణించిరి. యజ్ఞములో పాతిన స్తంభమువలె (అధ్వరేషు స్వరవః) నున్నవని వర్ణించిరి. ఇవన్నియును, "వరుసగ నిలువబెట్టిన మనుష్యుల" వలె (విశోన యుక్తాః) నున్నవి. పశువులమందవలె (గవాం న సర్గాః) పోవుచున్నవి. అవన్నియు నొకటే మాదిరిగ (సదృశీః) నున్నవట. ఒక్కటే మనస్సుతో (సజ్ఞానస్తే) కలసిమెలసి యుండి పనిచేయుచున్నవట. అవన్నియు నొకే ఆవరణలో (సమానే ఉర్వే) నున్నప్పటికిని ఒకదానిమీదికి మరియొకటి కలహించి పోవట. (మితహ్నాయతంతే.) X. 88-18 లో స్పష్టముగ మూడు ప్రశ్నలు గలవు. "ఎన్ని అగ్నులు, ఎంతమంది సూర్యులు, ఎన్నిఉషస్సులు (ఉషాసః) కలవు?" ఈపై వాక్యములనుబట్టి చూచినచో యాస్కాచార్యులవారియర్థము సరియైనదికాదని తేలుచున్నది. ఇదిగాక, శాయనాచార్యులవారు చెప్పిన దానిని విచారించి చూచుదము. ఉషఃకాలమున కధిష్ఠానదేవతలు యెక్కుమందియుండనేల? కాన యిదియును సరియైనదికాదు.



ఈ బహువచనప్రయోగమును మరికొంద రిట్లు సమర్థింప జూచిరి. సంవత్సరము పొడుగునను వచ్చు, ఉషస్సులనుగూర్చి చెప్పినందున నీ బహువచనమును ప్రయోగించిరట. ఈసిద్ధాంతము ప్రకారము సంవత్సరములో 360 ఉషస్సులుండవలెను. ప్రతియుషఃకాలానంతరమును సూర్యోదయ ముండవలెనుగద. కాని యీ విషయమును కొంచెము విచారించిన యెడల యీ సిద్ధాంతము నిలువజాలదని తేటపడగలదు. ఒక్కొక్క ఉషస్సునకు మధ్య 24 గంటల విరామముతో గూడుకొనిన 360 ఉషస్సులనుగూర్చి వర్ణింపుచున్నప్పుడు I. 92-1 లో "ఇవిగో! యీ (ఏతాః) ఉషస్సులే, ఆ (త్యాః) ఉషస్సులు" అని తనకండ్లార తనయెదుట కాన్పించుచున్న వస్తువులను చూపించి మాట్లాడుచున్న శైలి వర్ణించును. ఇచ్చట బహువచనప్రయోగ మేలయుండవలెను. ఈబహువచనము సంవత్సరముపొడుగునను దినములవరుసను, వచ్చుఉషస్సులైనయెడల "వరుసగ నిలువబెట్టబడిన మనుష్యులు" అనువర్ణన కెట్లు సరిపోవును? ఇవన్నియు నొకయావరణలోనే యున్నప్పటికిని ఒకటితో మరియొకటి తగవులాడుకొనకుండ నున్నవ" ను వర్ణన కెట్లు సరిపోవును? కనుక యీయర్థము లేమియు సరిపోవు. ఉషస్సులన్నియు నొకటితరువాత మరియొకటి యెడతెగక, సూర్యోదయముచే భగ్నముగాకుండ వరుసగనన్నియు నొకచోటనే నిలచియున్నవని తేలుచున్నది. కనుక వీనినన్నిటిని కలిపి ఒకదీర్ఘమైన పెద్దయుషఃకాలముగ గ్రహింపనగును.

అనగ అచ్చట యుషఃకాలము బహుదీర్ఘమైనదని సిద్ధించుచున్నది. "ఉషఃకాలపు వెలుతురు కనుబడుటకును తదుపరి సూర్యోదయమగుటకును మధ్య ననేకదినములు గడచునను VII. 76-3 లోని భావమునకును యీభావమునకును సరిపోవుచున్నది. రెంటియర్థ మొకటే. కనుక యాస్కాచార్యులవారు, శాయనాచార్యులవారు, తదితరులు చెప్పిన సిద్ధాంతములను త్రోసివేయవలసినదే. అప్పటికాలములో ఉషఃకాలము బహుదీర్ఘకాలముగ నుండెడిదనియు, ఆయుషస్సు అనేకదినములవరకు వ్యాపించియున్నకారణమున దినమునకొక్కొక్కఉషస్సుగ నీదీర్ఘయుషస్సును విభజించినయెడల, యీభాగములను బహువచనముతో సంబోధింపవచ్చుననియు తేలుచున్నది. దీనినిబట్టి ఉషఃకాలమునుగూర్చి చెప్పుచున్నప్పుడు కొన్నిసమయములలో నేకవచనమును, మరికొన్ని సమయములలో బహువచనము నేలప్రయోగించిరో తేటబడగలదు.

తై. సం. IV, 3-11 లో ఉషస్సులన్నియు కలిసి "ముప్పది యప్పచెల్లెండ్ర"ని చెప్పబడియున్నది. వీరందరును అయిదు జట్టులుగజేరి, గిరగిర తిరుగుచు, మొదట తాము బయలుదేరిన చోటికివచ్చి చేరుదురట. ఆ యనువాకమంతటిలోను 15 ఋక్కులు గలవు. కొన్ని యజ్ఞములలో బలిపీఠముపై "ఉషస్సు యిటుకలు" "వ్యుష్టీ - ఇష్టకాః" పేర్చునప్పుడు యీ ఋక్కులనే మంత్రములుగ పఠింతురు.



ఇటుకలన్నియు కలిసి మొత్తము 16 గలవు. వీనిలో 15 టిని పేర్చుట కీమంత్రములు పనికివచ్చును. మిగిలిన 16 వది మరియొకచోట గలదు. ఈ యనువాకములో మొదటి మంత్రమును పఠింపుచు మొదటి యిటుకను పెట్టెదరు. ఈ మంత్రములో మొట్టమొదటగ నాకాశమువీుద గాన్పించు ఉషస్సునుగూర్చి వర్ణింపబడియున్నది. రెండవమంత్రములో రెండు ఉషస్సులుకలిసి జంటగనొకచోటనే నివసించియున్నట్లు వర్ణింపబడియున్నది. మూడవమంత్రములో మూడవఉషస్సు సూచింపబడినది. ఇట్లే 4, 5 మంత్రములలో నాల్గవ, ఐదవ ఉషస్సులనుగూర్చి చెప్పబడియున్నది. ఈయైదు ఉషస్సులను తామైదుగురుమాత్రమేగాక తమలో నొక్కొక్కరికి అయిదేసి చొప్పున ఐగురు చెల్లెండ్రుకలరట. కనుక మొదటి అయిదుతోకూడ కలుపుకొని మొత్తము 30 ఉషస్సు లగుచున్నవి. ఈముప్పది యక్కచెల్లెండ్రును [త్రింశత్ స్వసారః] కలిసి అయిదుజట్టులుగ, గుండ్రగ, పోవుచున్నట్లును (పరియంతి) తిరిగి యెప్పటిచోటునకే వచ్చి చేరుచున్నట్లును (నిష్కృతం) వర్ణించియున్నారు. రెండుమంత్రములైనపిమ్మట ఉషస్సులలో నున్నట్టి యైకమత్యము తమలోకూడ నుండున ట్లనుగ్రహింపవలసినదని ప్రార్థన యొకటిగలదు. మొదటచెప్పిన 5 ఉషస్సులలో నొకఉషస్సు "ఋత" యొక్కకుమార్తెయట. రెండవది జలముయొక్క మాహాత్మ్యమును దెలుపునట. మూడవది సూర్యమండలములో నివసించు నట. నాల్గవది యగ్నిమండల

ములో నుండునట. 5వది " సవితృ " నిచే పాలింపబడుచున్నదట. పైవర్ణనను బట్టి యీమైదు ఉషస్సులును మన మీదేశములో ప్రతిదినము జూచు ఉషస్సులు కావనియు ఇవన్నియు నొక్కదీర్ఘ ఉషస్సులోని అంతర్భాగము లేయనియు, స్పష్టమగుచున్నది. "ఈయుషస్సు అనేకరూపములను ధరించి వెలుగుచున్నను, నిజమున కిది యంతయు నొక టేయుషస్సని" యీ యనువాకములోని చివరమంత్రములో నిస్సందేహముగ, ఖండితముగ, వివరించియున్నారు. ఈయనువాక మంతటిలో నెచ్చటను సూర్యోదయమైనట్లు చెప్పియుండలేదు. సూర్యోదయపు ప్రశంసయే రాలేదు. అదిగాక "బ్రాహ్మణము" లో దీనిని స్పష్టపరచినారు. " పగలును, రాత్రియు గానికాలము కొంతయుండెను. ఏదైనదియు చెప్పుటకు వీలులేనికాలముగ ఉండెను. అప్పుడు దేవతలందరును యీయుషస్సులను జూచి వానిని క్రిందికిదించిరి. అంతట వెలుతురు వచ్చెను. కనుక యీ "ఉషస్సు ఇటికరాళ్లను పేర్చిన వానికి వానిలోనుండు చీకటి పోయి వెలుతురు వచ్చును." ఈమంత్రములను చదువుచు బలిపీఠముమీద నేల "ఉషస్సు ఇటుకల" ను పేర్చవలెనో యీపైదానిని బట్టి స్పష్టమగుచున్నది. ఇది పూర్వగాథను దెలుపుచున్నది. పూర్వము దేవతలు రాత్రియు పగలుగాని సమయములో నున్న ఉషస్సులను ముప్పదింటిని చూచుచుండెడివారనియు, ఒకదానిపై నొక ఉషస్సును పెట్టుకొనుచు పోగా 30 ఉషస్సులను లెక్కపెట్టి పేర్చిన తరువాత



వెలుతురు (సూర్యకాంతి) వచ్చి సూర్యోదయ మాయెననియు స్పష్టమగుచున్నది.ఆవిధముననే బలిపీఠముమీద ఈమంత్రముల నుచ్చరించుచు యిటుకరాళ్ళను పేర్చిన యెడల వాని పాపములన్నియు పోయి, పుణ్యమువచ్చునని దీనిభావము. కనుక ముప్పది దినములు, లేక ముప్పది ఉషస్సులకాలము గడచినగాని సూర్యోదయమయ్యెడిది కాదని దీనివలన స్పష్టమగుచున్నది. అదిగాక, యీ 30 ఉషస్సులును మనము మనదేశములో ప్రతిదినము జూచుచుండు ఉషస్సులు కావనియు స్పష్టమగుచున్నది. కనుక యీ వర్ణన తప్పక ఉత్తరధ్రువ ప్రాంతదేశములకే వర్తించును. ఈ 30 యుషస్సులును దినదినమును కనిపించు మూహూర్తమాత్రపు ఉషస్సులు కావనియు ఇవన్నియు నొక దీర్ఘయుషస్సులోని భాగములే యనియు చెప్పుట కింకను నిదర్శనములు గలవు. తై. బ్రా. II. 5, 6, 5 " ఈ యుషస్సులే ఆ మొదట ప్రకాశించిన యుషస్సులు. ఈదేవతలు 5 రూపములను ధరింతురు. శాశ్వతమైనవి (శశ్వతీః) విడిపోనివి (నఅవపృజ్యంతి) అంతమొందనివి (నగమంతిఅంతం) [ఇమా ఏవతా ఉషసోయా ప్రథమా వ్యౌచ్ఛన్ । తాదేవ్యః కుర్వతే పంచరూపా।శశ్వతీ ర్నావపృజ్యంతి నగమన్త్యన్తమ్॥] దీనిలో చెప్పబడిన 5 రూపములకును తై. సం. లో చెప్పబడిన 5 జట్టులకును సరిపోవుచున్నది. ఈ యుషస్సు లన్నియు కలిసి యొకటిగనే యుండుననియు, విడిపోవనియు, వీనిలో నొకదానికిని మరియొకదానికిని మధ్య సూర్యోదయము రాద

నియు స్పష్టమగుచున్నది. ఋ. I. 152–4 లో ఉషఃకన్యల (కానీనాంజారం) ప్రియుడైన సూర్యునియొక్క మేలిముసుగు (అనగ ఉషస్సు) విడిపోనిదనియు, మిక్కిలి వెడల్పుగల దనియు (అర్క్-అవపృగ్ణ; వితత) వర్ణించి యున్నారు. ఇది పై వర్ణనలతో నేకీభవించుచునే యున్నది. అథర్వవేదము VII. 22–2 లో ఉషస్సులు "సచేతసః" అనియు, "సమీచీః" అనియు (అనగ అన్యోన్యమైత్రితో మెలగుచు కలిసిపోవుననియు, యెప్పుడును విడిపోవనియు) వర్ణించి యున్నారు. ఈ సందర్భములో 30 ఉషస్సులను గూర్చి శాయనాచార్యులవా రెట్లు సమర్థించిరో విచారించెదము. ఆయనువాకముయొక్క మొదటిమంత్రములో మొదటి యుషస్సును గూర్చిన ప్రశంసకలదు. ఈ మొదటి యుషస్సు సృష్ట్యాదిని కనుబడిన "ప్రథమఉషస్సు"ను సూచింపునని శాయనులవారు వ్యాఖ్యానముచేసిరి. రెండవమంత్రములో చెప్పబడిన "ఉషస్సు" మనము ప్రతినిత్యమును జూచు ఉషస్సును సూచింపునట. కాని మిగిలిన 28 ఉషస్సుల నేమిచేయవలెను ? శాయనుల వారికి యీ రెండు ఉషస్సులేతప్ప ఇంకొక మూడవరకపు ఉషస్సు తెలియదాయెను. అందువలన ఉషస్సంతయు నొకటేయైనను, ఆయుషాదేవత తన యోగ బలముచే ననేకరూపములను ధరింపగల్గెనని శాయనులవారు మిగిలిన 28 ఉషస్సులను సమర్థించిరి ! ఇదిగాక తుదకు వీరొక యర్థమును సాధించిరి. ఈ 30 ఉషస్సులును దినమున



కొక ఉషస్సుచొప్పున నెలదినములలోను కనుబడు మొత్తపు ఉషస్సుల సంఖ్యయని చెప్పిరి. కాని వీరిలెక్కప్రకారము సం॥ లో 360 ఉషస్సు లుండగ వానిలో యీ 30 ఉషస్సులను గూర్చిమాత్రమే యీ మంత్రములలో నేల ప్రశంసించిరో వీరెచ్చటను తెలియబరచియుండలేదు. ఈ యర్థములన్నియు పరస్పర విరుద్ధములేగాక, తైత్తిరీయ బ్రాహ్మణ॥; తై॥ సం॥ లలో చెప్పిన వాక్యములకుకూడ విరుద్ధముగ నున్నవి. పూర్వము మన యార్య లుత్తరధ్రువమువద్దనుండగ అచ్చటిసృష్టివైచిత్ర్యములను వారు కళ్లారచూచి యీవిధముగ వర్ణించిరను యనుమానము శాయనాచార్యులవారి మనస్సునకు తోచనందున వా రిట్టిపరస్పరవిరుద్ధములగు వ్యాఖ్యానములను చెప్పవలసినవారైరి. ఈకీలకమునే వా రెరింగి యుండినయెడల వా రిట్టి పెడార్థములను చెప్పెడివారు కారు.

ముప్పదియుషస్సులుగల వనుమాట తై॥ సం॥ బ్రా॥ లలో కలదేగాని, ఋగ్వేదములో నెచ్చటనులే దని కొందరు వాదింప సాహసించెదరేమో. అ ట్లింతమాత్రము కాదు. ఋ VI 59–6 లో ఉషస్సు "ముప్పదియడుగులు" (త్రింశత్ పదాని అక్రమీత్) నడచిపోయినది, అని చెప్పబడియున్నది. [ఇంద్రాగ్నీ అపాదియం పూర్వాగాత్పద్వతీభ్యః హిత్వీశిరో జిహ్వయావావదచ్చరత్త్రింశత్పదా న్యక్రమీత్]. దీని కింక నెవరును పూర్తిగ అర్థము చెప్ప సాహసింపలేదు. 'ఒకఉషస్సు ముప్పదిఅడుగులు నడచినది' అనినను 'ఉషస్సులు మొత్తము

30 అక్కచెల్లెండ్రు: వారందరు కలిసి ఒకచోటికే వచ్చి
చేరునట్లు గుండ్రముగ తిరుగుదురు ' అనినను — ఈరెండు
వాక్యములకు నొకటేయర్థమని వేరుగ చెప్పనక్కరలేకయే
తెలియుచున్నది. ఇదిగాక ఋ I. 123–8 [ సదృశీరద్య
సదృశీరిదు శ్వోదీర్ఘం సచంతే వరుణస్యధామ్ అనవద్యాస్త్రిం
శతం యోజనాన్యేకైకా క్రతుం పరియంతి సద్యః ] " ఉష
స్సులు యీదినముననున్నట్లే రేపటిదినముకూడనుండి, వరు
ణుని మందిరములో చాలకాలమువరకు నివసించును. అవి
కల్మషరహితమైనవి. అవి గుండ్రముగ ముప్పది యోజనములు
తిరుగును (పరియంతి). ఇట్లు తిరుగుటలో ప్రతియుషస్సును
యెప్పటిచోటికి వచ్చి చేరును (క్రతుం). " మొదటి రెండు
వాక్యములలోను కష్టమేమియులేదు. పిమ్మట " ఉషస్సులు
గుండ్రముగ ముప్పదియోజనములు తిరుగుచు యెప్పటిచోటికి
వచ్చిచేరుచుండును " అని చెప్పబడియున్నది. * దీనియొక్క
నిజార్థము నింతవర కెవరును విప్పిచెప్పలేకపోయిరి. ఇది కేవ
లము ఉ. ధ్రు. ప్రాంతదేశములోని ఉషస్సులయొక్క లక్ష
ణము. 30 ఉషస్సులు ( 30 దినములు ) గడచిననే గాని

* యోజనము అనగ " ఒక్కదినములో తిరుగగలదూరము " ఈ
మాటను యీ యర్థములోనే V–54–3 లో ప్రయోగించియున్నారు కనుక
ముప్పది యోజనము లనగ ముప్పదిదినములలో తిరుగుదూరము. అనగ దిన
మున కొకచుట్టుచొప్పున యీ యుషస్సులు 30 దినములలో 30 చుట్లు
తిరిగినపిమ్మట సూర్యోదయమగును — అని భావము.



సూర్యోదయముకాదని చెప్పియుంటిమి. ప్రతియుషస్సును
దిక్చక్రముయొక్క అంచువెంబడితిరుగుచు క్రమముగ పైకి
వచ్చుచుండుననికూడ చెప్పియుంటిమి. కనుక యీ వర్ణనను
ఉ. ధ్రు. ప్రాంతదేశపు ఉషస్సులకు వర్తింపజేసినచో, వీని
యర్థము చక్కగ బోధపడగలదు. ఈ వర్ణన మనదేశపు ఉషః
కాలవర్ణన కెంతమాత్రమును సరిపోదు. ఈ యుషస్సులు
గుండ్రముగ తిరుగుచున్నవనుటకు నిదర్శనములు చాలగలవు.
" ఓ ఉషస్సా ! తిరిగియెప్పటిచోటికేవచ్చి చేరునట్లు ( సమా
నం అర్థమ్ ) నీవు చక్రముతిరిగినట్లు తిరుగుము (చక్రం ఇవ
ఆవవృత్స్వ) అని ఋ III. 61–3 [ ఉషఃప్రతీచీభువనాని
విశ్వోర్ధ్వాతిష్ఠస్య మృతస్య కేతుః సమాన మర్థం చరణీయ
మానా చక్రమివనవ్యస్యావవృత్స్వ ॥ ] లో చెప్పియున్నారు.
" చక్రముతిరిగినట్లు " అనగ నిలువుగ రథచక్రము తిరిగినట్లు
తిరుగకూడదా యని కొందర భ్యంతరముచెప్పవచ్చును.
కాని ప్రపంచములో నెచ్చటను యీవిచిత్రము కాన్పింపదు.
ఉత్తర ధ్రువమువద్దసైతము అడ్డముగ, దిక్చక్రపు అంచువెం
బడి, కుమ్మరివానిసారె తిరిగినట్లు తిరుగునేకాని, నిలువుగ
తిరుగదు. ఉషఃకాలపు వెలుతు రెప్పుడును దిక్చక్రపు
అంచుననేయుండును గాని, ఆకాశముమీద మననెత్తిమీది
కెత్తుగ రాజాలదు. కనుక, కుమ్మరిసారె తిరిగినట్లే తిరు
గుచున్న దని చెప్పుట కేమియు అభ్యంతరము లేదు. ఇట్లు
తిరుగుట కేవల ముత్తరధ్రువప్రాంతలక్షణమే యనుట నిర్వి
వాదము. మనదేశములలో ఉషఃకాలపు వెలుతురు తూర్పున

కొద్దిగ గాన్పించి పిమ్మట సూర్యోదయ మగుటతోడనే దాని లో కలిసిపోవును. కనుక యిక్కడి యుషస్సు గుండ్రముగ తిరుగుచున్న దని చెప్పుట కెంతమాత్రమును వీలులేదు. కనుక పైవేదవాక్యము తప్పక ఉ. ధ్రువప్రాంతఉషస్సునే సూచింపు చున్నదనుట స్పష్టము.

ఋగ్వేదములో మన యుషఃకాలములనుగూర్చికూడ అచ్చటచ్చట సూచనలు గలవు. కాని చాలభాగమువరకు ఉ. ధ్రువపు దీర్ఘఉషఃకాలమే యిన్ని యుషాగీతములను వ్రాయుటకు కారణమైనదని మాత్రము చెప్పకతప్పదు. లేదా, ఉ. ధ్రు. వదలివచ్చిన పిమ్మటకూడ ఆకాలమువారు తమ తాత ముత్తాతలు చెప్పుకొనుచుండగ యీలక్షణములను వారివల్ల వినియైన నుండవలెను.

—♦ సింహావలోకనము. ♦—

(1) ఋగ్వేదములో వర్ణించిన ఉషఃకాలము బహు దీర్ఘమైనది. ఉషఃకాలపు కనువెలుతురు కనుబడుటకును తదుపరి సూర్యోదయ మగుటకును మధ్య అనేకదినములు గడచుచుండెను. దీనికి ప్రమాణము. [ ఋ VII-76-3 ]

(2) పూర్తిగ సూర్యోదయము స్వస్వరూపములోనికి వికసించుటకుపూర్వము అనేకఉషస్సులు ఒకటితరువాత ఒకటి క్రమముగ పైకివచ్చుచుండెను. దీనికి ప్రమాణము. [ఋ. 11. 28-9]

(3) ఉషస్సును బహువచనముగ సంబోధించిరి. 30 దినములవ్యాప్తిగల దీర్ఘఉషస్సులోని 30 దినభాగములు యీ



బహువచనము వర్తించును. దీనికి ప్రమాణము [ ఋ 1. 123-8: VI. 59-6 తై ॥సం॥ IV 3, 11, 6. ]

(4) అనేకఉషస్సు లొకచోటనే నివసించి, తమలో తాము కలహించుకొనక అన్యోన్యస్నేహభావముతో వర్తింపుచున్నవి. దీనికి ప్రమాణము [ ఋ. IV 51-7-9; VII 76-5; అధ. వేద. VII 22-2 ]

(5) ఉషస్సులోని 30 భాగములును యెడతెగనివి; విడిపోనివి. [ 1. 152-4; తై. బ్రా. II. 5, 6, 5; అధ. వేద. VII. 22-2 ]

(6) 30 ఉషస్సులును కుమ్మరిసారెవలె గిరగిర తిరుగును; ఎప్పటిచోటికేవచ్చి చేరును. [ 1. 123-8-9: 111.-61-3 తై సం॥ IV 3, 11, 6. ]

ఈపై లక్షణములన్నియు ఉ. ధ్రు. ప్రాంతదేశమునకే వర్తించునుగాని యికనేదేశమునకును వర్తింపవు.

వేదములను వ్యాపింపజేసిన ఋషులీసృష్టివైచిత్ర్యములను కళ్ళార చూచినయెడల మంచుయుగము రాక పూర్వమే, వారచ్చట నివసించియున్న కాలములోనే చూచియుండవలెను గద. అట్లయినచో, యీ మంచుయుగమునకు పూర్వయుగమును సూచింపు నిదర్శనము లేమైన వేదములయందు గలవా? కలవనియే చెప్పగలము. I. 113 [illegible] లో [illegible] పూర్వ[illegible]ములలో (పురా) ఉషాదేవత ఆ[illegible]లో సంతతము వెలుగు[illegible]

చుండెడిది ” అని కలదు. ఇచ్చట “ పురా ” అనుపదము హిమద్యుగము ( మంచుయుగము ) నకు పూర్వయుగమును సూచింపుచున్నదనుట స్పష్టము. ఉ. ధ్రు. ను వదలివచ్చిన పిమ్మట—అనగ మంచుయుగానంతరయుగములో—మాట్లాడుచు, “ పూర్వయుగములో యీ విధముగనుండెడిది ” అని మంచుయుగమునకు పూర్వపుయుగమును సూచింపుచున్నారు.

మరియు బలిపీఠముపై ఉషఃకాలపు మంత్రములను పఠింపుచు “ ఉషస్సు-ఇటుకలను ” పేర్చునప్పుడు ఆమంత్రములలో సూచింపబడిన ముప్పదిఉషస్సులకును తామీదక్షిణదేశములలో ప్రత్యక్షముగ తమకండ్లారచూచు నిమిషమాత్రజీవనముగల ఉషఃకాలమునకును యెచ్చటను సంబంధము లేకున్నదే యని వారి మనస్సులకు తప్పక సందేహము తోఁచెను. మంత్రముల యర్థమును చూచెదమాయనిన వానిలో 30 ఉషస్సులు కలవని యున్నది. కాని ప్రతిదినమును తాము కండ్లారచూచునది నిమిషమాత్రపు ఉషఃకాలమేగద. ఈ రెంటికిని యేకోశమునను సంబంధము కనిపింపలేదు. కాన వారు దీనినెట్లు సమన్వయించుకొనిరి ? దీనికి సమాధానము తై॥ సం ॥ V. 3, 4, 7 లో కలదు. “ ఈముప్పదియుషస్సు లేమియో మనకు తెలియదు. దీనియొక్క నిజార్థ మేమియో మనకు తెలియదు. ఇదిపూర్వకాలమునుండియు ననుశ్రుతముగ వచ్చుచున్నది. దీనిని మనము వదలిపెట్టనేల ? దీనియర్థ మేమైనను మన కేల ? పూర్వమునుండియు మనవారు దీనిని వాడుచు



న్నారుగాన మనముకూడ ఆప్రకారమే చేయుదము. బహుశః పూర్వము దేవతలకు 30 ఉషస్సులు కనుబడెడివికాబోలు ” అని యీ విధముగ మనస్సును సమాధానపరచుకొనినట్లు తై॥సం॥ V. 3, 4, 7 లో స్పష్టముగ చెప్పబడియున్నది. దీనినిబట్టి యివి తప్పక మంచుయుగమురాకపూర్వము మన పూర్వులు తమ కండ్లారచూచిన యంశములనియు, తదుపరి దక్షిణదేశములకు వచ్చినపిమ్మటకూడ యీ యంశములను మనవారు మరచిపోక, పూర్వాచారములుగ నెంచి, వాని ప్రకారమే యజ్ఞయాగాదులను జరుపుచుండెడి వారనియు స్పష్టమగుచున్నది.

పూర్వగ్రంథములలోని యుషఃకాల వర్ణన లన్నియు మన యుత్తరధ్రువసిద్ధాంతములను బలపరచుచున్న వని ఋజువుచేసితిమి. మిగిలిన లక్షణములను ముందుఅధ్యాయములలో విచారించెదము.



# అనుబంధము.

## ముప్పది ఉషస్సులు.

### తైత్తిరీయ సంహితా, ౪-వ. కాండ, 3-వ. ప్రపాఠకము, ౧౧-వ అనువాకము.

ఇయమేవ సా యా ప్రథమా వ్యౌచ్ఛదన్త రస్యాం చరతి ప్రవిష్టా । వధూర్జజాన నవగజ్జనిత్రీ త్రయ ఏనాం మహిమానః సచన్తే ॥ ౧ ॥

ఛన్దస్వతీ ఉషసా పేపిశానే సమానం యోని మనుసంచరన్తీ । సూర్యపత్నీ విచరతః ప్రజానతీ కేతుం కృణ్వానే అజరే భూరి-రేతసా ॥ ౨ ॥

ఋతస్య పన్థామను తిస్ర ఆగు(స్త్ర)యో ఘర్మాసో అను జ్యోతిషాఽఽగుః । ప్రజామేకా రక్షత్యూర్జ మేకా వ్రతమేకా రక్షతి దేవయూనామ్ ॥ 3 ॥

చతుష్టోమో అభవద్యా తురీయా యజ్ఞస్య పక్షావృషయో భవన్తీ । గాయత్రీం త్రిష్టుభం జగతీ మనుష్టుభం బృహదర్కం యుఞ్జానాః సువరాభర న్నిదమ్ ॥ ౪ ॥

పఞ్చభిర్ధాతా విదధావిదం యత్తాసా స్స్వసౄరజనయత్ పఞ్చ పఞ్చ । తాసామియన్తి ప్రయవేణ పఞ్చ నానారూపాణి కృతవోవసానాః ॥ ౫ ॥



త్రింశత్స్వసారం ఉపయన్తి నిష్కృత సమానం కేతుం ప్రతి ముఞ్చమానాః । ఋతూ స్తన్వతే కవయః ప్రజానతీ ర్మధ్యే ఛన్దసః పరియన్తి భాస్వతీః ॥౬॥

జ్యోతిష్మతీ ప్రతి ముఞ్చతే నభో రాత్రీ దేవీ సూర్యస్య వ్రతాని । వి పశ్యన్తి పశవో జాయమానా నానారూపా మాతురస్యా ఉపస్థే ॥౭॥

ఏకాష్టకా తపసా తప్యమానా జజానగర్భం మహిమాన మింద్రమ్ । తేన దస్యూ న్వ్యసహన్త దేవా హన్తాఽసురాణా మభవ చ్ఛచీభిః ॥౮॥

అనానుజామనుజాం మామకర్త సత్యం వదన్త్య న్విచ్ఛ ఏతత్ । భూయాసమస్య సుమతౌ యథా యూయమన్యా వో అన్యా మతి మా ప్రయుక్త ॥౯॥

అభూన్మమ సుమతౌ విశ్వవేదా ఆష్ట ప్రతిష్ఠా మవిదద్ధిగాధమ్ । భూయాసమస్య సుమతౌ యథా యూయమన్యా వో అన్యా మతి మా ప్రయుక్త ॥౧౦॥

పఞ్చ వ్యుష్టీ రనుపఞ్చ దోహాగాం పఞ్చనామ్నీ మృతవోఽను పఞ్చ । పఞ్చదిశః పఞ్చదశేన క్లృప్తాః సమానమూర్ధ్నీ రభిలోకమేకమ్ ॥౧౧॥

ఋతస్య గర్భః ప్రథమా వ్యూషుష్య పామే మహిమానం బిభర్తి । సూర్య స్యైకా చరతి నిష్కృతేషు ఘర్మస్యైకా సవితైకాం నియచ్ఛతి ॥౧౨॥

యా ప్రథమా వ్యౌచ్ఛత్ సా ధేను రభవద్యమే । సానః పయ
స్వతీ ధుక్ష్వోత్తరాముత్తరా సమామ్ ॥౧౩॥
శుక్రర్షభా నభసా జ్యోతిషాఽఽగాద్
విశ్వరూపా శబలీ రగ్ని కేతుః ।
సమానమర్థ స్వపస్యమానా బిభ్రతీజరా
మజర ఉషఆగా ॥ ౧౪ ॥
ఋతూనాం పత్నీ ప్రథమేయమాగా ద
హ్నాంనేత్రీ జనిత్రీ ప్రజానాం ।
ఏకాసతీ బహు ధోషో వ్యుచ్ఛస్య జీర్ణా
త్వం జరయసి సర్వమన్యత్ ॥ ౧౫ ॥

---

తైత్తిరీయ సంహితా : ౫-వ కాండ; 3-వ ప్రపాఠకం;
౪-వ. అనువాకము; ౭-వ. భాగము.

---

నవా ఇదం దివాన నక్తమాసీదవ్యావృత్తం తే దేవా ఏతా వ్యుష్టీరపశ్యన్ తా ఉపాదధత తతోవా ఇదం వ్యౌచ్ఛ ద్యస్యైతా ఉపధీయన్తే వ్యేవాస్మా ఉచ్ఛత్యథోతమ ఏవాపహతే ॥

# వైదిక నిలయము

ఆరవ అధ్యాయము.

—( దీర్ఘదివసము, దీర్ఘరాత్రము )—

ముప్పదిదినముల యావధిగల దీర్ఘయఖండయుషస్సును గూర్చి ఋగ్వేదము ఖండితముగ వక్కాణించి చెప్పుచున్నప్పుడు, తత్పూర్వ ముండితీరవలసిన దీర్ఘరాత్రిగూడ వేరుగ ఋజువుచేయ నక్కరలేకుండగనే సిద్ధించుచున్నది. మఱియు దీర్ఘరాత్రి యున్నప్పుడు దానికి ప్రతిగ దీర్ఘదివసముకూడ నుండియే తీరవలెనుగద. దీర్ఘదివసమును, దీర్ఘరాత్రములును ఉభయదీర్ఘసంధ్యలును — యీ మూడుముపోగా సంవత్సరములో కొంతకాల మింకను మిగులును. ఈమిగిలినకాల మెట్లుండును ? ఈకాలములో మనమామూలు అహోరాత్రములు (రాత్రింబవళ్లు) ఉండును. ఒక్కొక్క అహోరాత్రము మొత్తము 24 గంట లుండును. దీర్ఘరాత్రమును, దీర్ఘ ఉషస్సును గతించగనే అహోరాత్రములవరుస ప్రారంభమగును. మొట్టమొదట అహస్సు ( అనగ పగటిప్రొద్దు ) బహుతక్కువగ నుండును. కాని రోజులుగడచినకొలది పగటిప్రొద్దు యెక్కువగుచుండును. ఈవిధముగ పగటివేళ ప్రొద్దు పెరిగినకొలదియు రాత్రివేళప్రొద్దు తగ్గుచుండును. ఇట్లుకొంత

కాలముపోగా, ఇరువదినాలుగుగంటలును పగలుగనే యుండును. ఇకకొంతకాల మగుసరికి మరల రాత్రులు పొడుగగుచు, తుదకు యిరువదినాలుగుగంటలకాలమును రాత్రిగనే యుండును. ఇదియే దీర్ఘరాత్రి. ఇట్లు కొంతకాలమున్నతరువాత, మరల యుషఃకాలమును దానిననుసరించి సూర్యోదయమును, దానివెంబడి అహస్సులు ( పగటిపొద్దులు ) హెచ్చగుటయు సంభవించును. ఇట్లే, చర్వితచర్వణముగ కాలచక్రము తిరుగుచుండును.

ఈపై యంశములన్నియును అన్యోన్యాశ్రయములు, దీపముతోబాటు నీడ యెట్లుండితీరునో, అదేవిధముగ దీర్ఘ యుషఃకాలమొకటి యున్నయెడల, దానివెంట యీ దీర్ఘనిశలును, దీర్ఘదివసములును ఉండితీరును. దీనికై ప్రత్యేకముగ మనము ఋగ్వేదమును శోధింపనవసరము లేదు. అయినను మనమిప్పుడెన్నియో వేల సంవత్సరములనాటి విషయములను గూర్చి చర్చించుచున్నాము గనుక, మన మిప్పుడు పైన బేర్కొనినఖగోళాంశముల నన్నిటిని వేర్వేరుగనే భావించి, వానిలో నొక్కొక్క దానికి ప్రత్యేకముగ వేదవాఙ్మయము నుండి ప్రమాణములను జూపవలసినబాధ్యత మనదైయున్నది. ఇది శాస్త్రచర్చకులలక్షణము; అవసరము. ఈ దీర్ఘదివసములకును, దీర్ఘరాత్రములకును వేదములయం దెచ్చటనైన ప్రత్యక్షప్రమాణములు గలవా? ఎడతెగక నెలలకొలది సూర్యకాంతియు, నెలలకొలది చీకటి రాత్రులును గలవని



జెప్పుటకు వేదములయం దెచ్చటనైన ప్రమాణములు గలవా? వేదములయందు చెప్పబడియుండు సంవత్సరము యొక్క లక్షణములేమి? ఇవన్నియును, ఉత్తరధ్రువ ప్రాంత దేశలక్షణములేగాని, ఇట్టివి మరియెం కెచ్చటనులేవని ధ్రువపరుచుటకేమైన ప్రమాణములు వేదాదుల యందు గలవా? ఈ యంశములనెల్ల నీ యధ్యాయమునందును, సప్తమాధ్యాయమందును విచారించిచూచెదము.

ప్రప్రథమమున దీర్ఘనిశనుగూర్చి విచారింతము. మన మిప్పుడు ఉత్తరధ్రువమువద్దకు పోయి చూచినయెడల అచ్చట సంవత్సరములో కొన్నిదినము లెడతెగక యెల్లప్పుడును చీకటిగనే యుండును. సూర్యకాంతి కనుపించనే కనుపించదు. దీర్ఘనిశ కిది ప్రత్యక్షప్రమాణము. కాని, ప్రస్తుత మాప్రదేశమంతయు మంచుచే కప్పబడి ప్రాణికోటి నివసించుట కెంత మాత్రమును యోగ్యముగ లేదు. ఈ శీతలమునకు తోడు యీ దీర్ఘరాత్రికూడ తోడ్పడుటవలన జనసంచార మచ్చట పూర్తిగ నణగిపోయినది. కాని, ప్రథమాధ్యాయములో సూచించినట్లు కొన్నివేల సంవత్సరములకు పూర్వము (పూర్వ హిమవద్యుగములో) అచ్చట శీతోష్ణస్థితి మిక్కిలి యనుకూలముగ నుండెననియు, జను లచ్చట యథేచ్ఛగ విహరింపుచుండిరనియు మనము గ్రహింపవలెను. అయినను పూర్వ మచ్చట నివసింపుచుండిన జనులకు బాధాకరముగ నున్నదేమైనకలదా యని యడిగినచో — అట్టిది యీ దీర్ఘనిశ

యొక్కటియే యని మనము నొక్కి వక్కాణింపవచ్చును. ఇప్పటివలె నింత మంచును, అతి చలియు లేకపోయి నను దినములకొలది సూర్యరశ్మి లేక చీకటిలో సంచరింపవలసిన వారగుటచే సూర్యోదయ మెప్పుడగునా, తామెప్పు డీయంధకారములోనుండి విముక్తుల మగుదుమా యని ప్రజలు భగవంతుని సదా ప్రార్థింపుచున్నట్లు దృష్టాంతరము లనేకములు వేదములందు గలవు. భయంకరములగు నీదీర్ఘనిశలనుగూర్చి ఋగ్వేదములో ననేకచోట్ల ననేకవిధములుగ వర్ణించియున్నారు. ఈయంధకారము ఇంద్రుని శత్రువులగు రాక్షసుల కందరకును శరణ్యముగ నుండెనట. ఇంద్రశత్రువులంద రీచీకటిలో దాగుకొనెడివారట. అందువలన ఇంద్రు డీరాక్షసులతో (యీదస్యులతో) యుద్ధము చేసి, వారి నోడించి, వారి దుర్గములగు యీయంధకారములను భేదించెడివాడట. ఇంద్రశత్రువగు వృత్రాసురుడు దీర్ఘమగునంధకారములో దాగుకొని యుండెనట – దీనికి ప్రమాణము:— ఋ. 1. 32–10. [ దీర్ఘంతమః ఆశయద్ ఇంద్రశత్రుః ] తనతో పోరాడుటకైవచ్చిన "శుష్ణ" యను వాని నింద్రుడు చీకటి గోతిలో (తమసిహర్మ్యే) పడవేసెనని ఋ V. 32,5 దెల్పుచున్నది. తరువాతి శ్లోకములో "సూర్యుడులేని చీకటి" (అసూర్యేతమసి)ని గూర్చి వర్ణించి యున్నారు. దీనినే జర్మను పండితుడగు "మ్యాక్సిముల్లరు" గారు "భయంకరమగు చీకటి" యని వ్యాఖ్యానము చేసి



యున్నారు. దీని విషయమై ఋగ్వేదమునం దిన్ని ప్రమాణములు గాన్పించుచున్నను, మనవారింకను ఇంద్రవృత్రాసురుల పోరాటము కేవలము ప్రతిదినమును సూర్యోదయమునకు పూర్వము సూర్యునకును చీకటికిని జరుగు పోరాటమేగాని సంవత్సరములో నొక్కసారియే దీర్ఘనిశను భేదించుకొని వచ్చు సూర్యునకును తత్పూర్వమున్న దీర్ఘభయంకరాంధకారమునకును జరుగు పోరాటము గాదని మనవారింకను వాదింపుచుండుట మహాశ్చర్యముగ నున్నది. అనగ ఇంద్రవృత్రాసురుల పోరాటము దైనికమే గాని సాంవత్సరికము గాదని మనవారింకను వాదింపుచున్నారు. దీని విషయమయిన పూర్ణచర్చను ముందు గావించెదము. మనమిప్పుడు ప్రతిదినమునుజూచు అంధకారము (ఎంతయెక్కువగ జూచుకొన్నను)—౧౨ గంటల కంటె యెక్కువకాలముండుట కవకాశమే లేదు. ఈకొద్దికాలము మాత్రమే యుండు నంధకారములో ఇంద్రశత్రులగు రాక్షసులందరును దాగుకొనియున్నారని చెప్పిన హాస్యాస్పదముగ నుండగలదు. ఋగ్వేదమునందు వర్ణింపబడిన అంధకార మెట్టిది ? అతిదీర్ఘమైనదియు, అతిభయంకరాకారము గలదియు, సూర్యరశ్మి యెచ్చటను సోకనిదియు, ఇంద్రాదిదేవతలకు సైతము దుర్భేద్యమైనదియు—ననివర్ణించియున్నారు. మనము ప్రతిదినముచూచుచున్న చీకటిరాత్రి లిట్టిభయంకరాకారమునకును, యిట్టి వర్ణనములకును సరిపోవునా ?

ఇంద్రవృత్రాసురుల పోరాటమువంటి యీప్రాచీనగాథలేగాక, దీర్ఘనిశనుగూర్చి జెప్పు ఘట్టము లనేకములు ఋగ్వేదమునందు గానవగును. వేదములం దనేకచోట్ల తరుచుగ తమ్మును యీయంధకారమునుండి విముక్తులగావించి రక్షింపవలసినదని ఋషీశ్వరులు తమయిష్టదైవములను ప్రార్థింపుచున్నట్లు నిదర్శనములు గలవు. దీనికి ప్రమాణము:— ఋ. 11. 27, 14. [అదితే మిత్రవరుణో తమృళయ ద్వోవయం చకృమా కచ్చిదాగః । ఉర్వశ్యామభయం జ్యోతి రింద్రమానో దీర్ఘా అభినశంతమిస్రః ] — ఓ అదితీ! ఓ మిత్రావరుణులారా! మేము మీయెడలగావించిన యపచారములనెల్ల మన్నించి మమ్ములను బ్రోవుడీ! ఓ ఇంద్రా! అతివిశాలమైనట్టియు, నిర్భయమైనట్టియు వెలుతురును మేము పొందెదముగాక! ఈ దీర్ఘమైన యంధకారము ( బహుళాంధకారము ) మమ్ముల నావరింపకుండుగాక! ఈ దీర్ఘమైనఅంధకారమును సూచింపుటకు "దీర్ఘాఃతమిస్రాః" అను పద మచ్చట నున్నది. ఈపదమున కర్థము కేవలము దీర్ఘమైనఅంధకారము అని చెప్పుటకంటె "ఎడతెగని చీకటిరాత్రుల వరుస" యని చెప్పినచో దీని నిజార్థ మెక్కువగ తేటపడగలదు. ఈ బహుళాంధకార మెప్పుడంతమొందునా యని పూర్వము మనవారు పడిన యీ మనోవేదనకు — యీ యాతురతకు, హేతువేమి? మన మిప్పుడు నిత్యమును జూచు యీక్షణకాలపు చీకటిరాత్రులను జూచియేనా వారిట్లు భయపడినది? ఈ కొద్దికాలపు చీకటిని



జూచియే మనవా రింతవేదనను పొందిరని చెప్పుట కేవలము హాస్యాస్పదము. అట్లయినయెడల వారుబొందిన యీ వేదనకు గల నిజమైనకారణమేమి? దీనినెట్లుమనము సమర్థింపగలము? కేవలము మనము ప్రతిదినమునుజూచు చీకటి రాత్రులను చూచియే వారట్లు భయపడిరని చెప్పుటలో నర్థ మేమియు లేదు. ఋ 1. 46, 6, లో [యా నః పీవరదశ్వినా జ్యోతిష్మతీ తమ స్తిరః తామస్మే రాసాథామిషమ్] "ఈయంధకారమును గడచివచ్చుటకు తగినబలమును తన కనుగ్రహింపవలసిన"దని ఒకభక్తుడు అశ్వినీదేవతలనుగూర్చి ప్రార్థించుచున్నాడు. మరియు ఋ VII 67, 2 లో [ అశోచ్యగ్నిః సమిధానో అస్మే ఉపో అదృశ్ర న్తమసశ్చి దన్తాః ] = అగ్ని రగుల్కొనమొదలిడినది; అంధకారముయొక్క కొనలు గాన్పించుచున్నవి. ఉషస్సుయొక్క ధ్వజము తూర్పుదిక్కున గాన్పించుచున్నది. "తమసః అంతాః" అనుపదము మిక్కిలి చిత్రముగనున్నది. ఈ పదమునకును, దీర్ఘనిశను సూచించు యింక ననేకవాక్యములకును నిజార్థమును పూర్తిగగ్రహింపక మనదేశములోజూచు మామూలు శీతకాలపుచీకటి రాత్రులే నని యర్థముజెప్పుట యెంతమాత్రమును సరియైనవ్యాఖ్యానము గాదు. ఈరాత్రులను జూచి మనపూర్వజు లింతదిగులొంది తమ్మును రక్షించుటకు—యీమాత్రపుభాగ్యమునకు — దేవతలనుగూడ ఆహ్వానింపవలసినవారైరని చెప్పుటకంటె వింత వే రెద్దియును లేదు.

చీకట్లెప్పుడు పోవునా యని మనోవేదనను జూపించు ఘట్టము లనేకము లింకను గలవు. ప్రస్తుతకాలపు కిరస నాయిలు దీపములు, క్రొవ్వువత్తులు, మెరుపుదీపములు మొద లగు కృత్రిమపు టుపకరణము లెవ్వియు నాకాలమున లేనందు చేత పూర్వము మన యార్యులు యీక్షణకాలపు చీకట్లను జూచియే యింత దిగులొందిరని సమర్థింప జూచుట వెర్రి తలంపు. ఇప్పటికాలపు అడవిజాతి మనుష్యులుసైతము చీక ట్లను జూచి యింత మనోవేదనను బొందరే! అట్టిచో, యీ యడవిజాతి వారికంటె యెన్నియో రెట్లు యెక్కువ నాగరకులైన మన యార్యులు రాత్రివేళ చీకటిని జూచి యింత దిగులొందుటకుగల గారణము గాన్పించదు. ఒక్క మనుష్యులు మాత్రమే గాక, దేవతలుసైతము యీ బహు ళాంధకారములో చాలకాలము మునిగియుండవలసిన వారైరని కూడ వేదములు చెప్పుచున్నవి. దీనికి ప్రమాణము :— ఋ X. 124, 1– [జ్యోగ్ ఏవ దీర్ఘంతమ ఆశయిష్టాః] అగ్ని దేవుడుసైతము "అతిదీర్ఘకాలము యీదీర్ఘాంధకారములో మునిగియుండె"నట. దీర్ఘకాలమును సూచించుటకు "జ్యోగ్" అనియు, "దీర్ఘం" అనియు రెండు పదములను ప్రయోగింప వలసిన అవసరమేమి వచ్చినది? ఒకే భావమును దెలియ పరుచుటకు రెండు పదములను ప్రయోగింపనేల? వేద ప్రవర్తకులకు అత్యుక్తిదోషము నంటగట్టుదమా? ఉత్తర ధ్రువమండలమునకు దక్షిణమునగల దేశములలో రాత్రి



కాలము—మన మెంత యెక్కువగ జూచుకొన్నను —24 గంటలకు మించనేరదు. మన యార్యుల కనుభవసిద్ధమైన నిశలు యీ 24 గంటలకంటె మించియుండనియెడల యిట్టి వర్ణనలును, అవసరము లేనిచోట్ల రెండు పదముల నుపయో గించుటలును — మొదలుగా గలవానిని మన మెట్లు సమర్థింప గలము ఆ యగ్నిదేవుడే "యెడలేని రాత్రు"లందు (క్షపః) ప్రకాశించుచున్నాడని ఋ 11, 2, 2, చెప్పుచున్నది. "ఎడ లేనిరాత్రు"లన నర్థమేమి? మధ్య నెచ్చటను సూర్యోదయ ముగాని, సూర్యరశ్మియొక్క స్పర్శగానిలేకుండ — ఎడలేని— రాత్రులనియా? లేక మధ్యమధ్యకొంతకాలము సూర్యరశ్మితో కూడుకొనియున్న అనేకరాత్రులనియా? "క్షపః" అనగ "ఎడలేనిరాత్రు"లని యర్థము జెప్పిన ఆ మ్యాక్సుముల్లరు వంటి పండితుడే దీని నిజార్థమును పూర్తిగ గమనింపజాలనివా డాయెను.

పూర్వకాలములో మనవారికి దీర్ఘరాత్రులను గూర్చి పూర్తిగ తెలియునని సూచించుట కింతకంటె బలవత్తరమైన నిదర్శనములను జూపింపవచ్చును. ఋగ్వేదము పదియవ మం డలము ౧౨౭-వ ఋక్కులో, నిశాదేవతను గూర్చి సంబోధించి యున్నారు. "ఓ నిశాదేవతా! (భక్తు'లమగు) మమ్ములను సులభముగ తరింపజేయుదానవు గమ్ము. (నః సుతరా భవ) దీని తరువాత "రాత్రిసూక్తం" లేక "దురాస్తవమ్" అనుపరి

శిష్టములో రాత్రిదేవత తన కనుకూలించును గాక యని భక్తుడు ప్రార్థించుచున్నాడు. "మేము భద్రముగ ఆవలి దరికి చేరుకొందుము గాక" "మేము భద్రముగ ఆవలి దరికి చేరుకొందుముగాక" యని వేడుకొను చున్నాడు. [ ప్రపన్నోహం శివాం రాత్రీం భద్రే పార మశీమహి భద్రే పారమశీమహి ] అథర్వవేదము XIX. 47, 2, [ నయస్యాః పారం దదృశే న యో యువద్విశ్వ మస్యాం నివిశతే యదేజతి । అరిష్టాసస్త ఉర్వితమస్వతి రాత్రిపారమశీమహి భద్రే పారమశీమహి ] అథర్వవేదము XIX. 50, 3 లో [ రాత్రీం రాత్రిమరిష్యన్త స్తరేమ తన్వా వయమ్ ] జంగమపదార్థములన్నియును నిశలో ( నిశాసమయములో ) విశ్రమించును. నిశాంతమును, నిశాపారమును ( రాత్రియొక్క ఆవలిదరిని ) జూచినవా రెవరును లేరు. ఈ నిశను భేదించున దేదియును కూడ గాన్పింపలేదు. విశాలాంధకారపరివృతమగు నో నిశాదేవతా! మేము భద్రముగ నిన్ను తరించుదుము గాక! ఓనిశాదేవతా! మేము నిన్ను తరించుదుముగాక! ( నీపారమును జేరుదుముగాక! ) అథ. వే. XIX 50, 3-లో "మాశరీరముల కెట్టిహానియు లేకుండ మేము రాత్రిరాత్రియును (రాత్రిం రాత్రిం) (అనగ ప్రతిరాత్రియు) గడచిపోవుచుండెదముగాక!" అనియున్నది. ఏమి! ఇంతభయము! ఇంత దిగులు! ఇంత ఆతురత! ఈ రాత్రి గడచి యెట్లుబ్రతుకుదుమా యని ఇంత మనోవేదన బొందవలసిన అవసరమేమి?



"ఈ నిశాంతమును జూచినవా రెవరును లేరే! ఈ నిశను భేదింపగలవా రెవరును గాన్పింపరే!" యని మనయార్యులు ఆర్తనాదమును గావింపవలసినంతగతి యేమిపట్టినది? మనమిప్పుడు ప్రతిరాత్రియు నీ విధముగ దిగులొందుచున్నామా? మన కిప్పుడు లేనిభయము మనపూర్వీకుల నేలబాధింపవలెను? దీనికి ప్రత్యుత్తరము తై॥సం॥ 1, 5-5, 4 లో గానగును. "ఓ చిత్రావసూ! నన్ను భద్రముగ నీ యావలి దరికి చేరనిమ్ము. 1, 5, 7, 5 లో దీనిని వివరముగ తెలియజెప్పియున్నాడు. చిత్రావసు అనగ రాత్రి "ఇక తెల్లవారద" ని పూర్వకాలమందు బ్రాహ్మణులు భయపడెడివారు. [1,5,5,4- చిత్రావసోస్వస్తితే పారమశీయ ] I. 5,7,5- చిత్రావసోస్వస్తితే పారమశీయేత్యాహ। రాత్రి ర్వైచిత్రావసు రవ్యుష్ట్యైవా ఏతస్యైపురా బ్రాహ్మణా అభైషుః॥—రాత్రిగడచి యెప్పుడు తెల్లవారునాయని మనయార్యులు దిగులొంది, ఇక అసలు తెల్లవారనే తెల్లవారదని భయపడుచుండిరని వేదములో స్పష్టముగ నొక్కివక్కాణించియున్నారు. దీనియర్థమేమి? రాత్రికాల మతిదీర్ఘమై యుండనియెడల ఇట్టిభయమున కవకాశమే లేదుగద. శాయనాచార్యులవారు దీనివిషయమై గట్టిగపట్టుబట్టి విచారింపకుండ ఊరక తేలికగ త్రోసివేసిరి! శీతకాలములో రాత్రిప్రొద్దు ఎక్కువగనున్నందుచేత మనవారు శీతకాలములో నీవిధముగ — యెప్పుడు తెల్లవారునాయని — విసుగుకొనెడివారని మాత్రము చెప్పి సులభముగనా భాగమును సమర్థింప

జూచిరి. కాని, శాయనాచార్యులవారు చెప్పిన యంశములను బట్టియే, వారుచెప్పినయర్థము సరిగాదని ఋజువుపరచెదము. తైత్తిరీయ సంహితలో కొంతభాగము మంత్రార్థములను విపులముగబోధించు భాగమైయున్నది ఈయర్థమును విపులముగజెప్పు భాగమునకు "బ్రాహ్మణము" అనిపేరు. కనుక తైత్తిరీయ సంహితను "మంత్రము" లనియు "బ్రాహ్మణము" లనియు — రెండు భాగములుగ విభజింపవచ్చును. దీనినిబట్టిచూడగ పైన "పూర్వకాలమందు ఇకతెల్లవారదని బ్రాహ్మణులు భయపడెడివార"ని చెప్పువాక్యము బ్రాహ్మణములోచేరిన భాగమని స్పష్టమగుచున్నది. ఇక "బ్రాహ్మణము" యొక్క లక్షణములేమియో కొంచెము జూచెదము. "బ్రాహ్మణము" ను మన వేదాంతులు పదిభాగములుగ విభజించిరి. [ శ్లో॥ హేతుర్నిర్వచనం నిందాప్రశంసాసంశయో విధిః । పరక్రియా పురాకల్పో వ్యవధారణకల్పనా ॥ ఉపమానం దశైవైతే విధయో బ్రాహ్మణస్యతు ఏతద్వై సర్వవేదేషు నియతం విధిలక్షణమ్ ॥

(౧) హేతువు—అనగ మంత్రములో చెప్పినయంశములకు కారణమేమియో తెలుపుట: (౨) నిర్వచనం—అనగ, మంత్రములో యేపదమును యే యర్థములో ప్రయోగించినారో తెలుపుట. (3) నిందా—అనగ, మంత్రములో నిందార్హములైన భాగములను నిందించుట. (౪) ప్రశంసా—అనగ, మంత్రములో మెచ్చుకొనదగిన యంశములేమైన



నున్నచో వానినెత్తిజూపి ప్రశంసించుట. (౫) సంశయమ్—అనగ, మంత్రార్థముపూర్తిగ బోధపడనిచోట్ల నెత్తిచెప్పుట. (౬) విధి—అనగ, యీవిషయ మిట్లుండి తీరవలెనని సిద్ధాంతీకరించుట. (౭) పరక్రియా—అనగ, ఇతరులుచేసిన కార్యములు—ఏదేని విషయమయి యితరభాష్యకారులు గాని, యితరఋషులుగాని యేమిచెప్పిరో దానినిచెప్పుట (౮) పురాకల్ప—అనగ, పూర్వకాలపు టాచారములనుదెలుపు సంగతుల నెత్తిజూపుట. (౯) వ్యవధారణకల్పనా—అనగ, మంత్రములోని ఒకవిషయమై "యిదియైన కావలెను, లేదా అదియైన కావలెను; గాని వేరొండు కాజాలదు" అని హద్దుల నేర్పరుచుట. (౧౦) ఉపమానం—అనగ, పోలికలను జూపుట. వ్యాఖ్యానభాగమైన బ్రాహ్మణమును యిట్లు పదిభాగములుగ మనవారు విభజించిరి.

"పూర్వకాలము మనవారు సూర్యోదయము కాదనియే భయపడెడివారు" — అనువాక్యమును శాయనాచార్యులవారు యెనిమిదవ భాగమగు "పురాకల్ప" ము క్రిందికి తీసికొనివచ్చినారు. ఇది అర్థవాదముగాదనియు, ఇది కేవలము పూర్వకాలమునాటి యంశమును సూచింపుచున్నదనియు శాయనులవారే ఒప్పుకొనియున్నారు. అట్లయినప్పుడు, "సూర్యోదయము కాదని" భయపడెడివారనిచెప్పువాక్యము కేవలము శీతకాలపు దీర్ఘరాత్రులను జూచి అతిశయోక్తిగజెప్పినమాటయేగాని వేరొండుగాదని యర్థవాదము

జేయుట శాయనాచార్యులవారు గావించిన స్వవచన వ్యాఘాతమును సూచించుచున్నది ! కనుక యీ వాక్యము కేవలము పూర్వకాలము మనవా రనుభవించిన యశుభమును సూచించుచున్నది. ఈవిషయమునుండి యింకొక ముఖ్యాంశము బయలు దేరుచున్నది. తెల్లవారదనే భయము ఒక్క మన పూర్వులకు మాత్రమే యుండనేల ? మనకిప్పుడేల యట్టి భయములేదు. శీతకాలములో రాత్రులందు మనమీవిధముగ భయపడుచున్నామా ? అప్పటిరాత్రియు, యిప్పటిరాత్రియు సమానమే యైనయెడల మనపూర్వులకు భీతావహమును గలిగించిన ఆరాత్రి మనకిప్పుడేల యా భీతావహమును గల్పించుటలేదు ? మనలోనెట్టిమూఢునకైనను అట్టిభయమున్నదా ? సూర్యోదయమెప్పుడగునో నిశ్చయముగ జెప్పగల జ్యోతిష జ్ఞానము మన పూర్వపు టార్యులకు లేదని చెప్పుటకంటె పరిహాసాస్పదమగు విషయ మింకొకటి యుండబోదు. ఈ విషయమునుబట్టి చూడగ శాయనులవారు చెప్పిన సమాధానము సరియైనది గాదని ఋజువగుచున్నది. ఈ శీతకాలపు రాత్రులను జూచి కాదు మన యార్యులు భయపడినది. అది మన శీతకాలపు రాత్రికంటె అతిదీర్ఘమైనదై యుండితీరవలెను. "ఎప్పుడు సూర్యోదయ మగునా, ఎప్పుడు సూర్యోదయ మగునా ?" యని ప్రజల మనంబులను తల్లడింపజేయజాలినంత దీర్ఘనిశయై యుండితీరవలెను. ఇట్టి దీర్ఘనిశ ఉత్తరధ్రువ ప్రాంతదేశములలో నుండునుగాని మరి యెచ్చట నుండదు.



మరియు నిది వేదకాలమునాటికికూడ పూర్వకాలమం దుండెనని తెలుచున్నది. వేదకాలమువారికే యిది పెద్దలవలన వినుచువచ్చిన పూర్వకాలపు పుక్కిటిపురాణమై యున్నది. తైత్తిరీయసంహితాకాల మిప్పటికి షుమారు 4500 సంవత్సరములైనది. అప్పటికే యీదీర్ఘనిశ పుక్కిటిపురాణమైనది.

దీర్ఘనిశను దీర్ఘదివసమును సూచించుట కింక నేమైన ప్రమాణములు ఋగ్వేదమునందు గలవేమో చూచెదము. ఋగ్వేదములో దివారాత్రములనుగూర్చి చెప్పిన ఘట్టములను పరీక్షించి చూచెదము. రాత్రింబవళ్ళనుగూర్చి ఋగ్వేదములో ననేకచోట్ల ద్వివచనప్రయోగములు గలవు. ఋ. I. 122 లో ఉషాసా-నక్తా (ఉషస్సును రాత్రియు) అనియు, I. 142,7 లో "నక్తోషాసా" (రాత్రియు, ఉషస్సును) అనియు, I. 188, 6 లో, "ఉషాసా" (రెండు ఉషస్సులు) అనియు వక్కాణించియున్నారు. వీనికన్నిటికిని అర్థ మొక్కటియే. వీనికి రాత్రింబవళ్ళయొక్క జంట యని భావము. "అహోరాత్రే" యను పదము ఋగ్వేదమునందు లేకపోయినను దానికికూడ నిదియే యర్థము. ఇది "ఉషాసా నక్తా" యను పదమునకు పర్యాయపద మని ఐతరేయబ్రాహ్మణము చెప్పుచున్నది. ఒక్కొక్కచోట యీ యహోరాత్రముల జంటను అప్పచెల్లెండ్రనియు, కవలపిల్లలనియు వర్ణించియున్నారు. ఋ III 55,11 ను పరీక్షించి చూచెదము. ఈ ఋక్కునకు దేవత "అహోరాత్రము". ఈ ఋక్కు "అహోరాత్రము" ను

గూర్చి వర్ణించుచున్నదని వ్యాఖ్యాతలందరును ఒప్పుకొనియే యున్నారు.*

నానా చక్రాతే యమ్యా వపూంషి
తయో రన్య ద్రోచతే కృష్ణ మన్యత్ ।
శ్యావీచ య దరుషీచ స్వసారౌ
మహ ద్దేవానా మసురత్వ మేకమ్ ॥

ఋ. III, 55, II

అర్థము :- "ఆ కవలపిల్లలు ( యమ్యా-స్త్రీలింగం ) అనేక రూపములను ధరింతురు. ఆ రెంటిలో నొకటి ప్రకాశింపుచుండును ( రోచతే ). రెండవది నల్లగ ( కృష్ణమ్ ) నుండును. వారు ఇద్దరు అప్పచెల్లెండ్రు (స్వసారౌ). ఒకటి చీకటిగను ( శ్యావీ ) రెండవది ప్రకాశమానముగను ( అరుషీ ) ఉండును. దేవతలయొక్క మహాదంశము అద్వితీయమైనది "—ఈఋక్కుచూచుటకు బహు తేలికగ గాన్పించును. కాని దీనిలోని రెండు ప్రధానాంశములను మనవారు సరిగ గ్రహింపలేదు. ముందు దీనిలో మొదటిరెండు చరణములను గూర్చి చర్చించుదము. " ఆకవలపిల్ల లనేకరూపములను ధరింతురు, వానిలోనొకటి ప్రకాశించును, మరియొకటి చీకటిగ నుండును. కవలపిల్లలనగ రాత్రిం బవళ్ళు. పగలు వెలుతురుగ నుండును; రాత్రి చీకటిగనుండును". ఇంతవర కర్థము తేట తెల్లముగనే యున్నది. కాని యీ కవలపిల్లలు " అనేకరూపములను ధరింతురు", అనగ అర్థమేమి ? అనేకరూపములను



ధరించుటయన నేమి ? ఈవాక్యము విషయమై మనవారంత శ్రద్ధవహించినట్లు గాన్పించదు. " నానాచక్రాతే-వపూంషి" అనగ " అనేకరూపములుగ, అనేకశరీరములుగ, అగుచున్నవి ." ఈ వర్ణనలో మనము రెండు ముఖ్యాంశములను గుర్తింపవలెను. (౧) ఆ కవలపిల్లలలో నొకటి ప్రకాశమానముగను మరియొకటి చీకటిగనుండును. (౨) ఆ కవలపిల్లలనేకరూపములుగ మారుచుందురు. ఇంకొకచోట (I. 123,7) యీ దివారాత్రముల జంటనే " విషురూపే " యనియు, మరియింకొకచోట " విరూపే " యనియు ఒకేయర్థములో వర్ణించియున్నారు. పైజెప్పిన రెండు వర్ణనలుగాక— "విషురూపే" "విరూపే"—యనునది యింకొక మూడవయంశమని గ్రహించవలెను. కనుక దివారాత్రముల వర్ణనలో మూడు ముఖ్యాంశములను ప్రత్యేకప్రత్యేకముగ గ్రహింపవలెను.

(౧) కవలపిల్లలలో ఒకటి ప్రకాశమానముగను (రోచతే) రెండవది నల్లగను ( కృష్ణమ్ ) ఉండును.
(౨) కవలపిల్లలు అనేకరూపములుగ మారుచుందురు.
(3) " విషురూపే " " విరూపే "— యను వర్ణనను గమనింపవలెను.

ఈ మూడువర్ణనలను ఒకదానితో నొకటి కలుపకుండ విడిగ నుంచుదము. ఈమూడింటికిని అర్థమొక్కటియే కాదు. వీనికన్నిటికిని అర్థ మొక్కటియే యైనయెడల అత్యుక్తిదోష మాపాదించును. కనుక యీ మూడింటికిని మూడు వేర్వేరు

అర్థములుండి తీరవలెను. "విషురూపే, విరూపే"— యను పదములలోని "రూప" శబ్దమునకు—నలుపు, తెలుపు, ఎరుపువంటి — వివిధరంగులని శాయనాచార్యులవా రర్థము జెప్పియున్నారు. దివారాత్రిముల కీయనేకరంగులను బూయుట కెట్లు సంభవమగునో మనముగ్రహింపజాలము. మనకొక్కప్పుడు రాత్రింబవళ్లు పచ్చగను, ఎర్రగను, నీలముగను, ఊదారంగుగను గాన్పించునా? పోనీ, "రూప" శబ్దమునకు "రంగు" అని అర్థముచెప్పుటకు సాధ్యమైనను "వపూంషి" యనుపదమున కాయర్థ మెట్లు చెల్లును? దీని విషయమై భాష్యకారు లెవరును శ్రద్ధబూని విచారించినట్లు గన్పించదు. అందుచేతనే కొందరు "విషురూపే" యనగ "వివిధరంగుల" ని అన్వయించియున్నారు. "నక్తోషాసా" యొక్క స్వరూపము "విరూపే" యని ఋ I. 113, 3—లో వర్ణించియున్నారు. అచ్చటకూడ శాయనులవా రీయర్థమునే చెప్పియున్నారు. దీని విషయమై యింకను దీర్ఘముగ ఆలోచించినవా రెవరును గాన్పింపరు. కాని, శాయనులవారి కంటె పూర్వపువాడైన మాధవాచార్యులవారు "వివర్ణ" మను తమ సామవేదభాష్యమందు "విరూపే" యను పదమును గూర్చి పూర్ణముగ వ్యాఖ్యానము జేసియున్నారు. సామవేదముయొక్క "ఉత్తరార్చికము" నందు (19,4,2,3) యీ పదమునుగూర్చి యీవిధముగ జెప్పియున్నారు. "సంవత్సరములో దక్షిణాయనములో రాత్రికాలము



వృద్ధియగుచుండును. ఉత్తరాయణములో పగటికాలము వృద్ధిబొందును. [సుమేకే-సంవత్సరే దక్షిణాయనే రాత్రేర్వృద్ధిః; ఉత్తరాయణే త్వహ్నః, నక్తం రాత్రిః, ఉషాకాలప్రభృత్యహః] మాధవాచార్యులవారి యీభాష్య ప్రకారము "విషురూపే, విరూపే" — యను ఋగ్వేద పదములకు సరియైన యర్థమును జెప్పుటకు మనకు వీలు కలిగినది. "రూప", "వపుస్" శబ్దములు దివారాత్రముల యొక్క దీర్ఘతను (పొడవును), వ్యాప్తిని, తెలియజేయు పదములని మన మిప్పుడు గ్రహింపవలెను. కనుక, "విరూపే" యనగ "వివిధములైన పొడవులు గల రాత్రింబగళ్ళు" అని సరళమైన యర్థ మేర్పడుచున్నది. అనగ, దివారాత్రము లొకప్పు డొకపొడవును, మరియొకప్పు డింకొకపొడవును కలవై యున్నవని యర్థము. దీనితోబాటు, యీ కొలతలు మారిపోవుటయే గాక, యీ దివారాత్రములలో నొకటి ప్రకాశమానముగను, యింకొకటి నలుపుగను ఉండును. మాధవాచార్యులవారి భాష్యము నాధారముచేసికొని మన మిప్పు డీఋక్కుయొక్క మొదటి రెండు పాదములకును యీ క్రిందివిధముగ నర్థముచెప్పవచ్చును. "ఈ కవలపిల్లలయొక్క పొడవులు ( వపూంషి ) వివిధములుగ ( నానా ) మారుచుండును. వానిలో నొకటి మెరయుచుండును; మరియొకటి నల్లగనుండును." —

ఈ ఋక్కులో మొదటి రెండుపాదములకు నర్థమును జెప్పితిమి. కాని మూడవపాదమువద్దకు వచ్చుసరికి యింకొక క్రొత్తచిక్కు తటస్థించుచున్నది. మూడవపాదమున కర్థమే మనగ:—“ వారు ఇద్దరు అప్పచెల్లెండ్రు ( స్వసారా ) ఒకటి చీకటిగను (శ్యావీ,) రెండవది ప్రకాశమానముగను (అరుషీ) ఉండును. ” మూడవపాదములో చెప్పబడిన అప్పచెల్లెండ్రకును ( స్వసారా ) మొదటి రెండు పాదములలో వర్ణింపబడిన “కవలపిల్లల” కును (యమ్యా) యేమైన సంబంధమున్నదా? ఇవిరెండును వేర్వేరు వ్యక్తులా ? లేక ఒకవ్యక్తియేనా ? ఈ రెండును ఒకేవ్యక్తియని చెప్పినయెడల యీ మూడవ పాదము అనవసరమగును. మూడవపాదముయొక్క ప్రయోజనమేమి ? ఇక యివి రెండును వేర్వేరు వ్యక్తులని చెప్పిన యెడల యీ రెంటికిని గల భేదమేమియో చెప్పితీరవలెను. వ్యాఖ్యాత లెవరును దీనిని సమర్థింపజాలరైరి. అందువల్ల వారు పునరుక్తిదోషమునకొడిగట్టియైనను యీ రెండును ఒకేవ్యక్తి యని సమర్థించిరి. కాని యీ వ్యాఖ్యానము సంతృప్తికరముగ లేదని యందరికిని తెలియును. కనుక, మనచేతనైన యెడల నీవాక్యములకు సంతృప్తికరముగ నర్థమునుజెప్పుటకై యత్నింతము.

ఇచ్చట రాత్రింబవళ్ళయొక్క వర్ణనలు రెండు విధములుగ నున్నవి. ఒకజంటగాక రెండు జంటలనిచటవర్ణించి యున్నారు. ఈ యొక్కచోటనేగాక, యిదేవిధముగ ననేక



చోట్ల దివారాత్రములను రెండు తరగతుల జంటలుగ వర్ణించిన ఘట్టము లనేకములు గలవు. వీనికన్నిటికిని సమాధానము జెప్పుటెట్లు ? ఋగ్వేదమునందు దివారాత్రములను వర్ణించుటకు “ అహానీ ” యను మరియొక పదముగలదు. దీనికర్థమేమి ? దీని యర్థము “ రెండు పగళ్ళు ” అనికాదు: “ అహానీ ” యనగ “ ఒకరాత్రి, ఒకపగలు (జంట) ”అని యర్థము. కారణమేమన, ఋ VI, 9, 1లో “చీకటిదిన(అహః) మొకటియు, వెలుతురుదిన (అహః) మొకటియు గలవు”— అని స్పష్టముగ రెండు విధములైన “ అహః ” కలవని వర్ణించి యున్నారు. కనుక “అహానీ” యను పదమునకు “ఒక రాత్రింబగళ్లయొక్క జంట”యని స్పష్టమగుచున్నది. ఋగ్వేదములోనే మరియొకచోట “ఉషాసానక్తా” యని యింకొక జంటను వర్ణించి యున్నారు. “ అహానీ ”యను జంటకును “ ఉషాసానక్తా” యను జంటకును భేదమేమైన గలదా ? లేక యివి రెండును ఒకటియేనా? దీనికిసమాధానము ఋగ్వేదము IV, 55, 3-లో కనిపించగలదు. అచ్చట “ ఉషాసానక్తా ” యను దేవతను, “అహానీ” యను దేవతను– యీ రెంటిని– వేర్వేరుగ సంబోధించి, వేర్వేరుగ నాహ్వానించి యున్నారు. [ ఉభేయథానో అహ నిపాత ఉషాసానక్తా కరతామదబ్ధే] ఈ జంట దేవతలను వేర్వేరుగ నాహ్వానించుటం జేసి, యీ జంటలు రెండును వేర్వేరు జంటలై యుండితీరవలెనని సిద్ధించుచున్నది. మ్యాక్సిముల్లరు పండితుడు సైతము యీరెండు జంటలకును

గల భేదమును గుర్తించియే యున్నాడు. కాని వానియొక్క నిజ భావమేమియో పూర్తిగ విచారణ చేసియుండలేదు. మనదేశములో వలె సంవత్సరములోనున్న ౩౬౦ దినములును ఒకే విధముగ నున్నయెడల యీ రాత్రిం బవళ్ళను రెండు వేర్వేరు జంటలుగ వర్ణించుటకు కారణమేమి? ఈ రాత్రిం బవళ్ళు వివిధమైన పొడవులుగలవై యొకటి ప్రకాశమానముగను మరియొకటి నల్లగను ఉండుననివర్ణించిన చాలుగద. ఋ IV. 55, 3 లో - యీ రెండు జంటలకును జూపిన భేదమును మనమెట్లు సమర్థింపవచ్చును? దీనికై యీ భూగోళములో వివిధప్రదేశములలోనుండు దివారాత్రిములనెల్ల పరీక్షించి చూడవలెను. ఉత్తరధ్రువము మొదలుకొని భూమధ్య రేఖవరకు గల దివారాత్రిములనెల్ల పరీక్షించి చూచినయెడల, యీ ద్వంద్వ వర్ణనలకు సరిపోవు, దివారాత్రములు ఉత్తరధ్రువ ప్రాంతదేశములలోనుండు దివారాత్రిములేగాని, యిట్టివి మరియెచ్చటను లేవని తేలుచున్నది. ఉత్తర ధ్రువమండలములో నుండు దివారాత్రిముల యొక్క లక్షణములేమి? అనేకదినములవరకు యెడతెగక వ్యాపించి యుండు ఒకరాత్రియు, యిట్టిదే దీనితో తులదూగగల యొక పగలును—అనగ, ఒక దీర్ఘరాత్రిమును, ఒక దీర్ఘదివసమును—గలిగిన దివారాత్రిముల జంట యొకటి యుండును. ఇది యొక తరగతిజంట. ఇదిగాక, వివిధపొడవులు గలిగినట్టియు, మొత్తము ౨౪ గంటలకు మించనట్టియు



మరియొక తరగతి దివారాత్రముల జంటలుండును. ఇది యింకొక తరగతి జంట. (పటమును చూడుడు) ఇట్టి విచిత్రమైన దివారాత్రముల జంటలు ఉత్తరధ్రువమండలములో దప్ప మరియింకెచ్చటను గానరావు. భూమధ్య రేఖవద్ద దివారాత్రము లెప్పుడును ఒకేవిధముగ నుండును. ౨౪ గంటలలో సగము పగలును, సగము రాత్రియు గలిగి సంవత్సరములో నెట్టిమార్పునులేక యేకరీతిగనే యుండును. అనగ, భూమధ్య రేఖవద్ద దివారాత్రములు "విరూప" ముగనుండక, "సరూప" ముగనేయుండును. భూమధ్యరేఖకును, ధ్రువరేఖకును మధ్యనున్న దేశములో దివారాత్రము లెప్పుడును మొత్తము ౨౪ గంటలకు మించియుండవు. కాని, యీ ౨౪ గంటలలో ఒక్కొక్క చోట [ఉత్తరధ్రువమును సమీపించిన కొలది] ౨౩ గంటల పగలును ఒకగంట మాత్రమే రాత్రియు నుండవచ్చును; లేదా ౨౩ గంటలరాత్రియు, నొకగంట మాత్రమే పగలును కూడ నుండవచ్చును. ఈ రీతిగ రాత్రింబగళ్ళయొక్క పరిమితులు నానావిధములుగ మారుచుండును; కాని యీ రాత్రిం బగళ్ళు రెండును గలిసి మొత్తము ౨౪ గంటలకు మాత్రము మించవు. ఇదియే ఋ III. 55, 11-లో మొదటి రెండు పాదములలో వర్ణింప బడిన దివారాత్రముల జంట—"నల్లగను, ప్రకాశమానముగను, వివిధ పొడవులు గలదిగను" ఉండు జంట. ఇది మొదటితరగతి జంట. ఇక స్రీధువరేఖను దాటి ఉత్తరధ్రువమండలములోనికి ప్రవేశించినచో, యీ

మొదటి తరగతి జంటతోపాటు యింకొక తరగతి జంట కూడ గాన్పించును. ౨౪ గంటలకు మించని మొదటి తరగతి దివారాత్రముల జంటగాక, అనేక దినములవరకు నడలేక వ్యాపించి యుండు దీర్ఘరాత్రింబవళ్ళ జంట ఇంకొకటి సంభవించును. ఇది రెండవతరగతి జంట. ఉత్తర ధ్రువమండలములో నీరెండు తరగతులజంటలు గలవని సిద్ధించుచున్నది. కేవలము ఉత్తర ధ్రువము మీదికే పోయి కూర్చున్నచో దీర్ఘజంట యొక్కటి మాత్రమే– 6 నెలల రాత్రియు, 6 నెలల పగలును–ఉండును; ౨౪ గంటల జంట మాయమై పోవును.

మనము భూమధ్యరేఖవద్దనుండి బయలుదేరి ఉత్తర ధ్రువమువైపునకు ప్రయాణమై పోవుచున్నచో, మనకు మధ్యత్రోవలో క్రమముగ నీక్రిందివిధములైన దివారాత్రములు గాన్పించును:–

(౧) భూమధ్యరేఖవద్ద:– ఒకేజంట; ౨౪ గంటలకు మించదు; సగము నలుపు, సగము మెరుపు; రాత్రింబవళ్ళ పొడవులలో మార్పులుండవు. అనగ 'సరూప'ము.

5–వ పటము.

(౨) భూమధ్యరేఖకును ధ్రువరేఖకును మధ్య } ఒకేజంట; ౨౪ గంటలకు మించదు. వీని పొడవులు సంవత్సరములో సమానముగ నుండక వివిధములుగ (విరూపే) మారుచుండును.

6–వ పటము.




భూమధ్యరేఖవద్ద అనగ "౦" అక్షాంశ. ఇచ్చట క్షితిజమును, ఉత్తరధృవమును యేకమైపోవును. సంవత్సరములో ప్రతిదినమును సగము వెలుతురు, సగము రాత్రియు నుండును. ఇచ్చట 12 నెలల పొడవునను – రాత్రిళ్లు చీకటితో – సూర్యరశ్మి యుండును. రాత్రింబవళ్లు సరిసమానమైన పరిమితిగలవి. (సరూపము) దీర్ఘరాత్రియు, దానిననుసరించి దీర్ఘదివసమును పూర్తిగ మాయమగును. కాబట్టి ఇచ్చట ఒకే జంట గలదు.




భూమధ్య రేఖకును ధృవ రేఖకును మధ్య అనగ $23\frac{1}{2}^{\circ}$ మొ॥ $66\frac{1}{2}^{\circ}$ వరకు గల మధ్య ప్రదేశములో

ఈపటము 45° డిగ్రీల ప్రదేశమును సూచించును. ఇచ్చట 12 నెలల పొడవునను మామూలు రాత్రింబవళ్లుం డును. కాని, అవి సమాన పరిమితులుగలవి కావు (అనగ విరూపములు.)

దీర్ఘరాత్రియు, దీర్ఘదివసమును పూర్తిగ మాయమగు టచే, ఇచ్చట ఒక్కజంటయే గలదు.



(3) ధ్రువ రేఖకును, ధ్రువ మునకును మధ్య ... అనగ ధ్రువమండలములో.

7-వ పటము.

రెండు జంటలు;
ఒకజంట:- 24 గంటల జంట; ఇవి 'విరూప' ములు, కొంత నలుపు కొంతమెరుపు.

రెండవజంట:- దీర్ఘజంట; ఒక దీర్ఘరాత్రియు, దానితో తుల దూగగల ఒక దీర్ఘదివసమును కలిసి యీజంట యేర్పడు చున్నది.

(4) కేవలము ఉత్తర ధ్రువముమీద:-

8-వ పటము.

ఒకే జంట:- ఆరు నెలల దీర్ఘ రాత్రియు, ఆరు నెలల దీర్ఘదివస మును కలిసి యీదీర్ఘజంట ఏర్ప డుచున్నది. ఇది 'సరూప'ము.

ఋ IV. 55,3 లో "ఉషాసా నక్తా" యనియు, "అహనీ" యనియు రెండు జంటలను వర్ణించియున్నారుగద. ఆ రెండు జంటలును పైమూడవ పటములో చూపించిన జంటలై యుండితీరవలెను. కనుక ఆ ప్రదేశము ధ్రువమండలము లోనిదై యుండితీరవలెను. ఇట్టి వింకొకచోట నుండుటకు అసలు వీలే లేదు. ఋ IV. 55,3 ను, ఋ III. 55,11-తో సంపుటీకరణ మొనర్చి చూచినయెడల III. 55,11- యొక్క అర్థము నీవిధముగ చెప్పవచ్చును. ఈ ఋక్కులో రెండు జంటలను వర్ణించియున్నారు.

(౧) ఆ కవలపిల్లలు (యమ్యా ౨౪ గంటల జంట) అనేక రూపములను (నానావపూంషి) ధరింతురు. ఆ రెంటిలో నొకటి ప్రకాశింపుచుండును (రోచతే). రెండవది నల్లగ (కృష్ణమ్) నుండును. ఇది మొదటితరగతి జంట. "ఉషాసా నక్తా" యను జంట.

(౨) వారు యిద్దరు అప్పచెల్లెండ్రు (స్వసారౌ—దీర్ఘజంట.) ఒకటి నల్లగను (శ్యావీ) రెండవది ప్రకాశమానముగను (అరుషీ) ఉండును. ఇది రెండవతరగతి జంట "అహానీ"—యను జంట.

ఈ ఋక్కునకి ట్లర్థము జెప్పినయెడల వీనిలోని పాదము లెవ్వియును నిరుపయోగములు కాజాలవు. పునరుక్తిదోషము పోవును. దీని భావము సులభగ్రాహ్యమగును. సమస్తమును తెల్లమగును. ఋగ్వేదమునందు వర్ణింపబడిన "ఉషాసా నక్తా" "అహానీ" యను జంటలు రెండును వేర్వేరు జంటలని ఋ IV. 55, 3, వలన తెల్లమగుచున్నది. "ఉషాసా నక్తా" యను జంట ౨౪ గంటలకు మించని దివారాత్రమును దెలియజేయు మొదటి తరగతి జంటయనుకొందము; 'అహానీ' యను జంట దీర్ఘనిశను దీర్ఘదివసమును కలిసిన (రెండవ తరగతి) దీర్ఘజంట యనుకొందము. (వీని నీక్రింద ఋజువుపరచెదము). ఈ రెండు జంటలకును గల భేదము నిం కొకవిధముగ జూపెదము. మొదటి తరగతి ౨౪ గంటల జంటలోని దివారాత్రములు ఒకదాని నంటి మరియొకటి వరుసగ, నిరవకాశముగ, వచ్చుచుండును. అనగ, రాత్రి గడచుటతోడనే పగలును, పగలు గతించుటతోడనే రాత్రియు—నవిచ్ఛిన్నముగ, చర్విత చర్వణముగవచ్చుచుపోవుచుండును. కాని రెండవతరగతిది యగు దీర్ఘజంటలోని దీర్ఘదివసమును దీర్ఘరాత్రిమును ఒకదానినంటి యొకటిరాదు. దీర్ఘరాత్రి మంతమొందుటతోడనే దీర్ఘదివసము రాజాలదు. దీర్ఘరాత్రి మంతమొందిన ౪, ౫, ౬ నెలలకు గాని దీర్ఘదివసమురాదు. దీర్ఘనిశకును దీర్ఘదివసమునకును మధ్య కొన్ని నెలలు గతించవలెను. దీర్ఘనిశ సాధారణముగ హిమసంక్రమణము వద్ద (షుమారు మార్గశీర్ష పుష్యమాసములలో) తటస్థించును. దీర్ఘదివసము సాధారణముగ గ్రీష్మసంక్రమణము వద్ద (షుమారు జ్యేష్ఠాషాఢమాసములలో) తటస్థించును. ఈదీర్ఘనిశయు, దీర్ఘదివసమును — (అహానీ,) పోను మిగతా సంవత్సరములో మన సాధారణపు ౨౪ గంటలకు మించని (మొదటి తరగతి ఉషాసానక్తా)- దివారాత్రము లుండును. దీర్ఘనిశకును దీర్ఘదివసమునకును మధ్య యెన్ని నెలలు గతించవలెనో దీనినిబట్టి చదువరులే గ్రహింపగలరు. గ్రీష్మర్తువంతయు నెడలేనిపగలుగను, హేమంతర్తువంతయు నెడలేని దీర్ఘరాత్రిగను ఉండునని చెప్పిన చెప్పవచ్చును.

ఈ రెండవ తరగతి "అహానీ" జంటలోజేరిన దీర్ఘరాత్రికిని దీర్ఘదివసమునకును మధ్య షుమారు ఆరుమాసముల యవకాశముగలదని చెప్పవచ్చును. ఇది 'అహానీ' జంటయొక్క-

లక్షణము. ఈ లక్షణములు మన పూర్వుల కెరుకయే. దీనికి ప్రమాణము:— తైత్తిరీయ ఆరణ్యకము — I. 2, 3 [ ఏకహిశిరో । నానాముఖే । కృత్స్నంతదృతులక్షణమ్ ] ఇచ్చట "సంవత్సర" దేవతను వర్ణింపుచున్నాడు. ఈ దేవతకు ఒకతలయు, రెండు భిన్నముఖములును గలవు. ఇవన్నియు ఋతులక్షణములు. ఇకనీవాక్యములకు భాష్యకారు లెట్లర్థము జెప్పిరో చూతము. సంవత్సరములో రెండు అయనములు గలవు. గనుక సంవత్సరదేవతకు రెండు నోళ్ళున్నవని వర్ణించిరట. సంవత్సరములో వచ్చు ఋతువులన్నియు, నీ అయనములలో నిమిడి యున్నవి. గనుక యీ నోళ్ళను ఋతులక్షణములని వర్ణించిరట. మనవ్యాఖ్యాత లీవిధముగ సమర్థించిరి. ఈ తైత్తిరీయారణ్యకములోనే యింకొక కొంచెము దూరము పోయి చూతము. తై.ఆ. I. 2, 4— [ శుక్లకృష్ణే సంవత్సరస్య దక్షిణవామయోః పార్శ్వయోః తస్యైషా భవతి శుక్రంతే అన్యద్యజతంతే అన్యద్విషురూపే అహనీ ద్యౌరివాసి విశ్వాహి మాయా అవసిస్వధావో భద్రాతే పూషన్నిహారాతిరస్తు నాన్న భువనం నపూషా నపశవః నాదిత్యః సంవత్సర ఏవప్రత్యక్షేణ ప్రియతమమ్ విద్యాత్ ]— అర్థము:— [ సంవత్సర దేవతకు దక్షిణవామపార్శ్వములందు శుక్లకృష్ణ "అహ" ములు గలవు; నీకొకరూపము ప్రకాశమానముగను, మరియొకరూపము నల్లగను నుండును. ఈ రెండును వేర్వేరు రూపములు గల "అహ" ములై యున్నవి. నీవు



"ద్యౌ" వలె నున్నావు. ఓ స్వాశ్రయమూర్తీ! నీవు మాయాభూతములనెల్ల రక్షింపుచుందువు. ఓ పూషన్ ! నీ యపారమహిమ మాకిచ్చట మంగళకరమగుగాక ] ఇచ్చట "పూషన్" అను దేవతను "ద్యౌ" తో పోల్చియున్నారు. దానికిని "అహనీ" వలె, నలుపు, మెరుపు రూపములు గలవు. ఈ "అహనీ" యొక్క మెరుపు నలుపు రూపములే సంవత్సరదేవతయొక్క కుడి యెడమ పార్శ్వములై యున్నవి. అనగ, యీ మెరుపు నలుపు రూపములు ఒకదానినంటి మరియొకటిరావు. ఈ రెంటికిని మధ్య చాలనెలల యవకాశము గలదు. ఇట్టి లక్షణములుగలిగిన దీర్ఘనిశాదివసములు (అహనీ) ఉత్తరధ్రువమండలములో తప్ప తదితరచోట్ల నెచ్చటను సంభవింపజాలవు. (మూడవపటమును జూడుడు.) దీర్ఘనిశహేమంతర్తువందును, దీర్ఘదివసము గ్రీష్మర్తువందును సంభవించును. కనుక 'అహనీ' యొక్క మెరుపు నలుపు రూపములు సంవత్సర దేవతయొక్క ముఖద్వయమని తైత్తిరీయారణ్యకములో వర్ణించియున్నారు.

మనమింతవరకును దీర్ఘరాత్రమును గూర్చి [illegible] పరీక్షించి యున్నాము. ఇక దీర్ఘదివసమును వర్ణించు ప్రత్యక్ష ప్రమాణము లేమైన కలవేమో విచారింతము. ఋ V. 54, 5 లో (తద్వీర్యం వో మరుతో మహిత్వమమ్ దీర్ఘం తతాన సూర్యో నయోజనమ్) ఇచ్చట సూర్యునియొక్క "దీర్ఘం యోజనం" అను దానిని వర్ణించినారు. అనగ సూర్యుడు

పగటిపూట దీర్ఘప్రయాణము చేయుచున్నాడట. అట్లే మరుత్తులుకూడ తమయొక్కశక్తిని, మహిమను, వృద్ధినొందించుకొనిరట. ఇంతకంటె బలవత్తరమైన ప్రమాణము ఋ X-138, 3 లో-కలదు. (విసూర్యో మధ్యే అముచద్రథం దివో విదద్దాసాయ ప్రతిమానమార్యః దృఢాని పిప్రో రసురస్య మాయిన ఇంద్రో వ్యాస్యచ్చకృవాం ఋజిశ్వనా) ఇది మూడవ ఋక్కు. దీనిలో నింద్రుని వీరకృత్యములను వర్ణించినారు. మొదటి ఋక్కులో వృత్రాసురవధయు, తద్వారా నీటికిని ఉషస్సులకును గలిగిన బంధమోక్షణమును వర్ణించినారు. రెండవ ఋక్కులో వృత్రాసురవధవలన సూర్యుడెట్లు ప్రకాశింపజేయబడెనో వర్ణించి యున్నారు. 4, 5, 6, ఋక్కులు వృత్రాసురునికోటలను భంజించుటయు, చంద్రాదులను తిరిగి తమతమస్థానములంగో నిలుపుటయు, మొదలుగాగల వీరకృత్యములను వర్ణించినారు. ఈ ఋక్కులతో మన కిప్పుడంతగ పనిలేదు. మనకిప్పుడు కావలసినది పైనుదహరించిన మూడవఋక్కు. ఈ ఋక్కున కర్థమేమనగ:—[సూర్యుడాకాశమధ్యమందు తనయొక్క రథమును దింపుకొనినాడు (వి అముచత్) * దాసుడొనరించిన కృత్యము

* దాసుడనగ వృత్రాసురుడు. ఇతడు రాక్షసుడు. ఇతడు సూర్యుని (అనగ ఆర్యుని) కట్టివేయుటచే దీర్ఘనిశ యేర్పడుచున్నది. ఇప్పుడన్ననో వృత్రాసురుడు ఇంద్రునిచే సంహారింపబడుటవలన సూర్యునకు బంధమోక్షణము గలిగినది. కనుక, దాసుడొనర్చిన కార్యమునకు ప్రతిమానముగ —



నకు ప్రతిమాన మొనర్చుటకు—అనగ ప్రతికృత్య మొనర్చుటకు—ఇప్పుడు ఆర్యునకు అవకాశము జిక్కినది. ఋజిశ్వన సహాయుడై ఇంద్రుడు మాయికుడైన "పిప్రు"డను అసురుని బలిష్ఠమైన కోటలను భంజించెను.] ఈ ఋక్కులోని మొదటి రెండు చరణములే మన కిప్పుడు ముఖ్యముగ కావలసినవి. సూర్యుడు తనరథమును దింపుకొని కూర్చున్నాడట. ఎచ్చట? అస్తమయసమయమందు గాదు; క్షితిజమువద్ద గాదు; మరి యెచ్చట? ఆకాశమధ్యమందు; కొంతకాల మచ్చట విశ్రమించుటకొరకై సూర్యుడు తన రథమును దింపుకొనినాడు. ఇంతవరకు నిస్సందిగ్ధముగ దీని యర్థము తెల్లమగుచునే యున్నది. కాని, సూర్యునియొక్క యిట్టి విపరీతచర్య మన వ్యాఖ్యాతల కెంతమాత్రమును బోధపడినదికాదు. గ్రిఫిత్ అను పాశ్చాత్యశాస్త్రజ్ఞుడు దీనికొక విచిత్రార్థమును జెప్పెను. బహుశః యీవిపరీతచర్య సూర్యగ్రహణమై యుండవచ్చునట. లేదా ఆర్యులు తమ శత్రువులైన దస్యులను జయించుటకుగాను బహుశః సూర్యుని ఆకాశమందు గట్టివేసినా రేమోనట! ఈ రెండర్థములుకూడ తృప్తికరములుగ గాన్పింపవు.

యతికి ప్రతిగ; కుక్కకాటుకు చెప్పుదెబ్బ యన్నట్లు — సూర్యుడాకాశమున తన రథమును ఊడదీసి కూర్చునియున్నాడు. వృత్రాసురుడు దీర్ఘనిశను గలుగజేసినాడు గాన, దానికి ప్రతిమానముగ సూర్యుడు దీర్ఘదివసమును గలుగజేయుచున్నాడు.

ఏల ననగ:- సూర్యగ్రహణమునాడు సూర్యుడు బాగుగ ప్రకాశింపడు. ఛాయాగ్రహముచే నావరింపబడి యుండును గద. అదిగాక, గ్రహణమునాడు సూర్యుడు ఆకాశమధ్యమందు నిలువబడడు. కనుక, పైనవర్ణించిన సూర్యునిచర్య సూర్యగ్రహణము కానేరదు. ఇక రెండవ యర్థమును చర్చింపనే యక్కరలేదు. ఆ యర్థ మిచ్చుట యెంతమాత్రమును సరిపోదు. ఋగ్వేదమునం దెచ్చటను యిట్టి యర్థమునకు ప్రమాణము గాన్పింపదు.

ఇక శాయనాచార్యులవారు దీని నెట్లు సమర్థించిరో చూతము. "రథం వి అముచత్ మధ్యే దివః=సూర్యుడు తన రథమును వదలెను." అనగ, ఆకాశమధ్యమునకు ప్రయాణ మొనర్చుటకుగాను సూర్యుడు తనరథపగ్గములను వదలెను; లేక సడలించెను. "రథం ప్రస్థానాయ విముక్తవాన్"— యిదిశాయనులవారి భాష్యము. వృత్రాసురుని సంహారించిన పిమ్మట, ఇంద్రుడు సూర్య రథమును ఆకాశమధ్యమువైపునకు ప్రయాణమొనర్చు నిమిత్తము వదలివేసెనట. కాని యీ వ్యాఖ్యాన మంతసరళముగ గన్పింపదు. ఋగ్వేదమునందు "వి — ముచ్" అను పదమును రథహయములను గూర్చి చెప్పు సందర్భములో ౧౦, ౧౨ చోట్ల ప్రయోగించినారు. ఈ ౧౦, ౧౨ చోట్లలోను "కాడిని ఊడదీయుట, జీనును ఊడదీయుట, రథమునుండి గుఱ్ఱములను వేరుపరుచుట" యనునర్థములో ప్రయోగించిరేగాని, మరి యింకొకభావ మెచ్చటను గాన్పిం



పదు. ఆ యా ప్రదేశములలో శాయనాచార్యులవారు కూడ యిదేయర్థమును శలవిచ్చియున్నారు. ఋ I. 104, 1 లో "వి-ముచ్య" అనగ = "రథాత్ విశ్లిష్య" అని శాయనులవారే తెలిగించియున్నారు. ఋ I. 32, 1 లో "రథాత్ విముచ్య," యనియు, ఋ X 160, 1 లో "రథాత్ విసృజ్య" యనియు శాయనులవారే వ్యాఖ్యానముజేసియున్నారు. ఇంకను కావలసినయెడల, ఋ I. 171, 1; I. 177, 4; VI. 40, 1— ఋక్కులను పోల్చిచూడ వచ్చును. ఈ సందర్భములను బట్టి "సూర్యుడు తనరథమును ఊడదీసి దింపుకొన్నాడు" అనునదియే మిక్కిలి సరళమైన అర్థమని స్పష్టమగుచున్నది. "దివఃమధ్యే" = అనగ, "ఆకాశమధ్యమందు" అని యర్థముగాని "ఆకాశమధ్యమువైపునకు" అనియర్థము కానేరదు. "వి—ముచ్" అనగ "ప్రయాణమునిమిత్తమై రథపగ్గములను వదలినాడు" అని మన మొకవేళ యర్థము జెప్పినను, తత్పూర్వమందు రథమునిలిచియైన నుండవలెను; లేదా మిక్కిలి నెమ్మదిగనైన నడచుచుండవలెను. అట్లనియొప్పుకొన్నను ఆకాశమధ్యమందు సూర్యుడు తన రథము నేల నిలుపవలెను? ఏల నెమ్మదిగ నడిపింపవలెను? ఈ ప్రశ్నలకు సమాధానమింకను జెప్పవలసియే యున్నదిగద. అప్పటికి సూర్యుడు క్షితిజముక్రింద నున్నయెడల ప్రయాణమునకై బయలుదేరినాడని చెప్పవచ్చును; క్షితిజము క్రిందనైనను, ప్రయాణమునకు పూర్వము, సూర్యుడు నిలిచి యుండవలెను గద. దీనినెట్లు

సమర్థింతుము? కాని యీ ఋక్కులో వర్ణింపబడిన సూర్యుడు క్షితిజముక్రింద లేడు, దివామధ్యమందున్నాడు. కనుక ప్రయాణమునకై బయలుదేరినాడని చెప్పుటకు సందర్భపడదు. అదియునుగాక, దాసుడగు వృత్రాసురు డొనర్చినకృత్యమునకు సూర్యుడు ప్రతిమాన మొనర్చుచున్నాడని యీ ఋక్కునందున్నభావమున కర్థమేమి? శాయనులవారి వ్యాఖ్యకు మనము సమ్మతించిన యెడల యీ "ప్రతిమాన" మును సమర్థించుటెట్లు? కనుక, సూర్యు డాకాశమధ్యమందు తన రథమును ఊడదీసి కూర్చున్నాడను నదియే సహజ సిద్ధమైన యర్థము.

సూర్యు డాకాశమధ్యమందు నిలిచియున్నాడని చెప్పుటకు ఋ VII. 87, 5, లో నింకొక ప్రమాణము గలదు. (చక్రే దివి ప్రేఙ్ఖామ్ హిరణ్మయమ్) "హిరణ్మయుడైన సూర్యు డాకాశమందు "ఊయల" వలె నున్నాడు. అనగ, ఆకాశమధ్యమందు సూర్యుడు ఊయలవలె ముందునకును వెనుకకును ఊగులాడుచున్నాడట. దీనియొక్క నిజభావము మన కీప్రాంతములలో గాన్పింపదు. ఉత్తరధ్రువప్రాంతదేశములకు బోయి జూచిననేగాని మన కీవిచిత్రచర్య సుబోధకము గాదు. ఉత్తరధ్రువ మండలములో దీర్ఘదివసమునందు— అనగా, అనేక దినములవరకు సూర్యుడు క్రుంకక క్షితిజముపైననే తిరుగుచున్నప్పుడు— యీ విచిత్రచర్య గాన్పించును. మొట్టమొదట ఉషస్సును భేదించుకొని సూర్యుడు క్షితిజముపైకి వచ్చును. ఒక్క ౨౪ గంటలు గతించునప్పటికి సూర్యుడు



క్షితిజముయొక్క అంచుచుట్టును ఒకచుట్టు తిరిగివచ్చును. కాని ఒక్కచుట్టు తిరిగివచ్చునప్పటికి సూర్యబింబము క్షితిజముయొక్క అంచుననే యుండక కొంచెము పైకి లేచుచుండును. ఈ విధముగ కొన్నిదినములు గతించునప్పటికి సూర్యబింబము అడ్డముగ ౨౪ గంటల కొక చుట్టుచొప్పున కుమ్మరిసారెవలె తిరుగుచు క్రమక్రమముగ పైకిలేచుచుండును. ఇట్లు కొంతయెత్తువరకును లేచి ౧, ౨, మాసము లైనతరువాత తిరిగి క్రిందికి — అదేరీతిగ — క్రమక్రమముగ దిగుచుండును. ఇంకొక ౧, ౨ మాసము లగుసరికి సూర్యబింబము క్షితిజము క్రిందికి క్రుంకును. దీనినిబట్టి మన మేమి గ్రహింపవలెను? దీర్ఘదివసమునందు సూర్యుడు క్రమముగ పైకెక్కుటయు, క్రిందికి దిగుటయు తటస్థించుచున్నది. అనగ, సూర్యుడు ఊయలవలె ముందునకుబోయి వెనుకకు వచ్చుచున్నాడని చెప్పుటకు అవకాశ మేర్పడుచున్నది. కనుక, యిది ఉత్తరధ్రువమండల లక్షణమే యని సిద్ధించుచున్నది.

"విదద్దాసాయ ప్రతిమాన మార్యః"— అను రెండవ పాదమునకు పాశ్చాత్యశాస్త్రజ్ఞులు విచిత్రార్థమును చెప్పిరి. దీనిలోని "దాస" "ఆర్య" శబ్దములు హిందూదేశములోని ఆర్య, అనార్యజాతిప్రజలను సూచింపునని వారు తలంచిరి. కాని, ఋగ్వేదములో యీవాక్యముల నా యర్థములో ప్రయోగింపలేదు. "దాస" శబ్దము ఇంద్రశత్రుపరముగ ప్రయోగింపబడినది. శంబరుడు, పిప్రు, నముచి — మొద

లగు ఇంద్రశత్రు లందరును దాసులనియే వర్ణింపబడిరి. ఇంద్రుడు దాసుల మనస్సులలో భీతిని పుట్టించునట. (ఋ X. 120,2) తనకు మృత్యువులేదని విర్రవీగిన దాసుని ఇంద్రుడు చీల్చివేసెనట (ఋ II. 11,2). ఈవాక్యములవల్ల "ఆర్య" "దాస" శబ్దములు ఇంద్రునకును, ఇంద్రశత్రులకును వర్తించునేగాని ఆర్యానార్యజాతిప్రజలకు వర్తింపవని తేలుచున్నది. ఇదిగాక, యీవీరకృత్యములన్నియు నెచ్చటనో ఊర్ధ్వలోకములందు జరిగిన కార్యములు. ఇట్టి సందర్భములో, యీఋక్కులో నెచ్చటనో యొకటి రెండు పొడిమాటలను బట్టుకొని, హిందూదేశములో ఆర్యానార్యజాతిప్రజలకు జరిగిన పోరాటముతో పోల్చజూచుట హాస్యాస్పదము. ఇక రెండవ యంశ మేమనగ, "ప్రతిమాన" భావము నెట్లు సమర్థింపవచ్చును? ఆర్యు లోకప్పుడు దాసులవలన ఓడింపబడి యుండిన గాని, తిరిగి ఆర్యులు విజృంభించి తమ కసితీర్చుకొని రని చెప్పుటకు వీలు లేదుగద. తత్పూర్వమం దార్యు లోకప్పుడు దాసులచే నోడింపబడినట్లెచ్చటను చారిత్రక దృష్టాంతము గాన్పింపదు. కనుక, యీ యర్థ మిచ్చట సరిపోదు. కనుక యీ ఋక్కుయొక్క సరళభావ మేమనగ, సూర్యు డాకాశమధ్యమందు నిలువబడి దీర్ఘదివసమును కల్పించెను. అందువలన, తనశత్రువైన దాసునకు 'ప్రతిమాన' మొనర్చుటకు యింద్రున కిప్పుడు మంచి యవకాశము చిక్కినది. ఏలననగ, దీర్ఘనిశ యెవరివలన కలిగి



నది? ఇంద్రశత్రుడగు దాసునివలనగద. ఇంద్రశత్రుడగు దాసుడు దీర్ఘనిశను గల్పించినాడు గనుక, దానికి 'ప్రతిమాన' ముగ ఇంద్రు డిప్పుడు దీర్ఘదివసమును కల్పించి కసితీర్చుకొన్నాడు. ఇదే ఉత్తరధ్రువమండల లక్షణము. అచ్చట దీర్ఘనిశయు, దానితో తులదూగగల దీర్ఘదివసమును కలుగుచుండును. ఇదియే యీ ఋక్కుయొక్క నిజభావము. ఆర్యానార్య పోరాటములు మొదలగు అసందర్భపు వ్యాఖ్యానములెవ్వియు నిచట సరిపడవు.

మన మీయధ్యాయములో గ్రహించిన సారాంశముల నన్నిటి నిచ్చట క్లుప్తముగ చెప్పెదను:—

(౧) ఋగ్వేదమందు దివారాత్రములను వర్ణింపు జంటలు రెండు గలవు. ఒకటి ౨౪ గంటల పరిమితిగల సాధారణపు దివారాత్రియును (ఉషాసానక్తా) వర్ణించును. రెండవది, దీర్ఘనిశాదివసమును (అహనీ) వర్ణించును. దీనికి ప్రమాణము: ఋ III. 55, 11.

(౨) 'అహనీ' జంటలో వర్ణింపబడిన దీర్ఘనిశయు, దీర్ఘదివసమును సంవత్సరదేవతయొక్క వామదక్షిణపార్శ్వములు. ఇదియే ఉత్తర ధ్రువమండలములోని దీర్ఘదివసమును, దీర్ఘరాత్రమును నైయున్నవి. దీనికి ప్రమాణము తైత్తిరీయారణ్యకము.

(3) పూర్వకాలమందు మనవారు "యిక తెల్లవారనే తెల్లవారద" ని భయపడెడివారట—అనగ, రాత్రికాలమంత

దీర్ఘముగ నుండెడిదన్నమాట. అట్టిభయము మన కిప్పు డేల లేదో ? దీనికి ప్రమాణము తైత్తిరీయ సంహితా–

(౪) దీర్ఘనిశను వర్ణించు వాక్యము లనేకములు ఋగ్వేదము నందు గాన్పించుచున్నవి. "మమ్ముల నీయంధకారము నుండి దాటించి రక్షింపుడ" ని మన యార్యులు దేవత లను వేడికొనిన ట్లనేక ఋక్కులు గలవు.

(౫) అదిగాక, సూర్యు డాకాశమధ్యమందు చాలకాలము వరకును నిలిచియుండి, దీర్ఘదివసమును కల్పించి, దాను లచే కల్పింపబడిన దీర్ఘనిశకు 'ప్రతిమాన' మును కల్పించెనని స్పష్టముగ నొక్కివక్కాణించుటకు ఋగ్వే దమునందు ప్రత్యేక మొక ఋక్కుగలదు. దీనికి ప్రమా ణము ఋ X. 138, 3.

ఐదవ యధ్యాయములో వర్ణించిన దీర్ఘఉషస్సులేగాక దీర్ఘనిశా దివసములుకూడ మన యార్యులకు బాగుగ యెరు కయే యని యిప్పుడు ఋజువైనది. ఇవన్నియు ఉత్తరధ్రువ మండల లక్షణములే.

ఉత్తరధ్రువమండల లక్షణములలో నింకొక్క దానిని విచారించి యీ యధ్యాయమును ముగించెదను. అదే దనగ, సూర్యుని "దక్షిణదిక్‌గమనము." ఉత్తరధ్రువమండలములో సూర్యుడు దక్షిణదిక్కునకు బోవుచున్నట్లు గనిపించును. మన దేశములో భూమధ్యరేఖవద్ద మధ్యాహ్నము రెండుజాము లప్పుడు సూర్యుడు సూటిగ మన నెత్తిమీద ఆకాశమధ్య



మందు గాన్పించును. కాని ఉత్తరధ్రువమండలములో మధ్యా హ్నమందుసైతము సూర్యు డాకాశమధ్య బిందు (ఉచ్ఛ్రాయ దశ – Zenith ) వం దుండక దక్షిణపుదిక్కునకు పోయినట్లు కనిపించును. సూర్యు డుదయమగుటతోడనే సరిగ మన నెత్తి మీదుగ పోకుండ దక్షిణపువైపునకు వంగిపోయినట్లు గాన్పిం చును. కేవలము ఉత్తరధ్రువముమీదనే కూర్చున్నయెడల సూర్యుడు మన నెత్తిమీదుగ రాకుండ అడ్డముగ, కుమ్మరి సారెవలె, క్షితిజముయొక్క అంచుచుట్టును దక్షిణపువైపుగ ప్రయాణముచేయుచు గుండ్రముగ తిరుగుచున్నట్లు గాన్పింప గలదు. ఇది ఉత్తరధ్రువమండల లక్షణము. దీనికి వేద ప్రమాణము లేవైన కలవేమో విచారించెదము.

వేదవాఙ్మయమునందు "దక్షిణ" యను పదము రెం డర్థములలో ప్రయోగింపబడినది. (౧) కుడివైపు. (౨) దక్షిణపుదిక్కు. దీనికి కారణ మేమనగ, పూర్వము మన యార్యులు సూర్యోదయసమయమున తూర్పుదిక్కు మొగం బై, దేవతల నారాధించుటంజేసి తమ కుడిచేయి దక్షిణపు దిక్కుగ నుండెడిది. కనుక దక్షిణపుదిక్కునకును కుడిచేతి కిని ఒకేపదమును ప్రయోగింపుచు వచ్చిరి. దక్షిణ యను పదమునకు శుభాశుభకార్యములందు బ్రాహ్మణులకిచ్చు 'బహుమాన'మని కూడ మూడవ యర్థము కలదు. ఋ III. 58, 1 లో సూర్యుడు దక్షిణదిక్కుయొక్క కుమారుడని వర్ణించినారు. దీని భావమేమి ? దక్షిణ యనగ ఉషస్సు అని

అర్థము చెప్పినను, సూర్యుడు ఉషస్సుయొక్క పుత్రుడన నర్థమేమి? ఉషస్సునకు దక్షిణ యనుపేరేల వచ్చినది? దక్షిణ యనగ దక్షిణదిక్కని అర్థము చెప్పినచో యీ వాక్యముయొక్క నిజభావము తేటపడగలదు. ఋ I. 123,1; X. 107, 1 – లో ఉషస్సును 'దక్షిణ' యని సంబోధించి యున్నారు. ఋ III. 58,1 లో–సూర్యుడు దక్షిణయొక్క పుత్రుడని వర్ణించియున్నారు. ఈవాక్యములనుబట్టి చూచినచో, సూర్య, ఉషస్సులు దక్షిణదిక్కుగ వచ్చినట్లు తేటపడగలదు. సూర్యుడు దక్షిణదిక్కుగ ప్రయాణము చేయుచున్నట్లు గాన్పించు ప్రదేశము ఉత్తరధ్రువమండలమే యని చెప్పియున్నానుగద. కనుక యీపై ఋగ్వేదవాక్యములు ఉత్తర ధ్రువమండల లక్షణములను సూచించుచున్నవి. ఇది సిద్ధము.

ఉత్తరదిక్కున కాపేరెట్లు వచ్చినది. "ఉత్-తర"= అనగ పైభాగము: లేక ఊర్ధ్వభాగము అని యర్థము. దక్షిణదిక్కునకు "అధర" యనుపేరుకూడ కలదు. ఈ రెండు శబ్దముల వ్యుత్పత్త్యర్థములుకూడ మన సిద్ధాంతమున కనుకూలించుచునే యున్నవి. ఉత్తరదిక్కు పైభాగమున, సూటిగా నెత్తిమీద, నున్నట్లేదేశములో గాన్పించును? ఉత్తరధ్రువ మండలముందే గాన్పించును. ఉత్తరధ్రువమండలమందు ధ్రువ నక్షత్రము సూటిగ నెత్తిమీద గాన్పించును; కనుక ఉత్తరపు దిక్కు సూటిగ నెత్తిమీద నుండును; దక్షిణపుదిక్కు కాలి క్రింది అధోభాగమందుండును. అందుచేతనే ఉత్తరదిక్కునకు



"ఉత్"-తర (పైభాగము)" అనియు, దక్షిణదిక్కునకు "అధర (క్రిందిభాగము)" అనియు పేర్లువచ్చినవి. అదిగాక, యిటీవలి సంస్కృతవాఙ్మయమందు "సూర్యమార్గము సప్తర్షి మండలమున కంటె క్రిందుగ * (అధః) నున్న"దని యొక ప్రతీతిగలదు. సూర్యమార్గము (రాశిచక్రము) సప్తర్షి మండలమునకు దక్షిణముగ నున్నమాట వాస్తవమే; అయితే దానికి క్రిందుగ నున్నదనగ అర్థమేమి? ఈ వర్ణన మేదేశములో సరిపోవును? సప్తర్షిమండలము నడినెత్తిమీదనున్న దేశములో సరిపోవును. అనగా ధ్రువప్రాంతదేశములలో సరిపోవును. సప్తర్షిమండలము (ఋక్షాః) మిక్కిలి యెత్తుగ (ఉచ్చైః) నున్నదని యిదివరకే ప్రమాణమును జూపియున్నాము.

ఇంతవరకు నీ యారవయధ్యాయములో దీర్ఘదివసము, దీర్ఘరాత్రములనుగూర్చిన వేదప్రమాణములను పరిశీలించియున్నాము. సప్తమాధ్యాయములో మాసములనుగూర్చియు ఋతువులను గూర్చియుకూడ చర్చించి, యివికూడ ఉత్తర ధ్రువమండలమునే సూచించుచున్నవని ధ్రువపరచెదము.

* కాళిదాసు కుమారసంభవమ్ :– VI. 7 :– "అధః ప్రస్థాపితాశ్వేన సమావర్జిత కేతునా సహస్రరశ్మినా సాక్షాత్ప్రణామ ముదీక్షితాః॥
I. 16 :– "సప్తర్షిహస్తావచితావశేషా న్యధో వివస్వాన్ పరివర్తమానః॥
మల్లినాథ వ్యాఖ్య చూడనగును.

# వైదికనిలయము

## 7-వ అధ్యాయము.

### మాసములు, ఋతువులు.

దేవతలకు ఆరుమాసములు పగలును, 6 మాసములు రాత్రియునని సంస్కృతవాఙ్మయమునం దెచ్చట జూచినను స్పష్టముగ గన్పట్టుచున్నది. ఈయంశమే పారశీక వేదమగు "అవస్థ" గ్రంథమందుకూడగలదు. ఇవిగాక ముప్పదిదినముల పరిమితిగల ఉషస్సునుగూర్చియు దీర్ఘదివసము, దీర్ఘరాత్రిని గూర్చియు, ఋగ్వేదమందే ప్రత్యక్షప్రమాణములను జూచి యుంటిమి. ఈయంశములు పూర్వయుగపునాటివనికూడ ఋగ్వేదము చెప్పుచున్నది. ఈలక్షణములు ఉత్తరధ్రువప్రాంత లక్షణములనుటకు సందియములేదు.

అయితే యిక ఋతువులు మాసములు వగైరాలను గూర్చిన ఉత్తరధ్రువలక్షణము లేవైన వేదమునందు గలవా యను నంశమును ఇకముందు విచారింపవలసియున్నది. వేద సంహితాకాలమునాటి (దక్షిణదేశములకు వచ్చిననాటి) పంచాంగమునకునూ ధ్రువనివాసకాలమునాటి పంచాంగమునకును చాల భేదములు కలవని ఇదివరకు వివరించియుం



టిమి. అయితే ఈధ్రువనివాసకాలమునాటి పంచాంగలక్షణములను తెలిసికొనుటెట్లు? సంహితాకాలమునాటి పంచాంగము వెనుకటిపంచాంగముకంటె భిన్నమైనదైనను దీనియందు వెనుకటియంశములు కొన్ని నిలిచియుండకపోవు. ఏలననగ యాజ్ఞికులకు ప్రాచీనాచారములందు పట్టుదల మెండుగ నుండును కనుక ప్రస్తుతదేశకాలస్థితులు మారినను వెనుకటి వానిని మాత్రము వారు పూర్తిగ విడిచిపెట్టరు. వాని నేదో విధముగ ఈనూతన పరిస్థితులకు అంటగట్టుదురు. కనుక ఈనూతన పంచాంగమునందు ప్రాచీనపంచాంగపు లక్షణములుకూడ కొన్ని తప్పకమిగిలియుండునని మనము గట్టిగ చెప్పవచ్చును. వీనిని తెలిసికొనుటకు మార్గమేమిగలదు? యజ్ఞములను చేయుటయనునది ప్రపంచమందు సర్వజాతుల వారికిని పూర్వకాలమందు సాధారణాచారమైయుండెనని పరిశోధనలవలన రుజువగుచున్నది. ఈయజ్ఞయాగాది కర్మకాండ యంతయు కేవలము సూర్యునివార్షికగతిపై యాధారపడి యుండెను. ఈయజ్ఞములు (ముఖ్యముగ వార్షికసత్రములు) సూర్యుని వార్షికగతిక సరియైన నకలని చెప్పవచ్చును. కనుక యార్యులు ఉత్తరధ్రువమును వదలి దక్షిణదేశములకు వచ్చినప్పుడు వారికి సూర్యుని వార్షికగతియందు చాలభేదములు గన్పట్టెను. తదనుగుణముగ యాజ్ఞికులు తమ కర్మకాండయందుకూడ కొన్నిమార్పులను గావించుకొని యుండిరి. అయినను వెనుకటిసూర్యగతిని లేక పంచాంగలక్షణములను

వెలుపుకర్మభాగము లిప్పటికిని మిగిలియేయుండెను. వెనుకటి వానిని పూర్తిగ వారు తోసివేయలేదు. ఇట్లు యాజ్ఞికుల పూర్వాచారపరాయణత్వమువల్లను పట్టుదలవల్లను మిగిలిపోయిన ప్రాచీనకర్మకాండభాగములనుబట్టి పూర్వపు ధ్రువ పంచాంగస్థితి కొంత బోధపడగలదు. ఇట్టిమిగిలిపోయిన ప్రాచీన కర్మకాండ భాగములను బట్టిచూడగ ఆర్యులొకప్పుడు ఉత్తర ధ్రువప్రాంతములం దుండిరని ఋజువుకాగలదు.

కాని ఈవేదప్రమాణములను పరిశీలించుటకుముందు మనము కొన్ని ఖగోళాంశములను దెలిసికొనవలెను. ఉత్తర ధ్రువప్రాంతమందలి సూర్యగతికిని దక్షిణభాగములందలి సూర్యగతికిని ఏమేమిభేదములుండునో మనము జ్యోతిర్గణితమునుబట్టి సులభముగ దెలిసికొనవచ్చును. మఱియు ఇట్టి భేదములే కర్మకాండయందుఁకూడ జరిగియుండవలెను. కనుక ధ్రువనివాసమునాటి కర్మకాండకును, సంహితాకాలమునాటి (అనగా దక్షిణదేశములకు వచ్చిననాటి) కర్మకాండకును ముఖ్యముగ ఏయేభేదములుండునో మనము ముందుగనే యూహించి తెలిసికొనవచ్చును. ఈభూగోళముపై సంవత్సరం పొడవునను సూర్యరశ్మి యెట్లుండునోచూతము.

(బ్లాకు నెం. 5 రు)

(I) భూమధ్యరేఖవద్ద:—మొత్తము పండ్రెండు నెలల సూర్యరశ్మి (౧౨) యుండును. ఇరువదినాలుగు గంటలలో సమపరిమితిగల ఒకరాత్రియు ఒకపగలును యుండును.



(బ్లాకు నెం. 6 రు)

(II) భూమధ్యరేఖకును ధ్రువరేఖకును మధ్యమండలం:— పండ్రెండు నెలల పొడుగునను సూర్యరశ్మియుండును. ఇరువదినాలుగు గంటలలో ఒకపగలును ఒకరాత్రియు నుండును. అయితే ఈరాత్రింబవళ్లు సమానపరిమితిగలవి కావు.

(III) ధ్రువరేఖకును ధ్రువమునకును మధ్య (ధ్రువ మండలం):—అక్షాంశభేదమును బట్టి ఈక్రింది విధముగ నుండ వచ్చును. (రోజు = ౨౪ గంటలు.)

| | | | | |
|---|---|---|---|---|
| (i) (బ్లాకు నెం. 7 రు) | ౧ | నెల యెడతెగని చీకటి (దీర్ఘరాత్రి.) | | మొత్తము ౧౧ నెలలలో సూర్యరశ్మి యుండును. తక్కిన నెల దీర్ఘరాత్రి. |
| | ౫ | నెలలు: రోజులో కొంత చీకటి, కొంత వెలుతురు. (రోజులో వెలుతురు భాగ మంత కంత కెక్కువగు చుండును.) | | |
| | ౧ | నెల యెడతెగనిసూర్యరశ్మి (దీర్ఘదివసము.) | | |
| | ౫ | నెలలు: రోజులో కొంత చీకటి, కొంత వెలుతురు. (రోజులో వెలుతురు భాగ మంత కంతకు తగ్గుచుండును.) | | |

| | | |
|---|---|---|
| (ii) (ధ్రు సం. ౧ కి) | ౧ నెలలు: ఎడ తెగని చీకటి (దీర్ఘ రాత్రి.)<br>౪ నెలలు: రోజులో కొంత చీకటి, కొంత వెలుతురు. (రోజులో వెలుతురు భాగమంత కంత కెక్కు వగుచుండును.)<br>౧ నెలలు: ఎడ తెగని సూర్యరశ్మి (దీర్ఘ దివసము)<br>౪ నెలలు: రోజులో కొంత చీకటి, కొంత వెలుతురు. (రోజులో వెలుతురు భాగమంత కంతకు తగ్గుచుండును.) | మొత్తము పది నెలల సూర్యరశ్మియు, ౧ నెలల దీర్ఘ రాత్రి యుండును. |
| (iii) (ధ్రు సం. 10 కి) | 3 నెలలు: ఎడ తెగని చీకటి (దీర్ఘ రాత్రి.)<br>3 నెలలు: రోజులో కొంత చీకటి, కొంత వెలుతురు. (రోజులో వెలుతురు భాగమంత కంత కెక్కువగును.)<br>3 నెలలు: ఎడగతెని సూర్య రశ్మి (దీర్ఘ దివసము.)<br>3 నెలలు: రోజులో కొంత చీకటి, కొంత వెలుతురు. (రోజులో వెలుతురు భాగమంత కంతకు తగ్గును.) | మొత్తము ౯ నెలల సూర్యరశ్మియు, 3 నెలల దీర్ఘ రాత్రి యుండును. |




(ధృవ రేఖకును ; ధృవమునకును మధ్య)

70° ల అక్షాంశవద్ద - ఒక నెల దీర్ఘ రాత్రి యుండును : ఒక నెల దీర్ఘ దివస ముండును. తక్కిన పది నెలలలో రాత్రింబవళ్లు నానారూపములుగ ఎక్కుచు, దిగుచునుండును. అనగ, యిచ్చట రెండురకముల రాత్రింబవళ్ల జంటలు గలవు.

ఇచ్చట ఒక నెల మాత్రము యెడ తెగని చీకటి యుండును. తక్కిన పదునొకండు నెలలలో కొద్దియో గొప్పయో సూర్యరశ్మి యుండును.




75° అక్షాంశవద్ద - రెండునెలల దీర్ఘరాత్రియు, రెండు నెలల దీర్ఘదివసము నుండును. తక్కిన యెనిమిది నెలలలో రాత్రింబవళ్లు ఎక్కుచు, దిగుచు నానారూపములుగ నుండును.

రెండునెలలు ఎడతెగని చీకటి యుండును: తక్కిన పదినెలలలో కొద్దియో గొప్పయో సూర్యరశ్మి యుండును. ఇది "దశగ్వు"లుండు ప్రదేశము.




79° డిగ్రీల అక్షాంశవద్ద: 3 నెలల దీర్ఘరాత్రియు, మూడునెలల దీర్ఘదివసము నుండును. తక్కిన ఆరునెలలలో రాత్రింబవళ్లు నానారూపములుగ నుండును. ( విహూపే )

3 నెలలు ఎడతెగని చీకటి యుండును: తక్కిన తొమ్మిది నెలలలో కొద్దియో గొప్పయో సూర్యరశ్మి యుండును. ఇది "నవగ్వు" లుండు ప్రదేశము.




83° అక్షాంశవద్ద: 4 నెలల దీర్ఘరాత్రియు, 4 నెలల దీర్ఘదివసము నుండును. తక్కిన నాల్గు నెలలలో అహోరాత్రములు నానారూపములుగ నుండును. ఇచ్చట, 4 నెలలు ఎడతెగని చీకటి యుండును. తక్కిన ఎనిమిది నెలలలో కొద్దియో గొప్పయో సూర్యరశ్మి యుండును.



(iv) (బ్లాకు నెం. 11 వి)

- ౪ నెలలు: ఎడతెగని చీకటి (దీర్ఘరాత్రి)
- ౨ నెలలు: రోజులో కొంత చీకటి, కొంత వెలుతురు. (రోజులో వెలుతురు భాగమంత కంత కెక్కువగును.)
- ౪ నెలలు: ఎడతెగని సూర్యరశ్మి (దీర్ఘదివసము.)
- ౨ నెలలు: రోజులో కొంత చీకటి, కొంత వెలుతురు. (రోజులో వెలుతురు భాగమంత కంతకు తగ్గును.)

మొత్తము ౮ నెలల సూర్యరశ్మియు, ౪ నెలల దీర్ఘరాత్రియు నుండును.

(v) (బ్లాకు నెం. 12 వి)

- ౫ నెలలు: ఎడతెగనిచీకటి (దీర్ఘరాత్రి.)
- ౧ నెల: రోజులో కొంత చీకటి, కొంత వెలుతురు. (రోజులో వెలుతురు భాగమంత కంత కెక్కువగును.)
- ౫ నెలలు: ఎగతెగని సూర్యరశ్మి (దీర్ఘదివసము.)
- ౧ నెల: రోజులో కొంత చీకటి, కొంత వెలుతురు. (రోజులో వెలుతురు భాగమంతకంతకు తగ్గును.)

మొత్తము ౭ నెలల సూర్యరశ్మియు, ౫ నెలల దీర్ఘరాత్రియు నుండును.

(IV) కేవలము ఉత్తరధ్రువముమీద:—

౬ నెలల యెడతెగని రాత్రి
( దీర్ఘరాత్రి )
౬ నెలల యెడతెగని సూర్యరశ్మి
( దీర్ఘదివసము. )

యజ్ఞయాగాది క్రతువులు సూర్యరశ్మియున్న మాసములలోనే చేయబడును. సంహితా బ్రాహ్మణములు, (ఆర్యులు ధ్రువమును వదలివేసి) దక్షిణదేశములందు నివాసమొనర్చుకాలములలో వ్రాయబడినవి. ఈకాలములో ఆర్యులకు సూర్యరశ్మి ౧౨ మాసములుండెను. కనుక సంహితా బ్రాహ్మణములందలి సత్రములు ౧౨ మాసములపరిమితి గలవై యున్నవి.

ఉత్తరధ్రువమండలములో సూర్యరశ్మి ౧౨ మాసములుండక కొన్నిప్రదేశములలో ౭ మాసములును, కొన్నిచోట్ల ౮ మాసములును, కొన్నిచోట్ల ౯, ౧౦, ౧౧ మాసములును మాత్రమే యుండునని పైవివరణనుబట్టి తెలియగలదు. కనుక ఒకప్పుడు ఆర్యులు ఉత్తరధ్రువమువద్ద నివసించి యుండుటయే సత్యమైనచో, ప్రాచీనకాలమునాటి సత్రములు ౭ మాసములుగాని, ౮ మాసములుగాని, లేక ౯, ౧౦, ౧౧ మాసములుగాని పరిమితిగలవై యుండవలెను. కనుక పూర్వయుగపుసత్రములకును, తదుపరి సంహితాకాలమునాటి సత్రి




87° అక్షాంశవద్ద: 5 నెలల దీర్ఘరాత్రియు, 5 నెలల దీర్ఘదివసము నుండును: తక్కిన రెండునెలలలో రాత్రింబవళ్లు నానారూపములుగ నుండును.

ఇచ్చట అయిదునెలలు యెడతెగని చీకటి యుండును. తక్కిన యేడుమాసములలో కొద్దియో, గొప్పయో సూర్యరశ్మి యుండును.

"అదితిగాధ" యీ 83°, 87° అక్షాంశ మధ్యనున్న ప్రదేశమందు పుట్టినది.




కేవలము ఉ. ధ్రు. వద్ద : ఒకేజంట :

90° అక్షాంశవద్ద : ( అనగ ధృవము మీద ) ఆరు నెలలు దీర్ఘ రాత్రియు, ఆరు నెలలు దీర్ఘ దివసము నుండును.

ములకును, ఉండవలసిన ముఖ్యభేద మిదియై యుండవలెను. సంహితాకాలమునాటి సత్రములు ద్వాదశ మాసపరిమితి గలవిగను తత్పూర్వయుగమునాటి సత్రములు అంతకంటె తక్కువమాసముల పరిమితిగలవిగను ఉండితీరవలెను. అట్లయినచో ౧౨ మాసములకంటె తక్కువపరిమితిగల సత్రము లేమైన పూర్వయుగమం దుండియున్నట్లు వేదములందు ప్రమాణము లేమైనగలవా ? యని పరిశీలింపవలసి యున్నది.

ఆర్యు లందరును కేవలము ఉత్తరధ్రువముమీదనే కూర్చుండిరని మామతముగాదు. వారు ధ్రువమండలము నందంతటను వ్యాపించియుండిరి. కనుక, ధ్రువమునకు దగ్గిరగ నున్నవారికి మొత్తము ౭ మాసములలో సూర్యరశ్మి యుండును. అంతకంటె దూరమందున్నవారికి ౮ మాసములలో సూర్యరశ్మిగాన్పించును. ఇట్లే ధ్రువమునుండి దూరమైనకొలది ౯, ౧౦, ౧౧ మాసములలో సూర్యరశ్మియుండును. కనుక ధ్రువమునకు దగ్గరనున్నవారి సత్రములు ౭ మాసములపరిమితి గలవైయుండును. అంతకంటె దూరమందున్న వారివి ౮ మాసముల పరిమితి గలిగియుండును. ఇట్లు ధ్రువమును విడిచి దూరముపోయిన కొలదియు ౯ మాసముల యజ్ఞములు చేయువారును (నవగ్వాలు); ౧౦ మాసములయజ్ఞములు చేయువారును (దశగ్వాలు); ౧౧ మాసములయజ్ఞములు చేయువారునుకూడ కనిపించవచ్చును. ఇట్టి పూర్వయుగస్థితిని దెలుపు యీపలు తెరగులగు యజ్ఞముల చిహ్నములు సంహితలయం దేమైనగలవా ?

మొట్టమొదట ౭ మాసముల పరిమితిగల యజ్ఞములనుగూర్చి విచారింతము. ధ్రువమునకు దగ్గరగనున్నచో నచ్చట సంవత్సరములో మొదటి ౫ మాసములు (ఉషస్సుతోసహా) యెడతెగని చీకటియుండును. ౬ వ మాసములో సూర్యుడు క్రమముగ దినములో కొంచెముసేపు కనుపడును. ఈరీతిగ నెల జరుగునప్పటికి సూర్యరశ్మి ప్రతిదినమును యెక్కువగుచుండును. ౭, ౮, ౯, ౧౦, ౧౧ మాసములలో యెడతెగని సూర్యరశ్మి (చీకటియనుమాటయే లేకుండ) ఉండును. ఇదియే దీర్ఘదివసము. పిమ్మట ౧౨ వ నెలలో సూర్యరశ్మిక్రమముగ దినములవరుసను తగ్గిపోయి ౧౨ వ మాసము పూర్తియగునప్పటికి యెడతెగని అంధకారము (దీర్ఘరాత్రి) మరల ప్రవేశించును. కనుక యీప్రదేశమందు సూర్యరశ్మి కనుపించేమాసములు యేడుమాత్రమేనని గ్రహింపవలెను.

ఇట్టి ౭ మాసముల సూర్యరశ్మినిగూర్చి ఋగ్వేదమందు నిదర్శనములు నిలిచియున్నవి. దీనికి "అదితి" (లేకసప్తాదిత్యుల) గాథయే ప్రమాణము. అతిప్రాచీనకాలమందు ఆదిత్యుల (లేకసూర్యుల) సంఖ్య యేడు అని యీగాథ చెప్పుచున్నది. ఈవిషయమే ఋగ్వేదమందు పలుతావులలోగలదు. ఋ IX 114-3 లో యేడుగురు ఆదిత్యులును, యేడుగురు యాజ్ఞికులును చెప్పబడిరి. కాని వానిపేర్లు యిచ్చటలేవు. ఋ II ౨౭, 1 లో మిత్ర, అర్యమన్, భగ, వరుణ, దక్ష,



అంశలను ౬ గురి సూర్యులపేర్లు చెప్పబడినవి. ౭ వ సూర్యుని పేరుచెప్పబడలేదు. దీనిని మనమంతగ పాటింపనక్కరలేదు. ఈసప్తసంఖ్యప్రసిద్ధమే. సూర్యుడు సప్తాశ్వుడని V, 45,9 లో కలదు. ఏడుచక్రములుగల సూర్యరథము యేడుగుర్రములచే లాగబడుచున్నది (I, 50, 8) సూర్యరథము యేడుపేర్లుగల ఒకగుర్రముచేతనే లాగబడుచున్నది. (1, 164, 2) "సూర్యుని ప్రకాశమానములైన యేడుకిరణము"లనుగూర్చి (అథ. VII 107, 1) చెప్పుచున్నది. సూర్యుడు ఆదిత్యుడని ఋగ్వేదము చెప్పిన మాటనే అథర్వవేదముకూడ (XIII, 2, 9) "అదితేః పుత్రః" అని చెప్పుచున్నది.

సూర్యునియొక్క యేడుకిరణములనుబట్టి సూర్యునకీసంఖ్యావాచకనామము వచ్చినదని శాయనాచార్యులవారును యాస్కాచార్యులవారును, చెప్పుచున్నారు. అయితే సూర్యునకు యేడుకిరణములే యుండనేల? దీనియొక్క భావమేమియో యెవరును విప్పిచెప్పలేదు. సూర్యకిరణములో నిమిడియున్న ౭ రంగులును యిటీవలకనిపెట్టబడినవి. ఈరంగులీయాచార్యులకే తెలియవు. కనుక, పూర్వకాలపుటార్యులకు తెలియుననుట మరింతసాహసము. ఒకవేళ యీసమాధానమును ఒప్పుకొన్నను దీనికింకొక బాధయున్నది. ఏమనగ:- (ఋX, 72; 2-3) అదితిగాథలో నేమిచెప్పబడియున్నదనగ:- అదితి తనదేహమునుండి పుట్టిన ౮ మంది కొడుకులలో యెనిమిదవవాడగు మార్తాండుని పారవేసి, తక్కిన యేడుగురి

తోడనే ఆమెదేవతలను సమీపించెను. "అదితి తన యేఁడ్గురి కొడుకులతో పూర్వయుగమందు (పూర్వ్యయుగం) దేవతలను సమీపించెను. ఆమె మార్తాండుని మరల చావుపుట్టుకలకై అక్కడికి తెచ్చెను." ఈగాధ వేదవాఙ్మయమం దనేకచోట్ల చర్చించబడెను. వాని నిట పరిశీలించెదము. దీనికి సహేతుకమైన భావార్థము నెవరును దెలుపలేదు.

అదితి కీయాదిత్యులు పుట్టినవిధము అనేకచోట్ల అనేక విధములుగ చెప్పబడియున్నది.

౧. తై. సం. (VI 5, 6, 1) మొదట అదితి బ్రహ్మౌదనమును వండెను. దానిలో మిగిలినదానిని దేవత లామె కిచ్చిరి. దానివల్ల ఆమెకు ౪ గురు ఆదిత్యులు పుట్టిరి. పిమ్మట రెండవపర్యాయము ఆమె వండి, ఆమెయే తినెను. కాని యిప్పుడుపుట్టిన ఆదిత్యుడు "పరిపక్వముకాని గుడ్డు"గ నుండెను. మూడవపర్యాయము వండుకొని తినగ వివస్వతుడను ఆదిత్యుడు పుట్టెను. తక్కిన ఆదిత్యులనుగూర్చి యీ సంహితయం దేమియు చెప్పబడలేదు.

౨. అయినను యీలోపమును తైత్తిరీయ బ్రాహ్మణము తీర్చుచున్నది. I-1, 9 అదితి నాలుగుపర్యాయములు వండెను. అందులో మిగిలినదానిని దేవత లామె కిచ్చిరి. ఈ నాలుగు పర్యాయములును నాలుగురెండ్లు యెనమండుగురు కొడుకులు అదితికిబుట్టిరి. (ధాత్రి-అర్యమ;) (మిత్రి-వరుణ;) (అంశ-భగ) (ఇంద్రి- వివస్వత;)—అనునీనాలుగు జంటలు



కాని, యెనిమిదవ ఆదిత్యునకు మార్తాండుడనుపే రెట్లు వచ్చెనో, అదితియీమార్తాండుని యేలపారవేసెనో యీ బ్రాహ్మణము చెప్పుటలేదు

3. ఋX, 72, 8-9 లోని ఋక్కులే తైత్తిరీయారణ్యకములోగూడ (I, 13, 2-3) కూడ ఉదాహరింపబడినవి. కాని యీ రెంటికిని కొద్దిభేదమున్నది. "ఆమె మార్తాండుని మరల (త్వత్పునః) చావుపుట్టుకలకై అక్కడికితెచ్చెను" అని ఋగ్వేదమందుండగ ఆమె మార్తాండుని చావుపుట్టుకలకై ప్రత్యేకముగ పెట్టియుంచెను; తత్పరా-అని ఆరణ్యకమందున్నది. పిమ్మట ౮ మంది ఆదిత్యులపేర్లు చెప్పబడినవి. ఈయెనమండుగురిలో మార్తాండు డెవనిపేరో చెప్ప లేదు.

౪. ఈగాధయే తై. ఆ. I, 7, 1-6 లోగలదు. కాని పేర్లుభేదముగనున్నవి. (ఆరోగ, భ్రాజ, పతార, పతంగ, స్వర్ణర, జ్యోతిష్మత, విభాస, కశ్యప) కశ్యపుడను యెనిమిదవ ఆదిత్యుడు సదా మేరుపర్వతశిఖరముపైనుండి ఆప్రదేశము నంతయు వెలిగించుచుండును. తక్కిన ౭ గురు సూర్యులును తమకాంతిని యీకశ్యపునుండియే పొందుదురట. మానవులకు యీ యేఁడ్గురేతప్ప ఆయెనిమిదవ సూర్యుడు కన్పడడట. ఈయేఁడ్గురుసూర్యులనగ మనుష్యునిలోనున్న ౭ ప్రాణములని ఆచార్యుల అభిప్రాయము. ఇవి ౭ తరగతుల ఋత్విజులను తెలుపునని మరికొందరియూహ. ఇక మూడవయూహ యేమనగ:- ఆయా ఋతువులలోగాని, మాసములలోగాని,

సూర్యకిరణములవలనగలుగు శీతోష్ణాదుల భిన్నపరిస్థితులను బట్టి సూర్యుడు యేడువిధములుగ భావింపబడుచున్నాడని మరికొందరు తలంచుచున్నారు. దీనికి ప్రమాణముగ "పలు తావులలో తిరుగుచు సూర్యకిరణములు ఋతువులనుకలిగించు చున్నవి. దిగ్ భ్రాజ ఋతూర్ కరోతి" అను వేద మంత్రము ముదాహరింపబడినది. కాని యీమంత్రము యిప్పు డున్నసంహితలలో నాకెచ్చటను గాన్పించలేదు. అదిగాక శాయనులవారుకూడ యీమంత్రమున్న టైచ్చటను సూచింప లేదు. "ఆయాశీతోష్ణాది ఋతుపరిస్థితులనుబట్టి ఆయా తావులలో పలుతెరగులగు సూర్యులున్నారనిచెప్పవచ్చును" అని మాత్రము శాయనులవారు వ్రాసిరి.

౫. అయితే ఋతులక్షణములును తద్భేదములును పలు తెరగులుగనున్నవి. అట్లయినప్పుడు యెనమండుగురు ఆదిత్యు లేయని ఖండించి యేలచెప్పవలెను? ఈఅభ్యంతరమునకు యీయారణ్యకమేమియు తగిన సమాధానమును చెప్పలేక "యీయెనిమిదిసంఖ్య వేదమందు స్థిరపడిపోయినది." (అప్తేతువ్యవసితః) దానినిగురించి మనమేమియు నిక చర్చింప బనిలేదని నిరంకుశముగ త్రోసివేసిరి.

౬. శతపథ బ్రాహ్మణముగూడ యిట్టిసమాధానమే చెప్పుచున్నది. ౮ గురు ఆదిత్యులలో యేడ్గురే దేవాదిత్యు లట. ఎనిమిదవవాడగు మార్తాండుడు. అపరిపక్వస్థితియందు పుట్టెనట. కాన, దేవతలు దీనినుండి మనుష్యులను, మృగ జాతిని పుట్టించిరట.



౭. ఇంకొకచోట ఆదిత్యులు ౧౨ గురని శతపథ బ్రాహ్మణను చెప్పుచున్నది. ప్రజాపతిచే విడువబడిన ౧౨ బిందువులనుండి వీరు పుట్టిరట, వీరిని ౧౨ దిశలలోనుంచిరట.

౮. ఇంకొకచోట, యీ ౧౨ గురు ఆదిత్యులును సం వత్సరములో వచ్చు ౧౨ మాసములేయని చెప్పబడియున్నది.

౯. ఆదిత్యులు ౧౨ గురని ఉపనిషత్తులు చెప్పు చున్నవి. వేదవాఙ్మయమున కిటీవలివాఙ్మయమం దెల్లయెడ లను ఆదిత్యుల సంఖ్య ౧౨ గనే యున్నది. ఈ ౧౨ సంఖ్య సూర్యరశ్మిగల దక్షిణభాగములందలి ౧౨ మాసములకు సరిపోవుచున్నది. పాశ్చాత్యవ్యాఖ్యాతలుగూడ యీ సంఖ్య లనుగూర్చిగాని వీనిభావములనుగూర్చిగాని సరియైన సమా ధానమును చెప్పలేదు.

అదితిగాథను గూర్చియు, ఆదిత్యుల సంఖ్యను గూర్చియు వేదవాఙ్మయమందున్న అనేక చర్చలను గూర్చి యిట క్లుప్తముగ వివరించితిమి. కాని దీని కీలక మెవరికిని చిక్కలేదు. అందుచే పలువురు, పలుపోకలబోయిరి. కాని దీని నిజకీలకమును పట్టుకొన్నచో యీగాథకు సరియైన భావార్థము కుదురగలదు. అదేదనగ:- ఇటీవలి వేదవాఙ్మయ మందు ౧౨గురు ఆదిత్యులును ౧౨ మాసముల కధిష్ఠానదేవత లుగ పరిగణింపబడిరను మాట నిర్వివాదము. దీనికి శతపథ బ్రాహ్మణము X. I. 6-3; 8; బృ. ఆ. ఉ. III, 9, 5- ప్రమాణములు. "సంవత్సరములో ౧౨ మాసము లున్నవి.

వీరే ౧౨ గురు ఆదిత్యులు. ఈయుగమందు ౧౨ గురు ఆదిత్యులు సంవత్సరములో ౧౨ మాసములకు అధిష్ఠానదేవతలైనప్పుడు, పూర్వయుగమందు (పూర్వ్యంయుగం) ౭ గురు ఆదిత్యులు సంవత్సరములో ౭ మాసములకు అధిష్ఠానదేవతలని చెప్పుటలో కష్టమేమున్నది? కాని యీ యూహ యెవరికిని తట్టలేదు. కారణమేమనగ; ఆర్యులు మధ్యాశియాయందుండిరనియే వీరి భ్రమ.

ఇదిగాక ఋతు, మాస భేదములు భిన్న సూర్యులచేతనే గలుగుచున్నవను ప్రధానాంశము తైత్తిరీయారణ్యకమందే ఖండితముగ గ్రహింపబడు నెంతయు సంతృప్తికరముగనున్నది. ౭ సంఖ్య యేల వచ్చెనో యీయారణ్యకము చెప్పకపోయినను యీ భావముమాత్రము సరియైనదే. దీనిని బలపరుచుటకు ఋ IX. 114, 3 లో, "సప్తదిశలు గలవు; ఇందు నానాసూర్యులు గలరు; ఏడ్గురు హోతృలు గలరు; వీరే యేడ్గురు ఆదిత్యులు; — ఓసోమా! వీరితో మమ్ము రక్షింపుము." ఇచ్చట "నానాసూర్యాః" అనుపదము "దిశః సప్త" అనుపదమును వర్ణించు విశేషణమై యున్నది. ఏడు దిశలును, అందుండు యేడుసూర్యులును, యిచట స్పష్టముగ వివరింపబడియున్నది.

కనుక, అదితిగాధకు సరియైన భావార్థము చక్కగ కుదురుచున్నది. అదితి తనకొడుకులైన యేడ్గురు ఆదిత్యులను (సూర్యులను) ఆకాశముమీదికి తీసికొనివచ్చి దేవతలకు



అర్పించెను. దీనివలన, ఆస్థలమందు ౭ మాసముల సూర్యరశ్మియుండెను. ఆమెకు ఎనిమిదవ కుమారుడుండెను. కాని అతడు పరిపక్వస్థితియందు పుట్టలేదు. అనగ ఆస్థలమందు ౮ వ మాసము సూర్యరశ్మిగలమాసము కాదని భావము. అనగ ఆస్థలమందు దీర్ఘరాత్రి ౮ వ మాసములో ప్రారంభమయ్యెనని భావము. ఇదంతయు జరిగినదెప్పుడు? ఈయుగమందుకాదు; పూర్వయుగమందు (పూర్వ్యంయుగం) ఋ X, 72-9 లోనున్న "పూర్వ్యంయుగం" అనుమాటలు చాల భావగర్భితమైనవి. ఇదేరీతిగ సూర్యుని యేడుకిరణములు, యేడుగుర్రములు, మొదలగు వర్ణనలన్నియు సులభగ్రాహ్యముకాగలవు. ఒకభావమే యిన్నివిధములుగ వర్ణింపబడినది. ఉషస్సు యెడతెగకుండ మాసముదినము లున్నచోట సూర్యరశ్మి ౭ మాసములయందే యుండును. తక్కిన ౫ మాసములును దీర్ఘరాత్రియే. ఏడుమాసములు సూర్యరశ్మియుండి, ౮ వ మాసమందు దీర్ఘరాత్రి ప్రవేశించుస్థలమునే (      ) యీఅదితి గాధ తెలియపగుచుచున్నది. ఇంకొకవిధమైనచో దీనికి సరళమైన భావార్థము కుదురనేకుదురదు. ౮ వ సూర్యునకు మార్తాండుడను పేరేట్లువచ్చెనో చూతము. మార్త = చచ్చిన, లేకపక్వముగాని; అండ = గ్రుడ్డు, లేకపక్షి; సూర్యుడు పక్షిగ అనేకచోట్ల ఋగ్వేదము చెప్పియున్నది. అదిగాక సూర్యుని అస్తమయమునకు "మమార" = చనిపోవుట అని ఋగ్వేదము చెప్పుచున్నది. కనుక మార్తాండ=

చనిపోయినపక్షి = చనిపోయిన లేక అస్తమించిన సూర్యుడు అనిఅర్థము. కనుక యెనిమిదవసూర్యుడు చనిపోయెను అనగా ఆప్రదేశమందు సూర్యుడు యెనిమిదవమాసములో క్షితిజము క్రిందికి అస్తమించిపోయెనని భావము అనగా యెనిమిదవనెల చీకటినెల అని యర్థము. ఇట్టి విచిత్రమగు ప్రకృతిలక్షణము ప్రజలమనస్సునుండి త్వరగా మాసిపోజాలదు. కనుక ఆర్యులు తదుపరి దక్షిణదేశములకు వచ్చినను ఈపురాతన ప్రకృతి లక్షణమును వారు తమ గ్రంథములందు పూర్వయుగలక్షణముగ నిలుపుకొని యున్నారు.

ధ్రువమండలమందు 7 మాసములు సూర్యరశ్మి గల ప్రదేశములేగాక, 8, 9, 10, 11 మాసములు సూర్యరశ్మి గల ప్రదేశములుకూడగలవని పైన వివరించితిమి. అయితే వీనినిగూర్చికూడ పురాతనగాథలుగాని నిదర్శనములుగాని యేమైన వేదవాఙ్మయమందు నిలిచియున్నవా. మన అదృష్ట వశాత్తు ఇట్టి నిదర్శనములు ఋగ్వేదమందుగలవు. వానినిక పరిశీలింతము.

(1) సూర్యుని గుర్రములు యేడు ( I–50–8 ) అని మాత్రమేగాక పది ( IX–63–9 ) అనికూడ ఋగ్వేదము చెప్పుచున్నది. కనుక మొదటివాక్యమునకు యేడునెలల సూర్యరశ్మి అని అర్థమైనప్పుడు రెండవదానికికూడ పది మాసములసూర్యరశ్మి యనియే అర్థము చెప్పకతప్పదు. కాని మన సిద్ధాంతమంతయు ఈఒక్కచిన్నవాక్యముపైననే ఆధార



పడవలసిన అవసరములేదు. ఇంతకంటె బలవత్తరమైన ప్రమాణము కర్మకాండయందు మనకు దొరుకుచున్నది.

(2) ఋగ్వేదమందు పలుతావులలో పలుతెరగులగు "ప్రాచీనయాజ్ఞికులు"వర్ణింపబడిరి. వీరుమనపితరులు(నఃపితరః) అనియు,మనపురాతనపితరులు (నఃపూర్వేపితరః)అనియుఋగ్వేదము వర్ణించినది.వీరు పూర్వకాలమందు యజ్ఞముల నేర్పాటు చేసి, వానిని నడిపించుపద్ధతులను, రీతులను, నిర్మాణము చేసి యుండిరి. మానవులీపద్ధతులను సదా అనుసరించుచు యజ్ఞములను చేయుచుండవలసినదని వారు నియమించిరి. అనేకులనేకపద్ధతుల నవల నేర్పరచిరి. ఈయజ్ఞవిధాననిర్మాతలలో "మనువు" ఒకడైయున్నాడు. ఋ I. 76,7 లో మనువుచే నిర్మింపబడిన యజ్ఞపద్ధతి తక్కినవారొనర్చినపద్ధతులతో పోల్చబడెను. ఈమనువేగాక యితనితోపాటు అంగిరస, యయాతి అనువారుకూడ I. 31,17 లో ప్రాచీనయాజ్ఞికులుగ చెప్పబడిరి. VIII. 43, 13 లో భృగు, అంగిరసులును, I. 80, 16 లో అథర్వన్, దధ్యంచ అనువారును, I. 139, 9 లో దధ్యంచ, అంగిరస, అత్రి, కణ్వ అనువారును చెప్పబడిరి. I. 83, 5 లో అథర్వణుడు తన యజ్ఞముచేత మార్గమును విశాలము చేసెననియు, అంతట సూర్యుడు ఉదయించెననియు చెప్పబడియున్నది. అదిగాక, X. 14, 6 లో అథర్వణులు, అంగిరసులు, నవగ్వులు, భృగులు అని బహువచనములుగ కొందరు మన పితరులు (నఃపితరః) అని ఉదా

హారింపబడిరి. ఇంకను II. 34, 12 లో దశగ్వులు వర్ణింపబడిరి. భృగులు తమ శక్తిచే దేవతలైపోయినప్పుడు అధర్వణుడు తన యజ్ఞములచే శాంతిని నిలిపెనని X. 92, 10 లో గలదు.

శబ్దసాదృశ్యమునుబట్టి అధర్వణపదము "అథ్రవాన్" (అగ్నినికాపాడుయాజ్ఞికుడు) అను పార్శీపదముతో సరిపోవుచున్నది. అంగిరసపదము "అగ్గిలాస్=దూత" అను గ్రీకుపదముతోడను, "అంగర = రౌతు" అను పారశీపదముతోడను సరిపోవుచున్నది. దీనినిబట్టి అంగిరస, అధర్వణులు ఒక్కభారతీయులకే గాక, గ్రీకు, పారశీకాది సమస్త ఆర్యజాతులకుకూడ పూర్వపితరులని యూహింపవచ్చును. దీనినిబట్టి మనకు తెలియుచున్న సారాంశమేమనగ, ఆర్యసంతతులన్నియు ఉత్తరధ్రువమండలమందున్నకాలములో మను, అధర్వణ, అంగిరసాది కుటుంబములవారు యజ్ఞములను, వానిని నడిపించుపద్ధతులను యేర్పాటుచేసియుండిరి. పిమ్మట చాలకాలమునకు ఆర్యసంతతులు ధ్రువమండలమును వదలి దక్షిణదేశములకు వచ్చి అనేకశాఖలుగ చీలిపోయిరి. వీనిలో ఒకశాఖవారు దక్షిణదేశములకు వచ్చినకొంతకాలమునకు ఋగ్వేదమును రచించిరి. అప్పటికీయజ్ఞపద్ధతులను మొదటనిర్మించిన మను, అంగిరసాదిపురాతన కుటుంబములు పితృదేవతలుగను, దేవతలుగను భావింపబడిరి. ఆర్యసంతతియందు మొట్టమొదట యజ్ఞములను యేర్పాటుచేసి నడిపించినది యీకుటుంబముల



వారేయని ఋగ్వేదమందు పలుతావులలో వర్ణింపబడిరి. కనుక వీరును మొట్టమొదట మానవులే. పిమ్మట కాలము గడచినకొలదియు, వారు దేవతలుగ భావింపబడిరన్నచో ఆశ్చర్యములేదు. ఇప్పుడు మనము పరిశీలింపవలసిన యంశమేమనగ:- మొట్టమొదట ఆర్యసంతతులన్నియు కలిసి ఉత్తరధ్రువమండలములో నున్నప్పుడు మను, అంగిరసాది యజ్ఞనిర్మాత లేర్పరచిన యజ్ఞములయొక్క కాలపరిమితిని దెలుపునిదర్శనములేమైన మనకు ఋగ్వేదమందు దొరుకునా? దొరికినచో అవి మనధ్రువసిద్ధాంతము నేమైన బలపరచునా? ఇది విచారణీయాంశము.

అంగిరసకుటుంబమువా రేర్పరచిన యజ్ఞములయొక్క కాలపరిమితినిగూర్చి వేదవాఙ్మయమందు నాకు కొంత ఆధారము దొరికినది. తక్కినమను, అధర్వణ, భృగుమొదలగువారేర్పరచిన యజ్ఞకాలపరిమితినిగూర్చి యే వేదమందును నాకు ప్రమాణములు దొరకలేదు. కనుక యిప్పు డీఅంగిరసులనుగూర్చి విచారింతము.

శ్రౌతసూత్రములందు "అంగిరసాం అయనం" అను వార్షికసత్రమొకటి వర్ణింపబడినది. కాని దీని కాలపరిమితిమాత్ర మచ్చట ఖండితముగ చెప్పబడలేదు. అయినను, యీకాలపరిమితిని నిర్ణయించుటకు ఋగ్వేదమందే మనకితర సాధనములు గలవు. అంగిరసకుటుంబమందే రెండు ప్రధాన తెగలు (అంగిరస్ తమ) గలవు. వారికి నవగ్వులు,

దశగ్వులు అనిపేరు. వీరుకూడ మన పూర్వపితరులే, (నః పూర్వే పితరః) అని ఋగ్వేదము చెప్పుచున్నది. వీరు "వలా" యను అసురుని సంహరించుటలో యింద్రునకు చాల సహాయముచేసిరని వర్ణింపబడియున్నది. వీరు తమ గానముచే యింద్రునకు ప్రోత్సాహముగలిగించి, కొట్టమును, పగులగొట్టి ఆవులను విడిపించిరట. వీరియొక్క యజ్ఞకాలపరిమితిని నిర్ణయించుటకు రెండుఋక్కులేగలవు. ఋ V, 45, 7లో – "అనూనోదత్రహస్తయతో అద్రిరార్చన్ యేన దశమాసో నవగ్వాః" నవగ్వులు పదినెలలు పాడిరి (అర్చించిరి). మరియు ఋ V, 45, 11 లో– "ధియంవో అప్సు దధిషే స్వర్షాం యయాతరన్ దశమాసో నవగ్వాః" "వెలుతురును సంపాదింపగల మీప్రార్థనలను నేను నీటిపైయుంచుచున్నాను. (అర్పించుచున్నాను.) ఈప్రార్థనలతో నవగ్వులు తమ పదినెలలను పూర్తిచేసిరి. ఇదిగాక, ఋ II, 34, 12 లో – "వారు (అనగ దశగ్వులు) అందరికంటె ముందుగ బలులనర్పించిరి. వారు ఉషస్సు ప్రకాశించుసమయమందు మమ్మనుగ్రహింతురుగాక". మరియు ఋ IV, 51, 4 లో "కువిత్స దేవీః సనయో నవోవా యామో బభూయా దుషసో వోఽద్య యేనానవగ్వే అంగిరే దశగ్వే సప్తాస్యే రేవతి రేవదూష॥ "నవగ్వ అంగిరసులపైనను, సప్తాస్యులగు దశగ్వులపైనను, ఉషస్సులు విరివిగ వికసించెను." అనగ వీరి యజ్ఞములకు ఉషసోదయముతో సంబంధముగలదనియు, అవి



పదిమాసములపరిమితి గలవనియు, దీనివలన తెలియుచున్నది. వీరు తమ యజ్ఞములవలన చేసిన మహత్కార్యములు వర్ణింపబడినవి. వీరు తమ యజ్ఞములచే కొట్టమును పగులగొట్టి ఆవులను విడిపించిరి. ఋ III. 39, 5 – "సఖాహ యత్ర సఖిభిర్నవగ్వై రభిజ్ఞ్వా సత్వభి ర్గా అనుగ్మన్। సత్యంతదింద్రో దశభిర్దశగ్వైః సూర్యం వివేద తమసి క్షియంతం॥ వీరి సహాయముతో ఇంద్రుడు ఆవులవెంట వెదకికొనుచు పోగా సూర్యుడచ్చట చీకటియందు పడియుండెను. (తమసి క్షియంతం) ఋ X. 62,2–3 లో అంగిరసులే (అనగ, నవగ్వ దశగ్వులే) తమంతటతామేపోయి "వలా" ను సంహరించి, సంవత్సరాంతమందు ఆవులను విడిపించి, సూర్యుని బయటికి తీసికొని వచ్చిరి. (పరివత్సరే వలం అభిందన్.)

ఈ యంశము లన్నియు క్రోడీకరింపగ ౪ సారాంశములు తేలుచున్నవి. (౧) సవగ్వ దశగ్వులు తమ యజ్ఞములను పదినెలలలో పూర్తిచేసిరి. (౨) ఈ యజ్ఞములకును ఉషసోదయమునకును సంబంధము కలదు. (౩) సంవత్సరాంతమందు వలను సంహరించి ఆవులను విడిపించు పనిలో వీరు యింద్రునకు తోడ్పడిరి. (౪) ఆవులను విడిపించుకొనివచ్చుటకై యింద్రుడు పోయినస్థలమందు సూర్యుడు చీకటియందు వసించియున్నాడు.

ఈనాలుగు సారాంశములను విపులముగ పరిశీలింతము. అంగిరసులు తమ యజ్ఞములను పదినెలలలో (దశ

మాసా॥) పూర్తిచేసిరి. అనగ, అర్థమేమి ? పదినెలలలోనే యేలముగించిరి. ౧౨ నెల లెందుకు చేయలేదు. నవగ్వులు ఆవులను (సూర్యకిరణములను) విడిపించుటకై యింద్రునకు తోడ్పడిరనియు, వారు సంవత్సరాంతమందు 'వల'ను సంహరించి సూర్యుని ఆకాశముపైకెత్తిరనియు ఋగ్వేదము చెప్పుచున్నది. ఈపని ప్రతిసంవత్సరము జరుగుపనియని స్పష్టపడుచున్నది. ఇదిగాక, యింద్రునిచే విడిపింపబడుటకు పూర్వము సూర్యుడు చీకటిలో పడియుండెనట.— అనగ మానవులకు కనుబడకుండ క్షితిజముక్రిందికి అస్తమించి (కుంకి) పోయెనని భావము. ఇట్లువలయను రాక్షసునిచే చీకటిలో బంధింపబడిన సూర్యుని విడిపించుటకై యింద్రుడు పోయి వలను సంహరించెను. పిమ్మట సూర్యుని విడిపించెను. ఈకార్యమందు ఆంగిరసులు తమ యజ్ఞముచేతను, గానములచేతను, యింద్రునకు తోడ్పడిరి. ఈయజ్ఞములు పదిమాసముల పొడవునను చేయబడెను. అయితే, యీయజ్ఞములు యింద్రునకును వలకును యుద్ధము జరుగుచున్నకాలమందు చేయబడెనేమోయని కొందరు తలంపవచ్చును. కాని, యిదిసరియైన యూహకాదు. ఇదియే సరియైనయూహయైనచో చీకటి యెడతెగక పదినెల లున్నదని చెప్పవలెను. ఇది యేప్రదేశమందునుకూడ సాధ్యముకానేరదు. ఈ యజ్ఞములు యుద్ధమునకు పూర్వము సూర్యరశ్మియున్న పదినెలలయందే చేయబడెను. ఈ అంగిరసులు నివసించియున్న ప్రదేశమందు



సూర్యరశ్మి ౧౨ నెలలే యుండియున్నచో వీరు తమయజ్ఞములను ౧౦ నెలలలోనే ముగింపవలసిన యావశ్యకతలేదు. ఈపదిమాసములైనపిమ్మట సూర్యుడు వలయనురాక్షసునిచే గొనిపోబడి 'చీకటియందు బంధింపబడెను.' కాని యీపది నెలలయజ్ఞములలో ఆంగిరసు లర్పించిన సోమరసముచేతను, హవిర్భాగములచేతను ప్రోత్సహింపబడినవాడై, యింద్రుడు వలమీదికి దండెత్తిపోయి, అతని సంహరించి, సంవత్సరాంతమందు తిరిగి సూర్యుని విడిపించెను. అంతటితోమరల సూర్యరశ్మి వచ్చెను.

ఈ గాథయొక్క భావార్థ మిప్పుడు కరతలామలకమగుచునేయున్నది. నవగ్వదశగ్వాది ఆంగిరసులును, తక్కిన ప్రాచీనయాజ్ఞికులును నివసించినస్థలమందు సంవత్సరములో పదిమాసములు సూర్యరశ్మియుండెననియు, తక్కిన రెండు మాసములలో యెడతెగనిచీకటియుండెననియుస్థిరపడుచున్నది. ఇది ఉత్తరధ్రువమండలమందేసాధ్యమగునుగానియింకొకచోట గాదు. సూర్యరశ్మియున్న యీపదిమాసములందే వారు యజ్ఞములజేయుచుండిరి. కనుక, వారి యజ్ఞములయొక్క కాలపరిమితి పదిమాసములుగనుండెను.

ఇక 'నవగ్వ' 'దశగ్వ' యను పదములయొక్క శబ్దార్థమును విచారింతము. 'గ్వ' యను పదమునకు "నవ, దశ" యను పదములు చేర్చుటచే నవగ్వ, దశగ్వ పదములేర్పడుచున్నవి. 'నవ' అనగ "క్రొత్త" లేక "రమ్యమైన"

యనియు గ్వ = అనగ పోవుటయనియు శాయనులవారు చెప్పిరి. కనుక “ నవగ్వ ” అనగ రమ్యముగపోవుచున్న వారు= రమ్యమైన జీవితముగలవారు అని శాయనులవారి అర్థము. అయితే, “ దశ ” అనగ పదియనియే తప్ప తేరుఅర్థము చెప్పుటకు వీలులేదు. నవగ్వ, దశగ్వ పదములు ఋగ్వేదమం దెల్ల యెడలను జంటగ కలిపియే చెప్పబడుచున్నవి. ఈరెండును విడదీసి చెప్పబడలేదు. కనుక, వీనిభావ మొకటియేయై యుండవలెను. కనుక, ‘ దశ ’ పదము సంఖ్యావాచక మైనప్పుడు, ‘ నవ ’ పదముకూడ సంఖ్యావాచకమే యైయుండ వలెను.

ఇక “ గ్వ ” అనగ అర్థమేమి ? దీనికి రెండర్థములు చెప్పబడినవి. గ్వ అనగ = ‘ గో ’ (గోవు); లేక ‘ గం ’ (పోవుట) అనుఅర్థములు వచ్చును. దీనినిబట్టి నవగ్వ, దశగ్వ పదములకు “ తొమ్మిది గోవులయొక్క ” “పదిగోవులయొక్క” అనిగాని, లేక “ తొమ్మిదిగపోవు, ” “ పదిగపోవు” అనిగాని రెండువిధములుగ అర్థమువచ్చును. దశగ్వులు పదిమందిగలరని ఋ III. 39, 5 చెప్పుటచే రెండవ యర్థమే బలపడుచున్నది. అయినను, యీ నవగ్వ, దశగ్వపదములు యేకవచననామ వాచకములను వర్ణించుటకై యేకవచనమందే విశేషణము లుగ చాలచోట్ల ప్రయోగింపబడియున్నవి. అందుచే నవగ్వ, దశగ్వ లనగ తొమ్మిది, పదిమందిగలిగిన సమూహామే యని ప్రతిచోటను నిర్థారణగ చెప్పుటకు వీలులేకున్నది. ఉదా:- అగ్నికిరణములు ‘ నవగ్వము ’ లని చెప్పబడినవి. (VI. 6, 3.)



మరియు, “ అధ్రిగు ” అను నాతడు ‘ దశగ్వు ’ డని VIII. 12-2 నందును, ‘ దధ్యంచ ’ అను నాతడు ‘ నవగ్వు ’ డని IX. 108-4- నందును చెప్పబడియున్నది. కనుక మన మీ సంఖ్యావాచకపదములకు ఇంకొక సరళమైన యర్థమును చెప్పుకొనవలసియున్నది. అదేదనగ:- శాయనులవారు తమ ఋగ్వేదభాష్యమందు I. 62, 4 నకు వ్యాఖ్య వ్రాయుచు నిట్లు వ్రాసిరి. “ ఆంగిరసులలో నవగ్వులనియు, దశగ్వులనియు రెండు తెగలు గలవు. నవగ్వులనగ సత్రమును (అనగ యజ్ఞ మును) తొమ్మిదినెలలలో పూర్తిచేసి లేచువారు; దశగ్వు లనగ సత్రమును (అనగ యజ్ఞమును) పదినెలలలో పూర్తిచేసి లేచువారు. [అంగిరసో ద్వివిధాః । సత్రయాగమనుతిష్ఠన్తోయే నవభిర్మాసైః సమాప్య గతా స్తే నవగ్వాః ।...... ‘ నవగ్వా నవనీతగతయ ’ ఇతి యాస్కోవ్యాచఖ్యౌ। యేతు దశభిర్మాసైః సమాప్య జగ్ము స్తే దశగ్వాః] మరియు X. 62,6 కు వ్యాఖ్య వ్రాయుచు శాయనులవా రిట్లు చెప్పుచున్నారు:- సత్రి మాసీ నానా మంగిరసాం మధ్యే కేచన నవసు మాస్సు కర్మకృత్వో దతిష్ఠ కేచన దశసు మాస్స్వతి । ఏవ మంగిరసా మయన ముక్తమ్ । తేషా మగ్ని ర్నవగ్వశ్చ దశగ్వ శ్శ్రేష్ఠః ॥ ఋ V,45,7-11 లలో నవగ్వులును దశగ్వులును తమ సత్రి ములను పదినెలలలో పూర్తిచేసిరని చెప్పబడియున్నది. కనుక, యీఋక్కునుబట్టి శాయనులవారిభావము సరియైన దని స్పష్టముగ ఋజువగుచున్నది. తక్కిన వారందరు చెప్పిన

దానికంటె శాయనులవారు చెప్పినయర్థమే అంగీకార్య మైనది. అయితే మన మిట యింకొకయంశమును గుర్తించ వలెను. ఋ V, 47, 7 - 11 లలో నవగ్వ దశగ్వు లిరువురి విషయములోను పదిమాసముల పరిమితిగల సత్రమే చెప్పబడియున్నదిగాని, నవగ్వులకై ప్రత్యేకించి తొమ్మిది మాసముల సత్రము చెప్పబడలేదనుట నిజమే. అయినను, యీశబ్దముల యుత్పత్తినిబట్టి నవగ్వులనగ తొమ్మిదిమాసముల యజ్ఞమును చేసినవారనియు, దశగ్వులనగ పదిమాసముల యజ్ఞమును చేసినవారనియు సాహసించి చెప్పవచ్చును. ఇచ్చట సంఖ్యాభేదమేతప్ప విశేష మేమియు లేదుగాన దశగ్వులు పదిమాసములలో చేసినపనినే నవగ్వులు తొమ్మిది మాసములలో చేసిరనుటలో ప్రత్యేకమైన తాత్పర్య భేద మేమియులేదు. సారాంశ మొక్కటియే; ప్రధానవిషయ మొక్కటే.

మన సిద్ధాంతమును, బలపరుచు నిదర్శనమింకొకటి గలదు. అంగిరసులు "విరూపు" లని ఋ III, 53-7 లో చెప్పబడినది. మరియొకచోట విరూప, అంగిరసశబ్దములు సమానార్థకములుగ ప్రయోగింపబడినవి. ఇదిగాక, ఋ X, 62, 5-6 యే అగ్నేః పరిజజ్ఞిరే విరూపాసో దివస్పరి నవగ్వోను దశగ్వో అంగిరస్తమః సచాదేవేషు సంహతే॥ అంగిరసులు విరూపులనియు, వారు అగ్నినుండి (ఆకాశము నుండి) పుట్టిరనియు వర్ణనగలదు. మరియు వీరిలో నవగ్వదశ



గ్వులు ఉత్తములనియు (అంగిరస్తమ,) దేవసభలోవన్నె కెక్కినవారనియు వర్ణనగలదు. ఈ ఋక్కులు రెండును మనకు చాలముఖ్యమైనవి. ఇచ్చట విరూపశబ్దము విశేషణముగ ప్రయోగింపబడినది. విరూప అనగ అనేకరూపులు గల అని అర్థము. కనుక అంగిరసులలో అనేకతెగలు (విరూపములు) గలవనియు, ఆ తెగలలో యీ నవగ్వదశగ్వతెగలు ప్రధానమైనవనియు (అంగిరస్తమ) దీనివలన తెలియుచున్నది. విరూపశబ్దము క్రిందటి యధ్యాయములోకూడ రాత్రింబవళ్ళ జంటకు విశేషణముగ ప్రయోగింపబడినది. అది ఆ యధ్యాయమందు రాత్రింబవళ్ళ జంటయొక్క పలుతెరగులగు కాల పరిమితులను దెలుపుచున్నదని స్థిరపరచితిమి. ఇప్పుడిచ్చట కూడ యీ యర్థమే వివక్షితమగుచున్నది. అంగిరసులు చేయు యజ్ఞయు ౯, ౧౦ మాసములపరిమితిగలవేగాక, యింకను అంతకు తక్కువగాని యెక్కువగాని మాసములపరిమితి గల వనికూడ దీనినిబట్టి తెలియుచున్నది. అంగిరసులలో ౭,౮,౯, ౧౦, ౧౧ మాసములు యజ్ఞములుచేయు పలుతెరగులవారు (విరూపులు) గలరు. అయినను వీరిలో ౯, ౧౦ మాసముల యజ్ఞములుచేయు నవగ్వదశగ్వులుమాత్రము ప్రధానులు (అంగిరస్తమః). దీనినిబలపరుచుటకు ఋX,47-6లో నొకానొక "సప్తగ్వు"డు పేర్కొనబడియున్నాడు. ఇతనితోపాటు అంగిరసపుత్రుడగు బృహస్పతియు పేర్కొనబడెను. సప్త గ్వుపదమిచ్చట బృహస్పతిని వర్ణించువిశేషణముగా ప్రయో

గింపబడినది. మరియొకచోట బృహస్పతి సప్తాస్యుడనియు, (అధ. వే. IV, 5, 1) లో దశాస్యుడనియు వర్ణింపబడెను. ఋ IV, 51, 4 లో దశగ్వుడు సప్తాస్యుడనియుకూడ వర్ణింపబడినట్లు పైన నుదహరించియుంటిమి.

దీనినిబట్టి అంగిరసులలో చాలతెగలుగలవనియు, వారు ధ్రువమండలమందంతటను వ్యాపించియుండిరనియు ఒక్కొక్క తెగవారు తాము నివసించియున్న ప్రదేశమందు సూర్యరశ్మి యెన్నిమాసములుండునో అన్నిమాసములలోనే తమ యజ్ఞములను పూర్తిచేయుచుండిరనియు దీనివలన విదితమగుచున్నది. ఈసిద్ధాంతముపైననే తప్ప యింకొకరీతిగ యీపదముల కన్నిటికిని యేకవాక్యతను చేకూర్చుటకు సాధ్యముకాదు. పూర్వపు యజ్ఞములు సాధారణముగ ౭ మొదలు ౧౦ మాసముల పరిమితిగలవైయుండెడివి. యజ్ఞమెన్నిమాసములు పట్టునో అందరు హోతృలుండిరి. వీరు నెలకొకరుచొప్పున యజ్ఞమును నిర్వహించుచుండిరి. సూర్యరశ్మి పూర్తిగపోయి, దీర్ఘరాత్రి ప్రవేశించుటతోడనే యజ్ఞములు సమాప్తమయ్యెడివి. ఈదీర్ఘరాత్రియందు యింద్రునకును, 'వల' కును, యుద్ధముజరుగును. ఈయుద్ధమందు యింద్రుడు 'వల' ను ఓడించి, సంవత్సరాంతమందు (పరివత్సరే) సూర్యుని విడిపించును. "పరివత్సరే యను పదము చాలముఖ్యమైనది. ఏల యనగ దీర్ఘరాత్రి అంతమొందగనే ప్రాతసంవత్సరముకూడ సమాప్తమై క్రొత్తసంవత్సరము ప్రారంభమయ్యెడిదని భావము.



పదిమాసముల సూర్యరశ్మినిగూర్చి తెలుపు నిదర్శన మింకొకటి "దీర్ఘతమస్సు" కథలో గానవచ్చుచున్నది. అంధుడును, అశక్తుడునునై గోతిలోపడిపోయిన దీర్ఘతమస్సును నతని అశ్వినీదేవతలు రక్షించిరని యీకథయొక్క సారాంశము. ఈకథ భారతమందును, ఋగ్వేదమందును గలదు. భారతమందున్నకథ యేమనగ:- (ఆదిపర్వము 104 అధ్యా.) 'ఉతత్యుని'వలన 'మమతా'యందు "దీర్ఘతముడు"పుట్టెను. ఇతడు బృహస్పతి శాపమువలన పుట్టంధు డయ్యెను. ఐనను, యితడు 'ప్రద్వేషి'యను భార్యను వివాహమై ఆమెయందు పెక్కండ్ర కొడుకుల బడసెను. ఇతడు గ్రుడ్డివాడగుటచే యితని భార్యయు పుత్రులును విసుగుజెంది, ఇతని నొక తెప్ప మీద కూర్చుండబెట్టి గంగలో వదలివేసిరి. కొంతదూరమిట్లు కొట్టుకొనిపోగా, "బలి" యను రాజితని రక్షించి, తన యింటికి తీసికొనిపోయెను. ఆరాజుకు సంతానము లేమిచే, ఆతడిమ్మహాత్మునివలన తన భార్యయందు సంతతిని బడసెను. ఈసంతతియే పెక్కుదేశములకు రాజులైరి.

ఋగ్వేదమందుకూడ యీకథయే కొద్దిమార్పులతో గలదు. దీర్ఘతముడు మామతేయుడనియు, ఉతత్యుడనియు గలదు. (అనగ ఉతత్యునివలన మమతాయందు పుట్టెనని యర్థము.) దీర్ఘతముడు "దాసత్రైతన" వలన అగ్నియందును నీటియందును ముంచబడి బాధపడుచు, తన్ను రక్షింప వలసినదని అశ్వినీదేవతలను వేడికొనెను. అంతట అగ్ని వచ్చి

దీర్ఘతమునకు నేత్రదృష్టి నిచ్చెను. (ఒక దేవత చేసినపనిని యింకొక దేవత కంటగట్టుట ఋగ్వేదమందు సహజమే). అనగ, అశ్వినీదేవతలు దీర్ఘతముని రక్షించిరని అర్థము. ఈ కథయంతయు ఋగ్వేదము మొదటి మండలమందు అగ్ని సూక్తములలో వర్ణింపబడినది. ఈరీతిగ, అశ్వినులచే ఒక్క దీర్ఘతముడేగాక చ్యవనుడు,వందనుడు మొదలగువారనేకులు రక్షింపబడిరి; ఆరోగ్యవంతులుగ జేయబడిరి. ఈకథల కన్నిటికిని తాత్పర్యమేమి ? శీతకాలమందు చిక్కిపోయిన సూర్యుడు తిరిగి తేజోవంతుడగుటయే యీకథలయొక్క భావార్థమని పండితులు తలంచుచున్నారు. కాని యీగాథలలో కొన్నిచోట్ల "చీకటిలో పడియున్న సూర్యునివలె" అను వర్ణనలు గలవు. కనుక, యీకథలలో శీతకాలమందు హీనతేజుడైన సూర్యుడే యుద్దేశింపబడినాడని చెప్పజాలము. ఇచ్చట కేవలము చీకటిలో నివసించియున్న — అనగ, దీర్ఘకాలము క్షితిజముక్రిందికి గ్రుంకిపోయిన—సూర్యుడు ఉద్దేశింపబడినాడనుట స్పష్టము. ఈకథ నింకను పరిశీలింతముగాక.

ఋ I, 158, 6 [దీర్ఘతమా మామతేయోజుజుర్వాన్ దశమే యుగే అపామర్థం యతీనాం బ్రహ్మా భవతి సారథిః.] యిట్లుచెప్పబడినది. "మామతేయుడగు దీర్ఘతముడు పదియవ యుగమందు అశక్తుడై, తమగమ్యస్థానమునకు పోవుచున్న నీళ్లకు బ్రాహ్మణసారథియయ్యెను." "పదియవయుగ" మనగనేమి ? "తమగమ్యస్థానమునకు పోవుచున్ననీళ్లు"అనగ అర్థమేమి ? ఈరెండువాక్యములపైనను పండితులు చాల వివాదపడిరి. తక్కిన కథయంతయు బహుసులభముగనే యున్నది. "పదియవయుగ" మనుమాటలోనున్న "యుగ" మనుపదమువిషయమై పలువురు పలుతెరగులుగ అర్థము చెప్పుచున్నారు.



౧. యుగమనగ:– (వేదాంగజ్యోతిషము ననుసరించి) అయిదేండ్లని కొందరర్థముచెప్పిరి. దీనినిబట్టి దీర్ఘతముడు తన ౫౦ వ యేట అశక్తుడయ్యెనని భావింపవలెను.

౨. పాశ్చాత్య పండితులు యుగమనగ మనుష్య సంతతియని అర్థము చెప్పుచున్నారు. యుగ మనుపదము ఋగ్వేదమందు కాలవాచకము కానేకాదని వారి గట్టిమతము.

3. శాయనాచార్యులవారు మహీధరుడు మొదలగు పండితు లీయుగపదమునకు కాలవాచకమగు నర్థమేగాక, "సంయోగము" లేక "జంట" యను అర్థములనుకూడ చెప్పియుండిరి. కనుక దీనినిబట్టి "యుగ" మను శబ్దమునకు మూడర్థములను చెప్పవచ్చును. (ఒకటి) రాత్రింబవళ్ళ జంట యనికాని, (రెండు) రెండునెలలజంట – ఋతువు – అనిగాని, (మూడు) రెండుపక్షములజంట (మాసము) లేక సూర్యేందు సంగమమనికాని అర్థము చేసికొనవచ్చును.

కనుక, శబ్దోత్పత్తినిబట్టి చూడగ యీ కథయందున్న యుగశబ్దమునకుగాని, ఋగ్వేదమందువచ్చు "మానుషా యు

గాని ” అనుశబ్దములకుగాని భావార్థము స్పష్టపడుటలేదు. కనుక మన మింకొకమార్గము నారయవలసియున్నది.

ఋగ్వేదమందు “ యుగే యుగే ” యను పదము ౫, ౬ స్థలములందు ప్రయోగింపబడియున్నది. ఈ స్థలములలో శాయనులవారు ‘ కాలపరిమితి ’ యనునర్థమునే చెప్పియుండిరి. మరికొన్నిచోట్ల “ ఉత్తరయుగాని ” = ( యిటీవలికాలములు; ) “ ఉత్తరేయుగే ” ( యిటీవలికాలమందు ) అను పదములు కలవు. తరువాత “ దేవానాం పూర్వ్యే యుగే ” “ దేవానాం ప్రథమే యుగే” అనుపదములు దేవతల ప్రాచీన కాలములను తదుపరికాలములను తెలుపునర్థమందే ప్రయోగింపబడినవి. ఇచ్చట “ దేవానాం ” అనుపదము బహువచనము; యుగపదము యేకవచనము కనుక యీ పదమునకు “ దేవతలసంతతులు ” అని అర్థముచెప్పుటకు వీలుపడదు. ప్రాచీనకాలమందు దేవతలయొక్క సృష్టిని ( ఉత్పత్తిని ) గూర్చి యిట వివరింపబడుచున్నది. కనుక పూర్వోత్తరసందర్భమును బట్టికూడ యీపదము కాలవాచకమే యని స్పష్టపడుచున్నది. “ దేవానాం యుగం ” అనుపదమునకు “ దేవతలయొక్క కాలము ” అని. అర్థమైనచో “ మనుష్యా యుగాని ” “ మనుష్యా యుగా ” అనుపదములకు “ మానవులయొక్క కాలము ” అనియేల అర్థముచెప్పకూడదో యూహింపజాలకున్నాను. “మానుషా యుగా”యనుపదనమునకు కాలవాచకముగతప్ప మరి యింకొకవిధముగ అర్థము చెప్పుటకుఅసలు వీలే



లేనిఋక్కులురెండు ఋగ్వేదమందు గలవు. ఉదాహరణము:– ఋ V,52, 4లో “విశ్వేయే మానుషాయుగా పాంతిమర్త్యం రిషః ”– అర్థము– [పాంతి=రక్షించు (క్రియాపదము); విశ్వేయే=వారందరు (ప్రథమావిభక్తి కర్త); మర్త్యం=మనుష్యుని (కర్మ); రిషః=కష్టమునుండి (పంచమి); మానుషా యుగా= దీని యర్థమును ప్రస్తుతము వదలివేయుదము ] ‘ మానుషా యుగా అను పదమును ప్రస్తుతము వదలివేసి చూచినచో యింతవరకు తేలినయర్థమేమనగ:– “మనుష్యుని కష్టమునుండి రక్షించు వా రందరు ...... ” అయితే, యిప్పుడు “ మానుషాయుగా” అన అర్థమేమి ? దీనిని పై వాక్యముతో అతుకుట యెట్లు ? దీనికి “ మనుష్యసంతతులను ” అని అర్థముచేసినచో, అత్యుక్తిదోషము సంభవించును. యేలననగ :– పాంతి (రక్షించు) అను క్రియకు “ మనుష్యుని ”– అనుకర్మ యిదివరకే యున్నది ; కనుక “ మనుష్య సంతతులను ” అను యింకొక కర్మ నిష్ప్రయోజనమగును. ఒకవేళ రెండు కర్మలున్నవని యంగీకరించినను, వానిని కలుపుటకు “చ”– వంటి సముచ్చయపద మేదియు నిట గానరాదు. అందుచే యీ యర్థ మిచ్చుట అతకదు. ( అయినను మాక్సిముల్లరు పండితు డీయర్థమునే పట్టుకొని ప్రేలాడుచున్నాడు) కనుక, ‘మానుషా యుగా ’ అను పదమునకు కాలసూచకమైన అర్థమునే చెప్పవలెను. అట్లయినచో యీఋక్కునకువచ్చు అర్థమేమనగ:– “ మానవయుగము (కాలము) లందు మనుష్యుని కష్టముల

నుండి రక్షించు వా రందరు– (అనగ మరుత్తు లనుదేవతలు– అని పూర్వోత్తర సందర్భము). ఈ యర్థమిచ్చుట చక్కగ అతుకుచున్నది. ఇంతకంటె సహేతుకమైనట్టియు, సరళమైనట్టియు అర్థ మింకొకటి గానరాదు. గ్రిఫిత్ పండితుడును యీ యర్థమునే యంగీకరించెను.

II. ఇంకొక వాక్యమును విమర్శింతము:——

| ఋతావానమ్ | మహిషం | విశ్వదర్శతం |
|---|---|---|
| (ఋజుమార్గుడును) | (బలిష్ఠుడును) | (అందరికి కనుపడువాడును) |
| (1) | (2) | (3) |

| అగ్నిమ్ | సుమ్నాయ | దధిరే | పురో | జనాః |
|---|---|---|---|---|
| (అగ్నిని) | (శ్రేయస్సుకొరకు) | (ఉంచుకొనిరి) | (యెదుట) | (జనులు) |
| (కర్మ) | | (క్రియ) | | (కర్త) |

| శ్రుత్ – కర్ణం | సప్రథస్ – తమమ్ |
|---|---|
| (శ్రిద్ధమైన చెవులుగల) | (విశాలతమమైన) |
| (4) | (5) |

| త్వా | గిరా | దైవ్యం | మానుషాయుగా |
|---|---|---|---|
| (నిన్ను) | (స్తోత్రములతో) | (దేవతాసంబంధమైన) | (?) |
| | | (6) | |

(1) మొదలు (6) వరకుగల పదములు అగ్నిని వర్ణించు విశేషణములైయున్నవి. "మానుషాయుగా" అను చివరిపదమును వదలివేసినచో తేలు అర్థమేమనగ:—"పూర్వోక్తగుణములుగల అగ్నిని ప్రజలు తమ శ్రేయస్సుకొరకై తమయెదుట స్తోత్రములతోనుంచుకొనిరి." అయితే మానుషాయుగా అనుపదము నిప్పుడెట్లతుకవలెను? దీనికి కాల



సూచకార్థమును చెప్పినచో పైవాక్యముతో చక్కగ అతుకును. ఎట్లనగ:– "పూర్వోక్తగుణములుగల అగ్నిని ప్రజలు మానవయుగము (కాలము) లందు తమ శ్రేయస్సు కొరకై స్తోత్రపాఠములతో తమ యెదుటనుంచుకొనిరి."

కాని, గ్రిఫిత్ పండితు డీయర్థమును చెప్పక, "మానవ సంతతులను" అని చెప్పెను. అందుచే అసలు ఋక్కులో లేని క్రొత్తక్రియాపదము నొకదానిని అప్పుతెచ్చుకొనవలసి వచ్చెను. "మానవసంతతులు అగ్నిని స్తోత్రపాఠములతో గొప్పవానిని జేయుచున్నారు". ఇచ్చట "గొప్పవానిని చేయుచున్నారు" అను క్రియాపదము ఋక్కులో లేనేలేదు. అసలు నిజార్థమును తెలిసికొనక, యేదోవిధముగ అతుకులు పెట్టదలచినచో యెట్టిపండితుడైనను యెన్నితికమకలు పడవలసివచ్చునో దీనినిబట్టి స్పష్టమగుచున్నది.

ఈ ఋక్కే వాజసనేయసంహితయందుకూడ గలదు. అచ్చట మహీధరుడుకూడ యీ యర్థమునే చెప్పెను. "మానుషా యుగా" యను పదము "జనాః" "మర్త్యాః" అను పదములతో కలిసియుండి, యచ్చట యుగమునకు ఖండితముగ కాలసూచకార్థమునే తప్ప యింకొక యర్థము నసలు చెప్పుటకు వీలే లేని స్థలములు ఋగ్వేదమం దీరెండే గలవు. ఒకసారి, ఒకానొక పదమునకు ఖండితమైన యర్థమును నిర్ణయించిన పిమ్మట, పూర్వోత్తరసందర్భములకు భంగములేనిచో, ఆ యర్థమే యితరస్థలములందుకూడ అంగీక

రింపదగియున్నది. యాస్కాచార్యులవంటి భాష్యకారులు వేద వాక్యముల కర్థము జెప్పుటలో యీమార్గమునే యవలంబించిరి. కనుక, మన మిప్పు డిచ్చట వింతమార్గమును త్రొక్కుట లేదు. "మానుషాయుగా" అనగ "మానవయుగములు లేక కాలములు" అని యర్థము చెప్పితిమి. అయితే 'యుగమనగ యెంతకాలమో మన మిప్పుడుఖండితముగ నిర్ణయింపవలసి యున్నది. అథర్వణ వేదము VIII. 2,21 ని బట్టి యుగమనగ పది వేల సంవత్సరములకు తక్కువగాని కాలమని తెలియుచున్నది. కాని, బహుప్రాచీనమగు ఋగ్వేదమందు 'యుగ' పదమంతకంటె చాలతక్కువకాలమును సూచించెనని చెప్పుటకు దృఢమైనయాధారములు గలవు. ఋగ్వేదమందు "ప్రథమా" (మొదటి) ఉషస్సునుగూర్చియు "ఆయతీనాం ప్రథమా" (రాబోవువానిలో మొదటి) ఉషస్సును గూర్చియు, "అవమా" (చిట్టచివరి) ఉషస్సునుగూర్చియు పలుతావులలో పేర్కొనబడెను. ఉషస్సునకు "మొదటి దినము తెలియున" ని మరియొకచోట పేర్కొనబడెను. "ప్రథమ ఉషస్సు" అన్నప్పుడు "సంవత్సరములో వచ్చు మొదటి ఉషస్సు" లేక "సంవత్సరముయొక్క మొదటినాడు వచ్చు ఉషస్సు" అని అర్థము చెప్పిననే భావము చక్కగ బోధపడును. అట్లయినప్పుడే 'ప్రథమా' యనుపదము సార్థకమగునుగాని యింకొకవిధమైనచో కాజాలదు. దీనికిసాదృశ్యముగ బ్రాహ్మణములలో ప్రయోగింపబడిన "ప్రథమారాత్రిః"



యను పదమును చూడవచ్చును. కనుక, "ప్రథమా" "అవమా" ఉషస్సులాకాశమందు సంవత్సరముయొక్క ఆద్యంతములను దెలుపునవిగ నున్నవి. వైదికఉషస్సులను గూర్చి ౯ వ. అధ్యాయమందు చేసినవివరణమునుబట్టి విచారింపగ మన మిట్లని నిశ్చయింపవచ్చును. దీర్ఘరాత్రి యంతమొందగనే ఉషస్సులు ప్రారంభమగును. ఈ యుషస్సులతో నూతనసంవత్సరము ప్రారంభమగును. ఇట్లు నూతన సంవత్సరమును ప్రారంభించు ఉషస్సమూహములోనిదైన మొదటి ఉషస్సే యీరీతిగ ఋగ్వేదమందు "ప్రథమా" ఉషస్సని వర్ణింపబడినది.

ఋ I, 124, 2; I, 92, 11- లలో యీ ప్రథమ యుషస్సు "మానుషయుగముల నడిపించుచున్నది" (ప్రమినతి మనుష్యా యుగాని) అని యున్నది. మరియు I, 115, 2 లో- "ఉషస్సు కనిపించగనే సత్పురుషులు యుగములను విస్తరింతురు, అనగ విప్పుదురు." (యత్రా నరో దేవయంతో యుగాని వితన్వతే). ఈ రెంటిలో మొదటి వాక్యమందు "మానుషా యుగాని" పదములోనున్న 'యుగ' శబ్దమునకు కాలవాచకమైన యర్థమే చెప్పితీరవలెనని స్పష్టముగ గాన్పించుచున్నది. ఈ ప్రథమయుషస్సు వచ్చి దివ్యవ్రతములను (దైవ్యాని వ్రతాని) ప్రారంభించుచున్నదనియు, మానుష యుగములను నడిపించుచున్నదనియు, యీ వాక్యమందు వర్ణింపబడియున్నది. అనగ, యీ మొదటి యుషస్సుతో

యజ్ఞయాగాది కర్మలును, "మానుషయుగము" లను పేరు గల కాలభాగముల నడకయు ప్రారంభమయ్యెనని తాత్పర్యము. అనగ, మానుషయుగముల లెక్క యీ యుషస్సుతో ప్రారంభమాయ్యెనని భావము. ఈ రీతిగ, మానుషయుగములకును, ప్రథమ యుషస్సునకును యెడబాయకుండ నేర్పడిన బంధమునుబట్టి "మానుష యుగము" యొక్క కాలపరిమితిని మన మిప్పుడు బహుసులభముగ నిశ్చయింపవచ్చును. ఈ మానుష యుగములు సంవత్సరముయొక్క "ప్రథమా" యుషస్సుతో ప్రారంభమైనచో యివి సంవత్సరముయొక్క "అవమా" యుషస్సుతో నంతమొందవలెను. కనుక, మొత్తముపై మానుష యుగములన్నియుకలిసి సంవత్సరములో మొదటి యుషస్సునకును, చిట్టచివరి యుషస్సునకును మధ్యనున్న కాలపరిమాణమును దెలుపుచున్నవి. కనుక, ఒక్క మానుష యుగముయొక్క పరిమితి యీసంవత్సర కాలపరిమాణముకంటె తక్కువయని నిశ్చయమగుచున్నది.

దీర్ఘతమునిగాథ నటుంచి, మనమిప్పుడు ఋగ్వేద ప్రమాణములనుబట్టి రెండు ముఖ్యసారాంశములను తేల్చితిమి. (౧) "మానుషయుగములు" అనగ సంవత్సరములో మొదటి యుషస్సునకును చిట్టచివరి యుషస్సునకును మధ్యనున్న మొత్తపు కాలపరిమాణమేగాని, "మానవసంతతులు" అనిపాశ్చాత్యులు చెప్పిన అర్థముకాదు. (౨) "యుగ" మను పదము సంవత్సరమునకంటె తక్కువ కాలమానమును దెల్పుచున్నది.



ఈ రెండు సారాంశములనుబట్టి చూచినచో, దీర్ఘతముని గాథయందున్న, "దీర్ఘతముడు పదియవ యుగమందు ముసలివాడయ్యె" నను వాక్యమునకు అర్థము కరతలామలక మగుచునే యున్నది: ఈ గాథలో నున్న "యుగ" శబ్దమును "మానుషాయుగ" లోనున్న, 'యుగ' శబ్దమును ఒకటేయైనచో, "దీర్ఘతముడు పదియవ నెలయందు ముసలివాడయ్యె"నని పై వాక్యమున కర్థమగుచున్నది. ఈగాథ సౌరగాథయైనచో దీని భావ మేమనగ:- "సూర్యుడు (దీర్ఘతముడు) పదియవనెలయందు ముసలివా డయ్యెను". ప్రథమా, అవమా ఉషస్సులమధ్య (అనగ, సంవత్సరముయొక్క ఆద్యంతములకు నడుమ) పదియుగములు గలవని దీనివలన దెలియుచున్నది. కనుక యిచ్చట యుగమనగ నెల యనియే అర్థము చెప్పవలెను. ఏలననగ:- సంవత్సరాద్యంతములకు నడుమ పదిరోజులు గలవన్నను, పదిపక్షములు గలవన్నను సంవత్సరకాలపరిమితి కిది బహు తక్కువగును—చాలదు. పోనీ, పదిఋతువులన్నచో సంవత్సరమునకు మించిపోవును. కనుక, యుగమనగ నెలయనియే అర్థము చెప్పితీరవలెను; వేరే యర్థము చెప్పుటకు వీలులేదు. వేయేల, దీర్ఘతముడనగ పదియవమాసమందు ముసలివాడై పోయిన సూర్యుడే. అతడు నీటిప్రవాహముపై, స్వారిచేయుచుపోయి, క్షితిజముక్రిందనున్న సముద్రములో పడిపోయెను.(VII. 49,2) ఈనీటికి అర్థమేమి? వరుణుని పరిపాలనక్రిందనున్న జలమే

యీనీరు. వరుణుని ఆజ్ఞచే యీజలము ప్రవహించును. ఈ నీటియందు సూర్యుని ప్రయాణమునకై వరుణుడొక కాలువను త్రవ్వించెనట (VII. 49, 1-4; II. 28,4; VII. 87,11) ఇంద్రుడు వృత్రాసురుని సంహరించి సూర్యుని విడిపించగనే, యీకాలువలోనున్న నీటిప్రవాహము వెంబడి సూర్యుడు పైకి కొట్టుకొని వచ్చునట. (I, 51, 4) ఈ నీటినిగూర్చి యింకొక అధ్యాయములో ముందు చర్చించెదము. ప్రస్తుతము మనము గ్రహించవలసినదేమనగ:— క్షితిజము క్రిందనున్న సముద్రములోనుండి పైకివచ్చి, పదిమాసములు మానవులకు సూర్యరశ్మినిచ్చి, తదుపరి రెండుమాసములు మరల సముద్రములో గ్రుంకిపోవు ఉత్తర ధ్రువమండల సూర్యుడే దీర్ఘతముడు పదిమాసములలో తమయజ్ఞములను ముగించు దశగ్వుల చరిత్రముతో యీగాథ సర్వవిధముల తూచినట్లు సరిపోవుచున్నది.

‘యుగ’ శబ్దమునుగూర్చి నేనిచ్చట యింతవిపులముగ చర్చించియుంటిని. కారణమేమనగ:- పాశ్చాత్య పండితులును తదితరులును దీని విషయమై చాలయపార్థములను గల్పించి, నిజార్థమును మరుగుపరచిరి. ఈచర్చవలన ‘యుగ’ శబ్దమునకు మాసమను అర్థమే అతిప్రాచీనమగు ఋగ్వేదమందు ఉద్దేశింపబడినట్లు నిశ్చయమగుచున్నది. ఈయర్థమునే చెన్నపురి నివాసులగు రంగాచార్య పండితులవారుకూడ తదితర ప్రమాణములవలన నిశ్చయించియున్నారు. వారు ‘యుగ’ శబ్దమునకు



సంగమము లేక సంయోగము అను అర్థమును తీసికొని యిట్లు వ్రాసియున్నారు. “చంద్రుని కళలను గుర్తించుట బహు సులభము. ఈచంద్రకళలు జ్యోతిర్గోళముల సంయోగమును (యుగమును) బట్టియే కలుగుచున్నవగుటచే యుగ శబ్దమునకు ప్రప్రథమమున కాలమానవాచకమైన అర్థమేర్పడియుండవచ్చునని వీబరు పండితుడు తలంచుచున్నాడు” ...... పిమ్మట, రంగాచార్యులవారు సూర్యేందుసంగమమునకు (అమావాస్యకు) ప్రాచీనపదమగు “దర్శ” యను పేరునుకూడ నుదాహరించి యిట్లువ్రాయుచున్నారు. “ఈ సూర్యేందు సంగమమునేగాక, మనపూర్వులు తదితరములగు జ్యోతిర్గోళసంయోగముల ననేకములను చూచియున్నట్లనేక నిదర్శనములు గలవు. అయినను, వీనియన్నిటిలోను ముఖ్యముగ (అందరికిని సులభముగ గన్పట్టు) యీసూర్యేందుసంగమమునుండియే మొట్టమొదట ‘యుగ’ శబ్దమునకు కాలమానవాచకమైన యర్థమేర్పడియుండును. అనగ, అమావాస్యకును, మరియొక అమావాస్యకును గల మధ్యకాలమునకే “యుగ” మనిపేరు మొట్టమొదట వచ్చియుండవచ్చును. దీనినిబట్టి యుగశబ్దమునకు మొట్టమొదటియర్థము చాంద్రమాసమనియే యేర్పడుచున్నది.

ఇదిగాక “మానుష యుగముల చక్రమును నడిపించునది ‘ప్రథమా’ యుష”స్సని చెప్పువాక్యమును పైననుదహరించియుంటిమి. ఈవాక్యమును ఋ X, 139, 6 తో పోల్చి

చూడుడు. ఇంద్రుడు వృత్రాసురుని సంహరించి, ఉషస్సును, సూర్యుని, పైకితెచ్చి ఆకాశమందు "మాసముల నడకను యేర్పాటుచేసెను" అని యీఋక్కునందుగలదు. ఈరెండు వాక్యములనుబట్టి చూచినను, మొదటియుషస్సుతో ప్రారంభమైన కాలమానచక్రము మాసచక్రమనియే స్పష్టమగుచున్నది. కనుక "మానుషాయుగా" యనగ పూర్వకాలమందు ఉత్తరధ్రువమువద్ద సూర్యరశ్మియున్న మాసములు— అని యర్థమేర్పడుచున్నది. ఈమానుష యుగములందే (యీ సూర్యరశ్మియున్న మాసములందే) ఆర్యులు యజ్ఞయాగాది క్రతువులను చేయుచుండిరి.

ఈయర్థమునే స్థిరపరచువాక్యము లింకననేకములు ఋగ్వేదమందుగలవు. కాని, యీయన్నిచోట్లను పాశ్చాత్య పండితులు "మానుషాయుగా" యనుపదమునకు "మానవ సంతతులు, లేక తెగలు" అను అర్థము చెప్పుటచేనవి యెవరికిని బోధపడియుండలేదు. ఉదాహరణము:— ఋ VIII, 46, 12- "అందరును తమ (సోమరసపు) గరిటెల నెత్తి మానుష యుగములందు యింద్రుని ఆహ్వానింతురు." ఈవాక్యమునకు గ్రిఫిత్ గారు చెప్పిన అర్థమేమనగ:- "మానవజాతుల వారందరును యింద్రుని ఆహ్వానింతురు." కాని యీయర్థము పూర్వోత్తరసందర్భములతో నెంతమాత్రము నతుకుటలేదు. ఇంకొక యుదాహరణ:-(ఋ II. 2,2) లో "అగ్ని 'మానుష యుగా' యందును, 'క్షపః' యందును వెలుంగు"నని గలదు.



'క్షపః'="యెడతెగనిరాత్రులు". ఈవాక్యమున కర్థమేమనగ, "ఓ అగ్నీ ! నీవు మానుషయుగములందును, అఖండరాత్రులందును వెలుంగుచున్నావు. ఇచ్చట "మానుషయుగ," "క్షపః" అను పదములు రెండును జంటగ ప్రయోగింపబడినవి. ఇది అత్యవసరమైన విషయమే. ఏలననగ:— అగ్ని సంవత్సరము పొడవునను వెలుగుచునే యుండును. కాని "మానుష యుగా" యను శబ్దమందు దీర్ఘదివసమును, రాత్రింబవళ్ళతో కూడిన కొన్నిదినములును మాత్రమే యిమిడియున్నవి, గాని, సంవత్సరమంతయు పూర్తిగ యిమిడియుండలేదు — అనగ దీర్ఘరాత్రి యిమిడియుండలేదు. కనుక యీ "మానుష యుగా"కు దీర్ఘరాత్రిని (క్షపః) కూడ కలిపిననేగాని సౌర సంవత్సరము పూర్తి కానేరదు. కనుక ఋ II. 2, 2 లో సౌరసంవత్సరమును పూర్తిగ చెప్పవలసి వచ్చినప్పుడు, "మానుషయుగా" + "క్షపః"= యను పదముల రెంటిని జంటగ పేర్కొనక తప్పదయ్యెను.

"క్షపః" అనగ యెడతెగని, లేక అఖండరాత్రులని (Continuous nights) మాక్సిముల్లరు పండితుడు సరియైన యర్థమునే చెప్పెను. కాని, దానిలోని సంపూర్ణమైన భావమును గ్రహింపజాలక పోయెను. "ఓ యగ్నీ ! నీవు యెడతెగనిరాత్రులందు మానవజాతులమీద వెలుంగుచున్నావు" అనిపాశ్చాత్యపండితులు అర్థము చెప్పుచున్నారు. మానవజాతులమీద వెలుంగుటయనగ అర్థ

మేమో సుబోధకముగ లేదు. క్షపః=అనగ ఎడతెగని రాత్రి లేమైనచో ఉత్తరధ్రువమండలమందుండు "దీర్ఘరాత్రియే తప్ప వేరొండు లేదు. కనుక యీదీర్ఘరాత్రిపోగా మిగిలిన సౌరసంవత్సర భాగమే యీ "మానుషయుగా" యేల కాకూడదు ? ఈక్షపః శబ్దముమానుషయుగా శబ్దముతో జంటగ కలిపియే చెప్పబడియున్నది. కనుక, వీనిభావ మొకటియే యైయుండక తప్పదు.

ఋ IV. 16, 19 - కి కూడ పండితు లిట్టి యపార్థములనేకల్పించిరి. "క్షపః మదేమ శరదశ్చపూర్వీః" - "మే మనేకఋతువులందును, రాత్రులందును, సంతోషింతుము గాక." ఇచ్చట "ఋతువులు, రాత్రిలు," అనునది ద్వంద్వ సమాసముగ ప్రయోగింపబడినది. కాని "ఋతువు" లందే 'రాత్రిలు' కూడ యిమిడియున్నవని పాశ్చాత్యపండితులు తలంచుటచే వారీ రెండుపదములను విడదీసి రెండుక్రియల కంటగట్టిరి. అందుచే యీరెండుపదములను కలుపు "చ" యను ప్రత్యయము నిష్ప్రయోజనమగుచున్నది. కాని, యీరెంటిని కలిపి యర్థముచెప్పినచో, "మేము దీర్ఘరాత్రి (క్షపః) తోడను, ఋతువులతోడను కలిసియున్న సంవత్సరము నందంతటను సంతోషించుచుందుముగాక." అని సరళమైన అర్థమేర్పడగలదు. ఈపండితులకు ఉత్తరధ్రువసిద్ధాంతము తెలియకపోవుటచే, ఋతువులందును, యుగములందును "రాత్రి" లిమిడియేయున్నవని వారపోహపడియుండిరి. "మానుషయుగములందును, 'ఋతువు' లందును 'దీర్ఘ



రాత్రి' యిమిడియుండలేదను ఉత్తరధ్రువలక్షణము పాపమా పండితులకు తెలియదు.

సారాంశమేమనగ:— "మానుషయుగా" యనుపదముతో "క్షపః" యను పదమును జంటగచేర్చుటచే, "మానుషయుగా" కు "సూర్యరశ్మియున్న నెలలు" అను నర్థము మరింతబలపడుచున్నది.

దీర్ఘతముని గాధనుండియు, దశగ్వుల చరిత్రమునుండియు తేలిన సారాంశమే వేదములందు ఉదాహరింపబడిన ఋతువుల సంఖ్యనుబట్టికూడ నిర్ధారణమగుచున్నది. పది మాసముల సూర్యరశ్మియున్నప్పుడు రెండుమాసముల దీర్ఘరాత్రియుండును. కనుక సంవత్సరములో $5 \times 2=10$ మాసముల పరిమితి గల అయిదు ఋతువులుండును. తక్కిన రెండు నెలలలో సూర్యుడు క్షితిజము క్రింద సముద్రములో మునిగి యుండును. సరిగ యీ వర్ణనయే ఋ I. 164,12 లో కలదు. పంచపాదం పితరం ద్వాదశాకృతిం దివ ఆహుః పరే అర్ధే పురీషిణమ్ । అథేమే అన్య ఉపరే విచక్షణం సప్తచక్రే షళర ఆహు రర్పితమ్॥ ఇట్టి వాక్యములే అధర్వవేదమందును, ప్రశ్నోపనిషత్తునందును కూడ గలవు. దీని కర్థమేమనగ:- "ద్వాదశాకృతియు, పంచపాదుడునైన పితరుడు ఆకాశముయొక్క క్రిందిభాగమందు (పరే అర్ధే) నీటియావిరిచే (పురీషిణం) నిండియున్నా" డని కొందరు చెప్పుదురు. విచక్షణుడైన పితరుడు ఆకాశము

యొక్క పైభాగమందు (ఉపరే అర్ధే) షడారములతో (ఆరు ఆకులతో) నొప్పుచున్న సప్తచక్ర (రథము) పైనున్నాడని మరికొందరు చెప్పుదురు." ఇచ్చట పూర్వోత్తరసందర్భములనుబట్టి పితరుడనగ ౧౨ మాసములతో నొప్పుచున్న సంవత్సరదేవతయని యర్థము. ఈ సంవత్సరము విషయమై పై ఋక్కునందు రెండు తెగలవారి భిన్నాభిప్రాయములు పేర్కొనబడినవి.

కొందరు సంవత్సరదేవత "పంచపాదు" డని చెప్పుచున్నారు. అనగ సంవత్సరము ౫ ఋతువులుగ విభజింపబడెనని వీరి మతము. మరికొందరు సంవత్సరదేవతకు షడారములు (ఆరు ఆకులు) గల రథము గలదని చెప్పుచున్నారు. అనగ సంవత్సరము ౬ ఋతువులుగ విభజింపబడెనని యీ రెండవ తెగవారి మతము. పూర్వకాలమందిట్టి యభిప్రాయభేద మేల కలిగెను ?

ఋగ్వేదమందు కొన్నిచోట్ల ౫ ఋతువులే పేర్కొనబడియున్నమాట వాస్తవము. దీనినేదో విధముగ సమన్వయించుటకై ఐతరేయ బ్రాహ్మణతైత్తిరీయ సంహితలు ప్రయత్నించినవి. ఈ గ్రంథములు హేమంతశిశిరఋతువుల రెంటిని కలిపి ఒకే ఋతువుక్రిందలెక్కవేసెను. కాని, శతపథ బ్రాహ్మణముమాత్రము వర్ష శరదృతువులరెంటిని కలిపి ఒకే ఋతువుక్రింద లెక్కవేసెను. అట్లయినచో, ఎవరియిష్టము వచ్చినట్లు వారుయేవో రెండు ఋతువులను కలిపి ఒకటిగ



చేసిన చాలునాయేమి ? కనుక యీ పద్ధతి బొత్తుగపనికిరాదు. సంవత్సరములో ౫ ఋతువులుగలవను ఋగ్వేద వాక్యమును సమన్వయించుటకు మన మింకొకపద్ధతి నవలంబింపవలెను.

ఈ ఋక్కునందు ప్రథమభాగములో నేమిచెప్పిరనగ:—పంచపాదుడైన పితరుడు ఆకాశముయొక్క "పరే అర్ధ" మందు నీటిలోమునిగియున్నాడు. (పురీషణం) రెండవ భాగములో నేమిచెప్పిరనగ:—ఆరు ఆకులరథముతోకూడిన సంవత్సరము "విచక్షణ" మైనది. పురీషణ, విచక్షణ పదములు ఒకదానికొకటి ప్రతిరూపములుగ గన్పట్టుచున్నవి. ఈ యంశమే తరువాత రెండు ఋక్కులలో స్పష్టపరుప బడినది. పంచారేచక్రే పరివర్తమానే తస్మిన్నాతస్థు ర్భువనాని విశ్వా । తస్యనాక్షస్తప్యతే భూరిభారః సనాదేవన శీర్యతేసనాభిః ॥ సనేమి చక్రమజరం వివావృత ఉత్తానాయాం దశయుక్తావహంతి । సూర్యస్యచక్షూరజసైత్యావృతం తస్మిన్నార్పితాభువనాని విశ్వా॥ 13 వ ఋక్కునందు "ఐదు ఆకుల (పంచారే) చక్రము చాలపురాతనమైనదైనను విరిగిపోకుండ అట్లే నిలిచియున్నది" మరియు, 14 వ ఋక్కునందు "అజరమైన (చెడని) చక్రము తననేమితో తిరుగుచున్నది. దానిని ఆకాశముపై పది (గుర్రములు) లాగుచున్నవి. సూర్యనేత్రము "రజస్" (నీటి ఆవిరి) చే కప్పబడి తిరుగుచున్నది. సమస్తభువనములు ఆతనిపై ఆధారపడియున్నవి" ఈ

ఋక్కును ౧౨ వ ఋక్కుతో పోల్చి చూడుడు. పురీషిణం, రజసావృతం (నీటిచే గప్పబడిన) — అను పదములు రెండును సమానార్థకములే. అనగ, పంచపాదుడైన సంవత్సర దేవత లేక సూర్యుడు కొంతకాలము నీటిలో మునిగియుండె ననిగాని, లేక క్షితిజము క్రిందిభాగమందు సూర్యుడు నీటిచే గప్పబడి కొంతకాల మదృశ్యుడయ్యెననిగాని యీ ఋక్కుల భావము. "ఈతని రథమును పది (గుఱ్ఱములు) లాగుచున్నవి." అనగ, యిచ్చట సూర్యరశ్మి పదిమాసము లుండె నని తెలుచున్నది. ఈపదిమాసములు కలిసి ౫ ఋతువులగుచున్నవి. కనుక, ౫ ఋతువు లనగ పది నెలలనే యర్థమగును గాని, ౧౨ నెలలుగల ఆరుఋతువులలో యేరెంటినో కలిపి ౫ ఋతువులుగ జేయుటకాదని యీ "పది (గుఱ్ఱములు) లాగుచున్నవ"ను వాక్యమువలన ఖండితముగ నిర్ధారణ మగుచున్నది.

కనుక, 12 వ ఋక్కుయొక్క మొదటి భాగమందు పదినెలల సూర్యరశ్మిగల, —౫ ఋతువులతో కూడిన, — లేక (పంచపాదుడైన) సంవత్సర దేవత (సూర్యుడు) కొంతకాలము (అనగ, తక్కిన రెండునెలలు) నీటిలో మునిగి యుండెను. (పురీషిణం) — అని చెప్పబడు టెంతయు సహజముగనే యున్నది. ఇది యొకతెగ వారి మతము — ఇది ఉత్తర ధ్రువలక్షణము. కాని, ఆర్యులు దక్షిణదేశములకు వచ్చిన పిమ్మట సూర్యరశ్మి ౧౨ మాసము లుండెను. ఋతువులు



ఆరయ్యెను. కనుక సంవత్సరదేవత (సూర్యుడు) పూర్వకాలమందువలె రెండుమాసములు నీటిలో మునిగియుండవలసిన అగత్య మిప్పుడు లేకపోయెను. ఇదివరకు "పురీషిణ" ములో నున్న సంవత్సరదేవత యిప్పుడు "విచక్షణు" డయ్యెను. ఈ యభిప్రాయమే ౧౨ వ ఋక్కుయొక్క రెండవ భాగమందు పేర్కొనబడెను. ఇది రెండవ తెగవారి మతము — అనగ దక్షిణదేశప్రాంతముల లక్షణము. సంవత్సరదేవతను గూర్చిన యీరెండు భిన్నాభిప్రాయములును ౧౨ వ ఋక్కుయొక్క రెండు భాగములందు పేర్కొనబడినవి. ఈరెంటియొక్క లక్షణములును ఒకదానితో నొకటి పోల్చబడినవి.

| ౧౨ వ ఋక్కు: మొదటిభాగము. | ౧౨ వ ఋక్కు: రెండవభాగము. |
|---|---|
| (౧) అయిదు ఋతువులు | (౧) ఆరు ఋతువులు |
| (౨) పరే అర్థే (క్రిందిభాగము) | (౨) ఉపరే అర్థే (పైభాగము) |
| (3) పంచపాదం లేక పంచారే (14 ఋ) } ౫ ఋతువులు | (౩) షడారే (౬ ఋతువులు) |
| (౪) పురీషిణం ... (సూర్యుడు ౨ నెలలు నీటిలో మునిగి యుండుట) | (౪) విచక్షణం ... (నీటిలో మునిగియుండకుండ ౧౨ మాసములును చక్కని సూర్యరశ్మి) |

ఈరీతిగ వైదికఋషులు ౧౦ మాసముల సూర్యరశ్మియు, ౨ మాసముల దీర్ఘరాత్రియు గల ఉత్తరధ్రువమండల సంవత్సర లక్షణమును యీ ౧౨ వ ఋక్కుయొక్క

మొదటిభాగమందు మరచిపోకుండ నిలిపియున్నారు. తామీ ఋక్కును వ్రాసిననాటికి తమకు ౧౨ మాసముల సూర్యరశ్మియున్నను, ఆ వెనుకటి ౧౦ మాసముల సూర్యరశ్మిని గూర్చి పూర్తిగ మరచిపోకుండ యిచ్చట దాని నుదహరించియున్నారు. ఈ పూర్వయుగస్థితి పరంపరగ వచ్చుచుండుటచే వారు దానిని విడిచిపెట్టకుండ యిచ్చట నుదహరించియుండిరి.

ఈ ౧౨వ ఋక్కునందు మనము విచారింపవలసిన పదము లింకను రెండుగలవు. (ద్వాదశాకృతి; సప్తచక్ర) మొదటిపాదమందు ౫ ఋతువులతో నున్న సంవత్సరము "ద్వాదశాకృతి" గలదని వర్ణింపబడినది. అనగ, 12 మాసములు గలదని చెప్పబడెను. ఈ ఋక్కు దక్షిణదేశములలో వ్రాయబడియున్నది. అప్పటికి ౧౨ మాసముల సంవత్సరము వాడుకలోనికి వచ్చెను. కనుక, యీ ఋక్కును వ్రాయుచు సంవత్సరమును "ద్వాదశాకృతి" యని వర్ణించిరి.

ఇదిగాక, రెండవభాగమందు ౬ ఋతువుల సంవత్సరమును వర్ణించుచు "సప్తచక్ర" యనుపదము ప్రయోగింపబడినది. ఈ పదము యేడుమాసముల సూర్యరశ్మిని సూచించుట లేదాయని కొందరు అపోహపడవచ్చును. కాని ఒకానొక భాషలో పదములెట్లుత్పత్తియగునో అవి యెప్పుడెట్లు ప్రయోగింపబడుచుండునో తెలిసికొన్నచో ఎవరును యీ పదము విషయమై గందరగోళపడవలసిన యవసరముండదు. ఆర్యులోకప్పుడు ఉత్తరధ్రువమండలమందు 7 మాసముల



సూర్యరశ్మిగల ప్రదేశమం దున్నప్పుడు సూర్యునకు (లేక సంవత్సరమునకు) సప్తాశ్వ, సప్తచక్ర యను పేరులు వచ్చియుండెను. ఆపేరులే బహుకాలప్రయోజనముచే రూఢమైపోయి భాషయందు స్థిరముగ పాదుకొనిపోయెను. వానియొక్క యుత్పత్తివిధానము మరుగుపడెను. వైదికఋషు లీఋక్కులను వ్రాసినకాలమునాటికే యీ పదము లిట్లు భాషయందు రూఢములై పోవుటచే వారు సంవత్సరమును (సూర్యుని) వర్ణింపుచు యీ సప్తచక్రసప్తాశ్వ యను పదములను మామూలుగ ప్రయోగించియుండిరి. కనుక యీపదములు ఆ ఋక్కులుపుట్టిననాటి పరిస్థితులనే వర్ణింపుచున్నవని మనము భ్రమజెందకూడదు.

ఈ శబ్దోత్పత్తియొక్క పుట్టుపూర్వోత్తరములు బ్రాహ్మణములకాలమునాటికే యిట్లు మరుగుపడిపోవుటచే వానినేదో విధముగ సమన్వయించుటకై బ్రాహ్మణములను రచించిన ప్రాచీనులు అనేకపాట్లుబడిరి. కాని ఐతిహాసికదృష్టితో చూచినచో యిన్నితికమకలుపడవలసిన యవసరముండదు. ఈరీతిగ అనాదినుండియు పరంపరగవచ్చుచున్న దేశకాలపరిస్థితులు మరుగుపడకుండ ఋగ్వేదమందుగట్టిగ పదిలపరుపబడియున్నవి. ఇట్టిపదములకును, గాథలకును ప్రాచీనతమాగు ఋగ్వేద మొకగనియని చెప్పవచ్చును.

### సింహావలోకనము.

(౧) అదితిగాథనుబట్టి సంవత్సరములో యేడు నెలలు మాత్రమే సూర్యరశ్మియుండెనని స్పష్టమగుచున్నది.

(౨) దశగ్వులయొక్కయు, దీర్ఘతమునియొక్కయు చరిత్రలనుబట్టి సంవత్సరములో పదినెలలు మాత్రమే సూర్యరశ్మియుండెనని స్పష్టమగుచున్నది.

ఈ రెండంశములను ధ్రువసిద్ధాంతముపైననే తప్ప యింకొక విధముగ సమన్వయించుటకు వీలే లేదు.

(౩) ఈ సూర్యరశ్మిగల పదిమాసములును పూర్వమార్యులు యజ్ఞయాగాది క్రతువులొనర్చుకొను కాలముగ నుండెను. ఈ కాలమునకు "మానుషాయుగా" యను సంజ్ఞ గలిగెను.

(౪) తక్కిన రెండు నెలలును దీర్ఘరాత్రిగ నుండెను. ఈ దీర్ఘరాత్రియందు యింద్రుడు "వల"ను సంహరించి చీకటిలో పడియున్న సూర్యుని సంవత్సరాంతమందు పైకి తీసికొని వచ్చెను. ఈ కాలమునకే "క్షపః"యను సంజ్ఞగలిగెను.

(౫) ఈరీతిగ "మానుషాయుగా" (౧౦ మాసముల సూర్యరశ్మి) + క్షపః (౨ మాసముల దీర్ఘరాత్రి) యు కలిసి = మొత్తము ౧౨ మాసముల సంవత్సరము పూర్తియయ్యెను. ఆర్యులు దక్షిణదేశములకు వచ్చిన పిమ్మటకూడ



"మానుషాయుగా" + "క్షపః" అను పదము ఋగ్వేదమందు వాడుకలోనే యుండెను.

(౬) సంవత్సరములో ౫ ఋతువులే గలవనియు, సూర్యరథమునకు పదిగుర్రములే గలవనియు కొందరి మతమై యుండెను. యీ యంశముకూడ పైదానికి సరిపోవుచున్నది.

ఈ గాథలన్నియు ఒక్క భారతీయులందే గాక తక్కిన ఆర్యసంతతులలోగూడ గలవని ముందు ముందు నిరూపించెదను. ఇక యీ గాథలనటుంచి, ౧౦ మాసముల యజ్ఞములను గూర్చిన ప్రత్యక్షవాక్యములను రాబోవు అధ్యాయములో విమర్శింతము.



# వైదికనిలయము

## 8-వ అధ్యాయము.

### " గవాం అయనమ్. "

ఒక్క దశగ్వులచారిత్రమేగాక, ప్రాచీన సంవత్సరమునుగూర్చి దెల్పుచిహ్నము లింకననేకములు యాజ్ఞిక వాఙ్మయమందు గలవు. ఐ. బ్రా. 1, 18,22 లో వర్ణింపబడిన " ప్రవర్గ్యవిధి " యందు ప్రాచీన సంవత్సరమునుగూర్చి స్పష్టముగసూచించినట్లు గన్పట్టుచున్నది. ఈ "ప్రవర్గ్యవిధి" యను కర్మను చేయుటకు 3 దినములుపట్టును. "పశుయజ్ఞ" మను సోమయాగమునుచేయుటకు ముందుగ ప్రతివారును యీ విధిని నెరవేర్చితీరవలెను. ఈప్రవర్గ్యవిధిని చేయనివారు సోమయాగమును చేయుటకు వీలులేదు. ఈవిధియంతయు కేవలము సూర్యునియొక్క ( లేక యజ్ఞముయొక్క ) పునరుజ్జీవనమును దెలుపుచున్నది. సూర్యుడుతిరిగి సకాలమందు ప్రజననమొందుటకై బీజరూపముగ మృత్తికాపాత్రయందు భద్రపరుపబడుచున్నాడు. ఈ ప్రవర్గ్యవిధియందు ఉపయోగింపబడుసామాగ్రి) లన్నిటిలో ప్రధానమైనది మట్టికుండ



ఈమృత్తికాపాత్రకు " ఘర్మ " లేక " మహావీర " యని పేరు. అధ్వర్యు డీకుండను వేదికపై బెట్టి దానిచుట్టు వర్తులాకారముగ * మట్టికట్టను వేయును. అంతట యీకుండను బాగుగకాచి, రెండు కట్టెలతోపైకెత్తి యివతలబెట్టి, దానిలో అప్పుడు పితికిన ఆవుపాలను పోయును. పిమ్మటదానిలో మృతవత్సయైన మేకపాలుపోసిబాగుగ కలియబెట్టును. అటు పిమ్మట యీకలియబెట్టినపాలలో కొన్నింటిని ఆహవనీయాగ్నియందు హోమముజేయును. మిగిలినవానిని హోత్రియే త్రాగును.

ఐ. బ్రా. (I. 22) యీ ప్రవర్గ్యవిధి కీవిధముగ అర్థము చెప్పుచున్నది. " పాత్రలోనున్నపాలు బీజము ; అగ్నియేగర్భము ; ( అగ్ని దేవతలకు గర్భమనుట ప్రసిద్ధమే ) ఈ బీజము దేవతలగర్భమగు అగ్నియందు ఆధానముచేయబడియున్నది." ఈ విధముగ సూర్యుడు ( లేక యజ్ఞము, లేక సంవత్సరము ) బీజరూపముగ భద్రపరుపబడి, తిరిగి సకాలమందు పునరుజ్జీవితుడుగ చేయబడుచున్నాడు.

ఈ మృత్తికా పాత్రయందు పాలుపోయుచు పఠించు మంత్రము ఋ VIII, 72, 8 నుండి గ్రహింపబడినది. ఈ మంత్రముతోపాటు 6, 7, మంత్రములనుగూడ యిచ్చట తెలిగించెదను. ఉత్రోన్వన్యయన్మహాదశ్వావద్యోజనంబృహాత్

* ఈమట్టికట్టకు " ఖర " అనిపేరు. ఈ కట్టమవేయు మట్టిని గాడిద ( ఖర ) వీపుమీదవేసి తీసికొనివచ్చుటచే దానికాపేరు వచ్చెను.

దామారథస్యదదృశే॥ దుహన్తి సప్తైకాముపద్వా పంచసృజతః। తీర్థే సిన్ధోరధిస్వరే॥ ఆదశభిర్వివస్వత ఇంద్రః కోశమచుచ్యవీత్। ఖేదయాత్రి వృతా దివః॥

6 వ మంత్రము :– “ఇప్పుడు ఆతని గొప్పరథము, గుఱ్ఱములతోడను, రథమార్గముతోడను, గానవచ్చుచున్నది.

7 వ మంత్రము :– “ఏడ్గురు ఒకదానిని పితుకుచున్నారు. గర్జించుచున్న సింధు (సముద్ర) తీరమందు యిద్దరు అయిదింటిని సృజించుచున్నారు.”

8 వ మంత్రము :– వివస్వతునియొక్క పదియు నైన పిమ్మట, యింద్రుడు తనయొక్క ముప్పేటల సమ్మెటతో ఆకాశకలశమును క్రిందికి పడగొట్టెను. (యిది మృత్తికా పాత్రలో పాలుపోయునప్పుడు పఠించు మంత్రము.)

సూర్యరథమును గుఱ్ఱములును కనుబడెననగ క్షితిజముమీద ఉషస్సు కన్పట్టెనని అర్థము. ఇది ఆరవమంత్రమునకు భావార్థము. అంతట యేడ్గురు హోతృలువచ్చి యీ ఒక్కదానిని (అనగ ఉషస్సును) పాలుపితికి రెంటిని (అనగ రాత్రింబవళ్ళను) పుట్టించుచున్నారు. ఈరెంటివలన అయిదు (అనగ ఋతువులు) పుట్టుచున్నవి. — ఇది యేడవమంత్రముయొక్క భావార్థము. ఈ అయిదుఋతువులు గడచినపిమ్మట యేమిజరుగునో 8 వ మంత్రము చెప్పుచున్నది. వివస్వతునియొక్క పదియునైన పిమ్మట (అనగ, పదినెలలు గడచిన పిమ్మట) ఇంద్రుడు తన ముప్పేటల సమ్మెటతో ఆకాశ



కటాహమును (సూర్యుని) క్రిందికి పడగొట్టెను. — అనగ దివ్యజలముయొక్క మూడుకోశములు సముద్రములోనికి వంచివేయబడి ఖాళీచేయబడెను. ఈజలముతోపాటు సూర్యుడుకూడ అధోలోకమునకు పోయెను. VII, 101,4 ఏలననగ, సూర్యకాంతి మూడువిధములుగ నున్నదని ఋ VII, 101,2 చెప్పుచున్నది. తై॥సం॥లో(II. 1,2,5)కూడ సూర్యరశ్మి మూడువిధములని చెప్పబడియున్నది. ప్రాతఃకాలకాంతికి “వసంత” యనియు, మధ్యాహ్నకాంతికి “గ్రీష్మ” యనియు, సాయంకాలకాంతికి “శరత్” అనియు పేర్లు తై॥సం॥ యందు చెప్పబడినవి. దివ్యజలముయొక్క త్రిపథగమనము లేక సూర్యుని త్రివిధకాంతి ఇంద్రుని ముప్పేటల సమ్మెటగ యీ 8 వ మంత్రమందు ఉదాహరింపబడియున్నది. ఇదంతయు పదిమాసములైన పిమ్మట జరుగుపని. అటుపిమ్మట సూర్యుని యజ్ఞమును బీజరూపముగ భద్రపరుపబడి యుండిరి. ఇదియే “ప్రవర్గ్యవిధి” యను కర్మ.

సూర్యుడు ఆకాశమునుండి జారిపడుట యను నది యాజ్ఞికవాఙ్మయమందు తరుచుగవచ్చుచుండు క్రియయేగాని యిందుక్రొత్తయేమియు లేదు. యీయంశమే ఐ. బ్రా. IV. 18–లో వర్ణింపబడినది. తస్య పరాచోఽతిపాతాదబిభయుస్తం పరమైః స్వర్గైర్లోకైః పరస్తాత్ప్రత్యుత్తభ్నువన్॥ “సూర్యుడు తలక్రిందులైతమ్మును దాటిపోయిదూరముగ పడునేమో యను భయముచే అతనికి పోటీగపైన ఉత్తమ

లోకములనుంచిరి. ” ఈఋక్కునందు “ దూరముగపోయి పడుట”=పరాచోఽతిపాతాత్ — అను మాటచాలప్రధానమైనది. అనగ, సూర్యుడుతమకు ఆవలిప్రక్కనున్న అధోలోకమందు పడునని తాత్పర్యము. అశ్వినీదేవతలచే రక్షింపబడినవారిలో “ చ్యవను ” డొకడుకలడు. “చ్యవన” శబ్దము “చ్యు”=పడుట-అను ధాతువునుండి పుట్టినదని మాక్సుముల్లరు పండితుడు చెప్పుచున్నాడు. అశ్వినీదేవతలు చ్యవనునకు యౌవనమునొసంగిరి. అనగ,అధోలోకమందు పడిపోయిన సూర్యుడు తిరిగి పునరుజ్జీవనము నొందెనని భావార్థము.

ఇంతవరకు తేలిన సారాంశమేమనగ :— యాజ్ఞికవాఙ్మయమందు గల సూర్యపతనమునుగూర్చిన కథయే యింకొక మాదిరిగ (యీ పడిపోయిన సూర్యబీజము తిరిగి ప్రజనన మొందుటకై నిలువజేయుటగా) యీ “ ప్రవర్గ్యవిధి ” యందు వర్ణింపబడియున్నది. ఈ ప్రవర్గ్యవిధిలో పఠించు మంత్రమును పరిశీలించితిమేని దానియందు అయిదు ఋతువులతోడను, ౧౦ మాసములతోడను, నొప్పుచున్న ప్రాచీన సంవత్సరము సూచింపబడినట్లు స్పష్టమగుచున్నది.

ప్రాచీన వార్షికసత్రములయొక్క అవధిని (కాలపరిమితిని) గూర్చి స్పష్టముగ దెల్పు ప్రత్యక్ష వాక్యములనిక పరిశీలింతము. యజ్ఞమను సంస్థ ఒక్కభారతీయులందే గాక సమస్త ఆర్యసంతతులందును ప్రాచీనకాలమందు యేర్పడియుండెననుమాట నిర్వివాదమైనది. ఈ యజ్ఞముల యొక్క



నిజమైన భావార్థము కొంతకాలమునకు మరుగుపడిపోయినను యాజ్ఞికులు మాత్రము యీ యజ్ఞాదులలో చేయవలసిన ప్రతి చిన్నక్రియను బహుజాగ్రతగ యెన్నియో తరములనుండి విడిచిపెట్టకుండ లాగుకొనియే వచ్చుచుండిరి. ఈక్రియలకన్నిటికిని యేదోవిధమైన భావార్థమును చెప్పుటకై యాజ్ఞికులు ప్రయత్నించుచువచ్చిరి. కాని యెన్నివిధముల యత్నించినను భావార్థము పెగలని క్రియలు కొన్ని కర్మకాండయందు నిలిచిపోయెను. వానినేమియు చేయుటకు చేతగాక, “ ఇది అనాది నుండియు వచ్చుచున్న ఆచారము ” అని మాత్రము చెప్పుచు దానిని మాత్రము వదలిపెట్టకుండ, తరతరములనుండి లాగుకొని వచ్చుచుండిరి. ఈవిధముగ నిలిచిపోయిన వాక్యములను గూర్చియు క్రియలను గూర్చియు మన మిప్పుడు పరిశీలించి భావార్థమును తేల్చవలసియున్నది.

బ్రాహ్మణముల లోను, శ్రౌతసూత్రముల లోను, “ ఆదిత్యానాం అయనం ”, “ అంగిరసాం అయనం ”, “గవాం అయనం ” — మొదలగు వార్షికసత్రము లనేకములు వర్ణింపబడియున్నవి. ఇవన్నియు సూర్యుని వార్షికగమనమున కనుకరణముగ నేర్పాటుచేయబడినట్లు గాన్పించుచున్నవి. వైదికయజ్ఞము లన్నిటిలో నివి బహుపురాతనమైనవి. కనుక వీనియొక్క యవధియు (అనగ కాలపరిమితియు) తక్కిన వివరములును యజ్ఞకాండయందు విపులముగ చెప్పబడియున్నవి. ఇవన్నియు ఒక తేరకమైన యజ్ఞములు. వీనిలో వీనికిని విశేష

భేదమేమియు లేదు. వీనికన్నిటికిని "గవాం అయనం" అను యజ్ఞము ఆదర్శమైయున్నది. ఈనమూనానుబట్టియే తక్కిన యజ్ఞములుకూడ నడచును. దీనికి ప్రమాణము ఐ. బ్రా. IV, 17—వారు "గవాం అయనం" అను సత్రమును చేయుదురు. ఇందలి గోవులే ఆదిత్యులు. (మాసాధిష్ఠానదేవతలు. గవాం అయనమును చేసినందువల్ల వారు "ఆదిత్యానాం అయనము"ను గూడ చేసినట్లే" కనుక, గవాం అయనముయొక్క యవధిని మనము నిర్ణయించినచో, తక్కిన వారియొక్క యవధినికూడ నిర్ణయించినట్లే అర్థము వానిని ప్రత్యేకముగ పరిశీలించవలసిన పనియుండదు. యజ్ఞముల కన్నిటికిని నమూనాయైన యీ గవాం అయనము కర్మకాండయందు ఐ. బ్రా; తై. సం॥ లలో ముఖ్యముగ మూడు ప్రదేశములలో వర్ణింపబడియున్నది. వానినిట వివరించెదము. ఐ. బ్రా. IV, 17 గావోవై సత్రమాసత । శఫా ఛృంగాణిసిషా సత్యస్తాసాం దశమే మాసిశఫాః శృంగాణ్యజాయంత । తాఅబ్రువన్ యస్మై కామాయాదీక్షా మహ్యాపామ ముత్తిష్ఠామేతి । తాయా ఉదతిష్ఠం స్తా ఏతా శృంగిణ్యోఽథయాః సమాపయిష్యామః సంవత్సర మిత్యాసత తాసామశ్రద్ధాయా శృంగాణిప్రావర్తంత । తా ఏతా స్తూపరా ఊర్జం త్వసున్వం స్తస్మాదుతాః సర్వాన్ ఋతూన్ ప్రాప్త్వోత్తర ముత్తిష్ఠం త్యూర్జం హ్యాసున్వన్ సర్వస్యవై గావః ప్రమాణం సర్వస్య చారూతాం గతాః। సర్వస్యప్రేమాణం సర్వస్య చారూతాం గచ్ఛతి య ఏవం వేద॥



"(ఒకప్పుడు) ఆవులన్నియు చేరి, తమకు గోరిజలను కొమ్ములను సంపాదించుకొనుటకుగాను సత్రమును చేసెను. (ఈసత్రముయొక్క) పదియవ మాసమందు వానికి కొమ్ములును గోరిజలును వచ్చెను. అంతట అవి "మనము దేనిని కోరి యజ్ఞదీక్షితులమైతిమో ఆకోర్కె సఫలమాయెను. (యజ్ఞము పూర్తియైనది గనుక) మనమిక లేచెదముగాక" అని చెప్పెను. అంతటితో లేచినవానికి కొమ్ములుండెను. కాని సంవత్సరము పూర్తియగువరకు కూర్చుందము" అని చెప్పుచు (యజ్ఞమును నడుపుచునే) యున్నవానికి వానియొక్క అవిశ్వాసము చేత కొమ్ము లూడిపోయెను. వీరే కొమ్ములు లేనివారు (తూపరాః) వీరు (యజ్ఞమును సాగించుచు) వీర్యమును (ఊర్జమును) పుట్టించిరి. (ఇట్లు ౧౨ నెలలును యజ్ఞమును చేసిన) పిమ్మట ఋతువుల నన్నిటిని సంపాదించి, తుదకు వారు (మరల) లేచిరి. ఏలననగ :– (పోయినకొమ్ములు గోరిజలు మొదలగువానిని సంపాదించుకొనగల) శక్తిని లేక వీర్యమును (ఊర్జం) వారు పుట్టించిరి. ఈ రీతిగ ఆవులు సమస్తమైనవారికి ప్రేమపాత్రములయ్యెను. అందరిచేతను అలంకరింపబడెను".

యజ్ఞదీక్షవహించిన యావులకోర్కె పదిమాసములలోనే సఫలమునొందెనని యిట స్పష్టముగ విశదీకరింపబడియున్నది. అంతట కొన్నియావులు లేచిపోయెను. అంతటితో లేచిపోక యింక రెండు నెల లెక్కువ యజ్ఞముచేసిన ఆవులు "అవిశ్వాసము" గలవని చెప్పబడెను. ఈ యవిశ్వాసమునకు

ఫలితముగ, అవి తమకు లభించినకొమ్ములను పోగొట్టుకొన వలసివచ్చెను. దీనినిబట్టి తేలిన సారాంశమేమనగ:— సూర్య గమనమునుబట్టి ౧౨ మాసముల యవధిగలదిగ సంహితా బ్రాహ్మణములందు పేర్కొనబడిన "గవాం అయనం" అనబడు యీసత్రము ప్రాచీనకాలమందొకప్పుడు పదిమాసములలోనేపూర్తియయ్యెనని యిచ్చటస్పష్టముగ నిరూపింపబడియున్నది. దీనికి కారణమేమి? ౧౨ మాసముల యవధిగల వార్షిక సత్రము పూర్వము ౧౦ మాసములలోనే యేల ముగింపబడెను. ౧౨మాసములు యజ్ఞముచేసిన ఫలము ప్రాచీనులకు ౧౦ మాసములు యజ్ఞము చేసినంతమాత్రము చేతనే యెట్లులభించెను? ఇవి చాలముఖ్యమైన ప్రశ్నలు. కాని యీశంకలు ఐతరేయ బ్రాహ్మణమునకు తోచలేదు. కాని తైత్తిరీయ సంహితకుమాత్రమీశంకలు గలిగినవి. వారివారి యిష్టమునుబట్టి గవాం అయినమును ౧౦ నెలలలోగాని, లేక ౧౨ నెలలలోగాని ముగించవచ్చునని తై॥ సం॥ స్పష్టముగ చెప్పుచున్నది. కాని దీనికిగల కారణమేమియో తనకు తెలియదని తైత్తిరీయ సంహితయే యొప్పుకొనుచున్నది. "ఇది అనాదినుండియు వచ్చుచున్న ప్రాచీనాచార" మని మాత్రము చెప్పి యూరకొనుచున్నది. గవాం అయనమును గూర్చి యీతై॥ సం॥ యెట్లు వర్ణింపుచున్నదో చూతము —

తై॥ సం॥ VII, 5,1,1,2 గావోవా ఏతత్ సత్రమాసతా శృంగాః సతీః శృంగాణినో జాయంతా ఇతి కామేన। తాసాం



దశమాసా నిషణ్ణా ఆస న్నథ శృంగాణ్యజాయంత తా ఉదతిష్ఠ న్నరాత్స్మేత్యథయాసాం నా జాయంత తాః సంవత్సరమాప్త్వో దతిష్ఠ న్నరాత్స్మేతి। యాసాం చాజాయంత యాసాంచ న తా ఉభయీ రుదతిష్ఠ న్నరాత్స్మేతి। గోసత్రంవై సంవత్సరో య ఏవం విద్వాంసః సంవత్సర ముపయంత్యృధ్నువంత్యేవ తస్మా త్తూపరా వార్షికౌ మాసౌ పర్త్వా చరతి సత్రాభిజితం హ్యాస్యై తస్మా త్సంవత్సర సదో యత్కించ గృహే క్రియతే తదాప్త మవిరుద్ధ మభిజితం క్రియతే॥ "కొమ్ములులేని మనకు కొమ్ములు గలుగుగాక" యని కోరుచు ఆవులు కూడి సత్రము జేసెను. వారి సత్రము పదిమాసములు పట్టెను. అంతట వానికి కొమ్ములు రాగా "మా కోర్కె ఫలించె" నని చెప్పుచు అవి లేచెను. కాని కొమ్ములురాని గోవులు సంవత్సరమువరకు యజ్ఞమును చేసి "మా కోర్కె ఫలించె" నని చెప్పుచు లేచెను. కొమ్ములు వచ్చిన ఆవులు, కొమ్ములురాని ఆవులు—అన్నియుకలిసి "మా కోర్కె ఫలించె" నని చెప్పుచు లేచెను. ఈరీతిగ గోసత్రము వార్షికసత్రమైయున్నది. దీని నెరిగినవారు సంవత్సరమునుచేరి నిజముగ సుఖింతురు. కనుక కొమ్ములులేని (ఆవు) వర్షకాలము రెండునెలలును సంతోషముతో (మేయుచు) తిరుగును. సత్రమువలన గోవునకు కలిగిన ఫలితమిది. కనుక యీ వార్షికసత్రముచేసిన వారింటిలోనేపనిజేసినను అది సకాలమందు జయప్రదమగును; సక్రమముగను జరుగును."

బ్రాహ్మణములోని కథకును యీసంహితలోని కథకును కొద్దిభేదములుగలవు. సంవత్సరముపొడవునను యజ్ఞము చేసిన గోవులకు కొమ్ములురాలేదని సంహిత చెప్పుచున్నది. కాని వానికి "ఊర్జము" వచ్చుటకుమారుగ, హాయిగ రెండు నెలలు వర్ష కాలములో మేతదొరికెనని సంహితజెప్పుచున్నది. రెండు నెలలెక్కువ యజ్ఞముచేసినందుకు గలిగిన ఫలితమిది. కొమ్ములున్న గోవులు యీరెండునెలలలో హాయిగమేయ జాలకపోయెనని వ్యాఖ్యాతచెప్పుచున్నాడు! ఏలననగ, క్రొత్తగడ్డిమొలచిన ప్రదేశములందు గోవులకు కొమ్ములు ఆటంకముగనుండునట! కాని యీసత్రముయొక్క యవధి ౧౦ లేక ౧౨ మాసములుండవచ్చునను నంశమువాత్రము సంహితాబ్రాహ్మణములందు సమానముగనే యున్నది.

ఈకథయే తై॥ సం॥ యందింకొకసారి తరువాతి యనువాకములో నిట్లు వర్ణింపబడినది:- తైత్తిరీయసంహిత VII, 5, 2, 1-2. గావోవా యేతత్ సత్రమాసతా శృంగాః సతీః శృంగాణి సిషాసంతీస్తాసాం దశమాసా నిషణ్ణా ఆసన్నథ శృంగా ణ్యజాయంత తా అబ్రువన్నరాత్స్మోత్తిష్ఠామావతం కామమరుత్స్మహి యేన కామేన న్యషదా మేతి తాసాము త్వా అబ్రువ న్నర్ధావాయావతీర్వాఽఽసామహా ఏవేమా ద్వాదశౌ మాసౌ సంవత్సరం సంపాద్యోత్తిష్ఠామేతి తాసాం ద్వాదశే మాసిశృంగాణి ప్రావర్తన్త శ్రద్ధయా వాఽశ్రద్ధయా వా తా ఇమా యాస్తూపరాఉభయ్యో వావ తా ఆర్ధ్నవ



యాశ్చ శృంగాణ్యసున్వర్ యాశ్చోర్జమ వా రూంధతర్ధ్నోతి దశసుమాసూత్తిష్ఠ న్న్యృధ్నోతిద్వాదశసు య ఏవం వేదపదేనఖలు వా ఏతే యంతివిన్దతిఖలు వై పదేనయ న్తద్వా ఏతదృద్ధమయనంతస్మాదేతత్గోసని॥ "తమకు కొమ్ములు లేమిచే ఆవులుకొమ్ములను సంపాదింపగోరి యీసత్రమును జేసెను. ఈ సత్రముపదిమాసము లుండెను. అంతటకొమ్ములు మొలవగ, మనకోర్కెఫలించెను, యిక లేచెదముగాక. మనము కూర్చున్నకోర్కెతీరెను. కాని వానిలో షుమారు సగము ఆవులు మాత్రము, "మే మీరెండు నెలలుకూడ తప్పక కూర్చుని సంవత్సరమును ముగించిలేచెదము." అని చెప్పెను. వీరిలోనమ్మిన కొందరికి ౧౨వ మాసములో కొమ్ములు వచ్చెను నమ్మనివారికి యెప్పటి యట్లే కొమ్ములు లేకుండెను. ఈరీతిగ ఉభయులును—కొమ్ములువచ్చిన గోవులు, ఊర్జమును సంపాదించినగోవులును — తమకామితార్థమును పొందెను. దీనిని తెలిసికొన్నవాడు. ౧౦ వ నెలలోలేచినను, ౧౨వ నెలలో లేచినను సుఖియగుచున్నాడు. వారు నిశ్చయముగ పథమందు (పదేన) నడుచుచున్నారు. పథమందు నడుచువాడు నిశ్చయముగ (గమ్యస్థానమును) చేరుచున్నాడు. ఇది జయప్రదమైన అయనము. అందుచే యిది "గోసని" (గోవులకు లాభకరమైనది.) యని చెప్పబడుచున్నది."

వెనుకటి యనువాకములోని కథయే యిచట మరల కొద్దిమార్పులతో చెప్పబడినది. కాని దీనిలో రెండువాక్యములు

మాత్రము చాల ప్రాధాన్యముగ గన్పట్టుచున్నవి. (౧) ఈ యజ్ఞమును పదినెలలలో ముగించినను లేక ౧౨ నెలలో ముగించినను ఒకటే ఫలము గలుగునని చెప్పబడినది. (౨) దీనికి కారణమేమనగ, యిది అనాదినుండి వచ్చుచున్న ప్రాచీనాచారము. (పదేన) (ఇదియే పథము). ౧౨ నెల లుండవలసినట్టియు, యిప్పుడు నిజముగ ౧౨ నెలలు జరుగుచున్నట్టియు "గవాం అయనము" వంటి వార్షికసత్ర మొకప్పుడు పదినెలలలోనే పూర్తిచేయబచుండెను. తైత్తిరీయసంహితా కాలమునాటికి దీనికిగల నిజకారణమేమియో యెవరికిని తెలియదు. అందుచే యిది అనాది యాచారముగ నంగీకరింపబడెను. ఈకథ యేతండ్యబ్రాహ్మణమునందు కూడ గలదు. అచ్చటకూడ యీసత్రమునకు రెండు అవధు లంగీకరింపబడినవి.

ఈకథలో చెప్పబడిన 'ఆవు' లనగనేమో తరువాత విచారింతము. ప్రస్తుతము దీనికాలపరిమితిని పదినెలలు యజ్ఞమొనర్చు దశగ్వుల చరిత్రితో పోల్చిచూడగ తేలిన సారాంశమేమనగ:— వైదిక ఋషులయొక్క ప్రాచీనతరమువారు ధృవమండలములో సూర్యరశ్మి పదినెలలున్నచోట వసించియున్నప్పుడు వారు తమ వార్షికసత్రములను ఆపదిమాసములలోనే ముగించెడివారు. కాని పిమ్మట కొంతకాలమునకీయార్యసంతతులు ౧౨ నెలలు సూర్యరశ్మిగల దక్షిణభాగములకు వచ్చిచేరినప్పుడు యీవార్షికసత్రము ౧౦ నెలలే యుండుటకు సాధ్యమయ్యెడిదికాదు; అందుచే వారీసత్రిము



లను ౧౨ నెలలవరకు పొడిగించవలసి వచ్చెను. అయినను, ప్రాచీనాచారములందు వారికి మిగుల పట్టుదలయుండుటచే అనాదినుండియు వచ్చుచున్న యీపదినెలల యవధిని పూర్తిగవదలివేయుటకు వారు ఒప్పుకొనలేదు. కనుక యీ వార్షిక సత్రమునకీ పదినెలల యవధిని వైకల్పికముగ సంహితలయందు అంగీకరింపక తప్పినదికాదు. అందుచే దీనిని ప్రాచీనాచారముగ నంగీకరించుచు తైత్తిరీయ సంహిత యీపది మాసముల యవధిని ఉదాహరించెను. తక్కిన విషయముల నటుంచి మనమింతవరకు ఖండితముగ నిర్ధారణచేయవచ్చును. ప్రాచీనతమమగు వార్షికసత్రము పదిమాసముల యవధిని మాత్రమే గలిగియుండెననుట నిర్వివాదాంశము:—కారణము లేమైనగానిండు.

ప్రాచీన వార్షిక సత్రముయొక్క యవధి పదిమాసములుమాత్రిమే యేలయుండెనో తెలిసికొనజాలకపోయినది మన తైత్తిరీయసంహితను రచించిన ఋషులొక్కరే కారు సుమా! వీరితోపాటు యింకను కొందరుకలరు. ఇంగ్లీషు సంవత్సరములో చివరినెలకు యిప్పటికిని "డిశంబరు" అని పేరుగలదు. డిశంబర్ శబ్దము ల్యాటిన్ భాషనుండివచ్చినది. (ల్యాటిన్) 'డిశం' = (సస్కృత) 'దశన్' = పది; + (ల్యాటిన్) బర్ = (సంస్కృత) 'వార్' = కాలము లేకఅవధి కనుక, 'డిశంబర్' అనగ పదియవనెల యని యర్థము పూర్వము రోమన్ దేశపుపంచాంగములో పదినెలలుమాత్రమే

యుండెననియు, తరువాత కొంతకాలమునకు "న్యూమా" యను నాతడు వచ్చి మరిరెండు క్రొత్తనెలలను కలిపెననియు అందరికి తెలియును. దీనిని కొందరింకొకవిధముగ సమర్థింప జూచుచున్నారు. 'న్యూమా' క్రొత్తనెలలను కలుపలేదనియు, పూర్వపు పంచాంగములో చివరనున్న రెండునెలలను తీసికొనివచ్చి ముందుపెట్టెననియు సమాధానము జెప్ప జూచుచున్నారు. కాని రోమక్ నెలల పేర్లనుబట్టిచూడగ వీరి సమాధానము సరియైనది గాదని స్పష్టమగుచున్నది. ఎట్లనగ:— జులై నెలకు "క్వింటిలిస్" అనునది ప్రాతపేరు. "క్వింటిలిస్" అనగ "అయిదవ" అని అర్థము. ఆగస్టునెలకు "సిక్స్టిలిస్" = "ఆరవ" అనునది ప్రాతపేరు. సెప్టెంబర్ (సప్తమ లేక) 'యేడవ'నెలయని దానిపేరే చెప్పుచున్నది. అక్టోబరు (ఆక్టా=అష్ట) యెనిమిదవనెల; నవంబర్ (నవ=న్) తొమ్మిదవనెల; డిశంబర్ పదియవనెల. ప్రాతపంచాంగములో ౧౨ నెల లున్నమాట వాస్తవమైనచో మొదటినుండియు వచ్చుచున్న యీనెలలపేర్లయొక్క క్రమము ఆకస్మికముగ పదియవనెలతోడనే నిలిచిపోయి చివరి రెండునెలకుమాత్రము యేవో పేర్లు పెట్టబడెనని తలంచుటకువీలులేదు. కనుక ప్లూటార్కు పండితుడు చెప్పినట్లు "ప్రాచీనరోమక్ సంవత్సరములో ౧౦ నెలలేయుండెను గాని, ౧౨ నెలలు లేవనిచెప్పుటకు, అందు తుదినెలకు "డిశంబరు" అను పేరుండుటయే మనకు గొప్ప నిదర్శనము" దీనివిషయమై యెవరికైన నింకను సందేహ



మున్నచో," దశగ్వాదీర్ఘసత్రములగాథలను బట్టియు, గవాం అయనముయొక్క ప్రాచీనయవధినిబట్టియు ఆసంశయము విచ్ఛేదము గాగలదు. న్యూమాయను నతడు రెండుక్రొత్త నెలలను కలిపెనేగాని, వెనుకనున్న వానిని తీసికొనివచ్చిముందు పెట్టలేదని మాక్రోబియస్ పండితుడుకూడ స్థిరపరుచుచున్నాడు. పారశీకుల పంచాంగమీవిషయమై యేమిచెప్పుచున్నదో పిమ్మట విచారించెదము. మన మిప్పుడింతవరకు నిర్ధారణచేయగలము. ఏమనగ:—పురాతనమగురోమక్ సంవత్సరమునకు పదిమాసములే యవధియుండెను. పిమ్మట కొంతకాలమునకు—గవాం అయనముయొక్క యవధివలెనే—యిదికూడ ౧౨ మాసములకు పొడిగించబడెను. పూర్వపు సంవత్సరము ౧౦ మాసములేయేలయుండెనో, తదుపరి అదియేల ౧౨ మాసములుగ మార్చబడెనో యింతవరకెవరును కనుగొనజాలకపోయిరి. కాని, మన ధ్రువసిద్ధాంతము నాధారముగ గైకొన్నచో యీవైదికరోమక పరంపరలకు గల నిజకారణము కన్నులకు గట్టినట్లు గోచరముగాగలదు. రోమములును, భారతీయులును, ఆర్యసంతతులవారే. వీరందరుకలిసి మొట్టమొదట ధ్రువమండలమందు ౧౦ నెలల సూర్యరశ్మియున్న ప్రదేశములలో నివసించియున్నప్పుడు వారి సంవత్సరమునకు ౧౦ మాసములే యవధియుండెను. తక్కిన రెండుమాసములును దీర్ఘరాత్రియందు గలిసిపోయెను. ఈ దీర్ఘరాత్రియందే యింద్రుడు 'వల'తో

యుద్ధముజేసి ఆతనిచే బంధింపబడిన గోవులను విడిపింప యత్నించుచుండెను. ఈ దీర్ఘరాత్రియందే "హెర్క్యులిస్" తన ఆవులను దొంగిలించుకొనిపోయిన "కాకస్" అను రాక్షసునితో యుద్ధము జేయుచుండెను. ఈయార్యసంతతులు దక్షిణదేశములకు రాగనే, యిచ్చట సూర్యరశ్మి ౧౨ నెలలుండుటచే తమ సంవత్సరమునకు రెండు క్రొత్తనెలలు కలుపుకొనవలసివచ్చెను. ఇట్లు వీరు రెండుక్రొత్త నెలలను కలుపుకొన్నను ప్రాతసంవత్సరపు లక్షణములు కొన్ని యప్పటికిని మిగిలియేయుండెను. ఇట్లు మిగిలిపోయిన శేషములనుబట్టి పూర్వము పదిమాసముల యవధిగల సంవత్సరమును తదుపరి ౨ మాసముల యవధిగల దీర్ఘరాత్రియు వచ్చుచుండెనని నిర్ధారణమగుచున్నది. ఈయభిప్రాయమే ప్రాచీనగాథల వలనకూడ ధృవపడుచున్నది. ఈగాథల నింకొక యధ్యాయములో ముందు చర్చింపనున్నాము.

"గవాం అయనం" అనగ అర్థమేమి? నిజముగ ఆవులు యజ్ఞము చేసెనా? "ఈగోవులే ఆదిత్యులు" అని ఐతరేయబ్రాహ్మణము చెప్పుచున్నది. ఆదిత్యులనగ మాసాధిష్ఠానదేవతలు. ఇది నిజముగ సూర్యదేవతల సత్రము. ఒక్క భారతీయులలోనేగాక తదితర ఆర్యసంతతులవారి గాథలలో కూడ గోవులు రాత్రింబవళ్ళుగ వర్ణింపబడినవి. కనుక యీ సత్రమునకు నిజమైన భావార్థమును మన మిప్పుడు నిర్ణయింప వచ్చును. ఆర్యసంతతులయొక్క ప్రాచీనగాథలలో తరుచగ



వచ్చుచుండు గోవులనుగూర్చి మాక్సిముల్లరుపండితుని యభిప్రాయముల నిట క్లుప్తముగ దెలిపెదను.

"వేదవాఙ్మయమందు ఆవులు మూడుతరగతులుగ వర్ణింపబడినవి. (౧) నిజమైన ఆవులు. (౨) మేఘములలో నుండు ఆవులు; అనగ నీరు లేక పాలు. (౩) 'రాత్రి'యను చీకటి కొట్టమునుండి బయటికివెడలివచ్చు ఆవులు — అనగ, ప్రాతఃకాలమందలి, సూర్యకిరణములు — ఉషస్సు, లేక సూర్యకాంతి, ఉషస్సు చాలచోట్ల ఆవులతో పోల్చబడెను; వెంటనే ఉషస్సు కేవలము ఆవులే యని చెప్పబడెను. ఒకసారి యేవస్తువునైనను రెండవ వస్తువుతో పోల్చినప్పుడు యింకొకసారి యీ వస్తువు కేవల మావస్తువే యని చెప్పుట వేదమందు సహజమైపోయినది. ఈరీతిగ, యీ మూడుతరగతుల ఆవులును విడదీయుటకు వీలులేకుండ వేదవాఙ్మయమందు పెనవేయబడియున్నవి." దీనిని ధ్రువపరుచుటకు మాక్సిముల్లరు పండితుడనేక ఉదాహరణముల నిచ్చియున్నాడు. (ఋ I, 92, 1; I, 9, 3, 4; I, 62, 3; II, 19, 3; II, 24, 3; II, 3, 4, 1; V, 14, 4;) – యీప్రదేశములలో అవులనగ ఉషస్సులనిగాని, సూర్యకిరణములనిగాని సూర్యకాంతియనిగాని, లేక దినములనిగాని అర్థము. I, 32, 11 లో ఆవులనగ నీరనియర్థము. "పైనుదహరించిన వాక్యములలో చాలచోట్ల "ఇవ" = (వలె) అనుపదములు గానరావు. ఉషస్సులు మొదలగునవి చీకటికొట్టులోనుండి బయటికివచ్చిన

ఆవులవలె నున్నవని చెప్పక, కేవలము ఆవులే బయటికివచ్చిన వని చెప్పబడియున్నది. అదిగాక, ఒకఉషస్సు (ఏకవచనం) ఆవులకు తల్లి (మాతాగవాం) అనికూడ ఋ IV, 52, 2 చెప్పుచున్నది. ”

“ఆవులనగ ప్రాతఃకాలమందు గన్పడు యెర్రనిమేఘములని కుస్నిపండితుడు తలంచుచున్నాడు. కాని ప్రాతఃకాలమందెల్లప్పుడు మేఘములుండవు. అదిగాక, రాత్రియందీ మేఘములు బంధింపబడెననియు చెప్పుటకు వీలులేదు.

ఇంకొక ఆశ్చర్యకరమైన విశేషమేమనగ:—యీప్రాతఃకాలిక గోవులు ఒక్క వేదమందేగాక, తదితర ఆర్యసంతతులవారి పురాణగాధలలోకూడ గన్పట్టుచున్నవి. అవి యచ్చటి దినములతో పోల్చబడెననుట నిర్వివాదాంశము. ఆగాథలయందీ గోవులసంఖ్య 12 × 30=360 (మున్నూట అరువదిగ) చెప్పబడియున్నది.”—(ఇవిమాక్సిముల్లరు పండితుని యభిప్రాయములు.)

పురాణగాధలందు గన్పట్టు ఆవులునిజమైన ఆవులు కావు. అవి “పణి” యనురాక్షసునిచే దీర్ఘరాత్రియందు బంధింపబడిన “రాత్రింబవళ్ళ” నియే భావము. “గోవులు”అని యున్నచోట “రాత్రింబవళ్ళ”ని చెప్పి చదివిచూచినచో గవాం అయనముయొక్క నిజభావము తేటపడగలదు. కొమ్ములను సంపాదించుకొనుటకై ఆవులు పదినెలలు యజ్ఞముచేసెనను వింతకథకు అర్థమేమి? “పణి”యను రాక్షసుని బంధములనుండి బయటపడిన రాత్రింబవళ్ళనబడు గోవులు పూర్వము పది నెలలవరకు విహరించుచుండెను. అనగ, ఆర్యుల ప్రాచీన సంవత్సరము పదినెలల యవధినిమాత్రమే గలిగియుండెననియు, తదుపరి రెండుమాసములును దీర్ఘరాత్రిగ నుండెననియు, యీదీర్ఘరాత్రియందే రాత్రింబవళ్ళనబడు నీగోవులు అంధకారరాక్షసులచేత దొంగిలింపబడి బంధింపబడెననియు భావార్థము. ప్రాచీన రోమక సంవత్సరముకూడ పదినెలల యవధినిమాత్రమే గలిగియుండెనని పైన నిరూపించియుంటిమి. పారశీకవేదమగు “అవస్థ” గ్రంథమందుకూడ యీపదినెలల సంవత్సరమే వర్ణింపబడినది. పదినెలలైన పిమ్మట దుష్టరాక్షసులు ప్రపంచమునంతను కమ్మివేసి అతిచలిని, మంచును దెచ్చిపెట్టిరట. ఈవర్ణనలనుబట్టిచూడగ, గ్రీకు, పారశీక, భారతీయాది ఆర్యసంతతుల వారందరు ఒక్కజాతిగ ప్రాచీన కాలమందు ధ్రువమండలములో నివసించియున్నప్పుడే యీ పదిమాసముల సంవత్సరము వారిలో ప్రచారమయ్యెనని స్పష్టమగుచున్నది. ఇట్టి ప్రాచీనసంవత్సరముయొక్క చిహ్నములే ఋగ్వేదమం దిప్పటికిని నిలిచియున్నవి. ఇవి ప్రాచీన చరిత్రను దెలుపు నిదర్శనములుగ నున్నవి. వీనియొక్క నిజకీలక మెవరికిని తెలియకపోవుటచే, యివి యింతవరకును మహాపండితులకు సైతము దుర్గ్రాహ్యములుగనుండిపోయినవి.

ఆర్యులు ధ్రువమండలమందు నివసించియున్న మాటయే వాస్తవమైనచో ఒక్కపదిమాసముల సంవత్సరమేగాక,

అక్షాంశభేదములనుబట్టి 7, 8, 9, 11 మాసముల సంవత్సరములుకూడ యుండియుండవలెనుగద. అదితిగాథనుబట్టియు, ముప్పదిదినముల యుషస్సునుబట్టియు 7 మాసముల సంవత్సరముండెనని ఋజువగుచున్నది. నవగ్వుల చరిత్రినుబట్టి 9 మాసములసంవత్సరముండెనని విదితమగుచున్నది. ఇవిగాక, అంగిరసులలో పెక్కుతరగతులవారు (విరూపులు) గలరని చెప్పుటచే 7, 8, 9, 11 మాసములు యజ్ఞము చేయువారుకూడ గలరని తెలియుచున్నది. అనగ, 9, 8, 11 మాసముల సంవత్సరములుకూడ నుండెనని తెలియుచున్నది అయినను, అంగిరసులందరిలో నవగ్వదశగ్వులు ప్రధానులు. (అంగిరస్-తమ) అని చెప్పుటచే వీనియన్నిటిలో ౧౦ మాసముల సంవత్సరమే యెక్కువ ప్రచారములోనుండెననిగాని, లేకసగటున ౧౦ మాసముల సంవత్సరమే ప్రధానముగ గైకొనబడెననిగాని అర్థమగుచున్నది.

ఈయంశమునే తదితర జాతులవారి పురాణగాథలుకూడ బలపరుచుచున్నవి గ్రీకుదేవతయగు 'హేలియో'కు ౩౫౦ ఆవులును, ౩౫౦ గొర్రెలును నుండెనట దీనినిబట్టి, గ్రీకు సంవత్సరములో ౩౫౦ పగళ్ళును, ౩౫౦ రాత్రులును మాత్రమే యుండెనని మాక్సిముల్లరుపండితు డభిప్రాయపడుచున్నాడు. కాలుడగు కమ్మరివానికి 700 రింగులేయుండెనని జర్మనుగాథలు చెప్పుచున్నవి. అగ్నికి 720 మంది కొడుకులు గలరని ఋ I, 164, 11 చెప్పుచున్నది. ఈరెంటినిపోల్చిచూచి



జర్మనుల ప్రాచీనగాథలందుకూడ ౩౫౦ దినములసంవత్సరము గలదని మాక్సిముల్లరుపండితుడు తలంచుచున్నాడు. ఈప్రాచీన సంవత్సర మిప్పటి సౌర సంవత్సరమునకు ౧౫ దినములు కొరవడుచున్నది. ఇప్పటి సాధారణసంవత్సరమునకు ౧౦ దినములు కొరవడుచున్నది. ఆర్యులు ఉత్తరధ్రువమండలమును విడిచి వివిధశాఖలుగ చీలిపోకమునుపు ౩౫౦ దినముల సంవత్సరమే యుండియున్నచో, దీనికి వెనుకనే ౧౦, ౧౫ దినముల దీర్ఘరాత్రికూడ యుండియుండవలెను. సంవత్సరము ౩౦౦దినములే యైనచోట్ల, యీదీర్ఘరాత్రి ౬౦ దినములుండియుండవలెను. ఈరీతిగ స్థలభేదమునుబట్టి ఉత్తరధ్రువమండలమందు పలుతెరగులగు కాలపరిమితులుగల దీర్ఘరాత్రులుండియుండవలెను. ఇట్టిదీర్ఘరాత్రులలో యేరాత్రి యతిదీర్ఘమైనదో మనము శోధించవలసియున్నది. 'హేలియో' యొక్క ఆవులను(లేక యెడ్లను) గూర్చి మాక్సిముల్లరుపండితుడిట్లు చెప్పుచున్నాడు. (క్లుప్తీకరణము).

"ఈగ్రీకుగాథలో చెప్పబడిన గోవులే (యెడ్లే) వేదవాఙ్మయమందుకూడ గలవు, 'హేలియో' యొక్క ఆవులను "ఒడీసియస్" యొక్కసహచరులు తినివేసిరని యీగాథ చెప్పుచున్నది. దీనికి అర్థమేమోబోధపడుటలేదు. ఇదిగాక, "అపొలో" కు ౧౦౦ ఆవులు, ౧౨ యెడ్లు, ౧ ఆంబోతు ఉండెనట; ౫౦ యెడ్లేనని కొందరుచెప్పుచున్నారు అపొలో యొక్క యెడ్లను "హెర్మిస్" దొంగిలించి, వానిలో

రెంటిని చంపెనట. ఈకథగూడ అగమ్యగోచరముగనేయున్నది. ఈ "తినివేయుట," "దొంగిలించుట" అనగ నేమియో యూహించుటకు శక్యముగాకున్నది"

ఉత్తరధ్రువసిద్ధాంతము తెలిసియున్నచో మాక్సిముల్లరు పండితు డింతగందరగోళపడవలసిన యవసర ముండెడిది గాదు. "ఆవుల నెత్తికొనిపోవుట" యనగ భావము మన కిప్పుడు కరతలామలకమగుచునే యున్నది. అనగ, యిన్నిదినములు దీర్ఘరాత్రియందు గడచిపోయెనని భావము. స్థలభేదమునుబట్టి యీదీర్ఘరాత్రియందు పడిపోయిన దినములసంఖ్య (ఆవుల సంఖ్య) భేదించుచుండును. ఆవులను దొంగిలించుట యనునది వేదవాఙ్మయమందుకూడ కలదు. వృత్రాసురుడు ఆవులను దొంగిలించెను; కాని యెన్నిఆవులో చెప్పబడలేదు. కాని, I, 116, 16 – లో; 117, 18 – లో ఋజ్రాశ్వము (ఎఱ్ఱ గుఱ్ఱము) ౧౦౦, లేక ౧౦౧ గొఱ్ఱెలను చంపి, ఆడతోడేలునకు ఆహారముగ వేసెనట. ఈకథ పైగ్రీకు కథతో పోలుచున్నది.

ప్రాచీనసంవత్సరమునుగూర్చియు, అందు ముఖ్యముగ దీర్ఘరాత్రినిగూర్చియు, వైదికకర్మకాండయందు ప్రముఖమైన నిదర్శన మింకొకటి నిలిచియున్నది. కాని, యిది ఇటీవల దట్టముగ పెరిగిన వ్యాఖ్యానములలోను, భాష్యములలోను మరుగుపడి పూడిపోయి యున్నది. కనుక, దీనిని త్రవ్వి పెళ్ళగించుటకై, మన మిప్పు డిచ్చట సోమయాగముల



యొక్క సంపూర్ణచరిత్రను సమగ్రముగ పరిశీలింపవలసి యున్నది. ఈసోమయాగ మనునది చాల పురాతనసంస్థ యైనట్లు ఆర్యసంతతుల ప్రాచీనగాథలే వేనోళ్ళచాటుచున్నవి. కర్మకాండయంతటిలోను యీసోమయాగమే చాల పురాతనమైనది. ఋగ్వేదమం దిదియే ప్రధానవైదిక కర్మగ వర్ణింపబడినది. ౧౧౪ సూక్తములతో నొప్పుచున్న ప్రత్యేకమండల మొకటి దీనికొరకై ఋగ్వేదమందు ప్రత్యేకింపబడియున్నది. కనుక, దీనిని మనమిప్పుడు పలిశీలించి చూచి, యతిప్రాచీన సత్రములస్వభావ మెట్టిదో తెలిసికొందము.

సోమయాగమునకును తక్కిన యాగములకును గల ముఖ్యమైన భేదమేమనగ :– ఈ సోమయాగమందు సోమరసము తీయబడును. ఈ రసమును త్రాగుటకుముందు దీనిని దేవతల కర్పింతురు; ఇదియే ముఖ్యమైనభేదము. ఈ భేదము సోమయాగమను పేరునుబట్టియే తెలియుచున్నది. ఈ సోమరసము ఉదయ మొకసారి, మధ్యాహ్న మొకసారి, సాయంకాల మొకసారి— మొత్తముమీద దినమునకు మూడుపర్యాయములు అర్పింపబడును. దీని నర్పించుసమయమందు మంత్రముల పఠింతురు.

వానివాని కాలపరిమితినిబట్టి సోమ యాగములు మూడుతరగతులుగ విభజింపబడియున్నవి.

(౧) ఏకాహములు:— ఒకదినములో పూర్తియగునవి.

(౨) అహీనములు :— ఒకదినమునకంటె యెక్కువ ౧౩ దినములకంటె తక్కువకాలములో పూర్తియగునవి ;

(౩) సత్రములు:— ౧౩ దినములుగాని. అంతకెక్కువ, దినములుగాని పట్టునవి. ఈ సత్రములలో వెయ్యి సంవత్సరములు పట్టు సత్రములుకూడ గలవు.

I. ఏకాహముక్రిందికివచ్చున వేవనగ :—

(౧) అగ్నిష్టోమ ...............
(౨) అతిఅగ్నిష్టోమ
(౩) ఉక్థ్య ...
(౪) షోడశి ...
(౫) వాజపేయ...
(౬) అతిరాత్ర...
(౭) అప్తోర్యామ...

మొత్తముమీద యీ యేడును "జ్యోతిష్టోమము" యొక్క అంతర్భాగములనిగాని లేక రకములని గాని చెప్పవచ్చును.

ఈ యేడును ఒకతేరకమైన యజ్ఞములు. సోమరస మర్పించునప్పుడు చదువు మంత్రముల సంఖ్యలోను, చదువు విధములోను, అందుపయోగించు పాత్రలసంఖ్యలోను ఏవో కొద్దిమార్పులు తప్ప, వీనిలో వీనికి విశేషభేదములేవియు లేవు. ఈరకము యజ్ఞములతో మన కిప్పు డంతగ పనిలేదు.

II. ఇక రెండవ తరగతివి అహీనములు:— ఈతరగతి క్రిందికి వచ్చున వేవనగ:—



(౧) రెండు, మూడు, మొదలు ౧౨ రాత్రులవరకు పట్టు, ద్విరాత్ర, త్రిరాత్ర, 'చతురాత్ర' ములను పేర్లుగల సోమయాగములు 'ద్వాదశరాత్ర' ములవరకు గలవు.

(౨) "ద్వాదశాహ":— ఇది యీ తరగతిలో ప్రధానమైనది. ఇది ౧౨ దినములుపట్టును. (ఇది అహీనముగను, సత్రముగనుకూడ పరిగణింపబడుచున్నది.) దీనియందు జ్యోతిష్, గో, ఆయుస్, అను పేర్లుగల మూడు 'త్ర్యహ'ములున్ను ($3 \times 3 =$ ౯ దినములున్ను) $+$ ౧. పదియవదినమున్ను $+$ ౨ అతిరాత్రులున్ను=కలిసి మొత్తం ౧౨ దినములగుచున్నవి. ఈ 'త్ర్యహ'ములు మూటికిని కలిసి "నవరాత్ర" యని పేరు.

III. ఇక మూడవ తరగతివి సత్రములు:—

ఈ తరగతిలో వెయ్యి సంవత్సరములుపట్టు యాగములు కూడ చెప్పబడియున్నను యిందు ముఖ్యమైనవి వార్షికసత్రములే. తక్కినవానితో మన కిప్పుడు పనిలేదు. ఈ వార్షిక సత్రములలో ప్రధానమైనది "గవాం అయనం".

ఈ సత్రముల స్వభావమును పరిశీలించుటకు ముందు మనము "షళహ" అను పదమునకు అర్థ మేమో తెలిసికొనుట అత్యవసరమై యున్నది. షళహ = (షట్ + అహ), అనగ, ఆరురోజు లని అర్థము. (కర్మకాండయం దీపదము ఆరురోజులు చేయు కర్మకు పేరుగ పెట్టబడినది) అయిదు షళహాలు కలిసినచో ఒక నెల యగును. కనుక "షళహ"

యనునది "వారము", "పక్షము" వలె ఒకానొక కాలమాన మని తెలిసికొనవలెను. "షళహ" లోనున్న ఆరురోజులలో వరుసగ జ్యోతిష్, గో, ఆయుస్ — ఆయుస్, గో, జ్యోతిష్టోమములను పేర్లుగల ఆరుహోమములు జరుగుచుండును. కనుక, ప్రతి "షళహ" యు జ్యోతిష్టోమముతో ప్రారంభమై, జ్యోతిష్టోమముతో ముగియును. షళహాలో నిత్యము జరుగు హోమములందు సోమరస మర్పించు నప్పుడు పఠించు మంత్రముల లేక స్తోత్రముల క్రమమునుబట్టి యీ 'షళహా' లు "అభిప్లవ" షళహాలనియు, "పృష్ఠ్య" షళహాలనియు రెండురకములేర్పడెను. "పక్షముల" లో "శుక్ల", కృష్ణ భేదములున్నట్లే, "షళహాల" లో "అభిప్లవ," "పృష్ఠ్య" యను భేదము లేర్పడెను.

వార్షిక సత్రమందు ప్రధానముగ కొన్ని "షళహ" లుండును. వీనికితోడు సత్రముయొక్క ఆద్యంతములందును, మధ్యయందును, ప్రత్యేకముగ కొన్నిక్రియలునడుచును. సత్రముయొక్క మధ్యదినమునకు "విషువత్" అనిపేరు. ఇది సత్రమును రెండుసరిసమానమైన భాగములుగ విభజించు చున్నది. ఈవిషువత్ దినము యజ్ఞదినములలో లెక్కపెట్ట బడదు. మొదటిభాగమందు జరిగినక్రియలే రెండవభాగ మందును తలక్రిందు క్రమముగజరుగును. ఇట్టి వార్షికసత్రము యొక్క నమూనా (model) యెట్లుండునో ఉదాహరణార్థమై యీక్రింద వివరించెదను.



వార్షికసత్రముయొక్క నమూనా (Model.)

| | | |
|---|---|---|
| (౧) | యజ్ఞోపక్రమణసంబంధమైన అతిరాత్రము .... | ౧. దినము. |
| (౨) | ఆరంభణీయ, లేక ప్రాయణీయ యను పేరుగల చతుర్వింశ దినము, ఇదియేసత్రమునకు నిజమైన ఆరంభము ... | ౧. దినము. |
| (3) | నెల ౧ కి ౪ అభిప్లవషళహాలు + ౧. పృష్ఠ్యషళహ చొప్పున ౫ నెలల వరకు, మొత్తము ౨౫ షళహాలు = (25 × 6=150 దినములు) ... | ౧౫౦. దినములు. |
| (౪) | మూడు అభిప్లవషళహాలు+ఒక పృష్ఠ్యషళహ ... ... | ౨౪. దినములు. |
| (౫) | 'అభిజిత్' దినము ... ... | ౧. దినము. |
| (౬) | మూడు "స్వర–సామ" దినములు ... ... | 3. దినములు. |
| (౭) | "విషువత్" దినము (ఇది యజ్ఞ మధ్యదినము ; ఇది లెక్కలోనికి రాదు) ... ... | |
| (౮) | మూడు "స్వర–సామ" దినములు ... ... | 3. దినములు. |

| | |
|---|---|
| (౯) "విశ్వజిత్" దినము ... ... | ౧. దినము. |
| (౧౦) (౧పృష్ఠ్య + ౩ అభిప్లవ) షళహాలు ... ... ... | ౨౪. దినములు. |
| (౧౧) (అ) నెల ౧ కి (౧ పృష్ఠ్య + ౪ అభిప్లవల) చొప్పున ౪ నెలల వరకు = ౨౦ షళహాలు=...౧౨౦ దినములున్ను + + (ఇ) ౩ అభిప్లవలు + గోష్టోమ + ఆయుష్టోమ + దశరాత్ర (౧౦. ది.)=........ ౩౦ దినములున్ను వెరశి ౧౫౦ దినములు. | ౧౫౦. దినములు. |
| (౧౨) మహావ్రతదినము. (ఇదిచతుర్వింశ దినమునకు) ప్రతిగనున్నది ... ... ... | ౧. దినము. |
| (౧౩) ఉపసంహార సంబంధమైన అతిరాత్రము ... ... | ౧. దినము. |
| | వెరశి ౩౬౦ దినములు. |

పైనుదహరించిన ౩౬౦ దినములను రెండుతరగతులుగ విభజింపవచ్చును. (౧) స్థిరమైన దినములు (౨) అస్థిరమైన



దినములు. పైప్రణాళికనుబట్టిచూడగ, యీవార్షికయజ్ఞములో ఉపక్రమోపసంహారములందలి అతిరాత్రములును, చతుర్వింశ మహావ్రతదినములును, అభిజిత్ విశ్వజిత్ దినములును, విషువనుకు ముందువెనుకలనుండు స్వరసామ్ దినములును, విషువన్ దినమును, ద్వాదశాహములోనున్న దశరాత్రమును కలిసి మొత్తము ౨౨ దినములు చాల ప్రధానమైనవి. ఈయజ్ఞములో ఇవియే స్థిరమైనవి. తక్కిన దినములు అభిప్లవ, పృష్ఠ్య షళహాలలో ఇమిడియున్నవి. ఇవి స్థిరమైనవి కావు. ఇష్టమువచ్చినట్లు యీదినములసంఖ్యను మార్పవచ్చును. ఈప్రణాళికనుండియే కొద్దిమార్పులతో అనేకసత్రము లుత్పన్నమగుచున్నవి. ఎట్లనగ:- గవాం అయనముయొక్క యవధి ౧౦ మాసములే యైనచో ౩౬౦ దినములలో ౨ నెలలను కొట్టివేయవలెను. ఈరెండు నెలలను స్థిరమైనదినములలోనుండి కొట్టివేయుటకు వీలులేదు. కనుక, అస్థిరభాగము నుండియే కొట్టివేయవలెను. అనగ, పైప్రణాళికలో (౩), (౧౧) భాగములనుండి చెరిఅయిదు షళహాలను కొట్టివేసినచో గవాం అయన మేర్పడును. మరియు పైప్రణాళికలోనున్న షళహాలనన్నిటిని అభిప్లవషళహాలుగ మార్చినచో "ఆదిత్యానాం అయన" మేర్పడుచున్నది అట్లే షళహాలనన్నిటిని పృష్ఠ్య షళహాలుగ మార్చినచో "అంగిరసాం అయన" మేర్పడుచున్నది. కాని, యీ చివరిరెండు అయనములలోను మొత్తము దినములు మాత్రము ౩౬౦ గనే నిలిచియున్నవి. ఈప్రణాళికలో ౬

దినములుతగ్గించి ౩౫౪ దినములే యజ్ఞముచేసినచో "ఉత్సర్గిణాం – అయన" మేర్పడుచున్నది.

ఈ రీతిగ ఆయా ప్రదేశములందుండు సంవత్సరము యొక్క కాలపరిమితికిని, తదితర లక్షణములకును సరిపోవు నట్లు నమూనాగా పైన నుదహరించిన ప్రణాళికలోని అస్థిర భాగములలో కొలది సవరణలను మాత్రము చేసికొనుచు, పలువురు పలుతెరగులగు యజ్ఞములను చేయుచుండిరి. ఈ కొలదిభేదములను వదలి చూచినచో యీ సత్రములన్నియు మొత్తముమీద ఒక్క నమూనాగానేయుండును. ప్రధాన కర్మలు అన్నిసత్రములలోను స్థిరముగనేయున్నవి. విషువత్, అభిజిత్, విశ్వజిత్, స్వరసామ దినములలో నేయేకర్మలను చేయవలెనో బ్రాహ్మణములందును, శ్రౌతసూత్రములందును విపులముగ వివరింపబడియున్నవి. అతిరాత్ర, చతుర్వింశదినములం దేయేకర్మల జేయవలయునో ఐతరేయబ్రాహ్మణము విపులముగ జెప్పుచున్నది. చతుర్వింశ దినమందు ౨౪ రకముల స్తోమములను పఠింపవలసియుండుటచే దాని కా పేరు వచ్చినదట. ఇదియే సత్రమునకు నిజమైన ఆరంభము. మహావ్రతదినముతో సత్రము నిజముగ ముగిసిపోవును. ఈ దినమందు చేయవలసిన క్రియలు విపులముగ, ఐతరేయబ్రాహ్మణము IV, 14 లో గలవు. మహావ్రతదినమందలి కర్మప్రవర్గ్యవిధిని పోలియున్నది. "పైరాత్రిబీజమును నిలువజేసి మహావ్రతకర్మవలన యీ బీజము తిరిగి మొలకెత్తునట్లుజేయును."



సకాలమందు మరల మొలకెత్తుటకై యజ్ఞబీజమీరీతిగ భద్రపరుపబడినది. ఇదియే మహావ్రతకర్మ – ఇదియే ప్రవర్గ్యవిధియని పైనదెలిపియుంటిమి. గతించిన పాపసంవత్సరమునకును, ముందురానున్న క్రొత్తసంవత్సరమునకును యీమహావ్రతకర్మ యొకవిధమైన "లంకె"గ నున్నది.

ఇంకొకవిశేషమేమనగ:- ఈసత్రముయొక్క తుదిభాగమందువచ్చు ద్వాదశాహమును–అందులో ముఖ్యముగ ౧౦ రోజులును– చాల ప్రధానములుగనున్నవి. ఇట్లే సత్రముయొక్క ఉపక్రమోప సంహారములందలి అతిరాత్రములును చాల ప్రధానమైనవి.

ఆర్యులు ధ్రువమండలమును వదలివచ్చినపిమ్మట రచించిన యాజ్ఞికవాఙ్మయమందు గన్పట్టుచున్న ౩౬౦ దినముల పరిమితిగల వార్షికసత్రముయొక్క నమూనాను (ప్రణాళికను) పైనవివరించియుంటిమి. కాని; యింతకుపూర్వము ధ్రువమండలమందున్నప్పటి సత్రముయొక్క స్వభావ మెట్లుండునో మనమిప్పుడు విచారింపవలెను. దీనికొరకై మనమిప్పుడింకొక రకము సోమయాగములను పరిశోధింపవలయును. వీనికి రాత్రిక్రతువులనిపేరు.

సోమయాగములలో ఏకాహములనియు, అహీనములనియు, సత్రములనియు — మూడుతరగతులు గలవని పైన

జెప్పితిమి. రెండవతరగతివైన అహీనములలో ద్విరాత్ర, త్రిరాత్రములను పేర్లుగల సోమయాగములు "ద్వాదశరాత్రము"లవరకు గలవనికూడ జెప్పియుంటిమి. కాని, యీ జాపితా యింతటితో ఆగలేదు. ఇవిగాక, యింకను త్రయోదశరాత్ర, చతుర్దశరాత్రములను పేర్లుగల సోమయాగములు "శతరాత్ర"మువరకు గలవు. ఈ జాపితా "శతరాత్ర"తో నిలిచిపోవుచున్నది. వీని కన్నిటికిని కలిసి "రాత్రిక్రతువు"లని పేరు. (ఇవి రాత్రులందు జేయబడు క్రతువులని ముందు నిరూపింప నున్నాము.) ఇవి 'నూరు'వరకుమాత్రమే కలవు అంతకుపైన లేవు. ఈ నూరింటిలో ౧౨ రాత్రులవరకు అహీనవర్గములోను, ౧౩ నుండి — ౧౦౦ వరకు 'సత్ర' వర్గములోను చేర్చిరి. ఈ కృత్రిమవిభాగమును మన మంతగ పాటింపవలసిన పనిలేదు. ఏది యెట్లున్నను మొత్తముమీద ౨ మొదలు ౧౦౦ రాత్రులవరకు వివిధకాలపరిమితులుగల రాత్రిక్రతువులను పేరుగల యింకొకరకము సోమయాగములు తైత్తిరీయసంహిత, బ్రాహ్మణములు, శ్రౌతసూత్రములందు స్పష్టముగ వర్ణింపబడియున్నవి. వీనియొక్క సంఖ్యను గూర్చిగాని, స్వభావమునుగూర్చిగాని, అవధులనుగూర్చిగాని యెట్టి సంకోచములును లేవు. ఈ రాత్రిక్రతువులసంఖ్య ౯౯. అతిరాత్రక్రతువునుకూడ వీనికి గలిపినచో రాత్రిక్రతువుల సంఖ్య మొత్తము నూరగును.



మనమిప్పుడు విచారింపవలసిన యంశమేమనగ:-ఇన్ని సోమయాగములుండగ వీనిలో యీనూరుమాత్రమే యేల "రాత్రిక్రతువు"లని చెప్పబడినవి? ఈరాత్రి క్రతువులసంఖ్య నూరుమాత్రమే యేలయుండవలెను? నూరురాత్రులకంటె యెక్కువ పరిమితిగల రాత్రి క్రతువులేలలేవు? "రాత్రి" యనగ కర్మకాండయందు "దినము" అని అర్థముచేసికొనవచ్చునని మీమాంసకులు సమాధానము చెప్పుచున్నారు. శతరాత్రమనగ నూరుదినముల యవధిగల యజ్ఞమని వారి సమాధానము. ప్రాచీనకాలమందు కాలమానమును తెలిసికొనుటకు చంద్రుడే ప్రధానసాధనముగనుండెను. గనుక దినములకు రాత్రియను నామధేయముకూడ ప్రచారములోనుండియుండవచ్చును. దీనినిబట్టికూడ మీమాంసకులయర్థమును ఒకవిధముగ ఒప్పుకొనవచ్చును. అయితే యింతమాత్రముచే పైప్రశ్నలు పరిష్కరింపబడజాలవు. రాత్రియనగ దినమని యొప్పుకొన్నను యీరాత్రి క్రతువులవరుస నూరురాత్రులతోడనే నిలిచిపోనేల? తిరిగి ౩౬౦ దినములయజ్ఞము వచ్చువరకు యీలోపుగ నెట్టియజ్ఞము (రాత్రిక్రతువు) గాని యేల లేకపోయెను? ఒకటి మొదలు నూరువరకు క్రమముగ వచ్చినయజ్ఞములవరుస యింత ఆకస్మికముగ నూరువద్ద తెగిపోనేల? తిరిగి ౩౬౦ దినముల సత్రమువచ్చువరకు యీ మధ్య యింతపెద్దగండి పడనేల? నూటికిని, మున్నూటఅరువదికిని మధ్య యింతపెద్దఖాళీ యేలయుండెనో యింతవరకెవరును తగిన సమాధానము చెప్పలేదు.



గవాం అయనమువంటి యేవార్షికసత్రములోను చేరకుండ, "రాత్రిక్రతువు" లనుపేరుతో ఒకనూరు సోమయాగములు కర్మకాండయందు ప్రత్యేకమొకవర్గముగ—కేటాయింపుగ—నిలిచిపోయినవి. ఇవి యిట్లెందులోను చేరకుండ యేల ప్రత్యేకముగ నిలిచిపోయినవో యింతవరకెవరును చెప్పలేదు. వీనియొక్క యవధి నూరురాత్రులకంటె యేల యెక్కువలేదో యెవరును తెలిసికొనలేదు. చాలకట్టుదిట్టములతో నొప్పుచున్న సోమయాగ పద్ధతియందీనూరు క్రతువులు మాత్రమే యెందులోను చేరకుండ దూరముగ, ఒంటరిగ, యేలనిలిచిపోయెను? ఇన్నియుగములు గడచినపిమ్మట నేనిప్పుడీ ప్రశ్నలకు సమాధానము చెప్పబోవుట అతిసాహసముగ గన్పట్టవచ్చును. కాని మన ఉత్తరధ్రువ సిద్ధాంతము నాధారముగ గైకొన్నచో యీప్రశ్నలకు చక్కని సమాధానము కుదురునని నాకు గట్టిగతోచుచున్నది. కనుక, యీవిషయముపై నాకున్న యభిప్రాయముల నిట వివరించెదను.

అతిరాత్రక్రతువు యీకాలమందుకూడ రాత్రియందే చేయబడుచున్నది. ఈశబ్దములోని "రాత్రి"కి రాత్రియనియే యర్థమిప్పటికిని చెప్పబడుచున్నది. అట్లయినచో, ద్విరాత్ర, త్రిరాత్రాది శబ్దములలోనుండు రాత్రిశబ్దమునకుకూడ రాత్రియనియే యేల అర్థము చెప్పకూడదు? సోమరసమును రాత్రిపూట తీయుటకు వీలులేదు గనుక రాత్రియని అర్థము చెప్ప

కూడదని కొందరనుచున్నారు. కాని, యీయభ్యంతరము నిలువజాలదు. ఏలననగః– అతిరాత్రి క్రతువునందు సోమ రసము మామూలుగనే రాత్రియందుతీయబడి మూడు "పర్యా యము"లు ఇంద్రునకు అర్పింపబడుచున్నది. అతిరాత్రక్రతువు ప్రతిసత్రమునకు ఉపక్రమోపసంహారము లందాచరింపబడు చున్నది. అసురులు చీకటిలో దాగుకొనిరి. దేవతలు వెలు తురులో నుండిరి. ఈరాక్షసులను చీకటిలో నుండి వెడల గొట్టుటకై దేవతలుపూనిరి. కాని, యీపనికై దేవతలందరి లోను ఇంద్రుడొక్కడు తప్ప తదితరు లెవరును సాహసింపరైరి. ఇంద్రుడు మరికొందరిని వెంటబెట్టుకొని, చీకటికోటను ప్రవే శించి మొదటిపర్యాయపు సోమరసముతో రాక్షసులను రాత్రి యొక్క ప్రథమభాగమునుండి తరిమివేసెను; రెండవపర్యా యపు సోమరసముతో రెండవభాగమునుండి తరిమివేసెను; మూడవపర్యాయపు సోమరముతో మూడవభాగమునుండి పూర్తిగ వెడలగొట్టెను. దీనినిబట్టి సోమరసము రాత్రియే తీయబడెననియు, రాత్రియందే మూడుపర్యాయములు ఇంద్రునకర్పింపబడెననియు, యీరసమును త్రాగి ఇంద్రుడు ఉత్సాహవంతుడై రాక్షసులను (చీకటిని) తరుమగొట్టె ననియు స్పష్టమగుచున్నది.

ఇట్టి అతిరాత్రక్రతువే పారశీగ్రంథములందు కూడ వర్ణింపబడెను. రాత్రిలో మూడుభాగములు (త్రిష్వె) గల వట. మొదటి భాగమందు అగ్నిగృహ యజమానుని



మేల్కొలిపి, "అజి" (సంస్కృతం–అహి) అను రాక్ష సుడు అసురులచే ప్రేరేపింపబడి నామీదికి వచ్చి నన్ను చంపజూచుచున్నాడు. కనుక, నేనిప్పుడు మిక్కిలి తేజస్సుతో ప్రకాశింపవలసియున్నది; నీవిప్పుడు వెంటనే లేచి మొలదట్టీ (కోష్టి) బిగించి, కట్టెలనుతీసికొనిరా" అని చెప్పును. ఈరీతిగనే, అగ్నిగృహాయజమానుని మూడు 'పర్యాయము'లు మేల్కొలిపిచెప్పును. ఈకథ యింద్రునకు మూడుపర్యాయములు సోమరసమర్పించుటనుబోలియున్నది. మొలదట్టీ (కోష్టి) బిగించి కట్టెలుతెచ్చుటయు, సోమరసము తీసి అర్పించుటయు రాత్రిపూటయందేజరిగెను. ఈకథపారశీకు లందుగూడనుండుటచే అతిరాత్రక్రతువు చాలపురాతనమైన దని స్పష్టమగుచున్నది.

• అతిరాత్రిక్రితువు ఒక్కరాత్రితోనే పూర్తియగును; ఒకరాత్రి పరిమితిగల అతిరాత్రిక్రితువునకుచెప్పిన సమా ధానమే ౨, ౩, ౪, ౫, ... ౧౦౦ రాత్రుల పరిమితులుగల తక్కిన ద్విరాత్ర, త్రిరాత్రాదిక్రతువుల కేలచెప్పరాదు ? ప్రాచీనులగు ఆర్యులు తమయజ్ఞములను పదినెలలలోనే ముగించెడివారనియు, వీరి యజ్ఞములు కాగనే దీర్ఘరాత్రి వచ్చెడిదనియు యిదివరకుచెప్పి యుంటిమి. అయితే, యీ యార్యులీదీర్ఘరాత్రియందేమిచేయుచుండిరి? రెండునెలలును యెడతెగకుండ నిద్రపోవుచునేయుండిరా? ఇప్పుడుకూడ ఉత్తర ధ్రువమండలమందు "లాపు" లను నొక జాతిమనుష్యులు శిశి

సించుచునేయున్నారు. వారీదీర్ఘరాత్రియందు సదా నిద్రపోవుచునేయుండరు. మనమిచ్చట సూర్యగమనమువలన రాత్రింబవళ్ళనుగుర్తించినట్లే "లాపు" లుకూడ బహు కాలాభ్యాసముచే ఆదీర్ఘరాత్రియందు నక్షత్రములయొక్క ఉచ్చ, నీచలనుబట్టి రాత్రింబవళ్ళ సంజ్ఞ నేర్పరుచుకొనిరి." అని ఆదేశమును చూచివచ్చిన "పాల్ డు – చైలు" అను నాతడు చెప్పుచున్నాడు. ఇట్లేర్పరచుకొన్న రాత్రిపూటయందే వారు నిద్రపోదురు. తక్కినప్పుడు యేవో వ్యాపారములను చేసికొనుచుందురు. కనుక, యీనాడీ "లాపు" లు చేయుచున్నట్లే, ఆనాడు ఆర్యులుకూడ చేసియుండిరనుకొనుటలో ఆశ్చర్యమేమున్నది. ప్రాచీనులగు ఆర్యులు పదిమాసములు యజ్ఞములు చేసినపిమ్మట రెండు నెల లెడ తెగకుండ నిద్రపోయియుండరు. "వల" తో జరుగనున్న యుద్ధమందు యింద్రునకు తోడ్పడుటకై ఆర్యులు పదిమాసములు యజ్ఞములు చేసిరి; ఇప్పుడు యుద్ధముతీవ్రముగ ప్రారంభమైనది; యిప్పుడే యింద్రున కెక్కువ సహాయము గావలసియున్నది; పాపమింద్రుడు 'వల' తో పోరాడుచుండగ, ఆర్యులు ఆతని కేమియు తోడ్పడకుండ — ఒకగిన్నెడు సోమరసమైన నివ్వకుండ — కాళ్ళుపారజాపుకొని సోమరులై ఆర్యులు నిద్రపోవుచుండిరా? అట్లయినచో, అసలు యజ్ఞములయొక్క మూలసిద్ధాంతమే కూలిపోవును. కనుక, యీదీర్ఘరాత్రులందు ఇంద్రున కుత్సాహముగల్గించుటకై ఆర్యు లీరాత్రిక్రతువులను చేయుచు, ఇంద్రునకు సోమరస మర్పించుచుండిరి.



ధ్రువమండలమందు అక్షాంశభేదములనుబట్టి దీర్ఘరాత్రి కొన్నిచోట్ల 3 నెలలును, మరికొన్నిచోట్ల ౧ నెల, ౨ నెలలును, మరికొన్నిచోట్ల, ౨, 3, ౪, ౫ ... 3౦ రోజులునుకూడ నుండవచ్చునుగద. కనుక ఆయా ప్రదేశములలో నుండు దీర్ఘరాత్రులయొక్క అవధులనుబట్టి ద్విరాత్రి, త్రిరాత్రాదిక్రతువులు చేయబడుచుండెను. దీర్ఘరాత్రి ౨ రోజులున్నచోట ద్విరాత్ర క్రతువుచేయబడెను; పదిరోజులున్నచోట దశరాత్రక్రతువును, ౧౦౦ రోజులున్నచోట శతరాత్రక్రతువును చేయబడుచుండెను. శతరాత్రక్రతువులతో యీరాత్రిక్రతువులు నిలిచిపోయెను. అంతకుపైన లేవు. అనగ, మనయార్యులున్నచోట ౧౦౦ రోజుల దీర్ఘరాత్రికంటె యెక్కువ దీర్ఘరాత్రిలేదనిభావము. ఈభావమును బలపరుచుటకు అదితిగాథయే ప్రబల ప్రమాణముగ నున్నది. ఈగాథనుబట్టి ౭ మాసముల సూర్యరశ్మిగల ధ్రువమండలప్రదేశము సూచింపబడుచున్నది. దీనికిముందు 3౦ రోజులు ఉషస్సును, వెనుకప్రక్కను 3౦ దినముల 'యీ రెండ' యు కలిపినచో మొత్తము వెలుతురు ౯ మాసములుండును. తక్కిన మూడుమాసములును (౯౦ రోజులే ౯౫ రోజులును) దీర్ఘరాత్రియే. ఇంతకుమించిన దీర్ఘరాత్రిని ఆర్యులెరుగరు. ఈలెక్క పైనవివరించిన ౧౦౦ రోజుల పరిమితిగల 'శతరాత్ర' క్రతువుతో సరిపోవుచున్నది. నూరు రోజులకెక్కువ దీర్ఘరాత్రిలేదుగనుక, నూరురోజుల పరిమితి

గల "శతరాత్ర" క్రతువునకంటె యెక్కువ పరిమితిగల రాత్రి క్రతువులును లేవు.

ఉషస్సునుగూర్చియు, యీరెండనుగూర్చియు ప్రత్యేక క్రతువులుండుటచే యివి రాత్రిక్రతువులలో చేరవు. కనుక, రాత్రిక్రతువులసంఖ్య నూరింటితోడనే నిలిచిపోవుట మిక్కిలి సహజముగనున్నది. ఎందునను చేరక ప్రత్యేకముగ నిలిచియున్న రాత్రిక్రతువులనుగూర్చియు అందు ముఖ్యముగ "నూరు" అనుసంఖ్యనుగూర్చియు, యింతసరళమగు భావార్థము ఒక్కధ్రువసిద్ధాంతము పైననేతప్ప మరి యేయితర సిద్ధాంతముపైనను కుదురదు. దీనినిబట్టి ఒకమాసము ఉషస్సును ౭ మాసములు సూర్యకాంతియు, ఒకమాసము యీరెండయు, 3 మాసములు దీర్ఘరాత్రియుకలిసి ప్రాచీన కాలమందొకప్పుడు ఆర్యులకు సంవత్సరముగ నేర్పడెనని యీరాత్రిక్రతువుల చరిత్రమువలన ధ్రువపడుచున్నది.

ఈయంశమును బలపరుచుట కింకొక ప్రబలప్రమాణము గలదు. ఇంద్రునకు "శతక్రతు" అను నామధేయము ఋగ్వేదమందు గలదు. ఇటీవల ప్రబలిన పురాణములలో కూడ ఇంద్రుడు నూరుక్రతువులకు అధిపతియనియు, నూరుక్రతువుల కధిపతియైనవాడే ఇంద్రపదవికి అర్హుడనియు కూడ చెప్పబడియున్నది. ఈపురాణగాథకును, ఋగ్వేదమందున్న 'శతక్రతు' నామధేయమునకును సంబంధములేదనియు, వేదములో ఇంద్రునకు చెప్పబడిన "శతక్రతు" పదమునకు



"నూరుశక్తులకు అధిపతి" యని భావమనియు శాయనాచార్యులవారును, వారిననుసరించి పాశ్చాత్యపండితులుకూడ వ్రాసియున్నారు. కాని, నూరురాత్రిక్రతువుల యుత్పత్తినిగూర్చి నేను పైనచేసిన వివరణము నిజమైనచో, ఇటీవల పురాణములలో ప్రబలినగాథ కేవలము ఋగ్వేదమందున్న శతక్రతునామధేయము పైననే ఆధారపడియున్నదని చెప్పక తప్పదు. ఈ నూరురాత్రిక్రతువుల కింతవర కెవరును సరియైన సమాధానము చెప్పలేదు. దీర్ఘరాత్రియందు "వల" యను రాక్షసునితో పోరాడుటకు సాహసించినది ఇంద్రు డొక్కడే. ఈ యింద్రుని గూర్చియే యీ నూరురాత్రిక్రతువును చేయబడినవి. కనుక, ఇంద్రుడు నూరుక్రతువులకు అధిపతియనుట యెంతయు సమంజసముగ నున్నది. ఇట్లు నూరుదినములు "వల"తో, చీకటియందు పోరాడి, నూరుక్రతువుల కధిపతియైనవాడీ ఇంద్రు డొక్కడే. కనుక "శతక్రతు" అను బిరుదునకును, ఇంద్రపదవికిని, యీ ఇంద్రు డొక్కడే అర్హుడు. అందుచేతనే, ఋగ్వేదమం దింద్రునకు "శతక్రతు" నామధేయము వచ్చెను. ఈ నామధేయములో నిమిడియున్న భావమునుబట్టియే ఇటీవలి పురాణములుకూడ ఇంద్రుడు నూరు యజ్ఞముల కధిపతి యయ్యెనని చెప్పినవి.

అయితే, ఇంద్రపదవికి అర్హత నిచ్చు యీనూరుక్రతువులును అశ్వమేధములని పురాణములు చెప్పుచున్నవి. దీనిని సమన్వయించుటెట్లు ? ఋగ్వేదమందు చెప్పబడిన శతరాత్రి

క్రతువు అశ్వమేధమా? ఈభేదమంతగ పాటింపదగినదికాదు. ఏలననగ:– అశ్వమేధముకూడ ఒకానొక సోమయాగమేకాని, వేరుకాదు. కర్మకాండయందు అశ్వమేధము రాత్రిక్రతువులతోపాటు వర్ణింపబడియున్నది. తైత్తిరీయసంహిత VII, 2, 11 లో —— అశ్వమేధమం దర్పింపవలసిన నూరు బలులు పేర్కొనబడియున్నవి. ఈబలులు లేక హోమములు ప్రజాపతికి "రాత్రియందు" అర్పింపబడెనని తై॥ బ్రా॥ III, 8, 15, 1– చెప్పుచున్నవి. కనుక, అశ్వమేధమం దర్పింపబడు హోమములు "రాత్రిహోమముల"ని చెప్పబడుచున్నవి. యజ్ఞాశ్వమెప్పుడు తిరిగివచ్చునో తెలియదు గనుక అశ్వమేధముయొక్క అవధికూడ యెక్కడను నిర్ణయింపబడలేదు. యజ్ఞాశ్వమనగ నీటిలో సంచరించుచున్నసూర్యుడని ఋ I, 163, 1 చెప్పుచున్నది. ఆయా ప్రదేశములలోనుండు దీర్ఘరాత్రియొక్క పరిమితినిబట్టి, రాత్రిక్రతువులపరిమితులవలెనే, యీయశ్వమేధముయొక్క పరిమితులుకూడ భేదించుచుండవచ్చును. కనుక, యజ్ఞాశ్వముతిరిగివచ్చుటయు, సూర్యుడు దీర్ఘరాత్రినితరించి తిరిగి యుదయించుటయు నొక్కటే. కనుక, యింద్రునకు సహాయార్థముగ దీర్ఘరాత్రియందు చేయబడినరాత్రిక్రతువులకును అశ్వమేధమునకును పోలిక సర్వవిధములచేతను విధాయకముగ సరిపోవుచున్నది. పూర్వము, ఋగ్వేదమందు శతరాత్రక్రతువుగ వర్ణింపబడిన సోమయాగమే యిటీవల పురాణములందు అశ్వమేధమను సోమయాగముగ వర్ణింపబడిన దనుటలో మహాశ్చర్యమేమియు లేదు. ఈరెండును ఒకపరంపరనే తెలుపుచున్నవి. ధ్రువసిద్ధాంతముయొక్క ఆధారముచే వీనికన్నిటికిని చక్కని సమన్వయము కుదురుచున్నది.



"శతక్రతు" పదమునకు "నూరుశక్తులకధిపతి" యని చాలచోట్ల శాయనులవారును, వారి ననుసరించి అన్నిచోట్ల పాశ్చాత్యులునుకూడ అర్థముజెప్పిరి. కనుక, దీని నిజార్థమేమియో మన మిప్పుడు విపులముగ చర్చించవలసియున్నది.

"శతక్రతు" లోని "శత" అను శబ్దమునకేమిఅర్థము చెప్పవలెను? "శత" అనగ "అనేక" మని కొందరుచెప్పిరి. కాని యిదిసరికాదు. "శత" అనగ నూరు – కేవలమునూరు – అనియే చెప్పవలెను. ఎట్లనగ:– ఇంద్రునకనేక పేర్లుగలవు. శతనీత, సహస్రనీత; శతం–ఊతి, సహస్రం–ఊతి; శతమన్యు (ఋ), సహస్రమన్యు (సా. వే), సహస్రముష్క (ఋ). ఇవిగాక యింద్రుని బాణమునకు శతబ్రధ్న, సహస్రప్రాణ అని పేర్లుగలవు. మరియు 'సోమ' మునకు శతయామన్, సహస్రయామన్ – అను విశేషణములు ప్రయోగింపబడినవి. ఈపైనవివరించిన పేర్లన్నిటిలోను "శత, సహస్ర" అను పదములు "అనేక" అను భావములో ప్రయోగింపబడియున్నవి.

పైజాబితానుబట్టి చూచినచో "శతనీతి"కి ప్రతిగ "సహస్రనీతి" కలదు. "శతం–ఊతి" కిబదులుగ "సహస్రం–

ఊతి" గలదు. ఇట్లే ప్రతిచోటను "శత"కు ప్రతిగ "సహస్ర" గలదు. ఈపేర్లలో "శత" యన్నను "సహస్ర" యన్నను "అనేక"మనియేఅర్థము. కాని, శతక్రతుపేరునకు ప్రతిగ "సహస్రక్రతు"అనుపేరు వేదములందెక్కడను లేదు. శతక్రతు పదముఋగ్వేదమందు షుమారు ౬౦ సార్లును, తదితర వేద గ్రంథములందనేక పర్యాయములును ప్రయోగింపబడి యున్నది. ఇంద్రుడు "అనేకక్రతువులకధిపతి" యనుభావమే యుండియున్నచో పైపేర్లన్నిటితోపాటు "సహస్రక్రతు" అను పేరేల ప్రయోగింపబడదు? కనుక 'శతక్రతు' లోనున్న "శత"కును తక్కినపైపేర్లలోనున్న "శత"కును స్వభావమందు చాలభేదముగలదు. ఇంద్రుడు నూరుక్రతువులకంటె యెక్కువ క్రతువులకధిపతిగాడు గనుక, "శత" అనగ "నూరు" అను అర్థమందే "శతక్రతు" పదమును ప్రయోగించి, అంతటితో నిలిచిపోయిరేగాని "సహస్రక్రతు" అని పేరు పెట్టుటకు వైదికఋషులకధికారములేమిచే వారాపదము నెచ్చటను ప్రయోగింపరైరి. ఇంద్రుడు నూరుక్రతువులకే అధిపతియని తమకుగట్టిగ తెలిసినప్పుడు, ఆతనికి "సహస్రక్రతు" అని పేరుపెట్టుట తప్పని వైదికఋషు లెరుంగుదురు. అందుచేతనే, వేదమందెక్కడను "సహస్రక్రతు" అను పేరు ప్రయోగింపబడలేదు. కనుక, "శతక్రతు" లోని "శత" కు "నూరు" అనియే ఖండితమైన అర్థము. ఋ 1, 102, 6 లో యింద్రునకు "అమితక్రతు" అనుపదము



ప్రయోగింపబడినది; "అమిత" అనగ "నూరుకంటె యెక్కువ" అను అర్థమెక్కడనున్నది? ఇంతమాత్రముచే "శతక్రతు" లో నున్న "శత" కు "నూరు" అను సరళమైన అర్థమును వదలివేయవలెనను భావ మెచ్చటనులేదు.

ఇక, "శతక్రతు" లోని "క్రతు" అనగనేమి? "క్రతు" అనగ 'శక్తి' యని కొందరుచెప్పిరి. "శతక్రతు" అనగ "నూరుశక్తులకధిపతి" యట! ఏనూరుశక్తులు? ఇంద్రునకు ప్రత్యేకముగ ఫలానిఫలాని శక్తులు మొత్తము నూరు మాత్రమే గలవని యెచ్చటను లెక్కబెట్టిచెప్పబడలేదు పోనీ, అనేకశక్తులకధిపతియందుమా యన్నచో, "శత" అనగ, నూరనియే అర్థముగాని, "అనేకము" గాదని పైన వివరించితిమిగద. కనుక, "క్రతు" అనగ "యజ్ఞ" మనియే అర్థము చెప్పవలెను. ఇదిగాక, యజ్ఞమను నర్థమందే "క్రతు" శబ్దము ఋగ్వేదమందు చాలచోట్ల ప్రయోగింపబడియున్నది. ఇట్టి ప్రయోగములు ఋగ్వేదమందుండియే యున్నప్పుడు "శతక్రతు" పదమును "నూరుయజ్ఞముల కధిపతి"యను భావములో నేలప్రయోగించకూడదు? దీనికి అభ్యంతరమేమియో నాకు తోచలేదు. అందునను, ముఖ్యముగ, ఇటీవలి పురాణములుకూడ యీయర్థమునే చెప్పుచున్నప్పుడు దాని నింకొకవిధముగ నన్వయించుట స్వభావవిరుద్ధముగ గన్పట్టుచున్నది.

ఇంద్రుడు శత్రుపురములను 90,99 లేక నూరింటిని నాశనమొనర్చినట్లు ఋగ్వేదమందు పలుతావులలో వర్ణన గలదు. ఇదికూడ మన యర్థమునే బలపరుచుచున్నది. "దేవపురాః" (దేవతలకోటలు) అనగ "దినములు;" అని తైత్తిరీయసంహితావాక్యమునకు అర్థము చెప్పబడినది. శంబరుడను రాక్షసుడు యింద్రునకు శత్రువు. ఈ శంబరపురములనే యింద్రుడు నాశన మొనర్చెను. దేవపురములనగ దినములైనప్పుడు శత్రుపురము లనగ రాత్రు లనియే అర్థము. దేవతలకు పగలెట్లు కోటయో, రాత్రులకుచీకటియు నట్లే కోటయయ్యెను. ఈరాక్షసులీచీకటికోటలలో దాగికొనిరి. ఇంద్రుడీ చీకటికోటలను నూరింటిని నాశనమొనర్చెననగ నూరురోజుల పరిమితిగల దీర్ఘరాత్రియందు యింద్రుడు రాక్షసులతో పోరాడి, సూర్యుని పైకితెచ్చెనని భావము. ఈదీర్ఘరాత్రియందే ఆర్యులు శతరాత్రాది "రాత్రిక్రతువుల" నూరింటిని జేయుచుండిరి. ఈదీర్ఘరాత్రియందే యింద్రుడు "అహి" తో పోరాడుచు నదులను (స్రవంతీః) దాటెను. (I, 32, 14). ఈదీర్ఘరాత్రియందే "కుత్స" యను నాతడు యింద్రుని నూరు తోలుపట్టీలతో తనయజ్ఞమునకు కట్టివేసి, "నిన్ను నీవే విడిపించుకొనుము"ని చెప్పెనట. (తం. బ్రా. IX, 2, 22; ఋ X, 38, 5) ఈవర్ణనలన్నియు నొకేభావమును సూచింపుచు, ఒక్కయింద్రునే నూరుయజ్ఞముల కథిపతినిజేయుచున్నవి; మరియు వైదికఋషులయొక్క పూర్వోత్తరములవారొకప్పుడు నూరుదినముల దీర్ఘరాత్రిగల ఉత్తర ధ్రువమండలమందున్నట్లు స్పష్టముగ ఋజువుజేయుచున్నవి.



ఋ V, 48, 3 లో ఆ గ్రావభిరహన్యేభిరక్తుభిర్వరిష్ఠం వజ్రమా జిఘర్తి మాయిని। శతం వా యస్య ప్రచరన్ త్స్వే దమే సంవర్తయన్తో వి చ వర్తయన్నహా॥ యింకొక ప్రబల దృష్టాంతముగలదు. "ఇంద్రుడు వృత్రాసురుని వజ్రములో కొట్టుచున్నకాలమందు యింద్రుని మందిరములో చరించుచున్న నూరును (యజ్ఞములు) సాధారణదినములయొక్క గతిని తెగగొట్టి, మరల పునరుద్ధరించుచుండును." అని యీఋక్కుయొక్క అర్థము ఆనూరును యేమి? ఇవే దీర్ఘరాత్రియందు చేయబడుచున్న రాత్రిక్రతువులు; లేదా ఇంద్రజయమునకు కావలసిన నూరుదినములు. సూర్యరశ్మి నశించి మరల సూర్యరశ్మి వచ్చులోపల ధ్రువమండలమందు నూరుదినముల దీర్ఘరాత్రియుండునుగద. ఈ దీర్ఘరాత్రి సాధారణదినముల గతిని తెగగొట్టి, మరల పునరుద్ధరించుచున్నదని చెప్పుట యెంతయు సహజముగనేయున్నది.

ఇంద్రుడు వృత్రాసురుని చంపి అతనిచే బంధింపబడిన ఆవులను లేక నీళ్ళను విడిపించి, ఉషస్సును లేక సూర్యుని పైకితెచ్చెనని ఋగ్వేదమందు గలదు. దీనికి సరిసమానమైన కథయే పారశీగ్రంథములందుకూడ గలదు. "తిష్ట్రియ" యను నాతడు "అపోష" యను రాక్షసుని చంపి నీళ్లను, లేక ఉషస్సును, లేక సూర్యకాంతిని చెరనుండి విడిపించెను. ఈ

కథలో చెప్పబడిన "నీరు" అనగ మేఘములను చీల్చి తెచ్చు వర్షపునీరని కొందరు అర్థముచేయుచున్నారు. కాని, యిది సరికాదు. ఉషస్సు లేక సూర్యకాంతి లేక నీరు చెరనుండి విడిపింపబడినవి. ఒక భావమే యిన్నిరూపములుగ, యిన్నికథలుగ వర్ణింపబడెను. ఈ కథలలో పేర్కొనబడిన నీటియొక్క స్వభావమునుగూర్చి ముందు చర్చింపనున్నాము. ఈ కథలన్నియు అంధకారమునకును, వెలుతురునకును జరిగిన పోరాటమును దెలుపుచున్నవి.

'అహూరామజ్దా' చేసిన "హూమ (సోమ) యాగముచే ప్రోత్సహింపబడినవాడై "తిష్ట్ర్యి" యను దేవత "అపోష" యను రాక్షసుని సంహరించెను. ఈ యుద్ధము "వోరు-కశా" యను సముద్రమందుజరిగెను. "అపోష" ను సంహరించి "తిష్ట్ర్యి" యీ సముద్రజలమునుండి జయప్రదముగ బయటికి వెడలివచ్చెను. ఈయుద్ధమందు "అపోష" రాక్షసుడు నల్లనిగుర్రమురూపమును దాల్చెను. "తిష్ట్ర్యి" తెల్లనిగుర్రమై ఆతనితో పోరాడి, ఆతనిని చంపి, జయప్రదముగ సముద్రమునుండి వెడలివచ్చెను. ఇట్లే యజ్ఞాశ్వము సముద్రజలమునుండి బయటికి వెడలివచ్చెనని ఋగ్వేదము (I, 163, 1) చెప్పుచున్నది. తాను శత్రువును జయించి, భక్తులకు నియమితకాలమందు పొడసూపుటకుగాను భక్తులైనవారేమి చేయవలసియుండునో "తిష్ట్ర్యి" యను నీదేవత భక్తుడగు "అహూరామజ్దా" తో యిట్లని చెప్పుచున్నాడు.



"నన్ను పేరుబెట్టి ఆహ్వానించుచు, యజ్ఞముచేసి, నన్నుపూజించినభక్తులకు నేను సకాలమందు (నియమితకాలమందు) పొడసూపుదును. ఒకరాత్రియైననుసరే, రెండురాత్రులైననుసరే, యేబది రాత్రులైననుసరే, నూరు రాత్రులైననుసరే, నేను సకాలమందు (నియమితకాలమందు) పొడసూపుదును.

ఈవాక్యములు చాలభావగర్భితములుగనున్నవి. సకాలము (లేకనియమితకాలము) అనగ యీ "తిష్ట్ర్యి" దేవత చీకటిరాక్షసునితో పోరాడినకాలమని యర్థము. (౧) ఈ కాలము ఒకటిమొదలు నూరు రాత్రులవరకుండవచ్చును. (౨) ఈయుద్ధకాలమందు భక్తులు తనపేరుబెట్టిపిలిచి సోమయజ్ఞమునుచేయుచు తనకు ఉత్సాహమును గలుగజేయుచుండవలెను. వృత్రాసురవధయందుకూడ యింద్రున కుత్సాహముగలుగుటకై "రాత్రిక్రతువు"లను నూరు సోమయాగములు చేయబడెనని వేదవాఙ్మయమందు గలదు. కనుక యీ పారశీకకథకూడ రాత్రిక్రతువుల యుత్పత్తినిగూర్చి నేను పైనవివరించినభావమునే బలపరుచుచున్నది. పారశీకకథయందున్న "నియమితకాలము" ఒకటిమొదట నూరు రాత్రులవరకేల యుండవచ్చునో యెవరును యింతవరకు సమాధానముచెప్పలేదు. రాత్రిక్రతువుల యవధులుకూడ ఒకటిమొదలు నూరు రాత్రులవరకే యుండునని మన వేదముజెప్పుచున్నది. మన భారతీయ, పారశీకపు టార్యులెరిగినంతవరకు ఇంద్ర, వలలకు లేక తిష్ట్ర్యి, అపోషలకు జరిగిన యుద్ధము మొత్తమువిూద

నూరు రాత్రులకంటె యెక్కువకాలము పట్టలేదనియు, యీయుద్ధము "వోరుకశా" యందు లేక అంధకారావృత మైన సముద్రమందు జరిగెననియు యీకథలవలన తెలియు చున్నది. "వెరెత్రఘ్న" యను పారశీదేవత చక్కని మేష రూపమును దాల్చెనట; వృత్రఘ్నుడగు యింద్రుడుకూడ మేషరూపమునుదాల్చెనని ఋ VIII, 2, 40–చెప్పుచున్నది. పారశీగ్రంథమం దింకొకచోట నూరు ఘనకార్యములు చేసిన మేషము ( మేషాహె శతోకరహె ) వర్ణింపబడెను. మేష రూపుడైన "వెరెత్రఘ్న" డే యీనూరుఘనకార్యములు చేసిన "మేషాహె శతోకరహె" గావచ్చును. మేషరూపు డైన వృత్రఘ్నుడే నూరుయజ్ఞములకధిపతియైన "శతక్రతు" డని పైన వివరించితిమి. కనుక పారశీగ్రంథములో నున్న "శతోకరహె" మన వేదములోనున్న "శతక్రతు" పద మును పోలియున్నది. పారశీక, వైదికభావములు సర్వవిధ ములచేతను సమానముగనే యున్నవి. వైదిక ఋషులపూర్వ తరముల వారొకప్పుడు కాపురమున్నచోట భిన్నయవధులు గల దీర్ఘరాత్రు లుండుటచేతనే యీరాత్రిక్రతువులు మొట్ట మొదట ఉత్పన్నమయ్యెనని యీ హిందూ పారశీ గాథలవలన స్థిరమగుచున్నది.

ఇదిగాక, పారశీగ్రంథములం దింకొకచోట తిష్ట్ర్య యను దేవత "మానవుల సంవత్సరచక్రమును తిరిగి యిచ్చటికి తెచ్చెను" అని చెప్పబడియున్నది. ఈవాక్యము "ఉషస్సు



మానవయుగముల (మానుషాయుగా) నడకను సాగించెను" అను మన వేదవాక్యముతో తులదూగుచున్నది. అనగ, వృత్రవధ లేక అహోవధ పూర్తియై, దీర్ఘరాత్రి యంత మొందగనే, నూతనసంవత్సరము దీర్ఘఉషస్సుతో ప్రారం భమై, తదుపరి అక్షాంశభేదములనుబట్టి ౭ మొదలు ౧౧ నెలలవరకు సూర్యరశ్మితో నొప్పారుచుండెనని భావము.

ఇంతవరకు చర్చించిన యంశముల నాధారము జేసి కొని, మన మిప్పుడు "అతిరాత్ర" మనగ నేమి యర్థమో చూతము. ఈ క్రతువు యిప్పటికిని, రాత్రిపూటయే చేయ బడుచున్నది. కనుక యిచ్చట "రాత్రి"యనగ 'దిన' మని యర్థము జెప్పుటకు మీమాంసకులకు సాధ్యము కాలేదు. సరే, యితవరకు బాగుగనే యున్నది. అయితే, యీ యజ్ఞమునకు "అతిరాత్రి" మను పేరేలవచ్చెను? "అతి" యనగ అర్థమేమి? "అతి" అనగ "ఒకదానిని మించిన" లేక "ఒకదానికి ఆవలిప్రక్కగగాని, యీవలిప్రక్క గానియున్న" అని అర్థము. "ఈఅతిరాత్రి" పదముఋగ్వేద మందు VII, 103, 7-లో మాత్రమేగలదు. దీనికి శాయనా చార్యులవారిట్లని అర్థముజెప్పిరి. "రాత్రిం అతీత్య వర్తతే యితి అతి రాత్రః" = "రాత్రిని గడచినట్టిది లేక మించి నట్టిది యేదైతేగలదో అది అతిరాత్రము." ఆపస్తంబశ్రౌత సూత్రములకు వ్యాఖ్యవ్రాయుచు రుద్రదత్తుడుకూడ యీ యర్థమునేజెప్పెను. కనుక, రాత్రియొక్క ఆద్యంతముల

యందు చేయబడినక్రితువే అతిరాత్రిక్రితువు. అసురులను రాత్రియొక్క చీకటినుండి తరిమివేయుటకుగాను యీయతిరాత్రిక్రితు వుద్దేశింపబడినదని ఐ॥ బ్రా॥ IV, 5 స్పష్టముగ జెప్పుచున్నది. ఈఅతిరాత్రిక్రితువును మొట్టమొదటజూచిన ప్రిజాపతి యీక్రితువునుండి రాత్రింబవళ్ల జంటను (అహో-రాత్రి) సృజించెనని తండ్యబ్రాహ్మణము (IV, 1, 4, 5) చెప్పుచున్నది. ఏరాత్రియంతమొందగనే, మామూలురాత్రింబవళ్ళజంటతిరిగి యుత్పన్నమయ్యెనో అట్టిరాత్రియొక్క అంతమందే యీ "అతిరాత్రి" క్రితువుచేయబడెనని పైవాక్యమునుబట్టి స్పష్టమగుచున్నది. అనగ, యీఅతిరాత్రిక్రితువు చేయగనే, మామూలు అహోరాత్రిములనడక తిరిగిప్రారంభమయ్యెనని తాత్పర్యము.

దీర్ఘరాత్రి అంతమొందగనే మామూలు అహోరాత్రముల నడక ప్రారంభమగునని యిదివరకు వివరించియుంటిమి. కనుక, యీదీర్ఘరాత్రియొక్క అంతమందే యీ అతిరాత్రక్రతువు చేయబడవలెనని పైవివేచనమునుబట్టి నిర్ధారణమగుచున్నది.

మనదేశములందిచ్చట అహోరాత్రిములు సంవత్సరము పొడవునను — మధ్య అవాంతరమేమియులేకుండ — నడచుచునే యుండును. కనుక, యీ అహోరాత్రిములన్నియు సంవత్సరములో నేదియోయొక్క ఫలానిరాత్రి నుండియే పుట్టినవని వ్రేలుపెట్టి చూపించుటకు వీలులేదు.



అదిగాక, సంవత్సరములో ప్రితిరాత్రినుండియు అసురులను తరిమివేయుటకై యీ క్రితు వుద్దేశింపబడినదని వాదించినచో, యీ అతిరాత్రిక్రితువును ౩౬౦ రాత్రిలలోను చేయుచుండవలసినదేగద. కాని అట్లు జరుగుటలేదు. ఈ అతిరాత్రిక్రితువు సత్రముయొక్క ఆద్యంతములందు మాత్రిమే (అనగ, సంవత్సరములో ౨ పర్యాయములు మాత్రిమే) చేయబడుచున్నది. అదిగాక, సత్రిముయొక్క నిజమైన ఆద్యంతములు యీ అతిరాత్రిక్రితువులు కానేకావు. చతుర్వింశమహావ్రితదినములే సత్రిమునకు నిజమైన ఆద్యంతములని పై ప్రిణాళికలో వివరించి యుంటిమి — చూడుడు. వార్షిక సత్రము లిప్పుడు ౩౬౦ దినములు జరుగుచున్నవి. ఈ సత్రముయొక్క ౩౬౦ దినములలో మొదటి రాత్రి నుండియు చివరి రాత్రినుండియు మాత్రమే రాక్షసులను తరిమివేయుటకై యీఅతిరాత్రిక్రతువు లుద్దేశింపబడినవని చెప్పుటకువీలులేదు. ఇదియే నిజమైనచో తక్కిన ౩౫౮ దినములనుండిమాత్రిము రాక్షసులను తరిమివేయవలసిన అవుసరము లేదాయను ప్రిశ్నబాధించును. కనుక, రాక్షసులను తరిమివేయవలసిన అగత్యముగలరాత్రి యేదియోయింకొకటి ప్రత్యేకముగ — యీసత్రిదినములలో చేరకుండ — ఉండియుండవలెను. ఈ విధముగ సత్రిదినములలో చేరకుండ — కేటాయింపుగ — ప్రత్యేకముగనున్న యిట్టి రాత్రియొక్క ఆద్యంతములందే యీఅతి

రాత్రిక్రతువు జరుగుచుండెననుట నిర్వివాదాంశముగ గన్పట్టు చున్నది. ఇట్టిరాత్రియేది ?

ఆర్యులు ధ్రువమండలమందున్న ప్రాచీనకాలమందు సూర్యరశ్మి ౧౦ మాసములే యుండెననియు, తక్కినరెండు మాసములు దీర్ఘరాత్రిగనుండెననియు దెలిపితిమి. కనుక, "గవాం అయనము"వంటి వారిప్రాచీన వార్షికసత్రములు ౧౦ మాసముల యవధిమాత్రమే గలిగియుండెనని తెలిపితిమి. ఈపదిమాసముల వార్షికసత్రము పూర్తికాగనే ౨ మాసములు దీర్ఘరాత్రి వచ్చుచుండెను. ఈదీర్ఘరాత్రి నుండియే రాక్షసులను తరిమివేయుట అవుసరమయ్యెను. కనుక, యీదీర్ఘరాత్రియొక్క ఆద్యంతములందే యీ అతిరాత్రక్రతువు చేయబడుచుండెను. ఈదీర్ఘరాత్రిసమాప్తమొందగనే, మరలమామూలు అహోరాత్రములును, దానితోపాటు సత్రమును యథాప్రకారముగ ప్రారంభమయ్యెను. ఈమామూలు రాత్రులందు అసురులను తరుమవలసిన పనిలేదు; యేలననగ:—తండ్యబ్రాహ్మణము జెప్పినట్లు—అతిరాత్రక్రతువుయొక్క ఉద్దేశము అంతటితోనే (దీర్ఘరాత్రితోనే) నెరవేరిపోయినది. కనుక, ప్రతిమామూలు రాత్రియందును అతిరాత్రక్రతువు జేయవలసిన అవుసరము లేక పోయెను.

ఇంతవరకు తేలిన సారాంశమేమనగ:—౧౨ మాసములకు తక్కువయైన "గవాం అయనము" వంటి ప్రాచీన




వార్షిక సత్రముయొక్క యవధిలోచేరకుండ విడిగనున్న దీర్ఘరాత్రినుండి రాక్షసులను తరిమివేయుటకై ఆదీర్ఘరాత్రియొక్క ఆరంభమునందును, తుదియందును యీ అతిరాత్రి క్రతువులు చేయబడుచుండెను. ఇవి యీదీర్ఘరాత్రియందు గాక, దీర్ఘరాత్రియొక్క ఆద్యంతములందుమాత్రమే చేయబడుటచే "అతి" యను ప్రత్యయమీ "రాత్రిక్రతు" వులకుచేర్చబడెను. అందుచే యివి "అతిరాత్ర" క్రతువులయ్యెను. తక్కిన ద్విరాత్ర, త్రిరాత్రాది రాత్రిక్రతువులు కేవలము దీర్ఘరాత్రియందే—అనగ, ఆద్యంతములందున్న యీ రెండు అతిరాత్రిక్రతువులకుమధ్య—జరుగుచుండెను.

A మొదలు B వరకు పదిమాసములు బ్లాకు నెం. 13 రు. మామూలు అహోత్రములు (దీర్ఘ దివసముతో సహా;) యిది సత్ర కాలము. ఈ పదిమాసముల సత్రముపూర్తికాగనే దీర్ఘరాత్రి ప్రవేశించును. ఈదీర్ఘరాత్రియొక్క ప్రదేశమందు B వద్ద అతిరాత్రము జరుగును; పిమ్మటదీర్ఘరాత్రికాలమందు ద్విరాత్రి, త్రిరాత్రాది రాత్రిక్రతువులు జరుగును. A. వద్ద దీర్ఘరాత్రియంతమొందును. ఈయంతమందు మరల యింకొక అతిరాత్రిక్రతువు జరుగును. ఈఅతిరాత్రక్రతువుకాగనే తిరిగి మామూలు అహోరాత్రములును, దానితోపాటు సత్రమును ప్రారంభమగును ఈవిధముగ సంవత్సరచక్రము

పూర్తియగును. ఇది ధ్రువమండలమందున్నప్పటి ప్రాచీన పద్ధతి. కాని, ఆర్యులు ధ్రువమండలమును వదలి ౧౨ మాసముల సూర్యరశ్మిగల దక్షిణదేశములకు వచ్చినప్పుడు దీర్ఘరాత్రిమాయమైపోయెను; దీనితోపాటు ద్విరాత్రి, త్రిరాత్రాది రాత్రిక్రతువులయొక్క ప్రయోజనమును నశించెను. వీనిప్రయోజనమిట్లు నశించిపోయినందున కొంతకాలమునకు వీనిపుట్టుకయొక్కపూర్వోత్తరచరిత్రము. మరుగుపడిపోయెను. అందుచే, వీనినేమిచేయుటకును తోచక, మీమాంసకులు రాత్రి 'యనగ " దిన " మని అర్థము చెప్పి వీనిని దినక్రతువుల క్రిందికిమార్చి, వీనినొక ప్రత్యేకసోమయాగవర్గముగ నేర్పాటు చేసియుంచిరి. ఇట్లు దీర్ఘరాత్రితోపాటు రాత్రిక్రతువులు మాయమైపోయినను, ఆద్యంతములందున్న అతిరాత్రక్రతువులు రెండునుమాత్రము మన అదృష్టమువలన యెట్లో నిలిచియుండెను. పూర్వము ౧౨ మాసములకు తక్కువగనున్న సత్రమిప్పుడు సంపూర్ణముగ ౧౨ మాసములకు * పెంచబడెను. పూర్వముండిన దీర్ఘరాత్రి ముడుచుకొని శూన్యమైపోగనే దానిఆద్యంతములందుండిన అతిరాత్రములు రెండును యిప్పుడు యీ ౧౨ మాసముల సత్రమునకు ఆద్యంతములుగ నేర్పడుట

* పైపట్టికను జూడుడు:—స్థిరభాగముల నటుంచి, అస్థిర భాగములను మన యిష్టమువచ్చినట్లు పెంచవచ్చును; లేక తగ్గించవచ్చునని యిదివరకే చెప్పియుంటిమిగద.—

ప్లాను 10.




౧౨ మాసములును సూర్యరశ్మి యుండుటచే దీర్ఘరాత్రి క్షీణించిపోవును. కావున దీర్ఘరాత్రియొక్క ఆద్యంతములందు చేయబడు అతిరాత్రమిప్పుడు సంవత్సరముయొక్క ఆద్యంతములం దాచరింపబడుచున్నది.



తటస్థించెను. ఈరీతిగ యాజ్ఞికులు వార్షికసత్రప్రణాళిక యందీరెండు అతిరాత్రములకును కొంతనిలువనీడ నిచ్చియుండిరి.

ప్లాను నెం. 14 రు.

పూర్వము దీర్ఘరాత్రియొక్క ఆద్యంతములం దాచరింపబడుచు వచ్చిన యీ అతిరాత్రములిప్పుడు ౧౨ మాసముల వార్షికసత్రమునకు ఉపక్రమోపసంహారక్రతువులుగ ఆచరింపబడుచున్నవి. ఆహా! అతిరాత్రమను శబ్దమిదివరకే నాశనమైపోయి యుండినచో మనకీప్రాచీనచరిత్రమంతయు మరుగుపడిపోయెడిదేగదా. ఈచిన్నతీగె యొక్కటియైనను యిప్పటికినశింపకుండ మిగిలియుండబట్టియే, దీనిని బట్టుకొని మనమీడొంకనంతయు కదలింపగలిగితిమిగద. ఈఅతిరాత్రములవలన కొంతకు కొంతయైనను ప్రయోజనముండుటచే యివిరెండును వార్షికసత్రప్రణాళికయం దిప్పటికిని యేదో విధముగ నిలిచియుండుట తటస్థించెను. కాని, దీర్ఘరాత్రి యనునదిప్పుడు అసలుపేరేలేకుండ పూర్తిగ మాసిపోవుటచే, అందు చేయబడుచున్న రాత్రిక్రతువులగతి యేమయ్యెనో మన మిదివరకే విచారించితిమిగద. వీనికి ౧౨ మాసముల వార్షికసత్ర ప్రణాళికయందు తలదాచుకొనుటకైనను చోటు లేకపోయెను. వీనియొక్క పుట్టుపూర్వోత్తరమెల్లరును మరచిపోవుటచే వీనిని వెలివేసినట్లు దూరముగనుంచిరి. అంతట,

పాపము! మీమాంసకులువచ్చి 'రాత్రి' యనగ "దిన" మని అర్థముచెప్పి వీనిని ప్రత్యేక మొక దైనికసోమయాగ వర్గముగ నేర్పాటుజేసి, కొన్నింటిని అహీనవర్గము క్రిందికిని, మరికొన్నింటిని సత్రవర్గముక్రిందికిని జేర్చిరి.

పైన వివరించిన మార్పులన్నియు నెట్లు జరిగెనో విపులముగ విచారించుట కిది యదనుకాదు. ప్రాతపంచాంగమును మార్చి, నూతనపరిస్థితుల కనుగుణముగ క్రొత్త పంచాంగమును నిర్మించుట సులభమైన పనిగాదు. ఇది బహు కష్టసాధ్యమైన పనియని యెరుంగవలెను. ఆర్యులకు యజ్ఞకర్మ చాల ప్రధానమైనది. ప్రాతయజ్ఞములందు దేశకాలాది పరిస్థితులనుబట్టి క్రొత్తమార్పులను చేయక తప్పినదికాదు. అయినను, పూర్వాచారములందు వీరికి పట్టుదల మెండుగ నుండుటచే యీ నూతన యజ్ఞప్రణాళికయందు పూర్వపు ప్రాతయాచారములను సాధ్యమైనంతవరకు చాల భాగము నిలుపుకొనవలెననియే వీరు పెనగులాడి యుందురు. ఈ మార్పులన్నియు బహుశః బ్రాహ్మణములను రచించినవారును, తత్పూర్వమందున్న బ్రహ్మవాదినులును చేసియుందురు. వీరీ మార్పులను చేయబూనిన నాటికే యీ ప్రాచీనాచారములయొక్క నిజమగు భావార్థములు మరుగుపడిపోయెను. ఇట్లు నిజభావములు మరుగుపడిపోయిన ప్రాచీనాచారములను పూర్తిగ వదలిపెట్టుటకు వీలులేకపోయెను; తగిన యర్థములు జెప్పుట కంతకంటె చేతగాకపోయెను. ముందుకు బోయిన



నూయి, వెనుకకు పోయిన గోయి — యన్న చందమాయెను. కనుక, యీ బ్రాహ్మణములను రచించిన పండితులు బహు శ్రమపడవలసివచ్చెను ప్రాచీనపరంపరలయొక్క నిజభావములు స్ఫుటముగ నున్నంతవరకు వారు స్పష్టముగ నుదాహరించిరి. కాని, నిజార్థములు మరుగుపడిపోయిన చోట్ల మాత్రము, వారు పూర్వోత్తరసందర్భములనుబట్టి తమకు తెలిసినంతవరకు ఊహించి అర్థము వ్రాసియుండిరి. ఇంత వరకు చేసిన వివేచనవలన బ్రాహ్మణగ్రంథముల రచనను గూర్చియు, వాని స్వభావమును గూర్చియు తెలిసికొనుటకు కొంత అవకాశము జిక్కెను. కాని, మన ప్రస్తుతాంశమున కిది సంబంధింపదు గనుక దీని నింతటితో విరమింతము.

## సింహావలోకనము.

(౧) వైదికవాఙ్మయమందు వర్ణింపబడిన సోమయాగ పద్ధతియొక్క చరిత్ర నిట కొంతపరిశీలించితిమి. అందు యింత వరకు దుర్గ్రాహ్యములుగ నుండిపోయిన కొన్నియంశములకు మనమిప్పుడు ధ్రువసిద్ధాంతముచే సరళమగు నర్థములను జెప్పితిమి.

(౨) ఎందునను చేరకుండ వెలిగానిలిచిపోయిన రాత్రిక్రతువులను యీనూరు సోమయాగములును ఆర్యులు దీర్ఘరాత్రి యందిందునకు సహాయార్థముగ సోమయాగములు చేసిననాటి ప్రాచీనకాలమును సూచించుచిహ్నములుగ నున్నవని ఋజువుపరచితిమి.

(3) ప్రాచీనమగు "గవాంఅయన" యజ్ఞము ప్రాచీన రోమక సంవత్సరమువలెనే ౧౦ మాసములయవధిని మాత్రమే గలిగియుండెనని నిరూపించితిమి. తక్కిన రెండుమాసముల దీర్ఘరాత్రియందునను రాత్రిక్రతువులు చేయబడెనని వేరుగ చెప్పనక్కరలేదు. ఈరెండంశములును ధ్రువమండల నివాస కాలమునే సూచింపుచున్నవి. నవగ్వ, దశగ్వ, దీర్ఘతమాది గాథలుకూడ యీయంశమునే బలపరుచుచున్నవి.

(౪) పారశీగ్రంథములో చెప్పబడిన తిష్ట్రియ, అపోషల యుద్ధకాలమును, యింద్రుని "శతక్రతు" నామధేయమును, రాత్రిక్రతువులు నూరనుసంఖ్యయు, తదితరచిల్లర అంశములును ధ్రువసిద్ధాంతమును బలపరుచుచున్నవి.

ఇటీవల వేదవాఙ్మయమందు విరివిగ ప్రబలిన కర్మజాలములన్నియు, ప్రాచీనకాలమందుకూడ నుండెనని నేను తలంపను. ప్రాచీనయజ్ఞములు బహుసులభముగను, ఆడంబర రహితముగను, నుండెనని నాతాత్పర్యము. ప్రాచీనుల మత మంతయు యజ్ఞమందేయుండెను. ఇది వారికొక పెద్దకార్యముగగన్పట్టెడిదిగాదు. మామూలు గృహకృత్యముల జేసికొనునట్లే వారు నిత్యమునుబలుల నర్పించుచుండెడివారు. ఇదియొక పెద్దయాగపద్ధతిగ ముందు పరిణమింపబోవుచున్నదని వారు తలంపలేదు; వారాకాలమందును అట్లు భావించుకొనలేదు. సూర్యుని గతినిబట్టివారు బలులు వగైరాలనర్పించుచు దానితోపాటు తమకాలమానమునుగూడ (పంచాంగమును



గూడ) కాపాడుకొనుచుండెడివారు. వారి యాగములుసూర్యగమనమునకు సరియైన నకలుగనుండెడివని చెప్పవచ్చును. కనుక, వారి యాగపద్ధతిని తెలిసికొన్నచో, ఆప్రదేశమందలి సూర్యగతికూడ యెరుకబడును. కనుక, ఐతిహాసికదృష్టితో చూచినచో మనకీయాగపద్ధతి యెంతయో అమూల్యమైనదిగ గన్పట్టుచున్నది. నేనీదృష్టితోడనే పైవివేచనను జేసియుంటిని. ఇట్లుచేయగ, అందుగన్పట్టిన పెక్కుఅంశములను కేవలమొక్క ధ్రువసిద్ధాంతముపైననేతప్ప యింకొక విధముగసమన్వయించుటకువీలులేకపోయెను. ఈరీతిగ ఒకప్రక్కను ఋగ్వేద సూక్తములును, మరియొకప్రక్కను కర్మకాండయు నిలువబడి మన సిద్ధాంతపక్షమున సాక్ష్యమిచ్చుచుండగ మన సిద్ధాంతములోని సత్యమునుగూర్చి యింకశంకింపనేల ?



# వైదికనిలయము

## తొమ్మిదవ అధ్యాయము.

### వైదికగాథలు: (౧) నిరుద్ధజలము. (నిరుద్ధఆపః.)

ధ్రువమండల సిద్ధాంతమునుగూర్చి మనమింతవరకు చర్చించిన ప్రధానాంశముల నిట క్లుప్తముగ జ్ఞాపకముచేసి కొందము.

(౧) దేవతలకు ఆరుమాసములు పగలును ఆరుమాసములురాత్రియు కలిసి మొత్తము సంవత్సరమయ్యెనని మొదట నిర్ణయించితిమి. ఈయంశము హిందూపారశీక గ్రంథములందే గాక, జర్మనుజాతుల పురాతనగ్రంథములందుకూడ గలదని చూపితిమి.

(౨) తదుపరి ఋగ్వేదమందున్న ఉషస్సునుగూర్చి చెప్పబడిన సూక్తములపరిశీలించితిమి. వైదికఉషస్సు బహువచనముగ ప్రయోగింపబడినది. ఇదిగాక, ఉషస్సులసంఖ్య ముప్పదియను ప్రత్యక్షవాక్యమే దొరికెను. పూర్వకాలమందు ఉషఃకాంతి కనుపడిన చాలదినములకుగాని సూర్యోదయముగాకుండెను. ఉషస్సుక్షితిజముచుట్టు చక్రాకారముగ



(గుండ్రగ) తిరుగుచుండెనని స్పష్టముగ ఋగ్వేదమందుగలదు. ఈలక్షణములన్నియు ధ్రువమండలలక్షణములే.

(3) అదిగాక, అక్షాంశభేదములనుబట్టి భిన్నయవధులుగల దీర్ఘరాత్రులను, వానికిప్రతిగనున్న దీర్ఘదివసములను ఋజువుపరచు వేదవాక్యములను క్రిందటి మూడధ్యాయములలో చర్చించితిమి. ప్రాచీనకర్మకాండపద్ధతిని పరిశీలింపగ, ప్రాచీనవార్షికసత్రములు ౧౨ మాసములు జరుగక ౭, ౮, ౯, ౧౦, ౧౧ మాసములలోనే పూర్తిగావింపబడెననియు, తక్కినకాలమందు రాత్రిక్రతువులు జరిగెననియు నిశ్చయమయ్యెను. నవగ్వ, దశగ్వ, దీర్ఘతములయొక్కయు, అదితి పుత్రులయొక్కయు గాథలుకూడ పైయంశము ననుసరించియే యున్నవి.

కనుక మనసిద్ధాంతము కేవలము అచ్చటచ్చట చెదురుగపడియున్న పొడిమాటలపై యాధారపడక, గట్టిపునాదుల పైననే నిలిచియున్నదని యింతవరకు ఋజువైనది. పైనవివరించిన ధ్రువమండల లక్షణములలో ప్రతియొక్కటియు వైదిక ఋషులకు తెలియునని చెప్పుటకు ప్రత్యక్షముగ వేదవాక్యములే సాక్ష్యమిచ్చుచున్నవి. ఋగ్వేదరచయితలగు ఋషులు ౧౨ మాసముల సూర్యరశ్మిగల దక్షిణదేశములలో నివసించియుండగ, వారికీధ్రువలక్షణము లెట్లు తెలిసెనని కొందరడుగవచ్చును. ఋగ్వేదమును రచించిన ఋషులు ధ్రువమండలమందు తాముగ నివసింపకపోయినను, వీరిపూర్వోత్తర

ముల వారెప్పుడో యొకప్పు డచ్చట నివసించియుండి యుండవలెను. అప్పటినుండి, తరతరములుగ చెప్పుకొనుచువచ్చిన కథలవలన యీధ్రువమండల లక్షణములు వైదికఋషులకు తెలిసియుండవలెను. ఇవియెన్నియో వేలసంవత్సరములనాటి మాటలగుటచే మనమిప్పుడు పేర్కొనిన యీలక్షణములలో ప్రతియొక్కదానికిని సమానముగ దృఢమగు సాక్ష్యముదొరుకునని తలంచుటకు వీలులేదు. అయినను, మనసాక్ష్యము ఖగోళాంశములపై యాధారపడియుండుటచే, ఒక్కయంశమును ధ్రువముగ ఋజువుపరచినచాలును; తక్కినవి వానియంతట యవియే ఋజువయి తీరవలెను. కనుక, మనమింతవరకు సమకూర్చిన సాక్ష్యమంతటియొక్క మొత్తపుఫలితాంశము మన సిద్ధాంతమునే ఋజువుపరచుచున్నది.

ఉత్తరధ్రువ కీలక మెవరికిని యింతవరకు తెలియకపోవుటచే మన మీగ్రంథమందు చర్చించిన వేదవాక్యములకేదోవిధముగ శాయనాచార్యాది వ్యాఖ్యాతలు శబ్దార్థములను మాత్రము చెప్పి అంతటితో వదలివేసిరి. కొన్నిటికి పూర్తిగ శబ్దార్థమునైనను చెప్పక వదలివేసిరి. అందుచే, నేనీవాక్యముల కిప్పుడు చెప్పిన యర్థములు భిన్నములుగ గన్పట్టవచ్చును. అయినను, శాయనాచార్యాది వ్యాఖ్యాతలకు కూడ యీకీలక మెంతమాత్రమైన తెలిసియుండినచో, వారుకూడ యిట్లే యర్థములు చెప్పియుందురు. కాని, వారి మనస్సున కిది తట్టకపోవుటచే వారనేకతప్పుత్రోవల ద్రొక్క



వలసివచ్చెను. పిమ్మట కొంతకాలమునకు పాశ్చాత్యవ్యాఖ్యాతలు బయలుదేరి యీపొరబాటులను కొంతవరకు సర్దిరి. కాని, వీరుకూడ ధ్రువసిద్ధాంతము నంగీకరింపకపోవుటచే, ఆ లక్షణములను సూచించు వేదవాక్యము లేమైన వచ్చినప్పుడు వీని వాని నేదోవిధముగ విరిచియో, ఊరకత్రోసివేసియో, అతుకులుపెట్టిరి. ఈవిధముగ యెల్లరిచేతను విరిచి అతుకులుపెట్టబడినట్టియు, నిర్లక్ష్యముగ త్రోసివేయబడినట్టియు, దుర్గ్రాహ్యములుగ నెంచబడినట్టియు వాక్యములను నేనిప్పుడెత్తుకొని, వానికి సరళమగు భావార్థములను జెప్పితిని. కొన్ని వాక్యములకు వ్యాఖ్యాతలు సరియైన శబ్దార్థములనే జెప్పిరి. కాని, వానిలోని నిజమగు భావార్థమును మాత్రము గ్రహింపలేక అంతటితో వదలివేసిరి. అట్టి వానికి నేను ప్రత్యేకముగ శబ్దార్థములను చెప్పక వానిలోని భావమును మాత్రమే ప్రకటించితిని. ధ్రువసిద్ధాంతమును మొట్టమొదట నామనస్సులో పెట్టుకొని, దానినెట్లైన సమర్థించి తీరవలెనను దురాగ్రహముతోనే నీపనికై పూనలేదు. అంతయేల, మొదటనే నీ ధ్రువసిద్ధాంతమును నమ్మనేలేదు; యిది అసంభవమనికూడ తలంచితిని. కాని, హెచ్చుపెరిగివచ్చుచున్న ప్రమాణపరంపరలయొక్క బలవేగముచే నేను నా యభిప్రాయమును మార్చుకొనక తప్పినదికాదు. ఇంతవరకీ గ్రంథములో చర్చించినప్రమాణములను సమగ్రముగ పరిశీ

లించిచూచినవారికికూడ యిట్టి దృఢాప్రాయమేగలిగితీరునని తలంచెదను.

మన మింతవరకు విచారించిన ప్రమాణములు ప్రత్యక్ష ప్రమాణములని చెప్పవచ్చును. ఇకముందు విచారింపబోవనున్నవి పరోక్షప్రమాణములు వైదికఋషుల పూర్వజులొకప్పుడు ధ్రువమండలమందు నివసించియున్నమాట వాస్తవమేయైనచో, అచ్చటిసృష్టి చమత్కారములును వాతావరణ పరిస్థితులును వారి పురాతనగాధలయందు కొంతకు కొంతయైనను యెక్కియుండక మానవు. కనుక, యీపురాతన వైదికగాధలను పరిశీలించినచో మనకు ధ్రువమండలలక్షణము లేమైన నందుగాన్పించునేమో చూడవలసియున్నది. ఈపురాతనగాధలను పలువురు పలుతెరగులుగ నన్వయించి యుండుటచే యివి యంతగ బలవత్తరమైన ప్రమాణములని చెప్పుటకు వీలుండకపోవచ్చును. కనుకనే, వీనిని పరోక్ష (Indirect) ప్రమాణములని జెప్పితిమి. పురాతనగాధలకు భావార్థములను జెప్పుటలో మొత్తముమీద, పండితలోకమందు నాలుగు మతములు గలవు.

(౧) ఐతిహాసికమతము:—వైదికదేవతలందరును పూర్వమొకప్పుడు మానవమాత్రులుగనేయుండి, మనవలెనే యీ భూమిపై సంచరించుచుండిరనియు, పిమ్మట కొంతకాలమునకు వారియొక్క సుగుణసంపదనుబట్టియు అప్రతిమానమగు శక్తిని బట్టియు వారికి దేవత్వము లభించెననియు యీతెగలోని పండితులమతము.



(౨) బ్రహ్మవాదినమతము:— ఈమతమువారు వైదిక దేవతలను కర్మదేవతలనియు, ఆజానదేవతలనియు రెండుతెగలుగ విభజింతురు. తాముస్వయముగ చేసినకర్మలవలన దివ్యపదవినొందినవారు కర్మదేవతలు; పుట్టుకతోనే దేవత్వము నొందినవారు ఆజానదేవతలు.

(౩) నైరుక్తమతము:— సృష్టిచమత్కారములే యీ దేవతారూపములుగను, వారొనర్చు మహాత్కార్యములుగను వేదములం దలంకారరూపముగ వర్ణింపబడెనని నైరుక్తుల మతము.

(౪) ఆధ్యాత్మికమతము:— ఈమతమువారు వైదిక కథలనన్నిటిని బ్రహ్మజ్ఞానపరముగ నన్వయింతురు.

ప్రధానమగు యీనాలుగుమతములేగాక, యింకపలువురు పలువిధములుగ నన్వయంచువారునుగలరు. ఈపలుమతములలోని గుణాగుణముల తారతమ్యముల నిట చర్చించుటకిదియదనుగాదు.

వైదికగాధలందు సృష్టిచమత్కారములే అలంకారరూపముగ వర్ణింపబడియున్నవనుసంగతిని ఒక్కనైరుక్తులేతప్ప తక్కినమతములవారెవరును ఒప్పుకొనరు. ఈనైరుక్తమతము చాలపురాతనమైనది. ఆధునికపండితులుకూడ చాలవరకీమతమునేయంగీకరించిరి. యాస్కాచార్యులవంటి కొందరుఆధునిక నైరుక్తులుచిన్నచిన్న వివరములలో ప్రాచీననైరుక్తులతో నేకీభవింపకపోయినను మొత్తముమీద యీప్రాచీననైరుక్తపద్ధతి

యీకాలమందుకూడ చాలవర కంగీకరింపబడియున్నది. ఈరీతిగ వైదికగాధలకు నైరుక్తమత మంగీకరింపబడినను యీవైదిక గాధలప్రమాణము పరోక్షమగుటచే దీనిని ప్రత్యేకించి యింత వరకు నిలిపియుంచితిని. ఒకవేళ, యీవైదికగాధల నన్వయించు విషయములో నెవరేమతము నంగీకరించినను, యెవరేమతము నంగీకరింపకపోయినను మన మింతవరకు చర్చించిన ప్రత్యక్షప్రమాణములకు మాత్రమెట్టి బాధయు గలుగనేరదు. అది స్థిరముగ నిలిచియే యుండును. అందుచేతనే, యీ రెండురకముల ప్రమాణములను నేను వేరువేరుగ నుంచితిని. ఉత్తరధ్రువమండలమందున్న సృష్టిచమత్కారములను నిస్సంశయముగ ఋజువుపరుచు ప్రత్యక్షప్రమాణముల నన్నిటిని మొదటి ౮ అధ్యాయములలో చర్చించి, పరోక్షప్రమాణములగు యీవైదికగాధల చర్చను యింతవరకు నిలిపియుంచితిని. కావున, మన మిప్పుడీవైదికగాధల చర్చకు ప్రారంభింతము. మన చర్చ నైరుక్తులు చూపిన త్రోవనే యంగీకరించుచున్నది.

ప్రాచీననైరుక్తులు దాదాపు వైదికగాధల నన్నిటిని సూర్యకాంతికిని అంధకారమునకును నిత్యము జరుగుచుండు యుద్ధముగగాని; లేక సర్వసస్యముల కాధారభూతమైన నీటిని సూర్యకాంతిని బంధించివేసిన కారుమబ్బులకును, పర్జన్యదేవునకును జరుగు యుద్ధముగగాని భావించి యర్థము జెప్పిరి. ఉదాహరణ:- "తోడేలు నోటిలోపడిన పరిగపిట్టను (వర్తికా)



అశ్వినులు కాపాడిరి" అనియున్న వైదికగాధకు "రాత్రిపూట అంధకారమునందు బంధింపబడిన సూర్యకాంతిని, ఉషస్సును విడిపించుట" యను భావార్థమును యాస్కాచార్యులవారు చెప్పిరి. ఇట్లే వృత్రాసురునిగూర్చి యాస్కాచార్యులువారు తమ నిరుక్తమందు (II, 16) భిన్నమతస్థుల యభిప్రాయముల నిట్లని వివరించియున్నారు:- తత్కో వృత్రః మేఘఇతినైరుక్తాః త్వాష్ట్రోఽసుర ఇత్యైతిహాసికాః అపాంచజ్యోతిషశ్చ మిశ్రీభావ కర్మణోవర్ష కర్మజాయతే తత్రోపమార్థేన యుద్ధవర్ణాభవంతి అహివత్తుఖలు మంత్రవర్ణాః బ్రాహ్మణవాదాశ్చ వివృద్ధ్యా శరీరస్యస్రోతాంసి నివారయాం చకార తస్మిన్హతే ప్రసస్యన్దిరేఆపః॥ "వృత్రుడెవరు? "మేఘ" మని నైరుక్తులు చెప్పుచున్నారు. "త్వష్ట్రి" కుమారుడగు అసురుడని ఐతిహాసకులు చెప్పుచున్నారు. నీరును వెలుతురును మిశ్రమమగుటయే వర్షమనబడుచున్నది. ఈకర్మయే యుద్ధమని యుపమాలంకారముగ చెప్పబడినది. వృత్రుడు సర్పమని బ్రాహ్మణములును, మంత్రములును చెప్పుచున్నవి. ఈవృత్రుడు తన శరీరమును పెంచి నీటిప్రవాహములనన్నిటిని నిరోధించెను. వృత్రాసురుడు హతుడుకాగనే నీరు మరల ప్రవహించెను." దీనినిబట్టి, నైరుక్తుల వ్యాఖ్యానమునకు మేఘ (లేక పర్జన్య) సిద్ధాంతమును, ఉషస్సిద్ధాంతమును ప్రధానాధారములుగ గన్పట్టుచున్నవి. వేదములందు వర్ణింపబడిన దేవతలయొక్క నిజమగుస్వభావమును వీరు క్రీస్తుకుపూర్వము చాలశతాబ్దముల

క్రిందటనే కనిపెట్టిరి. ఈరీతిగ వేదవాక్యములలోని నిజతత్త్వమును కనిపెట్టగలిగినగౌరవము తప్పక ప్రాచీననైరుక్తులకే చెందవలెను. కాని, ఉత్తరధ్రువమండలమందలి సృష్టిచమత్కారములను, తల్లక్షణములను తెలిసికొనగలిగినంత భూగోళపరిజ్ఞానము వారికప్పుడు లేకపోవుటచే వారీవేదగాధలనన్నిటిని యీపద్ధతిపై పూర్తిగ సమన్వయింపలేకపోయిరి. ఈలోపమును పాశ్చాత్యపండితు లిటీవలకొంతవరకు సవరించిరి. యాస్కాచార్యాది ప్రాచ్యపండితులకంటె యీపాశ్చాత్యపండితులు చాల యుత్తరభూములలో నివసించియుండుటచే సూర్యుడు శీతకాలమందెట్లు చాలవరకు క్షీణించిపోవునో, మరలవసంతమందెట్లు సంపూర్ణముగ వికసించునో వారు ప్రత్యక్షముగచూచి యున్నారు. కనుక మేఘ, ఉషస్సిద్ధాంతములపై సమన్వయించుటకు వీలుగాని వైదికగాధలకొన్నింటిని పాశ్చాత్యపండితు లీసూర్యుని వృద్ధిక్షయముల నాధారముగ గైకొని సమన్వయించియుండిరి. దీనికి వసంతసిద్ధాంతమనిపేరు. పెట్టవచ్చును. ఇంతవరకు నైరుక్తమతమందు ముఖ్యముగ మూడు సిద్ధాంతములుగలవని తేలినది. వాని నిట క్లుప్తముగ వర్ణింపుచు వైదికగాధలనన్నిటిని పూర్తిగ సమన్వయించుటకవి యెట్లుపనికిరావో దెలిపెదను.

మొట్టమొదటిది ఉషస్సిద్ధాంతము:— ప్రాచీనకాలమందు సమస్తదేవవంశములకును, సమస్తవేదాంతములకును ఉషాదేవతయే మూలభూతమగు కేంద్రస్థానముగ నుండెను.



జ్యోతిర్మూర్తులగు దేవతలకును, పలుమూర్తులదాల్చిన సూర్యునకును, సమస్తఋతువులకును, సాయంప్రాతరాది త్రికాలములకును — ఉషాదేవతయే మాతృస్వరూపిణిగనుండెను. ఇక, ఆయుషాదేవతయన్ననో, వేయేల, కేవల మమృతత్వము మూర్తిభవించినదో యన్నట్లు బహుతేజోమయ విగ్రహమై వెలుంగుచుండెను. మాక్సిముల్లరుపండితుడు ఉషస్సును గూర్చి బహుసుందరముగ వర్ణించియున్నాడు. "ఉషస్సు మనకిప్పుడు కేవలము నేత్రానందకరమగు దృశ్యముగమాత్రము గన్పట్టుచున్నది. కాని, ప్రాచీనులగు పండితులకును ప్రేక్షకులకునుమాత్రమిది మహాగూఢమగు తత్త్వముగ గన్పట్టుచుండెను. పరమేశ్వరుని యవాంతశక్తికి ప్రతిరూపములుగ నున్న జ్యోతిర్మూర్తులన్నియు నిత్యము నుదయించుటకీయుషస్సే దుర్జ్ఞేయమగు జననస్థానముగనుండెను. ఈసృష్టియందీ లోకమొక్కటేగాక యింకచాలలోకములు గలవనియు, యీసృష్టియంతయు నేదోమహాశక్తిచే ప్రేరేపింపబడి నడచుచున్నదనియు, యీసృష్టి గుడ్డిపొంతగనడువక యేదోయొక సూత్రమును, క్రమమును అనుసరించి నడుచుచున్నదనియు, యీసమస్తసృష్టిని యింతతెలివితేటలతో క్రమముదప్పకుండ నడిపించు మహాజ్ఞానసంపన్ను డొకడున్నాడనియు మొట్టమొదట ప్రాచీనుల మనస్సునకు తోపజేసినదీ ఉషస్సే. మనకండ్లకు వట్టి సూర్యోదయముగ గన్పించుసృష్టి వ్యాపారము వారికండ్లకు మహాగూఢతరమగు పరమతత్త్వముగనుండెను. ఈ

సృష్టిరహస్యమేమియను గాఢసమస్య వారికండ్లకునిత్యము పొడగట్టుచుండెను. వారి జీవితమును నడిపించు దినములన్నియు మహాగంభీరమగు అంధకార సముద్రమునుండి ప్రతియుదయమునను బయల్వెడలివచ్చుచుండెను. ఈసముద్రతీరమంతయు ప్రతియుదయమునను అత్యద్భుతమగు తేజః పుంజములతోడను, చైతన్యముతోడను కళకళలాడుచు ఆనందసంధాయకముగను, నేత్రోత్సవదాయకముగను గన్పట్టుచుండెను. ప్రతియుదయమునను సూర్యుని నూతనారుణకాంతులు, నూతన చైతన్యమును, నూతనోత్తేజమును వెలిగ్రక్కుచుండెను. ఈయుషఃకాంతి రోదోంతరాళమునకు సింహద్వారముగనున్న పాఙ్నభస్థలముపై బంగారుకాంతులను వెదజల్లుచుండెను. బంగారుకాంతులతో తళతళలాడుచున్న యీ ప్రాగ్ద్వారమునుండి కోమలమందమారుతములు ఉషస్తేజస్తరంగములతో మేళవించి సర్వప్రాణికోట్లకు సత్కారపూర్వకముగ నాతిధ్యమొసంగి యాహ్వానించుచున్నవో యన్నట్లు హాయిగ వీచుచుండెను. అల్లదే! మలయపర్వతపంక్తుల కావల, మేఘమండలముల దాటి, ఉషస్తరంగముల నతిక్రమించి, "మనల నిచ్చటికి తెచ్చిన యా యమృతసింధువు" న కద్ధరినున్న బహుదూరభూములనుండి బయల్వెడలి వచ్చి, బంగారుకాంతులతో రోదోంతరాళమునంతను వెలిగించుచున్న పాగ్ద్వారములమీదుగ ఆ మందమారుతములు హాయిగ వీచుచుండెను. సూర్యుని విజయప్రస్థానమునకు త్రోవనొసంగుటకై యుషాదేవత బంగారుకాంతుల



వెదజల్లు పాగ్ద్వారములను విశాలముగ తెరచియుంచెను. ప్రాక్సింహద్వారము లిట్లు విశాలముగ తెరువబడియున్నప్పుడు ప్రాచీనులగు ఆర్యులు ఆద్వారముల కావలిప్రక్కనున్న యనంతమయప్రపంచములోనికి తొంగిచూచుటకై, అమాయకులగు చిన్నిశిశువులవలె తమ నేత్రములను, హృదయములను వికసింపజేసి తేరిపారజూచుచుండిరి. నిరామయమును, నిశ్శబ్దమును, అవ్యక్తమును, అనంతమును, పరమశాంతియుతము నగు నా ప్రకృతిదృశ్యము వీరి మనస్సులందు అనంతమును, అజరామరమును, దివ్యము నైన పరతత్వభావము నుదయింపజేసెను. కనుక, అప్పటినుండియు ఉషస్సనకీ కళ్యాణగుణ విశిష్టములైన నామధేయములే ప్రసిద్ధములయ్యెను.

ఈవర్ణన మెంతయు మనోహరమగు కవితాధోరణిని వెల్లడించుచున్నదే గాని, ఉషస్సుయొక్క నిజార్థమును మాత్రము తెలుపుటలేదు. ఈ ఒక్క ఉషస్సునుగూర్చిన వర్ణనలే వేదములందు పలుతెరగులగు కథలుగ జెప్పబడినవని మాక్సిముల్లరు పండితుని యభిప్రాయము. ఉదా:—"శరణ్యు" వను నామె వివస్వతునివలన కవలపిల్లలనుకని, ఆడగుర్రము రూపమునుదాల్చి ఆతనినుండి పారిపోయెను. అంతట వివస్వతుడు మొగగుర్రమై ఆమెవెంట పరుగెత్తెను.— ఈ కథకు మాక్సిముల్లరు పండితుడు చెప్పిన భావార్థమేమనగ :— ఉషస్సు అను స్త్రీ అహోరాత్రములను కవలపిల్లలను గని

సూర్యు డుదయింపగనే అదృశ్యమయ్యెనట. ఇట్లే, సూర్యుడు "సోమ"ను వివాహమాడిన కథయు, యింద్రుడు 'వృషాకపాయీ' యొక్క యెడ్లను మ్రింగివేసిన కథయు, అదితికి ఆదిత్యులు పుట్టిన కథయు, "పణి" యను రాక్షసునిచే దొంగిలింపబడిన ఆవులను వెదకుటకై 'సరమా' సముద్రములను దాటిన కథయు,— యివన్నియు ఉషస్సునుగూర్చి పలురీతులుగ జెప్పబడిన కథలని యీ పండితుని యభిప్రాయము. వేయేల, ప్రాచీనుల కీయుషస్సుతప్ప వేరే యింకొక టేమియు లేనేలేదని యీతని మతము. ఇది బహు ఆశ్చర్యముగ నున్నది! ఏమి? వారి కీయుషస్సేతప్ప ప్రపంచములో నింకనేమియు తెలియనే తెలియదా? ఈ సందేహము కొంతకాలమునకు మాక్సిముల్లరు పండితునకే గలిగెను. కాని, యెంతయోచించినను మాక్సిముల్లరున కీ యుషస్సు తప్ప యింకొకటి కనుబడలేదు. మాక్సిముల్లరు వర్ణించిన ఉషస్సు మనమీదేశములలో నిత్యమునుజూచు ఉషస్సేయని యెరుంగవలెను. మనమిచ్చట నిత్యమునుజూచు ఉషస్సు బహుస్వల్పకాలముండును. ముహూర్తమాత్రముండి మాయమైపోవు యీమనయుషస్సే ప్రాచీనార్యుల మనస్సులందింత భయభక్తులను పుట్టించి, యిన్నిగాథలను కల్పించుటకు కారణభూతమైనదని యీ పండితుని మతము. కాని, ఋగ్వేదమందు వర్ణింపబడిన ఉషస్సు ముహూర్తమాత్ర జీవనముగల మానయుషస్సుగాదనియు, అదినిజముగ దీర్ఘకాలముండు ధ్రువ



మండల యుషస్సనియు మనము ఋజువుపరచినప్పు డేగాథలయొక్క భావార్థములెట్లు పూర్తిగ మారిపోవునో చూడవలసియున్నది. అయినను, యీ కథలనన్నిటిని యెత్తుకొని మరల వానికి క్రొత్తభావార్థములను వ్రాయుట కిప్పుడు మనము పూనుకొనలేదు. ధ్రువసిద్ధాంతమును ఋజువుపరచుట యేమనపని.

రెండవది మేఘసిద్ధాంతము:— ఉషసిద్ధాంతమునకు లొంగనిగాథలకు భావార్థములను జెప్పుటకై ప్రాచీననైరుక్తులు రెండవదియగు మేఘసిద్ధాంతమునుగూడ బయలుదేరదీసిరి. ఈసిద్ధాంతము పైసమన్వయింపబడిన కథలలో ఇంద్రవృత్రాసురులకథ ప్రధానమైనది. ఇంద్రశబ్దము "ఇందు"= వర్షబిందువు — అనుమూలమునుండి యుత్పన్నమయ్యెనట. వృత్రశబ్దము "వృ" = కప్పివేయుట యను మూలమునుండి యుత్పన్నమయ్యెనట. ఈరెండుశబ్దోత్పత్తులనాధారము జేసికొని, వీలుగానిచోట్ల తక్కినపదములను విరిచి, యీకథనంతను సమన్వయించిరి. ఉదాహరణము:— ఇంద్రుడు 'పర్వత' మునుపగులగొట్టి అందుండి నదులను విడిపించెను. ఇచ్చట 'పర్వత' మనగ 'మేఘ' మనియు "నదుల"నగ 'వర్షధారల' నియు నైరుక్తులుజెప్పిరి. ఇంద్రుడు వజ్రమును (లేక పిడుగును) ధరించెననగ:— యింద్రుడు తుపానున కధిష్ఠానదేవతయని నైరుక్తులు జెప్పిరి. తుపానుతోపాటు వర్షమువచ్చుట ప్రసిద్ధమేగద. ఈయుద్ధమందు యింద్రునకు 'మరుత్తు' లు

(వాయువులు) సహాయముజేసిరట. అనగ, తుపానుపట్టినప్పుడు ప్రబలమైనగాలివీచుట సహజమేగద.

అయితే, వృత్రుడు (లేకఅహి) నీళ్ళను చుట్టుముట్టి బంధించివేసెనని కథలోకలదు. దీనిభావమేమి? నీళ్ళనుగొని పోయి, మేఘములలో బంధించి వేసెనని చెప్పవచ్చును. కాని, వృత్రవధచే సింధువులు (నదులు) విడుదలచేయబడెనని ఋగ్వేదముచెప్పుచున్నది. 'నదు' లనగనేమి? నదులనగ పంజాబులోనున్న నదులని వీరిమతము. ఇవి పంజాబునదులైనచో వృత్రుడు వీనినెట్లు చుట్టుముట్టిబంధించెనో బోధపడకున్నది. కాని, నైరుక్తులీయంశమును బహుతెలివితేటలతో సమన్వయించిరి. ఎట్లనగ:— పంజాబునదులు వేసవిలోయెండిపోవును; కనుకవర్షదేవతయగు యింద్రుడు, వర్షకాలమందు, తిరిగి వీనికి జీవనముల నిచ్చునుగనుక, యిందుౡడీనదులను వృత్రాసుర బంధములనుండి తప్పించెనని చెప్పవచ్చును. మనభారతీయ నైరుక్తులింతకంటె పైకిపోలేదు. కాని, జర్మనుపండితులు కొందరీసిద్ధాంతమును విస్తారముగ పెంచి ఉషస్సిద్ధాంతమునకు ప్రత్యర్థిగ నిలువబెట్టిరి. మాక్సిముల్లరుపండితుడు వైదిక గాథలకన్నిటికిని ఉషస్సే ఆధారమని చెప్పినట్లు యీపండితు లిప్పుడు వానికన్నిటికిని మేఘమే. లేక గాలివాన, తుపాను మొదలగు వాతావరణ పరిస్థితులే మూలాధారమని వాదింప జొచ్చిరి. "మేఘములు; తుపానులు, వర్షములు, ఉరుములు, మెరుపులు,—అన్నిటికంటె యివియే ప్రాచీనార్యుల మనో



భావముల నెక్కుడుగ ఆకర్షించెను" అని "కుహర్న్" పండితుడు చెప్పుచున్నాడు. "భూమిమీదనున్న వస్తువులు వారికి మామూలుగనే గన్పట్టెను. కాని, ఆకాశము నందుత్పన్నములైన యీమహాగంభీర దృశ్యములుమాత్రము వారికిమహాశ్చర్యమును, భయమును గల్పించెను. ఇట్టి వింతవస్తువులతో పోల్చుటకై భూమిమీద తామెరిగియున్నవస్తువులేమి యున్న వాయని వెదుక నారంభించిరి. సూర్యచంద్రాదుల యుదయాస్తమయములుకూడ— ఒకానొకక్రమముననుసరించి యుండుటచే — వారి కంతటి యాశ్చర్యమును పుట్టింపలేదు. కాని, ఆకాశమందలి వాతావరణపరిస్థితులుమాత్రము క్షణమునకొక వింతరూపముగ మారుచు మహాగందరగోళముగనుండెను. వీనితత్వము మహాగూఢముగను, గంభీరముగను, దురవగాహముగను గన్పట్టెను...." కనుక, ప్రతివైదికగాథయు యీ తుపానుమీదనే ఆధారపడెనని "కుహర్న్" పండితుని యభిప్రాయము.

మూడవది వసంతసిద్ధాంతము :— ఈ రెండునుగాక, మూడవది యింకొక సౌరసిద్ధాంతముగలదు. దీనికి వసంత సిద్ధాంతమని పేరుపెట్టుదము. మాక్సిముల్లరు మొదలగు పాశ్చాత్యపండితులు యాస్కాచార్యాది ప్రాచ్యనైరుక్తులకంటె ధ్రువమండలమున కెక్కువ దగ్గరగనున్నారు. అచ్చట, హేమంతర్తువునందు సూర్యునికాంతి చాలవరకు క్షీణించిపోవును. తిరిగి వసంతమునందు సూర్యకాంతి ప్రబలమగును.

సూర్యతేజముం, దిట్టి వృద్ధిక్షయములు మనదేశమందం తగ గన్పట్టవు. కాని, జర్మనీ మొదలగు ఉత్తరదేశములలో స్పష్టముగ గన్పట్టును గనుక, మాక్సిముల్లరు పండితుడు చాల గాథల నీఖగోళాంశముపై నన్వయించియున్నాడు. అశ్వినీదేవతలు అనేకమందిని రక్షించియున్నారు. అశ్వినులు చ్యవనునకు యౌవనము నొసంగిరి; అత్రిని శీతోష్ణాదులనుండి కాపాడిరి; బ్రతికియుండగనే గోతిలో పూడ్చిపెట్టబడిన 'వందన' మును పైకితీసి రక్షించిరి; 'విశ్పలా' యను నాపె యొక్క కుంటికాలును బాగుచేసిరి; ఋజ్రాశ్వమునకు నేత్రదృష్టినొసంగిరి. — ఈకథలన్నిటికిని ఒకటే భావార్థము— అనగ, శీతకాలమందు క్షీణించిపోయిన సూర్యుడు తిరిగి వసంతకాలము రాగనే పరిపూర్ణతేజస్సుతో వెలింగెను.

ఈ వసంత, ఉషస్సిద్ధాంతములు రెండును సౌరసిద్ధాంతములే — అనగ, సూర్యునకు సంబంధించినవే. అయితే, ఉషస్సిద్ధాంతము సూర్యునిదైనికగతిని దెలుపుచున్నది; వసంతసిద్ధాంతమన్నవో సూర్యునివార్షికగతిని దెలుపుచున్నది. మేఘసిద్ధాంతము సూర్యునకుసంబంధింపదు. ఇది కేవలము వాతావరణపరిస్థితులను దెలువుచున్నది.

ఇంతవరకు వర్ణించిన వసంత, మేఘ, ఉషస్సిద్ధాంతములుగాక, యింక ననేక సిద్ధాంతములుకూడ గలవు. వానినన్నిటి నిట చర్చించుట మన పనికాదు. నేనిప్పుడు చెప్పదలచుకొన్న ముఖ్యమైనమాట యేమనగ:— ఎన్నిసిద్ధాంతములు బయలుదేరినను యిప్పటికిని యీ సిద్ధాంతములకు వేనికిని లొంగని వైదికగాథలును, కథాభాగములును, చాలవరకు సలిచియే యున్నవి. క్లిష్టమైన యిట్టి యంశములు పండితులకు సాధ్యముగానందున, ప్రతివారును వానిని వదలివేసిరో, లేక అప్రాముఖ్యమైనవని త్రోసివేసిరో సరిపుచ్చుకొనిరి. వీరిచే నిట్లింతవరకు దురవగాహమైనవిగ వదలివేయబడిన గాథలకు మన ధ్రువసిద్ధాంతమువలన సరళమగు భావార్థము కుదిరినచో, మన సిద్ధాంతమును బలపరుచుకొనుటకై యీ గాథల నేల మనము సాక్ష్యముగ గైకొనకూడదు? కనుక, మన ధ్రువసిద్ధాంతముచే యీగాథలకేమైన సరళమగు భావార్థము కుదురునేమో పరిశీలించి చూతముగాక. మొట్టమొదట మనము ఇంద్ర వృత్రాసురులు గాథ నెత్తికొందము. దీనిని పండితు లిదివరకు మేఘసిద్ధాంతముపై పూర్తిగ సమన్వయింపగలిగితిమని తలంచుచున్నారు. అయినను, మనమిప్పుడు దీనిని మరల నామూలాగ్రముగ పరిశీలించిచూతము.

ఇంద్రునకును వృత్రునకును జరిగిన పోరాటము వేదములందు నాలుగువిధములుగ వర్ణితమైయున్నది. (౧) వృత్రతూర్యః— ఇది ఇంద్రునకును, వృత్రుడను రాక్షసునకును జరిగిన యుద్ధము. ఈ యుద్ధమందు వృత్రుడు నముచి, శుష్ణ, శంబర, వల, పిప్రు, కుయవాది నామములతో వర్ణితుడైయున్నాడు. (౨) అప్-తూర్య (నీటికై పోరాటము) ఈ పోరాటము నీటిని విడిపించుటకై చేయబడినట్లు వర్ణింపబడినది. ఇంద్రుడు

వృత్రుని సంహారింపగనే సింధువులు ( నదులు ) లేక నీరు (ఆపః) విడివడి పారజొచ్చెను. కనుక యింద్రుడు "అప్సు-జిత్" ( నీటిలో జయముగొన్నవాడు ) ఆయెను. ఇచ్చట వృత్రాసురుడు "నీటిని చుట్టుముట్టె" నని (ఆపః పరి- శయానమ్) చెప్పబడెను. (౩) గో-ఇష్టి= (గోవులను తిరిగి సంపాదించుటకై చేసిన పోరాటము). ఇంద్రుడు వృత్రాసురుని సంహారించి, ఆతనిచే బంధింపబడియున్న గోవులను విడిపించెను. (౪) దివిష్టి = (సూర్యకాంతిని విడిపించుటకై చేసిన యుద్ధము.) ఇంద్రుడు వృత్రుని సంహారించి అతనిచే బంధింపబడిన సూర్యుని, ఉషస్సును విడిపించి పైకితీసికొనివచ్చెను.

ఒక్క-పోరాటమే ఈనాలుగువిధములుగ ఋగ్వేదమందు వర్ణితమైయున్నది. ఈ చతుర్విధవర్ణనలనుగూర్చిన ఋగ్వేద ప్రమాణముల నీక్రింద సంక్షేపముగ వివరించెదను.

—* వృత్రవధనుగూర్చిన ప్రమాణములు *—

(౧) I, 80, 11; II, 11, 9, 10; VI, 17, 9 } ఇంద్రుడు తన వజ్రముతో వృత్రాసురుని ప్రహరించినప్పుడు ( అనగ కొట్టినప్పుడు ) భూమ్యాకాశములు భయముచే దద్దరిల్లిపోవును.

(౨) I, 80, 14 } ఈవజ్రమును నిర్మించిన "త్వష్ట్రి"కూడ యింద్రుని మహోగ్రకోపమునకు గడగడ వడంకును.



(౩) I, 32, 5 } ఇంద్రుడు తనవజ్రముతో వృత్రాసురుని తుత్తునియలుగ కొట్టివేయును.

(౪) I, 52, 15 } ఇంద్రుడు కొసదేరిన తన ఆయుధముతో వృత్రాసురుని మొగముమీదపొడుచును.

(౫) III, 20, 2 } నీటిని చుట్టుముట్టిన వృత్రుని యింద్రుడు చావగొట్టెను.

(౬) IV, 19, 2 } నీటిచుట్టును పరుండియున్న (పరిశయానమ్) భయంకరసర్పమును యింద్రుడు చావ మొత్తెను.

(౭) V, 30, 6 } నీటిమీదపరున్న ఘోరాహిని యింద్రుడు జయించెను.

(౮) II, 11, 5 } నీటిలోదాగికొని, నీటిని ఆకాశమును నిరోధించుచున్న ఘోరాహిని యింద్రుడు చంపెను.

(౯) II, 14, 2 } చెట్టువలె నీటినిచుట్టుకొనియున్న వృత్రుని యింద్రుడు తన వజ్రముతో చావ మొత్తెను.

(౧౦) VIII.36, 1 } ఈవిధముగ " నీటిలో జయముగొన్నవాడు " (అప్సు-జిత్) అను బిరుదు యింద్రునకొక్కనికే చెల్లును.

—♦ వృత్రుని నివాసస్థానమునుగూర్చిన ప్రమాణము. ♦—

(౧) I, 32, 10 — వృత్రునకు రహస్యమగు (నిణ్య) నివాసస్థాన మొకటిగలదు. ఇంద్రుడు నీటిని విడిపించినప్పుడవి యీరహస్య ప్రదేశమునుండి బయటపడి యీయసురుని శరీరముమీదుగ ప్రవహించి వచ్చును.

(౨) I, 121, 11; II, 11,19 — వృత్రుడు నీటిపై పరుండును.

(౩) I, 52,6 — వృత్రుడు నీటిచే కప్పబడి "రజస్" యొక్క అడుగు భాగమందు (బుధ్న) పరుండియుండును.

(౪) I, 80, 5 — ఇంద్రుడు నీటిని ప్రవహింపజేసినప్పుడు వృత్రుడు 'సాను' ప్రదేశమందు (కొండమీద) పరుండియుండెను.

(౫) X, 89, 7 — ఇంద్రుడు వృత్రుని చంపి, ఆతని కోటలను నాశన మొనర్చెను.

(౬) VIII, 93, 2; VII, 19, 5 — వృత్రునకు ౯౯ కోటలు గలవు.

(౭) I, 130, 7; IV, 30, 20 — వృత్రుని కోటలు ౯౦ లేక ౧౦౦



(౮) I, 52, 2 — వృత్రుడు "నదీ-వృత్" (నదులను చుట్టుముట్టుకొని యున్నవాడు.)

(౯) I, 57, 6 — వృత్రుని కడుపులో పర్వతము గలదు.

(౧౦) IV, 30, 20; IV, 27, 1 — వృత్రుని కోటలు రాతితోను, యినుముతోను కట్టబడినవి.

(౧౧) I, 130, 7; I, 131, 4; IV, 20,10 — వృత్రుని కోటలు "శారదీః" అని చెప్పబడెను. (దీని యర్థమును పిమ్మట విచారింతము.)

—♦ యుద్ధరంగమును గూర్చిన ప్రమాణములు ♦—

(౧) V, 32, 5, 6 — ఇంద్రుడు తనతో పోరాడుట కాతురుడైయున్న "శుష్ణ"ను చీకటిగోతిలో పెట్టి, సూర్యరశ్మిలేని గాఢాంధకారమందు, (అసూర్యే తమసి) వధించెను.

(౨) I, 34, 10 — వృత్రుని మందిరములో చీకటి వ్యాపించి యుండెను.

(౩) II, 23, 18 — బృహస్పతి, యింద్రసహాయుడై, చీకటిచే ఆవరింపబడియున్న సముద్రమును క్రిందికి విసరివేసి, ఆవుల కొట్టమును తెరచెను.

(౪) I, 32, 10 — వృత్రుని శరీరము నీటిచే ఆవరింపబడి దీర్ఘమగు గాఢాంధకారమందు మునిగియుండెను.

(౫) II, 23, 18 — వృత్రుని సముద్రము చీకటిలో మునిగి యుండెను. (తమసి పరివృతం)

వ్యా:— వృత్రునిచే ఆవరింపబడిన సముద్రము (అర్ణః) సూర్యరశ్మిలేని గాఢాంధకారముగనుండెను. కనుక యిది V, 45, 10 లో-సూర్యుడు యెక్కి-వచ్చిన జ్యోతిర్మయ సముద్రమున కంటె (శుక్రం అర్ణః) భిన్నమైనదని యెరుంగవలెను.

(౬) I, 53, 7
VIII, 12, 17
VIII, 45, 25 — ఇంద్రుడు వృత్రాసురుని సంహరించుటకై చాల దూరదేశము (పరావత్) లోనికిపోయెను.

వ్యా:— చాల దూరప్రదేశమందు, చీకటిలో, నీటి మధ్యను, యీ యుద్ధము జరిగెనని సారాంశము.

—* యుద్ధకాలమునుగూర్చిన ప్రమాణములు *—

(౧) VIII, 32, 26 — ఇంద్రుడు అర్బుదను (వృత్రుని) మంచుతో (హిమ) చంపెను.

(౨) X, 62, 2 — ఆవులను విడిపించుటలో యింద్రునకు తోడ్పడిన అంగిరసులు వలను(వృత్రుని) సంవత్సరాంతమందు ( పరివత్సరే ) చంపిరి.

(౩) — ఇంద్ర శంబరుల యుద్ధకాలమును ఖండితముగ నిర్ణయించుటకై ఋగ్వేదమందింకొక ప్రమాణవాక్యముగలదు. దానిని తదుపరి చర్చింతము.



—* యుద్ధ ఫలితములనుగూర్చిన ప్రమాణములు. *—

(౧) III, 34, 8 — ఇంద్రుడు వెలుతురును, దివ్యజలములను, సంపాదించుకొని వచ్చెను.

(౨) VIII, 89, 4 — ఓయింద్రా! వృత్రునిసంహరించి, వెలుతురును సంపాదించుకొని రమ్ము.

(౩) I, 51, 4
I, 52, 8 — ఇంద్రుడు తనవజ్రముతో ఘోరాహిని సంహరించి, మానవులకొరకు నీటిని విడిపించినప్పుడు సూర్యునికూడ-యెల్లరికి కనిపించునట్లు-ఆకాశమందుంచెను.

(౪) II, 19, 3 — ఘోరాహిహంతకుడగు యింద్రుడు సముద్రజలములను ప్రవహింపజేసెను. సూర్యునిపైకితెచ్చెను. ఆవులను కనుగొనెను.

(౫) III, 34, 8, 9 — రాక్షసుని సంహరించిన పిమ్మట యింద్రుడు సూర్యుని జలములను సంపాదించెను.

(౬) I, 32, 4
VI, 30, 5 — ఇంద్రుడు రాక్షసుని సంహరించి,పర్వతమునుండి నీటిని విడిపించినప్పుడు ఆతడు సూర్యుని, ఆకాశమును, ఉషస్సునుకూడ పుట్టించెను.

| | | |
|---|---|---|
| (౭) | I, 62, 5<br>II, 12, 7<br>VI, 17, 5 | ఇంద్రునిచే విడిపింపబడిన వస్తువులలో సూర్య, ఉషస్సులతోపాటు ఆవులు కూడ పేర్కొనబడినవి. |
| (౮) | I, 7, 3<br>II, 19, 3<br>X, 138, 2 | సూర్యునితోపాటు ఆవులుకూడ పేర్కొనబడెను. |
| (౯) | II, 11, 2 | ఘోరాహిచే బంధింపబడిన ప్రవాహములను యింద్రుడు విడిపించెను. |
| (౧౦) | I, 32, 12<br>II, 12, 12 | ఇంద్రుడు ఆవులను గెలుచుకొనివచ్చి సప్తనదులను ప్రవహింపజేసెను. |
| (౧౧) | II, 15, 6 | ఇంద్రునిచే విడిపింపబడిన నదులు ఊర్థ్వముగ (ఉదంచం) ప్రవహించుచున్నవి. |

వరా:— ఈ ప్రదేశములలో పర్వత, గిరి, అద్రి, ఊధస్ (పొదుగు), ఉత్స (నీటిబుగ్గ), కబంధ (పెట్టె), కోశ (గిన్నె) — అను పదములే ప్రయోగింపబడియున్నవి. గాని మేఘమను భావమును సూచించు 'అభ్రా'దిపదములు మచునకైనను ప్రయోగింపబడలేదు. అయినను, నైరుక్తులును పాశ్చాత్యులును కూడ యీ పైపదముల కన్నిటికిని మేఘమనియే యర్థము జెప్పిరి. 'గో' అనగ 'ఆవు' అని సాధారణార్థము. కాని, కొన్నిచోట్ల 'గో' అనగ ఇంద్రునిచే విడిపింపబడిన నీరని పండితులు చెప్పిరి. రాతిగోడలలో బాధింపబడిన గోవులను ఇంద్రుడు విడిపించెననగ, మేఘమను రాతిగోడలమధ్య బాధింపబడిన నీటిని ఇంద్రుడు విడిపించెనని భావార్థమును జెప్పిరి. ఈ యుద్ధమం దింద్రునకు తోడ్పడిన వారిలో మరుత్తులు, విష్ణు, అగ్ని, బృహస్పతి, అంగిరసులు — మొదలగువారు పెక్కుమందిగలరు. ఈ కథయే ఋగ్వేదమం దింక ననేకవిధములుగ వర్ణింపబడియున్నది. కాని, మన కింతవరకు చాలును.



వృత్రాసురవధను మేఘసిద్ధాంతముపై సమన్వయించితిమని పండితులు తలంచుచున్నారు. కాని, వీరి సమర్థనము సరియైనదిగాదు. దీనికి ముఖ్యముగ నాలుగభ్యంతరములుగలవు. వానినిట వివరించెదను.

I. మొదటి అభ్యంతరము :— (యుద్ధఫలితములను గూర్చిన అభ్యంతరము) వృత్రాసురవధకు ఫలితముగ నేకకాలమందు నాలుగు ఫలితములు గలిగినవి. (౧) ఆవులు విడిపింపబడెను; (౨) నీరువిడిపింపబడెను; (3) ఉషస్సు ప్రజనన మొందింపబడెను; (౪) సూర్యుడు ప్రజనన మొందింపబడెను. ఈ సమకాలిక చతుర్విధఫలోత్పత్తిని మేఘసిద్ధాంతము సంతృప్తికరముగ సమర్థింపలేదు. వృత్రుడు మేఘుడని యన్నచో యింద్రుడు తనవజ్రముతో మేఘమునుచీల్చి అందు బంధింపబడియున్న నీటిని విడిపించెనని చెప్పవచ్చును. కాని, వృత్రవధవలన ఒక్కనీరేగాక దానితోపాటు ఆవులుకూడ విడిపింపబడియున్నవే? ఆయావులేవి? ఆవులగ నీరేయని

నైరుక్తులు చెప్పుచున్నారు. ఆవులన్నను, నీరన్నను ఒక్కటే యైనచో యివిరెండు భిన్నఫలితము లెట్లుగాగలవు ? కనుక, యివి యెట్లు భిన్నపదార్థములో నైరుక్తులు చెప్పలేకపోయిరి. మరియు, ఆవులు, నీరు నను నీ రెండువస్తువులేగాక, వృత్రవధ వలన సూర్య, ఉషస్సులు సయితము ఆకాలమందే ప్రజనన మొందెను. మేఘసిద్ధాంత మీ సూర్య ఉషస్సుల యుత్పత్తిని సమర్థించుట కెంతమాత్రమును చాలదు. మేఘములు సూర్యుని సదా కప్పవు. ఏ బహుస్వల్పకాలమో మేఘము లాచ్ఛాదించినంతమాత్రముచే, మేఘములను చీల్చినందువలన సూర్యుడు ప్రజననమొందెనని చెప్పుటకు సాధ్యపడదు. అట్లే ఉషసోదయముకూడ అసమర్థనీయముగనున్నది. మేఘములు సాధారణముగ ఆకాశమధ్యమందు సంచరించుచుండును. బహు అరుదుగ క్షితిజమువద్దకు పోవును. అట్లయినప్పుడు, మేఘములను చీల్చినందువలన ఉషస్సు ప్రజననమొందెనని నమర్థింపజూచుట చాల అసంగతముగనున్నది. ఈ చతుర్విధ ఫలముల సమకాలికోత్పత్తిని సమర్థించుట కింతవరకెవరును ప్రయత్నించియుండలేదు. ఒకనైరుక్తులుమాత్ర మీ మేఘ సిద్ధాంతముచే కొంత యత్నించి చూచిరి. ఈ నాల్గుఫలితము లలో నీరే ప్రధానమైనదిగ గన్పట్టుటచే, నైరుక్తు లీ మేఘ సిద్ధాంతమును బయలుదేరదీసిరి. నీరు* (ఆపః) అనగ మనము ప్రతిదినమునుచూచు మామూలునీరనియే వా రర్థముచేసి కొనిరి. కాని, యీనైరుక్తులును పాశ్చాత్యులును యెన్ని



విధముల ప్రయత్నించినను యీఫలితములసమకాలికోత్పత్తిని మాత్రము సమర్థింపనేలేకపోయిరి. “తుపానుపోయిన తరువాత సూర్యుడు గన్పట్టుటకును — రాత్రిగడచిన పిదప సూర్యోదయమగుటకును — చాలభేదముగలదు. ఇవి రెండును రెండు భిన్నవిషయములు. కాని, యీ రెండు విషయములును (వేదములందు) గందరగోళముగ తారుమారుజేసి చెప్పబడియున్నవ” ని మ్యాక్డొనాల్డుపండితుడు తలంచుచున్నాడు. కనుక యీమాటవలన తేలినసారాంశ మేమనగ:— “ఈసమకాలికోత్పత్తియొక్క నిజమగు భావార్థము మాకు తెలియలేద”ని పండితులుస్పష్టముగ నొప్పుకొని యున్నారని యర్థమగుచున్నది. కాని దీనిలోవచ్చిన వింత యేమనగ:— ఇట్టి అసమర్థతకు తమ అశక్తియే కారణమని చెప్పుకొనక వైదికఋషులే యేమో గందరగోళపడిరని చెప్పుచు తమతప్పును వైదికరుషులమీదికి తోసివేయు చున్నారు!

II. రెండవ అభ్యంతరము:— (యుద్ధరంగమును గూర్చిన అభ్యంతరము) ఇంద్రుడు ఆవలిప్రక్కనున్న బహుదూర దేశములో భయంకరమగు గాఢాంధకారమందు సముద్రజలములమధ్యను వృత్రునిసంహరించెను. ఇంద్రుడు వృత్రుని సంహరించుటచే దేవయానద్వారములు బాహాటముగ తెరపి యయ్యెను. అనగ, యింద్రుడువృత్రుని దేవయానమునకు పోవు గుమ్మమువద్ద చంపెను. పారశీగ్రంథమందుకూడ ‘త్రిష్ట్రి

అపోషను వోరు-కశాసముద్రమందు చంపెను. యుద్ధానంతరమందు 'తిష్ట్రి'మజ్ఞాయను దేవతచే చేయబడిన మార్గమందు (దేవయానమందు) నడచుచువచ్చెను. వృత్రమందిరము "రజస్" యొక్క అట్టడుగున నీటిచేగప్పబడి అదృశ్యముగ నుండెనని ఋ I, 52, 6 చెప్పుచున్నది. ఈవర్ణనలలో నొక్కటియైనను మేఘమునకు సరిపోజాలవు. మేఘము సముద్రమని చెప్పుటకు వీలులేదు. మేఘము ఆవలిప్రక్కనున్న బహుదూరదేశములో (పరావత్) నున్నదని చెప్పుటకును వీలులేదు. మేఘము * "దేవయాన గుమ్మము" వద్దనున్నదనియు చెప్పజాలము. ఆకాశమధ్యమందు తిరుగాడుచున్న మేఘములు దేవయాన గుమ్మమువద్దనున్నవనగాని, ఆవలిప్రక్క దూరదేశమందున్నవనిగాని వర్ణింపబడజాలవు. అదిగాక, మేఘములు సూర్యరశ్మి లేని గాఢాంధకారమందు (అసూర్యే తమసి) మునిగియున్నవను వర్ణనయు నసంగతమే. కనుక, యీ యుద్ధరంగమును తీసికొనిపోయి మేఘములలో పెట్టుట కెంతమాత్రమును వీలులేదు. ఈ యుద్ధరంగము మనకు ఆవలిప్రక్క దూరదేశములో గాఢాంధకారపరివృతమై యున్న సముద్రమధ్యమందు జరిగెను. ఈ యుద్ధానంతరము సూర్యుడు తేజోమయమైన

* దేవయాన మనగ ఖగోళముయొక్క పై యర్ధభాగము; పితృయాన మనగ ఖగోళముయొక్క అడుగు భాగము. దేవయాన గుమ్మమనగ మనకు పైన గాన్పించు ఖగోళార్ధభాగమునకు (అనగ ఆకాశమునకు) ప్రవేశపు గుమ్మము; అనగ క్షితిజమునకు కొంచెము క్రిందిభాగమని యర్థము.



సముద్రము (శుక్రంఅర్ణః) మీదికి—అనగ మనపైనకనుబడుచున్న ఆకాశముమీదికి— యెక్కివచ్చెను. యుద్ధముజరిగిన చోటు గాఢాంధకారమైయున్న అర్ణవముగనుండెను. (తమసా పరివృతం) యుద్ధానంతరము సూర్యుడుపైకియెక్కివచ్చినచోటు తేజోమయార్ణవముగనుండెను. (శుక్రం అర్ణః) కనుక యీ రెండును భిన్నప్రదేశములుగ ప్రత్యేకించి వేదమునందే చెప్పబడియున్నవి. దీనినిబట్టి మనక్షితిజముక్రిందనున్న ఖగోళార్ధభాగమందు (అనగ, అధోలోకమందు) యుద్ధముజరిగెనేగాని, మననెత్తిపై యాకాశమందు తిరుగాడుచున్న మేఘములో కాదు సుమాయని స్పష్టమగుచున్నది. (ఇంద్రుడు వర్షాధిష్ఠానదేవతయైన నైయుండవచ్చునుగాక; కాడని నేజెప్పుటలేదు. కాని ప్రస్తుతాంశమేమనగ:— వృత్రహంతకుడుగ వేదమందు వర్ణింపబడిన యింద్రుని మాత్రము వర్షాధిష్ఠానదేవతగ నన్వయించి చెప్పుటకు వీలులేదని మామతము.)

III. మూడవఅభ్యంతరము:- (యుద్ధకాలమును గూర్చిన అభ్యంతరము) మేఘసిద్ధాంతము సంగీకరించినచో యీ యుద్ధము వర్షకాలమందు జరిగెనని చెప్పవలసివచ్చును. కాని, యింద్రునిచే నాశనముచేయబడిన వృత్రుని * కోటలు శరదృతుసంబంధమైనవని (శారదీః) ఋగ్వేదము చెప్పుచున్నది. ఈయసందర్భమును సమర్థించుటెట్లు ?

* కోటలను నాశనముచేసినందువల్ల యింద్రునకు పురందర, పురభిత్, నామములు వచ్చెను.

పూర్వము వర్షశరదృతువుల రెంటికినికలిసి మొత్తముపై యొక్క శరదృతువను పేరేయుండెనని చెప్పి దీనిని సమర్థింప వచ్చును. కాని, ఒకవేళ దీని నిట్లు సరిపుచ్చుకొన జూచినను "వృత్రుడు సంవత్సరాంతమందు (పరివత్సరే) చంపబడెనని చెప్పు ఋ X, 62, 2 వాక్యమునెట్లు తప్పించుకొనవగలము. దీనినితప్పించుకొనుటకై పూర్వమొకప్పుడు సంవత్సరము శరదృతువుతో ప్రారంభమయ్యెనని చెప్పుకొనవలెనుకాబోలు! ఇంద్రుడు అర్బుదను (వృత్రుని) మంచుతో (హిమతో) చంపెనని వేదము చెప్పుచున్నది. యుద్ధము వర్షకాలమందు జరిగినచో, ఉషసోదయమును యుద్ధఫలితముగ నెట్లు చెప్పవచ్చును. యుద్ధము అసూర్యమగుతమస్సులో జరిగెనని యెట్లు చెప్పవచ్చును. కనుక, యీయుద్ధకాలమును సమర్థించుటకు కూడ యీమేఘసిద్ధాంతము సరిపోదు.

IV. నాల్గవ అభ్యంతరము:- (శబ్దజాలమునుగూర్చిన అభ్యంతరము) వృత్రుడునీటిని బంధించియుంచిన ప్రదేశమును వర్ణించుచు వేదమునందు, పర్వత, గిరి, అద్రి, ఊధస్, ఉత్స, కబంధ, కోశ,-మొదలగు శబ్దములు ప్రయోగింపబడియున్నవి. మేఘసిద్ధాంతవాదు లీపదముల కన్నిటికిని "మేఘ" మను భావార్థమునే చెప్పిరి. వేయేల, యీ ప్రదేశమును వర్ణించుటకై వేదఋషు లేపదమును ప్రయోగించియున్నను సరే దాని సరళార్థము నెంతమాత్రము లెక్కగొనక మన నైరుక్తులు దాని నంతయు విరిచి ప్రతిచోట మేఘమనియే భావా



ర్థమును జెప్పిరి. ఈ వృత్రగాధకు నిజమగు భావార్థమును తెలిసికొనుట కీమేఘసిద్ధాంత మొక్కటియే తప్ప అప్పటికి వేరొండు గతిలేకపోవుటచే, వారిట్లు శబ్దములను విరిచి యేదో విధముగ సరిపెట్టుకొనవలసినవారైరి. అప్పటి యవసరమును బట్టి వా రేదోయొకవిధముగ నిట్లు సరిపెట్టుకొన జూచినను, మొత్తముమీద యీపద్ధతి చాల లోపభూయిష్ఠమనిమాత్ర మొప్పుకొనక తప్పదు. అందుచే వారి వ్యాఖ్యానపద్ధతికంత విలువ యుండజాలదు. ఈలోపమును గ్రహించి, దాని నెట్లైన సరిపుచ్చుటకై పాశ్చాత్యపండితులు కొంత యత్నించిరి. కాని వారియత్నములు సయితము నిష్ఫలము లయ్యెను. పర్వత, గిరి, అద్రి, అను పదములకు మేఘమనుటకు బదులుగ "పర్వత" మనియే సరళార్థమును చెప్పిన బాగుండునని యొక పండితుడు సూచించెను. అనగ, ఇంద్రుడు తన వజ్రముతో పర్వతములను పగులగొట్టి నదులను విడిపించెనట. "పర్వతమును వజ్రముతో (పిడుగుతో) పగులగొట్టినంతమాత్రముచే దానినుండి నదులెట్లు ప్రవహించి రాగలవ"ని వెంటనే మాక్సిముల్లరుపండితు డాక్షేపించెను. కనుక, యీ రెండవయర్థ మసలే సరిపోదు. ఇది మొదటిదానికంటె మరింత అయోమయముగనున్నది. మేఘసిద్ధాంతముతప్ప మనకింక వేరుగతిలేనప్పుడు ప్రతిమాటకు మేఘమనియే అర్థముచెప్పుకొని సరిపుచ్చుకొనక తప్పదు.

ఈవిధముగ మేఘసిద్ధాంతము సమకాలిక చతుర్విధ ఫలోత్పత్తిని సమర్థించుటకుగాని యుద్ధరంగమును సమర్థించుటకుగాని, యుద్ధకాలమును సమర్థించుటకుగాని, శబ్దజాలమును సమర్థించుటకుగాని, పనికిరాకపోయెను. ఇట్లయ్యును యిది యింతకాలమునుండియు యేల యంగీకరింపబడుచు వచ్చెనో తెలియకున్నది. ఈనాలుగుఫలితములలో మొదటి రెంటిని (నీరు,ఆపులు) మేఘసిద్ధాంతము సమన్వయించుచున్నది; చివరిరెంటిని (సూర్యుడు, ఉషస్సు) ఉషస్సిద్ధాంతము సమన్వయించుచున్నది. కాని, యీనాల్గింటినికలిపియే యొక్కసిద్ధాంతమును సమర్థింపజాలకున్నది. ఈనాల్గింటిని యేకకాలమందు సమర్థించునట్లుగ యీసిద్ధాంతములరెంటిని సమ్మేళనజేయుటకైనను సాధ్యపడకున్నది. అట్లుగానిచో, తుపానుపోయిన పిమ్మట వచ్చుసూర్యకాంతిని, రాత్రిగడచిన పిమ్మట కలుగుసూర్యోదయమును— యీరెంటిని తారుమారుచేసి వైదికఋషులే తబ్బిబ్బులుగ జెప్పిరని యీతప్పును వైదికఋషులనెత్తిపైనైనను వేయవలసివచ్చును.

మేఘ ఉషస్సులను నీరెండు సిద్ధాంతములలో ప్రాచీన నైరుక్తులు మేఘసిద్ధాంతమునే యెక్కువ మాన్యమైనదానినిగ గ్రహించియుండిరి. కారణమేమనగ:— ఇంద్రుడు వర్షాధిష్ఠానదేవతయను భావము నైరుక్తులకు తదితరకారణములచే యేర్పడియుండెను. ఈ తమ భావమునకు మేఘసిద్ధాంతము సరిపోవుటచే వారు దీనినే యెక్కువగ నంగీకరించుచు, యీ సిద్ధాంతమునకు లొంగని, సూర్యోషస్సుల ప్రజననాదులు



చాల అప్రస్తుతమైనవనియు, అప్రాముఖ్యమైనవనియు, అగ్రాహ్యమైనవనియు చెప్పి త్రోసివేసిరి. పాశ్చాత్యులుకూడ యీ సిద్ధాంతమునే యంగీకరించిరి. ప్రస్తుత మిప్పుడు పండితలోకములో నిలిచియున్న దీ మేఘసిద్ధాంతమొక్కటే. అయినను, యిది వృత్రగాధను సమన్వయించుటకు బొత్తుగ పనికిరాకుండనున్నది; ఇది యెంతమాత్రమును చాలకుండనున్నది. ఈవృత్రగాధ నింతకంటె యెక్కువ భాగుగసమన్వయింపగల క్రొత్త సిద్ధాంత మింకొకటి మనకు దొరికినచో, యీ పనికిరాని మేఘసిద్ధాంతమును వదలివేయుటకు పండితలోకము సంకోచింపదు.

వృత్రగాథయందలి యుద్ధము పిడుగును చేబూనివచ్చిన యింద్రునకును, మేఘమునకును జరిగినదనుకొనుట తప్పు. అసలీయుద్ధము నిజముగ అంధకార, ప్రకాశములకు మధ్య జరిగియుండెను. వృత్రవధమాట యటుంచి యింద్రుడు ప్రప్రథమములో “వెలుతురు” నకధిదేవతయని యెరుంగవలెను. దీనికనేక ప్రమాణములుగలవు.

(౧) III, 34, 4
VIII, 15, 5
X, 43, 4
I, 108, 8
IV, 16, 4
} చీకటిలో పడియున్న వెలుతురును యింద్రుడుకనుగొని పైకితీసుకొని వచ్చెను.

| | |
|---|---|
| (౨) II, 12, 7<br>II, 21, 4<br>III, 31, 15 | ఇంద్రుడు సూర్యుని, ఉషస్సును కలిగించెను. |
| (౩) I, 62, 5 | సూర్య, ఉషస్సులతో యింద్రుడు చీకటిని భేదించెను. |
| (౪) VIII, 3, 6 | సూర్యుని వెలుగజేసినది యింద్రుడే. |
| (౫) I, 7, 3 | సూర్యుని ఆకాశముమీఁది కెక్కించినది యింద్రుడే. |
| (౬) X, 111, 3 | సూర్యునకు త్రోవ నేర్పాటుచేసినది యింద్రుడే. |
| (౭) III, 39, 5 | చీకటిలో పడియున్న సూర్యుని కనుగొన్నది యింద్రుడే. |
| (౮) ఐ.బ్రా. IV, 5 | రాత్రిపూట అంధకారములో దాగికొన్న అసురులను తరిమివేయుటకు దేవతలందరిలోను యింద్రుఁ డొక్కఁడే పూనుకొనెను. |

ఈవాక్యములం దెచ్చటను వృత్రవధమాటయే లేదు. కనుక, వృత్రవధతో సంబంధములేకుండనే యింద్రుడు జ్యోతిర్దేవతయని యెరుంగవలెను. సూర్యుని, వెలుతురును సంపాదించుకొని వచ్చినది ఇంద్రుడే. కనుకనే ఇంద్రునకు “ అప

బ్లాకు 15.

# వృత్రవిజృంభణ




( జలమును, సూర్యుడును వృత్రునిచే అధోలోకమందు బంధింపబడియున్నారు. )

1 వరుణవృక్షము

2 దివ్యాః ఆపః ( దివ్యజలము )

3 అహి ( సర్ప ) రూపుడగు వృత్రుడు

బ్లాకు 16.

# వృత్రవధ



( జలమును, సూర్యుడును వృత్రుని చెరనుండి విడిపింపబడిరి. )

1 వరుణవృక్షము

2 దివ్యాః ఆపః ( దివ్యజలము )

3 అహి ( సర్ప ) రూపుడగు వృత్రుడు

4 సూర్యుడు

వర్త్యా" (వెలుతురును తిరిగి కలుగజేసినవాఁడు) అను బిరుదు వచ్చెను; అందుచేతనే మాక్సిముల్లరుపండితుఁడు ఇంద్రుని గ్రీకుపురాణములలో జ్యోతిర్దేవతయైన "అప్పాలోను" తో పోల్చియున్నాఁడు.

వెలుతురును పునరుద్ధారణజేసెనను యీ ఇంద్రలక్షణము ఆతఁడొనర్చిన వృత్రవధ, నీటివిడుదల మొదలగు కార్యములతో యేల కలిపిచెప్పబడవలెను? ఈ రెంటికిని సంబంధమేమి? ఈనీటికిని, వెలుతురునకును సంబంధమేమి? ఈ రెండును యేకకాలమందే యేల చెప్పబడినవి? వేయేల, యీగాథ మేఘసిద్ధాంతమునకుగాని, ఉషస్సిద్ధాంతమునకుగాని లొంగకపోవుట కీజ్యోతిర్జలముల కలయికయే (సమకాలికత్వమే) ముఖ్యమైన అభ్యంతరముగ నున్నది. ఇంద్రుడు వృత్రవధవలన నీటిని విడిపించి, వెలుతురును పైకితెచ్చెను. — వేదమునందంతటను యిదే పాట. ఈజ్యోతిర్జలముల సమకాలికోత్పత్తిని ఇంతవర కెవరును సంతృప్తికరముగ సమన్వయింపలేదు. మేఘసిద్ధాంతమువలన నీటివిడుదలను సమర్థింపవచ్చునుకాని, వెలుతు రెట్లు వచ్చునో చెప్పజాలము. అట్లే, ఉషస్సిద్ధాంతమువలన వెలుతు రెట్లు వచ్చునో సమర్థింపవచ్చునుకాని, నీటికెట్లు విడుదలకలిగెనో చెప్పజాలము. ఈరెంటిని యేకకాలమందు సమర్థించుటకు వీలులేకున్నది. ఇది బహు చిక్కుగనున్నది. కనుక, వేదమందు చెప్పబడిన నీరు (ఆపః) యొక్క స్వరూపస్వభావము లెట్టివో మన

మిప్పుడు విపులముగ పరిశీలించుట యావశ్యకమైనది. ఈనీటి యొక్క స్వభావమును తెలిసికొన్నపిమ్మట యీమేఘ, ఉష స్సిద్ధాంతముల నంగీకరించుటయా, లేక త్రోసివేయుటయా యను ప్రశ్నను పరిష్కరించుకొనవచ్చును.

మన మిప్పు డీనీటిని (ఆపః) గూర్చి పరిశీలింతము:—

ఇంద్రుడు వృత్రుని చంపి నీటిని విడిపించెనని చెప్పు వేదవాక్యములలో నెచ్చటను మేఘమను మాటయే మందున కైనను కానరాదు. ఆవాక్యములలో పర్వత, గిరి, అద్రి — మొదలగుపదములే ప్రయోగింపబడియున్నవి. నీటిని సూచించుటకు ఆపః, సింధవః అను శబ్దములుగలవు. ఋగ్వేదమందు 'ఆపః' శబ్దము 'నీర' ను సాధారణార్థములో ప్రయోగింప బడియున్నది. కాని, 'ఆపః' అను యీపదమే ఋగ్వేదమందు చాలచోట్ల "దివ్యజలము," లేక "ఆకాశజలము" అను నర్థమును దెలుపుచున్నది. ఋ I, 23, 17—లో—ఈజలము దేవతల మార్గమునపోవుచుండును; ఇవి తమవద్దనున్న సూర్యునితో కలిసియుండును. VII, 49, 2—లో—ఆకాశజలమును (దివ్యాః ఆపః), భూజలమును (ఖనిత్రిమాః) వేర్వేరుగ ప్రత్యేకించి స్పష్టముగ చెప్పబడియున్నవి. ఈజలమంతయు తుదకు సముద్రములో పోయిచేరునట. ఏడునదులు భయంకర ధ్వనితో అగాధములో పడునట్లు వరుణదేవుని ముఖగహ్వరమందు పడుచున్నవని VIII, 69, 12 చెప్పుచున్నది. వరుణదేవుడు యింద్రునివలెనే నదులను ప్రవహింపజేయునట



(II, 28, 4) దీర్ఘతముడు తమ గమ్యస్థానమునకు పోవుచున్న నీటిపై తేలియాడుచు పోయెనని I, 158, 6 లో చూచియుంటిమి. ఈ నీటివిషయమై యింక యెక్కువగ ప్రమాణముల జూపవలసిన యవసరములేదు. ఏలనన:—ఋగ్వేదమందు ఆకాశజలమును, భూజలమును,— రెండురకముల జలములు— ప్రత్యేకించి వేర్వేరుగ చెప్పబడియున్నవని పండితులెల్లరు నంగీకరించియే యున్నారు కనుక, యీవిషయములో తగాదా యేమియు లేదు. కాని, యీ ఆకాశజలము (దివ్యాః ఆపః) యొక్క నిజమైన స్వరూపస్వభావములను పండితులు బాగుగ గ్రహించినట్లు గన్పట్టదు. అందుచేతనే వృత్రగాథలో చెప్పబడిన ఉషసోదయ, జలమోక్షణములకుగల సన్నిహితసంబంధమును పండితులు గ్రహింపజాలక పోయిరి. ఋగ్వేదము దివ్యజలమును (దివ్యాః ఆపః) పేర్కొన్నప్పుడెల్ల అది 'వాననీరే' యని పండితులు తలంచుచుండిరి. ఇది పెద్దపొరబాటు : ఏలయనగ:— ఈ జగత్తుయొక్క సృష్టినిగూర్చిచెప్పు సందర్భములో యీసృష్టికి పూర్వము విశ్వమంతయు యేకార్ణవమై యుండెనని (ఒక్కటే సముద్రమైయుండెనని) ఋ X, 82, 6, 129,-3) చెప్పుచున్నది. బైబిలు చెప్పినట్లే ఆదియందీ విశ్వమంతయు జలమయముగ నుండెనని— పైన ఆకాశమందును, క్రింద భూమియందును- సమస్తమును జలమయముగ నుండెనని ఋగ్వేదముకూడ చెప్పుచున్నది. శత.బ్రా. (XI, 1, 6, 1); ఐత. ఉప. (I, 1); మనుస్మృతి (I 9)— కూడ యీ

ప్రపంచమంతయు నీటియావిరినుండి యుత్పన్నమయ్యెనని చెప్పుచున్నవి. కనుక, యీ దివ్యజలమునుగూర్చి వైదిక ఋషుల పూర్వజులకు బాగుగ తెలియునని మనము ఘంటా పథముగ జెప్పవచ్చును. ఈ దివ్యజలమునుండియే జగత్తు పుట్టెనని చెప్పుటచే, దీనిస్వభావము తేటపడుచున్నది. దివ్య జలముగ యిప్పటి ప్రకృతిశాస్త్రజ్ఞులు చెప్పు "ఈథర్" అను ఒకానొక, బహుసూక్ష్మమైన అస్పష్టద్రవపదార్థము. ఇది మన త్వక్, చక్షు, శ్రోత్రి, జిహ్వా, ఘ్రాణములకుగోచరింపదు; ఇదివాయువునకంటె యెన్నియోరెట్లు బహు సూక్ష్మమైనది; ఇదివిశ్వమునంతనువ్యాపించియున్నది; ప్రతియవకాశమునందున నిండియున్నది; వాయువులేని ఖాళీప్రదేశములలో సైత మిది కలదు; వేయేల, ఇదిలేనిచోటు లేనేలేదు. ఏచోటునుండియు దీనిని తరిమివేయుటకు సాధ్యముగాదు; మన మింతదూరము పోనేల, ఋగ్వేదమందు దివ్యజలమును (దివ్యాః ఆపః) నీటి యావిరియు (పురీషం) పేర్కొనబడియున్నవని చెప్పిన మనకు చాలును. ఈ విశ్వమంతయు — పైనను, క్రిందను, సర్వ దిశలును, సమస్తాంతరాళములుకు, సమస్తావకాశములును— యీ దివ్యజలములచే నిండి నిబిడీకృతమై యున్నవనియు, యీ విశ్వ మున్నంతకాల మీ దివ్యజలము లుండి తీరుననియు (ఋ X, 30,10) వైదికఋషులు తలంచిరి. మన కింతవరకు చాలును.



మనకు నెత్తిపైన గన్పట్టుచున్న ఖగోళార్థభాగమేగాగ, మన భూమికి క్రిందిభాగమందుకూడ రెండవ ఖగోళార్థము గలదను విషయము వైదికఋషులకును, తత్పూర్వజులకును స్పష్టముగ తెలియును. దీని కనేకప్రమాణములు గలవు. దీని విషయమై పండితలోకములో నెవరికిని సందేహము లేదు. దీని నిట ప్రత్యేకముగ ఋజువుపరచవలసిన పనిలేదు. అయినను, కొందరు పాశ్చాత్యపండితు లీయంశమునుఒప్పుకొని యుండలేదు; ఇట్లొప్పుకొనకపోవుటకు ముఖ్యముగ వారిసాంప్రదాయికమగు దురాగ్రహమే కారణము. భూమి గుండ్రముగ బంతివలెనుండి, అవకాశములో ఖగోళమధ్యమందు, వ్రేలాడుచున్నదను సంగతి ప్రాచీనులకు తెలియనేతెలియదట! భూమి బల్లపరుపగనుండి, పైనఆకాశమను డిప్పచే కప్పబడియున్నదని ప్రాచీనులు తలంచిరట! ఇట్టిసాంప్రదాయికాగ్రహ మొకటి పాశ్చాత్య పండితుల మనస్సును కప్పివేయుటచే, తమయెదుట ప్రత్యక్షముగ, కండ్లకు గట్టినట్లు, కన్పట్టుచున్న సరళవాక్యములను వారు విరిచియో, లేక మెలిబెట్టియో, వానికి పెడార్థములను చెప్పవలసినవారైరి. మనభూగోళముక్రిందకూడ ఆకాశము లేక వాతావరణము (రజస్) కలదను సంగతి వైదికఋషులకు తెలియునని చెప్పుటకు చాల ప్రమాణవాక్యములు గలవు. వానిలో కొన్నింటినిట యుదాహరించెను:—

(౧) VI, 9, 1 } శుక్ల, కృష్ణ దివసములు రెండును రజస్సుల (లోకముల) రెంటిని ప్రసిద్ధ మార్గములగుండ వివర్తన జేయుచున్నవి. ( అనగ, చుట్టుచున్నవి. )

షరా:—ఈరెండు రజస్సులు (లోకములు) యేవి? ఒకటి ఖగోళముయొక్క యూర్ధ్వభాగము; రెండవది ఖగోళముయొక్క అధోభాగము. (ఖగోళముయొక్క తిర్య, గూర్ధ్వ భాగములు రెండును యీవాక్యమందు స్పష్టముగ పేర్కొన బడియున్నవి) —

(౨) VII, 80, 1 } ఒకదానినొకటి ఆనుకొనియున్న (సమంతే) లోకములరెంటిని (రజసీ—ద్వివచనము) ఉషాదేవత విప్పిసమస్తమును బహిరంగము జేయుచున్నది.

షరా:—ఈరెండులోకములును క్షితిజమువద్దకలియుననియు, ఈరెంటికిని క్షితిజముసరిహద్దనియు యీవాక్యములో స్పష్టపరుపబడియున్నది. క్షితిజమునకు పైభాగమంతయునొక లోకము (రజస్) అడుగుభాగమంతయు యింకొకలోకము (రజస్).

(3) V, 81, 4 } ఓసవితృ! నీవురాత్రి రెండువైపులను తిరిగివత్తువు. (రజనీ ముభయతః పరీయసే.)



షరా:— రెండువైపు లనగ ఖగోళముయొక్క తిర్యగూర్ధ్వభాగములని స్పష్టమగుచున్నది. ఈమూడువాక్యముల లోను పేర్కొనబడిన లోకములు రెండును పైన ఆకాశము లోనే యున్నవని యర్థముచేసికొనవలెనట! ఆహా! యేమి! పాశ్చాత్యుల సాంప్రదాయికాగ్రహము. సూర్యుడు రాత్రిపూట క్రిందిలోకమునకు పోకుండ పైఆకాశములో యేలోకమున దాగికొనునో!

(౪) VII, 104,11 } మా శత్రువు మూడులోకముల యడుగు భాగమునకు పోవుగాక! (తిస్రః పృథివీః అధః)

షరా:- దీనినిబట్టి యీ యధోలోకము నరకమువలె దుఃఖమయమైనదని సూచింపబడెను.

(౫) X, 152, 5 } మాకు హానిచేయువాడు, అధోలోకమందున్న అంధకారములో బడుగాక. (అధరం తమః )

షరా:- ఈ యధోలోకము చీకటిమయమని సూచింపబడెను.

(౬) III, 53, 21 } మమ్ముల ద్వేషించువాడు క్రిందికి పడిపోవునుగాక. (అధరః)

(౭) II, 12, 4 } ఇంద్రునిచే చంపబడిన దస్యుసంతానము అజ్ఞాతమగు అధోలోకమునకు పోయిరి. (అధరం గుహాకః)

షరా:- దీనినిబట్టి ఇంద్రునకును వృత్రాసురునకును జరిగిన యుద్ధ మీయధోలోకమందే జరిగెనని సూచింపబడెను.

(౮) I, 34, 8 — అశ్వినీదేవతలు ఊర్ధ్వలోకముల మూడింటిపైనను ( తిస్రః పృథివీ ఉపరీ ) తిరుగుచు రాత్రింబవళ్ళు అంతరిక్షము యొక్క పై భాగమును (దివో నాకం) కాపాడుచుందురు.

షరా:— ఈమూడు ఊర్ధ్వలోకములును, యిదివరకు చెప్పిన మూడుఅధోలోకములకును ప్రతిరూపములుగనున్నవి. భూమిని మూడులోకములుగ విభజించుట వేదములలో సర్వసామాన్యవిషయమే.

(౯) I, 164, 6 — ఈభూమికి పైనమూడున్ను, క్రింద మూడున్ను మొత్తము ఆరురజస్సులు గలవని ఋగ్వేదము చెప్పుచున్నది.

(౧౦) సూర్యుడు చీకటిలోకమునుండి ( కృష్ణేనరజసా) కదలి వచ్చుచున్నాడనియు, ఆవలి ప్రక్కనున్న చాల దూరదేశమునుండి, (పరావత్ ) వచ్చుచున్నాడనియుకూడ వేదము చెప్పుచున్నది. కనుక, ' పరావత్ ' 'కృష్ణేనరజసనా'— యను నీరెండుపదములును ఒకేయర్థమును సూచించుచున్నవి. కృష్ణరజస్సునుండి సూర్యుడు పైకెక్కును.



( ఉ—ద్యక్; ఉద్—ఆచరత్ ) కనుక రాత్రిపూట సూర్యుడు అధోలోకమునకు పోవునని స్పష్టమగుచున్నది.

(౧౧) I, 117, 5 I, 164, 32, 33 — సూర్యుడురాత్రిపూట " నిరృతి " యొక్క యొడిలో పరుండునట. రాత్రిపూట చీకటిలో నివసించియుండునట. 'నిరృతి' యనగభూమికి క్రిందిభాగమున పడమరనుండి తూర్పువరకు వ్యాపించిన అధోలోకమని మాక్సిముల్లరు మొదలగు పాశ్చాత్యులు చేసిన యూహలనుబట్టియు, తదితర ఋగ్వేద వాక్యములనుబట్టియు నిర్ధారణయగుచున్నది.

(౧౨) II, 27, 15 — ఖగోళముయొక్క తిర్యగూర్ధ్వ భాగములరెంటిని దెలుపుటకు "ఉభేఅర్ధా" అనుపదము ప్రయోగింపబడినది.

ఇదిగాక, యింకొకచోట దూరమందున్న (క్రిందనున్న) అర్ధభాగమునకు " పరేఅర్ధే " యనియు మనకుదగ్గరగ (పైన) నున్న అర్ధభాగమునకు " అపరేఅర్ధే " యనియుకూడ శబ్దములు ప్రయోగింపబడియున్నవి. ఈవిధముగ ఖగోళము రెండర్ధభాగములుగ విభజింపబడియున్నదని చెప్పుటకు ఋగ్వేదమునుండి యనేక ప్రమాణములను చూపవచ్చును. అధర్వవేదమందుకూడ (X, 8, 7) రెండు " సగములు " (అర్ధం)

చెప్పబడియున్నవి. ఋగ్వేదమందు మరికొన్నిచోట్ల యీ భావమందే "సముద్రా" అనుపదము ప్రయోగింపబడియున్నది. ఈరెండు సముద్రములలో ఒకటి యీప్రక్కను (అవర) రెండవది ఆప్రక్కను (పర) ఉన్నవట. ఈసందర్భమందే, అవస్తాత్ పరస్తాత్, అను పదములుకూడ గలవు. ఈరెంటికే యింకొకచోట పరావత్, అంబర అనుపదములు ప్రయోగింపబడినవి. సూర్యుడు "పరావత్" ప్రదేశమందు నిద్రించుచుండునట. ఖగోళముయొక్క యీ రెండుసగములను కలిపి చెప్పవలసివచ్చినప్పుడు "ఉభయతః" అని ప్రయోగించిరి.

మనయెదుట నిన్ని ప్రమాణములుండగ ప్రాచీనులకు అధోలోక మొకటియున్నదను సంగతి తెలియనే తెలియదనుట కెట్లు సాహసించవచ్చును. ఖగోళముయొక్క తిర్యగర్ధమునుగూర్చి యిప్పటిశాస్త్రజ్ఞులకు తెలిసినన్ని వివరములు ప్రాచీనులకు తెలియకపోయి యుండవచ్చునుగాక. అంతమాత్రముచే అధోలోకమొకటి యున్నదను సమాచారమే వారికి తెలియదని చెప్పుట బహుసాహసము. ఈయంశము నింతటితో విరమించి యింకకథాభాగమునకు వత్తము.

మనభూమికి క్రిందనున్న ఖగోర్ధభాగమును వైదికఋషులెరుంగుదురని సిద్ధాంతముచేసిన పిదప, యిక వేదములందు పలుతావులలో చెప్పబడిన దివ్యజలముయొక్క స్వరూపస్వభావమును గుర్తించుట బహుసులభము. విశ్వమంతయు—సమస్తావకాశమును — దివ్యజలముచే నిండియున్నది. ఈ



జలము ప్రవాహములుగట్టి క్రిందినుండి పైకిని, పైనుండి క్రిందికిని, సదా ప్రవహించుచుండును. ఈప్రవాహవేగముచేతనే, సూర్యచంద్రాదులును, తదితర జ్యోతిర్గోళములును ఆకాశమందు నడచుచుండును. ఈ యంశమే చాల ప్రధానమైన కీలకమని గుర్తుంచుకొనవలెను. ఈ కీలకమును బట్టుకొన్నచో వైదికగాథలను చాలవరకు సరళముగ సమన్వయింపవచ్చును. ఈ జలము నదులరూపముగ ఆకాశమందు ప్రవహించుచు తుదకువరుణునిముఖగహ్వరమందు-అనగ, అధోలోకమందున్న సముద్రములో—పోయిపడునని ఋగ్వేదము (VII, 49, 2; VIII, 69, 12) చెప్పుచున్నది. అధోలోకమే ఈజమున కంతటికిని కూడలిస్థానము— లేక ఆశయము. ఈ జలాశయము (Reservoir) "యహ్వతీః" (శాశ్వతమైనది) అని చెప్పబడెను. ఈ జలాశయమే వరుణరాజ్యము; యిదే యమలోకము; యిదే రహస్యముగనున్న (నిణ్య) వృత్రుని నివాసస్థానము. ఈ నీటియొక్క పారుదలనుగూర్చి పారశీగ్రంథములేమిచెప్పుచున్నవో చూతము:—

ఈదివ్యజలముతమకుకూడలి స్థానమైన "వోరు-కశా" సముద్రమునుండి లేచి, ఆకాశముమీదికి ప్రవహించి, మరల క్రిందికి దిగివచ్చి యీసముద్రములో కలియును. ఇట్లొకయావృతమైన పిమ్మట, మరల రెండవయావృతము ప్రారంభమగును. ఈరీతిగ యీదివ్యజలము సదాపైకి, క్రిందికి, నడచుచునేయుండును. ఇదిగాక, జలమును, వెలుతురును—

రెండును ఒకమూలస్థానమునుండియే బయలుదేరివచ్చుచున్నవి; తిరిగి రెండును ఆమూలస్థానమునకే చేరుచున్నవని యింకొక పారశీగ్రంథము చెప్పుచున్నది. దివ్యజలములు దేవతలచే యేర్పరుపబడిన మార్గముగుండ ప్రవహించుచున్నవని పారశీగ్రంథము చెప్పుచున్నది. ఋగ్వేదముకూడ తూచినట్లు సరిగ యీభావమునే చెప్పుచున్నది. పారశీగ్రంథములోని జలములవలెనే, ఋగ్వేదజలములుకూడ ఆకాశమార్గమున ప్రవహించుచుపోయి తుదకు అధోలోకసముద్రమందు—వరుణముఖమున—బడుచున్నవి. కాని, ఋగ్వేదమునకంటె పారశీగ్రంథ మింకొక విశేషమునుయెక్కువగ జెప్పుచున్నది. ఏమనగ:—జలమును, వెలుతురును—రెండును—ఒకేమూలస్థానమునుండి బయలుదేరివచ్చి, మరల తుదకు, ఆ మూలస్థానమునే చేరుచున్నవని పారశీగ్రంథము ఖండితముగ చెప్పుచున్నది. మనకు కావలసిన కీలక మిదియే. ఇది పారశీగ్రంథమందు నిస్సంశయముగ దొరుకుచున్నది. అదిగాక, "ఓ సూర్యుడా ! నీవు పైన అంతరిక్షమార్గమున యీ జలప్రవాహము వెంట నడచిపొమ్ము"—అని పారశీగ్రంథము చెప్పుచున్నది. ఇంకొకచోట, "అర్ద్వీసూర అనాహిత" యను నది పర్వతశిఖరమునుండి మహావేగముతో పరుగెత్తి వచ్చి క్రిందనున్న "వోరు-కశా" సముద్రములో పడుచున్నదట. సరస్వతీనది అంతరిక్షమందున్న పర్వతశిఖరములను చీల్చుకొనుచువచ్చి యజ్ఞప్రదేశమునకు దిగుచున్నట్లు ఋగ్వేదము



చెప్పుచున్నది. ఈ రెండునదులును "దివ్యవాహినులే" ఇవి భూలోకమునకు దిగివచ్చి, భూమిపైనున్న నదుల నన్నిటిని జలపూరితములుగ జేయునట. ఈ భూమిపైనున్న జలమంతయు — మన శరీరములలోను, చెట్లలోను కూడనున్న సమస్త ద్రవపదార్థములును — మేఘములద్వారా అసలీదివ్యజలమువలననే యుత్పత్తియగుచున్నదట. మనకు పైన మూడు ఊర్ధ్వలోకములు గలవని ఋగ్వేదము చెప్పినట్లే, పారశీగ్రంథములుకూడ చెప్పుచున్నవి. మొదటిది నక్షత్రలోకము; ఈ లోకమందు సమస్తయోషధుల బీజములు నుండును. "అర్ద్వీసూరఅనాహిత" నది యీ నక్షత్రలోకముగుండ ప్రవహించును. ఈనదిలోని నీరంతయు పైలోకములకేపోకుండ కొంతభూలోకమునకుకూడ ప్రవహించుటకుగాను మానవులీనదిని స్తుతింతురు. అంతట, సమస్తబీజములతోసహా యీదివ్యజలము — మేఘములద్వారా — భూమిపైకి నీటినిపంపును. ఈనీటితోకలిసివచ్చిన బీజములవలననే మనకు ఓషధులు లభించుచున్నవి. సరస్వతీనదికూడ యిట్లే అంతరిక్షమున ప్రవహించుచు మానవులచేస్తుతింపబడి, భూమిపైకి — మేఘములద్వారా — కొంతనీటిని పంపును. ఈనీటితో కలిసి వచ్చిన బీజములవలన ఓషధులు మొలుచును. "వోరుకశా" సముద్రమధ్యమందొక వృక్షముగలదట. ఈవృక్షమునుండియే సమస్తబీజములుపుట్టును. ఇట్లు పుట్టినబీజములు దివ్యజలములోకలిసిపోవును. వర్షముకురిసినప్పుడీబీజములుకూడ నీటితో

కలిసి భూమిపై బడును. వానినుండి వృక్షాదులు మొలుచును. దీనికిసరియైన భావమే ఋగ్వేదమందుకూడ (I, 23, 20) కలదు. సమస్తఓషధులును నీటిలోగలవని సోముడుచెప్పెనట. వోరుకశాసముద్రము చుట్టును పర్వతపంక్తి (అల్ బురుజ్) గలదట. (బహుశః వేదములందు చెప్పబడిన అద్రి, పర్వత, గిరి,-యిత్యాదిపదములు యీపర్వతమునే సూచించుచున్నవి.) సరస్వతీనదికి "వృత్రఘ్ని" (వృత్రుని సంహరించిన స్త్రీ) యను బిరుదము ఋగ్వేదమందు (VI, 61, 7) గలదు. "అర్ద్వీసూర అనాహిత" యను పార్సీనదికూడ తనను గొల్చిన భక్తునకొకనికి త్రిశిరుడగు రాక్షసునొకని చంపుటకు తగినశక్తినిచ్చెనట. ఈరెండు కథలవలన యీదివ్యవాహినీ రూపములుగనున్న దివ్యజలమునకును, వృత్రవధకును గల సంబంధము స్థిరపరుపబడినది.

ఈవిధముగ, అర్ద్వీసూర అనాహిత, సరస్వతీనదులకు పోలిక సర్వవిధములచేతను విధాయకముగ సరిపోవుచున్నది. దివ్యజలములు అధోలోకమందు మూలస్థానముగ జేరియున్న జలాశయమునుండి (సముద్రమునుండి) బయలుదేరి, దాని చుట్టునున్న పర్వతకనుమల (బిలముల) గుండ బయటికి వచ్చి, అంతరిక్షముపైకిలేచి, అంతరిక్షముగుండ ప్రవహించి, మరల క్రిందికి దిగివచ్చి, యీసముద్రములో కలియుచుండును. అంతరిక్షముగుండ ప్రవహించుచున్న కాలములో, మానవులచే స్తుతింపబడి, కొంత నీరు (బీజములతోసహా)



భూమిపైకి వర్షరూపముగ పడుచుండును. ఇట్లు స్తుతింపనిచో ఆ దివ్యజలమునకు దయరాక వర్షములను బిగబట్టునేమో యను భయముచే మానవులు యజ్ఞయాగాదులను చేయుచుండిరి.

ఈదివ్యజలముయొక్క పారుదలను గూర్చి తెలిసికొంటిమి. ఈదివ్యజలప్రవాహముల వెంటనే సూర్యచంద్రాదులును, తదితర జ్యోతిర్గోళములును ఆకాశమందు (పడవలలో వలె) సంచారము చేయుచుండును. ఈదివ్యజలప్రవాహములు నిలిచిపోయినచో సూర్యచంద్రాదుల చలనములుకూడ కట్టుబడిపోయి, ప్రపంచమంతయు గాఢాంధకారమున మునిగిపోవును. అందుచేతనే, దివ్యజలమునకును, వెలుతురునకును యెడబాయని సంబంధమేర్పడుచున్నది. వృత్రాసురుడీదివ్యజలప్రవాహములను కట్టివేసినప్పుడు, ప్రపంచమున కెంత క్షోభగలిగెనో మనము సులభముగ యూహించవచ్చును. అధోలోకసముద్రమందు నివాసమేర్పరుచుకొనియున్న వృత్రుడు తన దేహమును పెంచి, సముద్రమునంతను చుట్టివేసి, కొండబిలముల నన్నిటిని మూసివేసెను. అంతటితో యీదివ్యజలములుపైకిప్రవహించుటకువీలులేక సముద్రమందే బంధింపబడిపోయెను. సూర్యచంద్రాదులుకూడ అందే బంధింపబడిపోయిరి. ఇంద్రుడువచ్చి, వృత్రుని సంహరించి, కొండబిలములను తెరపిజేసెను. అంతట, యీదివ్యజలములు యథాప్రకారముగ యీ కొండబిలములవెంట బయటికివచ్చి ఊర్ధ్వ

ముఖముగ ప్రవహించెను. వానితోపాటు సూర్యచంద్రాదులు కూడ యీ ప్రవాహములవెంట, ఆకాశముపైకెక్కి సంచరించిరి. ఈ వోరుకశా సముద్రమును చుట్టియున్న "అల్ బురుజ్" పర్వతపంక్తిలో తూర్పున ౧౮౦ బిలములును, పశ్చిమమున ౧౮౦ బిలములును మొత్తము ౩౬౦ బిలములు — గలవట. దివ్యజలప్రవాహములును, వానితోపాటు, సూర్యచంద్రనక్షత్ర గ్రహాదులును యీ బిలములవెంటనే బయటికి వచ్చుచు, పోవుచు, నుండునని పారశీ గ్రంథములు చెప్పుచున్నవి. ఇంద్రుడు వృత్రాసురుని యీ కొండమీద నుండగనే చూచెనట. ఈ కొండలమధ్యనే వృత్రుడు ఆవులను బంధించియుంచెనట. చుట్టునున్న యీ కొండలను ఛేదించియే అంగిరసులును, బృహస్పతియు, ఆవులను విడిపించుకొని వచ్చిరట. ఈఋగ్వేదప్రమాణములేగాక, యిటీవలి సంస్కృత వాఙ్మయమందుకూడ సూర్యుడు ఉదయాద్రిపైకెక్కి వచ్చుననియు, అస్తాద్రివెనుకకు దిగిపోవుననియు వర్ణనలుగలవు. హిందూ, పారశీకవర్ణనలిట్లు తూచినట్లు సరిపోవుచున్నవి. వృత్రవధవలనకలిగిన చతుర్విధఫలముల సమకాలికోత్పత్తిని ప్పుడు మనము సరళముగ సమన్వయింపవచ్చును. దివ్యజలములు విడుదలకాగానే, వానితోపాటు ఉషస్సు, సూర్యుడు, ఆవులు (ప్రాతఃకాలిక సూర్యకిరణములు, లేక పగళ్ళు)కూడ విడుదలయయ్యెను.

ఈనీటిపారుదలకును సూర్యచంద్రుల ప్రకాశమునకును గల సన్నిహిత సంబంధమును స్థిరపరుచుటకింక నెన్నియో



ప్రమాణములు పారశీగ్రంథములందును వేదములందునుకూడ గలవు. పితృదేవతలొనర్చిన మహత్కార్యములనేకములు వేదములందు వర్ణింపబడియున్నవి. సృష్టివ్యాపారమును నడిపించుటలో దేవతలకు పితృదేవతలుకూడ చాల తోడ్పడిరట. పితృదేవతలు ఆకాశమును నక్షత్రములతో నలంకరించి, రాత్రియందుచీకటిని, పగటియందు వెలుతురును ఉంచిరి. (X, 68, 11); మరుగుపడియున్న వెలుతురును కనుగొని తెచ్చిరి; ఉషస్సును ప్రజనమొందించిరి. (VII, 76, 4; X, 107, 1). పారశీగ్రంథము లిట్లు చెప్పుచున్నవి:— చాల కాలమువరకు ప్రవహించుటకు వీలులేక ఒకచోటనే నిలువయున్న నీటిని పితృదేవతలు ప్రవహింపజేసి, వానికి దేవతలచే నిర్మింపబడిన మార్గమును చూపిరట; అంతట నీరు దేవమార్గము వెంట ప్రవహింప జొచ్చెనట; అట్లే, అసురుల నిర్బంధముచే ఒకచోటనే చాలకాలమునుండి కట్టుబడియున్న సూర్యచంద్రనక్షత్రాదులను పితృదేవతలు విడిపించి వానికి దేవనిర్మితమార్గమును జూపిరట; అంతట సూర్యచంద్రాదులు దేవయానమార్గము వెంట సంచరింప జొచ్చిరట; ఈవిధముగ నీటిపారుదలకును వెలుతురునకును గల సంబంధము ధృవపరుపబడియున్నది.

వృత్రగాధయందు మహాదురవగాహముగ నెంచబడిన యీజ్యోతిర్జలముల సన్నిహితసంబంధము, వేదవాక్యములచే

నంత ఖండితముగ వివరింపబడకపోయినను యీ పార్సీగ్రంథ ప్రమాణములవలన స్పష్టముగ కరతలామలక మగుచున్నది.

ఈ నీటిపారుదల శీతకాలమందు — దీర్ఘరాత్రికాలమందు — నిలిచిపోయెనని తెలుపుట కింకను పార్సీగ్రంథ ప్రమాణములు గలవు. పారశీకులు తమ శవములను దహనము చేయక సూర్యరశ్మిలో (యెత్తుప్రదేశమందు) పక్షుల కాహారముగ వదలివేయుదురు. ఒకభక్తు డిట్లు దేవునియడుగుచున్నాడు. "వేసవిగడచిపోయి, శీతకాలమువచ్చినచో భక్తుడేమిచేయవలెను?" దీనికి దేవుడిట్లు బదులు చెప్పుచున్నాడు:— "ప్రతియింటిలోను మూడు 'కాట' లను (గోతులను) త్రవ్వియుంచవలెను. శవమును ఆగోతిలోపెట్టి—పక్షు లెగురనారంభించువరకు, ఓషధులు మొలువ నారంభించువరకు, వాహినులు ప్రవహింపనారంభించువరకు, భూమిమీది నీరంతయు యెండిపోవనారంభించువరకు, — రెండురాత్రులైనను సరే, మూడురాత్రులైననుసరే, లేక నెలదినములైననుసరే— అక్కడే యుంచవలెను. పక్షు లెగురనారంభింపగనే, ఓషధులు మొలువ నారంభింపగనే, వాహినులు ప్రవహింపనారంభింపగనే, భూమిమీది నీరంతయు యెండిపోవనారంభింపగనే, భక్తుడగువాడు శవమును సూర్యునకభిముఖముగ (యెత్తు ప్రదేశముమీద) పెట్టియుంచవలెను." ఇచ్చట వాహినులు ప్రవహించుటయు, ఓషధులు మొలచుటయు, నను క్రియలు బహుకాలము కట్టుబడియున్న సూర్యుడు మరలతిరిగి నుదయిం



చుటతో సమకాలికముగనున్నవి. ఈవిధముగ యీ రెంటికిని సంబంధము స్థిరపరుపబడినది. సూర్యుడు చాలకాలమువరకు కనిపింపలేదని చెప్పుటకు శవమును నెలదినములవరకైననుసరే యింటిలో గోతిలోనే పెట్టుకొని యుండవలెనని భగవంతుడు చెప్పుటయే ప్రబల ప్రమాణముగనున్నది. సూర్యుడు ప్రతి దినమును కనుబడుచున్నచో మరునాడే దానిని సూర్యరశ్మిలో నుంచవచ్చునే; అట్లుగాక, దానిని నెలదినములవరకైనను సరే — (సూర్యరశ్మికై నిరీక్షించుచు) — యింటిలోనే పెట్టుకొని యుండవలసిన యవుసరమేమి? అనగ, యీ నెల దినములును సూర్యుడు కనుపడలేదని వేరుగ చెప్పవలెనా? ఈసందేహమును దీర్చుటకోయన్నట్లు యీ నెలదినములలో గాఢాంధకారముండెనని యింకొకచోట స్పష్టపరుపబడియున్నది. దీనితో సందేహనివృత్తియగుచున్నది. "చీకటిగనున్నప్పుడు, మంచు గురియుచున్నప్పుడు, యెవరైనను చనిపోయినచో యేమి చేయవలెను?" —దీనికికూడ పైనచెప్పిన ప్రత్యుత్తరమే భగవంతుడు చెప్పెను. "ఇంటిలో గొయ్యిత్రవ్వి, నెలదినములైనను సరే, పక్షులెగురువరకు వాహినులు ప్రవహించువరకు,...... శవమునక్కడేయుంచి, పిమ్మట సూర్యరశ్మిలో వదలివేయవలెను. ఈ నెలదినములలో సూర్యుడు కనుబడకపోయెననియు, వాహినులుకట్టుబడిపోయెననియు, ఓషధులు మొలుచుటలేదనియు అతిశీతకాలమనియు, — వేయేల, యిది ధృవమండలమందలి దీర్ఘరాత్రి యనియు, ఆరాత్రిలో సూర్యరశ్మి లేక

పోవుటచే శవమునకు జరుగవలసిన యంత్యక్రియలు నిలిచిపోయెననియు యీపార్సీవాక్యములు చెప్పకయే చెప్పుచున్నవి. దక్షిణాయనమందు మరణించుట అశుభమని హిందువు లిప్పటికిని తలంచుచున్నారు. బహుశః, ఇది ధ్రువమండలనివాసమునాటి యాచారమై యుండనోపు. పారశీకులవలెనే, హిందువులుకూడ ఆ ధ్రువమండల దీర్ఘరాత్రియందు శవమునకు జరుగవలసిన యంత్యక్రియలను జరుపకుండ, సూర్యుడు కనుపించువరకు, — నెలదినములైనను సరే, — శవమును ఇంటిలోనే పెట్టుకొని యుండిరని యూహించుటకవకాశములు గలవు. ఎట్లనగ, పార్సీగ్రంథములో గోతికి ప్రయోగింపబడిన "కాట" యను శబ్దము వేదములందు కూడ గలదు. "కుత్స" యను పేరుగల యొకానొక ఋషి "కాట" యందు (గోతిలో) పడియుండి, "వృత్రుని చంపుచున్న ఓ ఇంద్రా! నన్నురక్షింపుమ"ని మొరపెట్టుకొనుచున్నాడు. (ఋ I, 106,6). అనగ, వృత్రసంహారము పూర్తియై, తిరిగి వాహినులు ప్రవహింప నారంభించువరకు, సూర్యు డుదయించువరకు, ఓషధులు మొలువ నారంభించువరకు పూర్వము ధ్రువమండలవాసులగు హిందువులుకూడ తమ శవములను ఇంటిలోనే పెట్టుకొని యుండిరని యూహించుట కిచ్చట పరోక్షమైన ప్రమాణ మొకటి గాన్పించుచున్నది.



ఈ పై నిదర్శనమునుబట్టి వృత్రగాథకును, ఇంద్రుని ఘనకార్యములకును, ఇంక ననేకమైన వేదవాక్యములకును మన మిప్పుడు సరళమైన భావార్థములను చెప్పవచ్చును. ఇంద్రుడు తన బలిమిచే ప్రవాహములను ఊర్ధ్వముఖముగ ప్రవహింపజేయుచున్నాడు. (ఉదంచ IX, 15, 6) వృత్రవధవలన నదులు బాహాటముగ ప్రవహించునట్లు చేయబడెను. (I, 32, 12) జ్యోతులు నిరభ్యంతరముగ ఆకాశమందు వెలుగు నట్లును, జలములు బాహాటముగ ప్రవహించునట్లును యింద్రుడు చేసెను. (I, 80, 5) ఈవిధముగ వెలుతురును, నీరును, యేకకాలమందే ప్రవహించుచున్నట్లు దెలుపు నిదర్శనములు వేదములం దింకను పెక్కులుగలవు.

మన మింతవరకు వివరించిన దివ్యజలస్వరూప స్వభావములను వ్యాఖ్యాత లింతవరకు గుర్తింపకపోవుటచే వృత్రగాథను సమన్వయించుటవారికి బహుకష్టసాధ్యమయ్యెను. అందుముఖ్యముగ, సమకాలిక చతుర్విధపలోత్పత్తిని సమర్థించుట మరింత కంటకప్రాయమయ్యెను.

దివ్యజలసంచారమునుగూర్చి హిందూపారశీకగాథలందు మాత్రమేగాక తదితర ఆర్యజాతుల ప్రాచీనగాథలలోకూడ నిదర్శనములు గలవు. సూర్యుడు సముద్రమునుండిలేచి, ఆకాశముపైకెక్కి బంగారుపడవలో తూర్పునుండి పడమరకు ప్రయాణముజేసి, మరలసముద్రములోనికి చేరునని గ్రీకు గాథలు చెప్పుచున్నవి. భూమ్యాకాశములకుమధ్య సదా

యొకనది ప్రవహించుచుండుననియు, దానిలోని జలము ఆవిరి రూపముగనుండి, పైనుండి క్రిందికిని, క్రిందినుండిపైకిని, యెక్కి దిగుచుండుననియు "ఆరిష్టోటల్" అనుగ్రీకు పండితుడు చెప్పుచున్నాడు. ఇట్టి నదియే ప్రాచీనజర్మను గాథలందు గలదట. "ఫిన్ను" జాతివారి గాథలందుకూడ పైకి, క్రిందికి యెక్కి దిగి వచ్చుచుండు రెండు దివ్యవాహినులు పేర్కొనబడియున్నవి. "వెట్టు" లను మరియొక జాతివారి గాథలందు, బంగారుపడవ యొకటి సముద్రములో మునిగిపోవుచుండగ ఆకాశదేవత దుఃఖించెనట. అంతట కొందరు దేవతలు పడవలమీదపోయి దానిని రక్షించిరట. ఈకథ వేదములందు చెప్పబడిన చ్యవన కథను పోలియున్నదని మాక్సిముల్లరుపండితుడు చెప్పుచున్నాడు. చ్యవనుడు మొదలగు వారిని అశ్వినులురక్షించిరి. అనగ, దీర్ఘరాత్రియందు క్షీణించిపోయినసూర్యుడు మరల తేజస్వియయ్యెనని భావము. ఈభావమునే "వెట్టు"లకథ చెప్పుచున్నది. అశ్వినులు తమభక్తులను పడవలలోపోయి రక్షించిరని ఋగ్వేదము (I, 116, 3; I, 182, 6) చెప్పుచున్నది. "పూషణ్" అనుదేవత ఆకాశసముద్రమును, బంగారు పడవలలో దాటునని ఋగ్వేదము (VI, 58, 3) చెప్పుచున్నది. దీర్ఘతముడు (సూర్యుడు) నీటిప్రవాహమువెంట (సారథివలె) కొట్టుకొనివచ్చెనని యిదివరకే చెప్పితిమి. దివ్యజలమునుగూర్చి ఐగుప్తీయుల గాథలుకూడ చెప్పుచున్నవి నీటిప్రవాహములును, దానివెంట నక్షత్రగణములునుకూడ



కలిసియే ఆకాశదేవత ఐగుప్తుగాథలలో వర్ణింపబడియున్నది. ఒక్కసూర్యుడేగాక, నక్షత్రములుకూడ తూర్పునుండి పడమరకు ఆకాశముమీద పడవలలో ప్రయాణముచేయుచున్నవని ఐగుప్తుగాథలు చెప్పుచున్నవి. ఆదియందు విశ్వమంతయు జలమయముగ నుండెననియు, పిమ్మట ఆకాశజలము వేరుగను, భూమిమీద జలము వేరుగను, విభజింపబడెననియు యూదుల గాథలు (బైబిలు) చెప్పుచున్నవి. ఈవిధముగ, సమస్తఆర్య సంతతులకును తెలిసిన యీదివ్యజలలక్షణములే హిందూ పారశీగ్రంథములందు మరింతవిపులముగ వర్ణింపబడియున్నవన్నచో మన మాశ్చర్యపడవలసిన పనిలేదు. కనుక, వైదిక గాథలందు గాన్పించుచున్న జ్యోతిర్జలముల సమకాలికసంచారమీదివ్యజలసంచారముపై సమన్వయింపబడుట కెట్టి యభ్యంతరమునుండజాలదు.

ఈదివ్యజలసంచారమును గూర్చియు, జ్యోతిర్జలముల సమకాలికోత్పత్తినిగూర్చియు మనము ఒప్పుకొన్నను, యీ సందర్భమున ఉత్తరధ్రువసిద్ధాంతము రావలసినపనియేమి? దీనిచే ధ్రువసిద్ధాంతమెట్లు ఋజువగుచున్నది? ఈవృత్రవధ వలన చీకటికిని వెలుతురునకును నిత్యము సూర్యోదయాత్పూర్వము జరుగుచుండుపోరాటమే సూచింపబడుటలేదా? యని కొందరు శంకింపవచ్చును. కాని, కొంచముసూక్ష్మముగ ఆలోచించిచూచినచో వృత్రగాథలోని వివరములన్నిటిని సమన్వయించుటకు మనమీదేశములలో సూర్యోదయాత్పూర్వము

నిత్యమును జూచుచుండు చీకటివెలుగుల పోరాటము చాలదు. ఇంద్రసహాయులగు అంగిరసులు వృత్రుని సంవత్సరాంతమందు (పరివత్సరే) చంపిరి. దీనినిబట్టి యీపోరాటము సంవత్సరమునకొకసారి జరుగునదేగాని, నిత్యమును జరుగునది కాదని ధ్రువపడుచున్నది. ఇంద్రుడు అర్బుదను (వృత్రుని) మామూలు వజ్రముతో చంపక, మంచుతో (హిమంతో) చంపెనట. అనగ, యీయుద్ధము మంచుకాలమందు, అనగ, శీతకాలములో (హేమంతర్తువులో) జరిగెనని యిచ్చట సూచింపబడినది. ఈభావమే పైనయుదాహరించిన పారశీగ్రంధవాక్యములవలన కూడ స్థిరపడుచున్నది. వృత్రునికోటలు "శారదీః" అని వర్ణింపబడినవి. అనగ, యీయుద్ధము శరదృతువుయొక్క అంతమందు ప్రారంభమై, హేమంతఋతువునం దంతటను జరుగుచుండెనని భావము. తిష్ట్ర్యఅపోషలయుద్ధము ౧ మొదలు ౧౦౦ రాత్రులవరకు జరుగుచుండెనని పారశీగ్రంథములు చెప్పుచున్నవి. అట్లే రాత్రిక్రతువులసంఖ్య నూరువరకుగలదని ఋగ్వేదము చెప్పుచున్నది. కనుక, వృత్రగాథలోని యిట్టివివరములనన్నిటిని సమర్థించుటకు దైనికపోరాటముచాలదు; సాంవత్సరిక పోరాటముచేతనే యివి సమర్థింపబడగలవు. అనగ, ధ్రువసిద్ధాంతముచేతనే వీని నిజమగు భావార్థములన్నియు తేటపడగలవు.

ఇంద్ర వృత్రాసురుల పోరాటము శారదాంతమందు ప్రారంభమై శిశిరాంతమువరకు జరిగియుండవలెనని యింత



వరకు నిరూపించితిమి. ఇక వేయేల, యుద్ధము యేతిథియందు జరిగెనోకూడ, నిస్సందిగ్ధముగ దెలుపు ప్రమాణవాక్యమొకటి మనకు ఋగ్వేదమందే దొరుకుచున్నది. II, 12, 11 యః శంబరం పర్వతేషు క్షియంతం చత్వారింశయాం శరద్యన్వవిందత్ । ఓజాయమానం యో అహిం జఘానదానుం శయానం స జనాస ఇంద్రః॥ "ఇంద్రుడు శరదృతువులో నలుబదియవ (తిథి) యందు(చత్వారింశ్యామ్ శరదీ) పర్వతముమీదనున్న శంబరుని కనుగొనెను. "చత్వారింశ్యామ్" అను పదము వరుసను సూచించు సంఖ్యావాచకపదము; ఇది సప్తమీవిభక్తి; స్త్రీలింగమునందు గలదు. "శరదీ" యను పదము కూడ సప్తమీవిభక్తి, స్త్రీలింగమునందున్నది. కనుక యీ పదమునకు రెండువిధములుగ అర్థము చెప్పవచ్చును. (౧) "చత్వారింశ్యామ్" — అను పదమును "శరదీ" కి విశేషణముగ గైకొన్నచో — ఇంద్రుడు శంబరుని నలుబదియవ శరత్తులో (అనగ ౪౦ వ సంవత్సరములో) కనుగొనెను." వ్యాకరణరీత్యా, యీయర్థము సరిగనే యున్నది. శాయనాచార్యులవారును, పాశ్చాత్యపండితులును కూడ యీ యర్థమునే గ్రహించిరి. అయితే, దీని భావ మేమి? ఇంద్రుడు శంబరునికై ౪౦ సంవత్సరములు వెతకెనా యేమి? ఇంద్ర శంబరుల పోరాటము ౪౦ సంవత్సరముల కొకసారి జరుగునని తలంచుటకు వీలులేదు. కారణమేమనగ:-దీనివలన, "ఇంద్రుడు సంవత్సరాంతమందు 'వల'ను సంహరించెనని చెప్పు ఋగ్వేద

వాక్యమునకు (X, 62, 2) బాధ కలుగుచున్నది. ఆర్యులకును, ఆదిమ నివాసులగు అడవిజాతివారికిని ౪౦ సంవత్సరములు జరిగిన పోరాటముగాని, లేక పూర్వ మొకప్పుడు తటస్థించిన ౪౦ సంవత్సరముల క్షామముగాని యీ "చత్వారింశ్యామ్ శరదీ" యను వాక్యముచే సూచింపబడుచున్నదని కొందరు పండితులు చెప్పుచున్నారు. ఇట్టి విపరీతభావములనుగూర్చి మన మంతగ పాటింప బనిలేదు. ఇట్టియభిప్రాయములను మనము సరకుజేయక త్రోసివేయవచ్చును. ఇంద్ర శంబరుల పోరాటము ఋగ్వేదమందు పలుతావులలో పేర్కొనబడెను. ప్రతిచోటను యిది యింద్ర వృత్రులనే సూచించు చుండెను. ఆకస్మికముగ యీయొక్కచోటనే, ఆర్యుల కును ఆదిమనివాసులకును జరిగిన ౪౦ సంవత్సరముల పోరాట మిచ్చట, ఒకవాక్యములో, అప్రస్తుతముగ, చెప్పబడెనని తలంచుటకంటె మహావిపరీత మింకొకటియుండబోదు. కనుక "చత్వారింశ్యామ్ శరదీ"కి ౪౦ సంవత్సరములని యర్థము చెప్పుట నిష్ప్రయోజనము. ఈవాక్యముయొక్క భావార్థము దీనివలన యెంతమాత్రమును తెలియవచ్చుటలేదు. (౨) ఇక రెండవ యర్థమును విచారింతము:—మనము యీకాలమందు కూడ, యేతిథినైనను చెప్పవలసివచ్చినప్పుడు,—కార్తికే, శుక్ల పక్షే, త్రయోదశ్యామ్—అనిచెప్పుదుము. అనగ, కార్తిక మాసమందు. శుక్లపక్షమందు, ౧౩ వ తిథియని సప్తమీ విభక్తిని ప్రయోగింతుము. మరియు, "త్రయోదశ్యాంతిథి"



యని చెప్పక, కేవలము "త్రయోదశ్యాం" అని మాత్రమే చెప్పుదుము; తిథినిగాని, దినమునుగాని, సూచించుపదమును వదలివేయుదుము. దీనికి తై॥ బ్రా॥ (I, 1, 9, 10) కూడ సాక్ష్యమిచ్చుచున్నది. ఇది సంస్కృత సాంప్రదాయలక్షణము. అయితే, మన మిప్పుడు చర్చించుచున్న వేదవాక్యములో— "చత్వారింశ్యామ్, శరదీ"—యని యున్నది. ఈరెంటిని రెండు ప్రత్యేకసప్తమీ విభక్తి పదములుగ గైకొన్నచో, పైసాంప్రదాయమునుబట్టి యీవాక్యమునకు "చత్వారింశ్యామ్" తిథియందు; శరత్తునందు, —అని అర్థము వచ్చును. అనగ, "శరదృతువులో, నలుబదియవ తిథియందు" అని యర్థము వచ్చును. ఈ రెండేతప్ప యింకొక మూడవవిధముగ యీ వాక్యమున కర్థము చెప్పుటకు వీలులేదు.

ప్రాచీనకాలమందు సంవత్సరము వసంతర్తువుతో ప్రారంభమయ్యెను. శరదృతువులో ౪౦ వ తిథియనగ ఏడు నెలల, పదిదినములు లేక ౨౧౦ దినము లగును. కనుక, ఇంద్ర శంబరుల పోరాటము (చీకటివెలుగుల పోరాటము) సంవత్సరములో ౮ వ నెల, ౧౦ వ తేదీన ప్రారంభమయ్యె నని తేలుచున్నది. అనగ, ధ్రువమండలమందు — యీ వాక్యముచే సూచింపబడిన ప్రదేశమందు – సంవత్సరములో యేడునెలలవరకు సూర్యరశ్మియుండి, ౮ వ నెల ప్రారంభమై ౧౦ దినములుమాత్రమే గడచినపిమ్మట, దీర్ఘరాత్రి ప్రారంభ మయ్యెనని భావము. ఈ భావము, అదితిగాథతో సంపూర్ణ

ముగ నేకీభవించుచున్నది. పూర్వయుగమందు అదితి తన ౭ గురు కొడుకులను (మాసాధిష్ఠాతలగు సూర్యులను) దేవతల కిచ్చి, ౮ వ వాడగు మార్తాండుని — (అపక్వస్థితిలో పుట్టుటచే). — పారవైచెనట. అనగ, ఎనిమిదవమాసము నకు అధిదేవతయగు సూర్యుడు పుట్టిన బహు కొలదికాలము నకే మరణించెనట. అనగ, యెనిమిదవ మాసారంభమందు దీర్ఘరాత్రి ప్రారంభమయ్యెనని భావము. కనుక, యీదిన మందే (౮వ నెల, ౧౦వ తేదీయందే) ఇంద్ర వృత్రాసురుల యుద్ధము ప్రారంభమయ్యెనని చెప్పుట యెంతయు సహజముగ నున్నది. అదితిగాథయు, ఇంద్రశంబరుల యుద్ధోపక్రమణ దినమును నిర్ణయించు ఋగ్వేదవాక్యమును (II, 12, 11)— యీరెండును — అత్యద్భుతముగ, సర్వవిధముల, విధాయక ముగ, సరిపోవుచున్నవి.

పై చర్చనుబట్టిచూడగ, శరదృతువుతో సూర్యరశ్మి క్షీణించి, నశించి పోవుచున్నదనుట స్పష్టము. ‘శరత్’ యొక్క శబ్దోత్పత్తికూడ యీయర్థమున కనుకూలముగనే యున్నది. “శరత్” శబ్దము “శౄ”=క్షీణించు, నశించు—అను మూలమునుండి యుత్పన్నమగుచున్నది. శరదృతువనగ క్షీణించు, లేక నశించు ఋతువని అర్థము.—అనగ, సూర్యుని తేజస్సు యీఋతువునందు క్షీణించిపోవునని భావము. దీనికై తై॥ సం॥ (II, 12, 5):—త్రీణివా ఆదిత్యస్య తేజాంసి వసంతా ప్రాత గ్గ్రీష్మే మధ్యం దినే శరద్యపరాహ్ణే। యావంత్యేవ



తేజాంసి తాన్యే వావరుంధే॥ “సూర్యునకు మూడు తేజస్సులుగలవు. ప్రాతఃకాలమందు వసంత తేజము; మధ్యాహ్నమందు గ్రీష్మతేజము; సాయంకాలమందు శరత్ తేజము.” ఇచ్చటకూడ సూర్యునిసాంవత్సరికగమనములో శరదృతువునందు సూర్యతేజము క్షీణించిపోవునని సూచింపబడెను. ఈశరదృతువు దాటినపిమ్మటసూర్యునకు తేజమేలేదు. అనగ, అంతటినుండియు సూర్యుడస్తమించును; హేమంతశిశిర ఋతువులందు సంపూర్ణముగ దీర్ఘరాత్రి నిండియుండును. జైమిని సూత్రములకు వ్యాఖ్యవ్రాయుచు శబరుడొక వేదవాక్యము నుదాహరించెను. ఆదిత్యోవా సర్వఋతవః సయదైవోదిత్యథ వసంతో యదా సంగవోఽథ గ్రీష్మో యదా మధ్యందినోఽథ వర్షాయదాఽపరాహ్ణోఽథ శరద్ యదాస్తమే త్యథ హేమంతశిశిరా॥ సూర్యుడే సర్వఋతువులునై యున్నాడు; ఉదయకాలమప్పుడు వసంతము; సంగవకాలమప్పుడు (పాలుపితుకువేళ) గ్రీష్మము; మధ్యాహ్నమప్పుడు వర్షము; సాయంకాలమప్పుడు శరత్తు; అస్తమించినప్పుడు హేమంత, శిశిరములు రెండును, సూర్యతేజము శరత్తునందు క్షీణింపనారంభించెనని యీ వాక్యము ఖండితముగ దెలుపుచున్నది. శారదాంతమందు సూర్యుడు అంధకారరాక్షసులకు పూర్తిగ లోబడిపోయెనని యు, హేమంతశిశిరములు పూర్తిగదీర్ఘరాత్రిలో మునిగిపోయె ననియు యీవేదవాక్యము ఘంటాపథముగ జెప్పుచున్నది. ఋ I, 34,1—లో—‘రాత్రి’ని దెల్పుటకు “హిమ్యా” యను

శబ్దము ప్రయోగింపబడియున్నది. అనగ, హేమంతఋతు వంతయు గాఢాంధకారముగ నుండెనని భావము.

పూర్వము తేదీలను వ్రాయునప్పుడు మాసములపేర్లు చెప్పక ఋతువులపేర్లుమాత్రమే వ్రాయుచుండిరనుటకు ప్రమాణములు లేవేయని కొందరాక్షేపించెదరేమో. కాని హిందూదేశములో కొన్ని కొండగుహాలలోనున్న ౧౮౦౦ సంవత్సరములనాటి పురాతన శాసనములనుబట్టిచూడగ ఫలాని కార్యము, ఫలానిఋతువులో, ఫలానిపక్షములో, ఫలాని తిథియందుజరిగెనని వ్రాయబడియున్నదేగాని, మాసము పేరెచ్చటను ఉదాహరింపబడనే లేదు. కనుక, యీశాసనములకంటె పూర్వమెన్నియో వేలసంవత్సరములక్రింద బయల్వెడలిన ఋగ్వేదమందు తేదీలను వ్రాయునప్పుడు మాసములపేర్ల నెత్తక కేవలము ఫలానిఋతువులో,ఫలానిదినమందు (తిథియందు) మాత్రమే ఫలానికార్యము జరిగెనని వ్రాయుట యొకవింతగాదు. దీనికిపారశీకగ్రంథమందు స్పష్టమైన ప్రత్యక్ష ప్రమాణములేగలవు. ఒకానొక తేదీని వ్రాయుచు ఆగ్రంథమందు ఋతువుపేరును, ఆఋతువునందాదినముయొక్క వరుస సంఖ్యయు మాత్రమే పేర్కొనబడియున్నవి. — మాసము పేరెచ్చటనులేదు. ఈపద్ధతిననుసరించియే ఋగ్వేదమందు కూడ "చత్వారింశ్యామ్‌శరదీ" — "శరత్తులో ౪౦ వ (దినము)"- అని, ఋతువును, అందరి తిథిసంఖ్యయుమాత్రమే చెప్పబడినవి. వృత్రశంబరుల యుద్ధోపక్రమణ దినమిచ్చట



స్పష్టముగ లిఖింపబడియున్నదనుట కెట్టి సందేహమును లేదు. ఈయుద్ధముయొక్క నిజమైన భావార్థము పండితుల మనస్సునకు తట్టకపోవుటచే, వారీ వాక్యమునకు పెడార్థములను లాగిరి. తాముదీసిన పెడార్థములవలనకూడ వారికి సరళమైన భావార్థమొక్కింతయు కుదురలేదు; వారంతట యుక్కిరిబిక్కిరియై దానినచ్చటనే వదలివేయవలసిన వారైరి. చత్వారింశ్యామ్, శరదీ—యను శబ్దముల రెంటిని స్వతంత్రమైన రెండు సప్తమీవిభక్త్యంత శబ్దములుగ గ్రహించినచో దాని నిజభావము అత్యద్భుతముగ బయటపడితీరును. దీనికి, ధ్రువసిద్ధాంతమును కూడ జేర్చినచో, శరదృతువుయొక్క ౪౦ వ తిథియందు ఇంద్రుడు వృత్రుని కనుగొనెనని భావమేమియో కరతలామలక మగుచునే యున్నది; వృత్రుని కోటలు "శరదీః" అని యేల చెప్పబడినవో తేటతెల్లమగుచునే యున్నది; అర్బుదయను రాక్షసుడు హిమచే (మంచుచే) యేల చంపబడెనో స్పష్టమగుచునే యున్నది; శంబరుని కోటలను (పురములను) వర్ణించుసందర్భమున 'పుర'మనగ 'దిన'మని యిదివర కర్థము చెప్పితిమి. ఈదినములు శరదృతువులోని దినము లగుటచే, యీపురములు లేక కోటలుకూడ "శరదీః" అని చెప్పబడుట సహజమేగద. కనుక మన యర్థము తూచినట్లు సరిపోవుచున్నది. ధ్రువమండలమందు సూర్యుడు ౬ వ మాసారంభమున పూర్తిగ అస్తంగతుడై, దీర్ఘరాత్రిని గలుగజేసినట్టి సృష్టిచమత్కారముపై యీవృత్ర

గాథయంతయు నాధారపడియున్నదనుట కొంతమాత్రమును సందేహము లేదు.

వృత్రవధవలన జలమును, వెలుతురును యేకకాలమందే విడుదల యయ్యెనని ఋజువుపరచితిమి. ఇట్లు విడుదలయైన నీరు వాహినులుగ లేక నదులుగ ప్రవహింపుచున్నవనియు (II, 15,3; 11,2); యీనదులు ఊర్ధ్వముఖముగ (ఉదంచ) ప్రవహించుచున్నవనియు (II,15,6); ఈనదులసంఖ్య యేడుగ నున్నదనియు (I,32,12; II, 12,12) ఋగ్వేదము చెప్పుచున్నది. ఈనదులేల యూర్ధ్వముఖముగ ప్రవహింపుచున్నవో మనము పైన ఋజువుపరచియుంటిమి. కాని, వీనిసంఖ్య యేడని చెప్పుటలో అర్థమేమి ? మన మిప్పుడీయంశమును చర్చింపవలసియున్నది. దీనివిషయమై మేఘసిద్ధాంతవాదులు చెప్పిన సమాధానమేమనగ:—మేఘములలో బంధింపబడియున్న నీటిని వర్షకాలమందు యింద్రుడు విడిపించుటచే, పంజాబు దేశములోని నదులు సంపూర్ణజలపూరితములగుచు ప్రవహించును; అందుచే, వృత్రవధచే యీపంజాబు నదులు విడివడెనని చెప్పవచ్చునట ! దీనిని బలపరచుటకు మేఘసిద్ధాంతవాదులు పారశీగ్రంథములలో హిందూదేశమునకు ప్రయోగింపబడిన "హప్త-హిందు" (సప్తసింధు)-వను పదమును కూడ సాక్ష్యముగ జూపుచున్నారు. వీరివాదము పైకెంత చక్కగ గన్పట్టుచున్నను, ఇది సంతృప్తికరముగ లేదు. ఏలనగ:—నీటియొక్కయు, వెలుతురుయొక్కయు సమకాలిక



సంచారము దివ్యజలసంచారముపైననే తప్ప యింకొకవిధముగ సమర్థించుటకు వీలులేదని పైన ఋజువుపరచియుంటిమి. అట్లయినప్పుడు, ఊర్ధ్వముఖముగ ప్రవహించుచున్న యీదివ్యవాహినులు పంజాబునదులే యని చెప్పుట కెట్లు వీలగును. వేయేల, యీసప్తదివ్యవాహినులను భూమిమీదనున్న యేనదులతోడనుకూడ పోల్చుటకు వీలులేదు. అదిగాక, పంజాబు దేశము 'పంచనద' దేశముగాని, 'సప్తనద' దేశముగాదు. పంజాబు 'పంచనద' దేశమని వాజసనేయ సంహిత స్పష్టముగ చెప్పుచున్నది. వా. సం. XXXIV, 11:- పంచనద్యః సరస్వతీమపియంతి సస్రోతసః । సరస్వతీతు పంచధా సోదేశే౽భవత్ సరిత్ ॥ "సప్తసింధవః" యను పదము ఋగ్వేదమందు షుమారు ౧౨ పర్యాయములు ప్రయోగింపబడియున్నది. వీనిలో ౫, ౬, చోట్ల "సప్తసింధవః" అనగ వృత్రవధచే ఆవులు, వెలుతురు, మొదలగువానితోపాటు యేకకాలమందే విడుదలయైన దివ్యజలవాహినులని ఖండితముగ చెప్పబడియున్నది. కనుక, యీ ౫, ౬ ప్రదేశములలోను భూమిమీదనున్న నదు లుద్దేశింపబడలేదనుట స్పష్టమగుచునే యున్నది. మిగిలినచోట్లకూడ భూమిమీద పారుచున్న నదు లుద్దేశింపబడినట్లు సూచన లిసుమంతయైనను లేవు. కనుక, ఋగ్వేదమందు "సప్తసింధవః" యనుటచే సాధారణముగ దివ్యజలవాహినులే యుద్దేశింపబడినవనుట యెక్కువ సమంజసముగనున్నది.

సప్తసింధవః, సప్తస్రవతః, సప్తప్రవతః — మొదలగు పదములకు భూమిమీద పారుచున్న నదులను భావము లేనే లేదని నేనువాదింపను. ఏలననగ:— దేవలోకమందు యేడు నదులును, భూలోకమందు యేడునదులును, అధోలోకమందు యేడునదులును పారుచున్నవని ఋగ్వేదము చెప్పుచున్నది. ఈసప్తవిధవిభాగ మొక్క నదులయందేగాక, తదితర విషయములలోకూడగలదు. ఎట్లనగ:— సప్తలోకములు, సప్తపర్వతములు, సూర్యుని సప్తాశ్వములు, సప్తహోతృలు, సప్తదిశలు, సప్తాదిత్యులు, సప్తధీతులు, సప్తమర్యాదలు మొదలగుసప్తవిధ విభాగముఋగ్వేదమునందు ప్రతిచోటను గన్పట్టుచున్నది. ఇటీవలిసంస్కృత వాఙ్మయమందుకూడ యీసప్తవిధవిభాగము గన్పట్టుచున్నది.ఒక్క వేదములందేగాక, తదితర యార్యజాతుల వారి ప్రాచీన గాధలలోకూడ యీసప్తవిధ విభాగమిట్లే ప్రతి విషయమునను గన్పట్టుచున్నది.కనుక, యీసప్తసంఖ్యయొక్క ప్రాముఖ్యము ఆర్యజాతులందరును కలిసి ఒకటిగనున్నప్పుడే పుట్టియుండవలెను. అంతియేగాని, ఒక్క పంజాబునదుల యాధారముననే పుట్టినదని చెప్పుట కెంతమాత్రమును వీలు లేదు. ఏలననగ, పంజాబులో ౫ నదులేయున్నవి; ఒకవేళ, యింక యే రెండుచిన్ననదులనో కలిపి మొత్తము ౭ నదులున్నవని యొప్పుకొన్నను యీపంజాబునదుల సప్తవిధవిభాగమును జూచియే, యార్యజాతులవారందరును యీసప్తవిధవిభాగసూత్రమును ప్రతివిషయములోను వర్తింపజేసిరని తలంచుటకు వీలులేదు. ఏలననగ:—ప్రపథమమున పంజాబులోనున్న ౭ నదులనాధారముగ గైకొనియే ఆర్యజాతులవారందరును ౭ సంఖ్య కింతటి ప్రాముఖ్యమునిచ్చిరని చెప్పినచో, పంజాబుదేశమే మొట్టమొదట ఆర్యసంతతుల కందరికిని మూలస్థానముగ నుండెనని చెప్పవలసి వచ్చును. కాని, యిట్టి యూహ కాధార మెంతమాత్రమును లేదు. ఇంద్రునిచే నూర్ధ్వముగ ప్రవహింపజేయబడిన నదులు దివ్యవాహినులే గాని, భూమిమీద పారు నదులు గావనియు, ఋగ్వేదమందలి "సప్తసింధవః" యను పదము ప్రప్రథమమున పంజాబునదుల మూలమున పుట్టలేదనియు, మన మింతవరకు ఋజువుచేసితిమి. అట్లయినచో, యీపదముయొక్క నిజ భావమేమి? పారశీగ్రంథములో హిందూదేశమును దెలుపుటకు ప్రయోగింపబడిన "హప్త — హిందు" పదముయొక్క నిజ భావ మేమి? ఈరెండుప్రశ్నలకును మన మిప్పుడు సమాధానము చెప్పవలసియున్నది.

"సప్త—సింధవః"లోని నిజభావము ఇంద్రునిచే యేక కాలమందే విడిపింపబడిన జ్యోతిర్జలముల సమకాలికసంచారమందే యిమిడియున్నది. ఈసప్తవాహినులను ప్రవహింపజేసిన ఇంద్రుడు "సప్తరశ్మిః" యనబడుచున్నాడు. (II, 12, 12). అనగ సప్తరశ్ములకును, సప్తవాహినులకును సన్నిహిత సంబంధముగలదని దీనివలన సూచితమగుచున్నది. జలములును, సూర్యుడును—రెండును — ఒకపర్యాయమే కదలునని

పారశీగ్రంథములు చెప్పియున్నవిగద. అట్లయినప్పుడు, సప్త సూర్యులు ప్రయాణముచేయుటకు సప్తాశ్వము లక్కరలేదా? సప్తసూర్యులాకాశమందు సంచారమొనర్చుటకు సప్తదివ్యజలవాహిను లక్కలేదా? దీర్ఘతముడైన సూర్యుడీదివ్యజలవాహినివెంటనే గదా ప్రయాణముజేసి వెళ్ళినది? అదితిగాథ యేమి చెప్పుచున్నది? ఏడు దిశలలోను యేడ్గురు సూర్యులు (మాసాధిదేవతలగు సూర్యులు) గలరనియు, వారు యేడుమాసములలో మాసమునకొక్కవిధముగ శీతోష్ణాదులనుగలుగజేయుచుందురనియు, అదితిగాథ చెప్పుచున్నది. ఏడుభిన్నదిశలలోనున్న యీయేడ్గురు సూర్యులును ఆకాశమందెట్లు సంచరింపగలరు? అధోలోకమందు దివ్యజలపూరితమైయున్న సముద్రమునుండి యేడు దివ్యజలవాహినులు ఆకాశముపైకి యెక్కివచ్చును. ఈనదులిట్లు అధోలోకమునుండి బయలుదేరి, ఆకాశముపైకెక్కివచ్చునప్పుడు, వానిలో ఒక్కొక్కనది ఒక్కొక్కసూర్యుని తనవెంటబెట్టుకొనివచ్చును. కనుక ఒక్కొక్కసూర్యునకు ఒక్కొక్కనదిగలదు. ఇట్లీయేడు నదులవెంటయేడ్గురు సూర్యులును పరియాణము చేయుచుందురు. సప్తసూర్యులను మోసికొనిపోవు యీసప్తదివ్యజలవాహినులును ఋగ్వేదమందు (IX, 54, 2) స్పష్టముగ పేర్కొనబడి యున్నవి. ఈనదులయొక్క నడకయు, ఉషస్సోదయమును సమకాలికమని ఋగ్వేదము పలుతావులలో చెప్పియున్నది. వానిలోకొన్నిటి నిదివరకే మనముదాహరించియున్నాము. ఈయంశములన్నియు పాశ్చాత్యులుచెప్పిన సిద్ధాంతముపై సమన్వయింపబడజాలవుగనుక, మనముచెప్పిన యీ పైసమాధానమే సర్వవిధముల సరిపోవుచున్నది.



హిందూదేశమును పేర్కొనునప్పుడు పారశీగ్రంథములు "హప్త-హిందు" (సప్తసింధు) అను పదము నేల ప్రయోగించెను? నేనిదివరకు పైన చెప్పినట్లు, 'సప్తసింధు'శబ్దము చాల ప్రాచీనమైనది. ఇది, ఆర్యసంతతు లందరును కలిసి ఉత్తరధ్రువమండలమందు యేడుమాసముల సూర్యరశ్మిగల ప్రదేశమందున్నప్పుడు పుట్టినమాట. తదుపరి, ఆర్యులనేక శాఖలుగ చీలి, వివిధప్రాంతములకు వలసబోయినప్పుడు, వారీ సప్తసింధుశబ్దమును తమ వెంటగొనిపోయి, తాము క్రొత్తగ ప్రవేశించిన క్రొత్తదేశముల కీపేరు నంటగట్టిరి. ఇది ప్రపంచమం దిప్పటికిని సర్వసాధారణగ జరుగుచున్న యాచారమే గాని, దీనిలో క్రొత్తవింత యేమియులేదు. ఉదాహరణ:- ఇంగ్లీషువారు తమ తల్లిదేశమును విడిచి క్రొత్తగ అమెరికా, ఆస్ట్రేలియా, దేశములకు వలసపోయినప్పుడు, తమ ఇంగ్లండులోనున్న ప్రాతపేర్లను తీసికొనిపోయి, అమెరికాఖండములోనున్న క్రొత్తదేశములకును, స్థలములకును అంటగట్టిరి. అట్లే, అయోధ్య, మిథిలాప్రాంతములనుండి కొందరు భారతీయులు బర్మాదేశమునకు వలసపోయి, అచ్చటనున్న కొన్నిపట్టణములకు "అయోధ్య", "మిథిలా" యను పేర్లను బెట్టిరి! ఇట్లే, ప్రాచీనులగు పారశీకులుకూడ "హప్త - హిందు"

అను ప్రాతపేరును ధ్రువమండలమునుండి తమ వెంటగొని వచ్చి, యిచ్చట తమ సమీపముననున్న హిందూదేశమునకో, లేక పంజాబునకో అంటగట్టి యుండవచ్చును. దీనిలో వింత యేమియు లేదు.

సింహావలోకనము.

(౧) ఇంద్రునిచే విడిపింపబడిన జలముయొక్క స్వభావ సంచారములు బ్రాహ్మణముల కాలమునుండియు, ప్రాచీననైరుక్తుల కాలమునుండియు దుర్గ్రాహ్యములుగనే యుండిపోయెను. పండితులెల్లరు వీనికి విపరీతార్థముల లాగిరి. ఆకాశమందు "పూషా" దేవతబంగారు పడవలలో ప్రయాణము చేయును; అశ్వినులు, సూర్యుడుకూడ పడవలలో ప్రయాణము చేయుదురు. అశ్వినుల బంగారు రథములు "సమానయోజనములు" (I, 30, 18)— అనగ అకాశము పైనను, నీటిపైననుకూడ సమానముగ ప్రయాణముచేయ గలవి. ఈవాక్యములలోని నిజభావమును తెలిసికొనలేక, యీ నీరంతయు మేఘములో బంధింపబడియున్న నీరని నైరుక్తులు తలంచిరి.

(౨) ఇంద్రునిచే విడిపింపబడిన సప్తవాహినులు గంగా, యమునా మొదలగు భారతదేశములోని నదులని పండితులు భ్రమపడిరి.

(3) పర్వత, గిరి, అద్రి, మొదలగు పదములను విరిచి పెడార్థములను చెప్పిరి.



(౪) అంతట పాశ్చాత్యులు బయలుదేరి, పారశీగ్రంథములో భారతదేశపరముగ ప్రయోగింపబడిన "హప్త-హిందు" శబ్దమునుబట్టుకొని, యింద్రునిచే విడిపింపబడిన సప్తవాహినులు పంజాబునదులేయని చాటించిరి. ఆర్యులు పంజాబులో నుండగ వేదగాన మొనర్చుచుండుట లేదని నేను చెప్పను. కాని, వేదములందు యింద్రునిచే విడిపింపబడినట్లు చెప్పబడిన సప్తసింధువులుమాత్రము పంజాబునదులు కాజాలవు.

(౫) కనుక, వృత్రగాధను సమన్వయించుటకు దివ్యజల సంచారమే ముఖ్యమైన యాధారము. "ఈథర్" (Ether) వలెనున్న యీదివ్యజలము ప్రవాహములుగ యేర్పడి, తిర్యగూర్ధ్వలోకములమధ్య సదా సంచరించుచు, తన ప్రవాహములవెంట సూర్యచంద్రాదులను, తదితర జ్యోతిర్గోళములను గొనివచ్చును. ఈదివ్యజలములకు మూలస్థానమైన అధోలోకసముద్రములో వృత్రాసురుడు పరుండియుండి, తనదేహమును విపరీతముగపెంచి, చుట్టునున్న పర్వతబిలములను మూసివేసి యీజలప్రవాహములు బయటికిపోకుండ నిరోధించెను. అంతటితో సూర్యచంద్రాదుల గతికూడ కట్టువడియెను. అందుచే, ఉత్తరధ్రువమండల వాసులగు మనయార్యులకు దీర్ఘరాత్రి యేర్పడెను. ఈర్ఘరాత్రియం దార్యులు క్రతు

వృలను జేసి, యింద్రునకు కావలసినంత సోమరసమిచ్చి, వృత్రునిమీఁదికి పంపిరి. ఇంద్రుఁడు వృత్రుని సంహరించి, కొండబిలములను తెరపిజేసెను. అంతట, వెంటనే, దివ్యజల ప్రవాహములు యథారీతిగ పారనారంభించెను. ఈదివ్యజల ప్రవాహములవెంటబడి ఉషస్సు, సూర్యుఁడు, ఆవులు (కిరణ ములు లేక పగళ్లు) కొట్టుకొనివచ్చెను. ఈరీతిగ, వృత్రవధ వలన చతుర్విధఫలములు సమకాలమందు ఉత్పత్తియయ్యెను. ఈచతుర్విధఫల సమకాలికోత్పత్తిని సరళముగ సమన్వయింప లేక పండితులు గంద్రగోళపడి, తుదకు తమతప్పును వైదిక ఋషులమీఁదికే త్రోసివేసిరి.

(౬) ఇంద్రుఁడు నూరురాత్రిక్రతువులలో నర్పింపబడిన సోమరసముచే ఉత్సాహవంతుడై నీటిలో దాగియున్న అంధ కార రాక్షసుని మంచుతో (హిమతో) సంహరించి, అతని నూరు "శరదీః" కోటలను పగులగొట్టి, సప్తదివ్యవాహినుల నూర్ధ్వముఖముగపంపి, వానివెంట సూర్యుని, ఉషస్సును, ఆవులనుకూడ పంపెను. ఈయుద్ధము ప్రతిసంవత్సరము శర దృతువు, నలుబదియవ తిథియందు ప్రారంభమై, శశిరాంతము వరకు జరుగుచుండును. ఈయుద్ధవర్ణనమంతయు ఉత్తరధ్రువ లక్షణములనే సూచించుచున్నది.

(౭) అయితే, యింద్రుఁడు వర్షాధిదేవత కానేకాఁడా? అయిన నయియుండవచ్చును. ఇంద్రుఁడు వర్షమునిచ్చుననికూడ



ఋగ్వేదములో నచ్చటచ్చట గలదు. కాని, వృత్రహంతకుఁడగు యింద్రుఁడు వేరు; వర్షాధిదేవతయగు యింద్రుఁడు వేరు (ఇవిరెండు ను రెండుహోదాలు) వృత్రవధను, దివ్యజలమోక్షణమును గూర్చిన కథ బహు పురాతనమైనది. ఇది సమస్తఆర్యజాతుల లోను కలదు. వేదములోని వృత్రుఁడే, గ్రీకుగ్రంథములలో "ఆర్థ్రోస్" అయ్యెను. కాని, ఇంద్రశబ్దము మాత్రము తదితరభాషలలో లేదు. కనుక, వృత్రహంతకునకు ఇంద్రు డను పేరు మొట్టమొదట లేదనియు, ఈ వృత్రవధజేసినవాడు ఇంద్రుడుగాక యెవరో మరియొక దేవతయనియు, తదుపరి కొంతకాలమునకు ఇంద్రుడు వేదములందు ప్రధానదేవతగ పరిగణింపబడుటచే ఆ దేవత యెవరోచేసిన వృత్రవధ యీ ఇంద్రునకంటగట్టబడెననియు కొందరు పండితులు తలంచు చున్నారు. పారశీగ్రంథములో కూడ యిట్టి భావమే గలదని తోచుచున్నది. రాక్షసుని వధించినవాడు "తిష్ట్ర్యి" యను వాడేగాని, "వెరెత్రఘ్న" (మన మిప్పు డింద్రుడని తలంచు వాడు) కాడు. కనుక, వృత్రవధ యొనర్చినవాడు మనము సాధారణముగ తలంచు ఇంద్రుడు కాడేమోనని యనుమా నించుట కిచ్చట కొంత యాధారము గన్పట్టుచున్నది. అట్లు గాక, మొదట వృత్రుని వధించిన ఇంద్రుడే, తదుపరి వర్షాధి దేవతయగు ఇంద్రుఁడయ్యెనని మరికొందరు తలంచుచున్నారు. ఏది యెట్లున్నను, ఈ యంశము మన సిద్ధాంతమునుమాత్రము

కదల్పజాలదు. తనచేతులార వృత్రవధచేసిన "వృత్రహా"యే, తదుపరి వర్షదేవతయగు యింద్రుడుగ మారెనో, లేక, యిటీవల ప్రధానుడగు వర్షదేవతగ పరిగణింపబడిన యింద్రునకే యీవృత్రవధయంట గట్టుటచే యింద్రుడు "వృత్రహా" అయ్యానో మనము నిర్ధారణ చేయవలసిన పనిలేదు.

వృత్రాసురునిచే బాధింపబడిన నీరు మేఘములలోని నీరుకాదసియు, యిది "ఈథర్" వలెనున్న దివ్యజలమనియు దీనిని అధోలోకమందు వృత్రుడుబాధించుటచే, దీనితోపాటు సూర్యుడుకూడ నిలిచిపోయెననియు, దానివలన ఉత్తరధృవ మండలమందు దీర్ఘరాత్రి యేర్పడెననియు, దానినొకదేవత విడిపించుటచే, మరల దివ్యజలవాహినులును, దానితోపాటు సూర్యుడు, ఉషస్సు మొదలైనవి తిరుగ నారంభించెననియు చెప్పిన చాలును.



# వైదిక నిలయము

## పదియవ అధ్యాయము.

### వైదికగాథలు: ప్రాతఃకాలిక దేవతలు.

వృత్రగాథను సమన్వయించుటకు మేఘ, ఉషస్సిద్ధాంతము లెట్లు పనికిరాకపోయెనో క్రిందటి యధ్యాయములో వివరించితిమి. ఇప్పుడు సామాన్యముగ వసంత సిద్ధాంతముపై సమన్వయింపబడిన క్లెంచబడుచున్న గాథలనుకూడ విచారించి యీ గాథలలోని ప్రధానాంశముల కేకవాక్యతను గూర్చుటకీ వసంతసిద్ధాంత మెట్లు సరిపోదో యీ యధ్యాయమందు దెలిపెదము. ఈ గాథలన్నియు ముఖ్యముగ అశ్వినీదేవత లొనర్చిన మహాత్కార్యములపైననే ఆధారపడియున్నవి. అశ్వినీదేవతలనగ యిద్దరు కవలదేవతలు. వీరు దేవతలకు మందులిచ్చి కాపాడువైద్యులు వీరొనర్చిన మహాత్కార్యములన్నియు ఋగ్వేదమందు స్పష్టముగ జేర్కొనబడియున్నవి. ఈమహాత్కార్యములను పలువురుపండితులు పలుతెరగులుగ సమన్వయించియున్నారు. కాని వానియన్నిటితో మనకిప్పు డంతగపనిలేదు. పూర్వమువలెనే మనమీగాథలనుకూడ నైరుక్తమత ప్రకారమే విచారింతము. ఈనైరుక్తమతమందుకూడ పలువురు

పలుతెరగులుగ తలంచుచున్నారు. అశ్వినులనగ సూర్యోదయాత్పూర్వమందు గన్పట్టు నక్షత్రములని కొందరును, మిథునరాశిలోనుండు నక్షత్రద్వయమని మరికొందరును, తలంచుచున్నారు. శీతకాలమందు క్షీణించిపోయిన సూర్యుడుమరల వసంతమందు పరిపూర్ణ తేజోమూర్తిగ వెలుగొందుసృష్టిచమత్కారమే యీయశ్వినగాథలకన్నిటికిని మూలమని సర్వసామాన్యముగ పండితలోకము తలంచుచున్నారు. ఈగాథలనన్నిటినిప్పుడు విపులముగ పరిశీలించుట మనపనికాదు. వసంత, ఉషసిద్ధాంతములచే నింతవరకు సంతృప్తికరముగ సమర్థింపబడజాలని యంశములను మాత్రమెత్తుకొని, వానినిప్పుడు ధ్రువసిద్ధాంతముచే సమన్వయించుటకేమైన వీలున్నదేమో విచారించి చూతము.

అశ్వినీ దేవతలకును ఉషస్సునకును చాల దగ్గరసంబంధమున్నట్లు ఐతరేయబ్రాహ్మణము ఖండితముగ జెప్పుచున్నది. సూర్యోదయాత్పూర్వమందు వేయిశ్లోకములుగలిగిన "అశ్వినశాస్త్ర" మనుబహుదీర్ఘ శాస్త్రమొకటి హోతృలచేపఠింపబడునని ఐ. బ్రా. IV, 7, 9 చెప్పుచున్నది. ఈయంశమును మనమిదివరకే అయిదవ యధ్యాయమందు వివరించియున్నాము. సూర్యనిపుత్రిక అశ్వినుల రథమెక్కెనని ఋ I, 116, 17; 119, 5-చెప్పుచున్నది. అగ్ని, ఉషస్సు, యింద్రుడు, అశ్వినులుకలిసి అశ్వినశాస్త్రమును సంపాదించుటకై పందెము వేసికొనిరట. ఈపందెములో అశ్వినులు గెలిచిరట. అశ్వినులు



గన్పింపగనే, వారితోపాటు సూర్యోదయము, ఉషసోదయము, యజ్ఞాగ్నిప్రజ్వలనము — యీమూడును యేకకాలమందే జరిగెనని (I, 157, 1; VII, 72, 4) ఋగ్వేదము చెప్పుచున్నది. "ఎర్రని ఆవులమధ్య చీకటియింకనుఉండగనే" ( అనగ, ఉషఃకాలమందే ) అశ్వినీదేవతలు కనుబడుదురు (X, 61, 4) ఈయంశములనుబట్టి అశ్వినీదేవతలకును, ఉషస్సునకును సన్నిహిత సంబంధమున్నదనియు, ఉషసోదయసూర్యోదయములకు మధ్యనున్నకాలమందు అశ్వినులు గనిపింతురనియు - ఈరెంటివిషయమై - పండితులెల్లరును నిస్సందేహముగ అంగీకరించియేయున్నారు. దీనివిషయమై అభిప్రాయభేదమేమియులేదు. ఈగాథలను సమన్వయించువిషయములో మనమేసిద్ధాంతము నవలంబించినను అశ్వినీదేవతలనగ ఉషస్సును. ప్రాతఃకాలిక తేజస్సును తమవెంట తీసికొనివచ్చు ప్రాతఃకాలిక దేవతలను సంగతినిమాత్రము మనము మరచిపోకూడదు.

వృత్రహా, శతక్రతు, — అను యింద్రుని బిరుదముల వంటివే అశ్వినులకుకూడ గలవు. "వృత్రహంతమా" (VIII, 8, 22); "శతక్రతు" (I, 112, 23) అను బిరుదములు అశ్వినులకు కూడ గలవు. వృత్రాసురుని సంహరించిన యింద్రమరుత్తులలక్షణములే అశ్వినులకుకూడ గలవు. (ఇంద్రతమా — మరుత్తమా) నముచివధా సందర్భమున అశ్వినులు యింద్రునకుచాల సహాయముచేసిరి (X, 131, 4)-

దీనినిబట్టి, యింద్రవృత్రాసురుల యుద్ధమందు అశ్వినులును కూడ చాలవరకు పాల్గొనియుండిరని స్పష్టమగుచున్నది.

ఇంతియేగాక నిరుద్ధజలమును విడిపించుటలో సైతము వీరికి భాగమున్నట్లీ క్రిందినిదర్శనములవలన తెలియగలదు. సముద్రము వీరికి తల్లియట ( I, 46, 2 – సింధు–మాతరా ) వీరిరథము సముద్రమునుండి బయల్వెడలి వచ్చునట ( IV, 43, 5 ) అశ్వినులు తమ రథమెక్కి ఆవలిప్రక్కనున్న దూర దేశమందు ( పరావతి ) సూర్యుని చుట్టివత్తురట ( I, 112, 13 ) అశ్వినులు సముద్రమును కదలించిరట ( I, 112, 9 ) — అనగ, సముద్రజలమును ప్రవహింపజేసిరని తాత్పర్యము. అశ్వినులు 'రసా'యను దివ్యవాహినిని ప్రవహింపజేసి, గుర్రములేని రథమును జయప్రదముగ సాగించిరట (I, 112, 12) శంబరాసురునితో పోరాడుచున్న అతిథిగ్వ, దివోదాసులకు అశ్వినులు తోడ్పడిరి. ఇంద్ర మిత్రుడగు 'కుత్స'కు అశ్వినులు తోడ్పడిరి. అశ్వినులు విజయోత్సాహపూరితులై పాలప్రవాహమును విడిపింప బయల్వెడలిరి. అశ్వినులు ఆకాశసముద్రమందు (దివో అర్ణవే) నివసింతురు (VIII, 26, 17) ఈయంశమునుబట్టి చూడగ, జ్యోతి, ర్జలముల మోక్షణమునకై పోరాడుచున్న ఇంద్రునకు అశ్వినీదేవతలు కుడిభుజముగనుండి చాల సహాయము జేసిరని స్పష్టమగుచున్నది. అశ్వినులు దేవతలకు వైద్యులు గనుక, యుద్ధరంగమందు వీరు నిలువబడి ఇంద్రునకు సహాయము జేసిరనుట సమంజసముగనే యున్నది. యుద్ధరంగమం దిట్లు అశ్వినీదేవతలు ఇంద్రునకు చేదోడుగనుండి యుద్ధమందు జయించి తెచ్చిన జ్యోతిర్జలాదుల నన్నిటిని అశ్వినీదేవతలు తమ వెంటబెట్టుకొని వచ్చిరనుటయు మిక్కిలి సమంజసముగ నున్నది. యుద్ధానంతరమందు జయప్రదముగ బయల్వెడలివచ్చుచున్న అగ్ని, ఉషస్సు, సూర్యుడు—మొదలగు ప్రాతఃకాలికదేవతాశ్రేణికందరికిని అగ్రభాగమం దీయశ్వినీదేవతలు నాయకత్వము వహించి వచ్చుచుండిరి. కనుక, అశ్వినీదేవతలను గూర్చిన యీలక్షణముల నన్నిటిని సమర్థించుటకు వసంతసిద్ధాంతము గాని, లేక ఉషస్సిద్ధాంతముగాని యెంతమాత్రమును పనికిరావు. "అశ్వినీశాస్త్ర"మును పఠింపవలసిన యుషఃకాలము బహు దీర్ఘ ఉషఃకాలమేగాని, యీదక్షిణమండలముల లోని ముహూర్తమాత్ర జీవనముగల ఉషస్సుగాదు. వీని నన్నిటిని సమర్థింపజాలిన దీయొక్క ధ్రువసిద్ధాంతమే తప్ప వేరొండులేదు. ఈ సిద్ధాంతదృష్టితో చూచినచో యీ యశ్వినగాథలన్నియు సరళముగ సమన్వయమగును.



అశ్వినులొనర్చిన మహత్కార్యములలో ప్రధానమైన వాని నిట క్లుప్తముగ వివరించెదను. ముదుసలియైన చ్యవనునకు యౌవనమునొసంగి, ఆతనిభార్యకు ఆనందము గల్పించిరి; వృద్ధుడగు "కలి" కి యౌవనమొసంగిరి; యౌవనుడగు "విమదకు" రథముపై భార్యనుగొనితెచ్చి యిచ్చిరి. "తుగ్ర" కుమారుడగు "భుజ్యు"డు సముద్రమధ్యమందు పడి,

కొయ్యముక్కనుపట్టుకొని వ్రేలాడుచు గాఢాంధకారములో నటు నిటు కొట్టుకొనుచు అశ్వినీదేవతలను ప్రార్థించెను. అంతట అశ్వినులు ఆధారరహితమగు, అడుగులేని (అనారంభణే) సముద్రములో నూరు తెడ్ల పడవలో భుజ్యుని కూర్చుండబెట్టి యింటికితీసికొనిపోయిరి. అంతరిక్షమందు సంచరించుచున్న—నీరుచొరని నాలుగుపడవలలో – ఒకరెక్కల పడవలో — నూరుపాదములును, ఆరుగుర్రములును గలిగి యెగురుచున్న మూడు రథములలో—భుజ్యునికూర్చుండబెట్టి రక్షించిరి. "రేభ" యను ఋషి, పొడువబడి, దుర్మార్గులచే రహస్యప్రదేశమందు కట్టివేయబడి, పదిరాత్రిళ్ళు, తొమ్మిది పగళ్ళు నీటిలోముంచబడి, చచ్చిపోయినట్లెంచబడి, అతిదీనావస్థయందు పడియుండగ అశ్వినీదేవతలు వచ్చి ఆతనిని లేవదీసి, విడిపించి, కాపాడిరి. వందన, యను ఋషిని ఘోర విపత్తునుండి కాపాడి సూర్యకాంతిని జూపించిరి. అశ్వినులీవందనకొరకొక గోతినిత్రవ్వి, దానిలో "నిర్రుతి యొడిలో నిద్రించుచున్న" దానివలెను, లేక "అంధకారమందు పడియున్న సూర్యుని"వలెను, పూడ్చిపెట్టబడి తళతళ మెరయుచున్న బంగారుముద్దనుత్రవ్వియెత్తిరి. "అత్రి - సప్త-వధ్రి" యను ఋషి నొకరాక్షసుడు మండుచున్నగోతిలో పడవేసిపోగా, అశ్వినులతనిని పైకిదీసికాపాడి, అంధకారమునుండిపైకితెచ్చిరి. తోడేలునోటిలోపడిన పరిగెపిట్టనుకాపాడిరి. ఋజ్రాశ్వము ౧౦౧ గొర్రెలనుచంపి ఆడతోడేలునకువేయగ



క్రూరుడగు నాతనితండ్రిఋజ్రాశ్వముయొక్క కంటిని పొడిచివేసెను. కాని, ఆడతోడేలుయొక్క ప్రార్థనను విని అశ్వినులు ఋజ్రాశ్వమునకు మరల నేత్రదృష్టి నొసంగిరి. "పరావృజ"కు కుంటితనమును, గ్రుడ్డితనమును పోగొట్టిరి. "విశ్పలా" యొక్క కాలుయుద్ధరంగమందు పక్షిరెక్క తెగినట్లుతెగి పోగా అశ్వినులతనికి యినుపకాలునిచ్చిరి. "ఘోషా" యను నామె తనతండ్రియింట వృద్ధురాలైపోవుచుండగ, అశ్వినులామెకొకభర్తనొసంగిరి. నపుంసకుడగు నొకానొకనిభార్య "వధ్రిమతీ" యనునామెకు అశ్వినులు "హిరణ్యహస్తుడ"ను నొక కుమారునొసంగిరి. "శయూ" యొక్కఆవునకు కాన్పుడిగి పోగా, తిరిగి పాలుపడునట్లు చేసిరి. ఇట్టివే యశ్వినులొనర్చిన మహత్కార్యములింక నెన్నియోగలవు. కాని, మనకిప్పుడివి చాలును.

దీనులకు తోడ్పడుటయే ఆశ్వినుల ప్రధానలక్షణముగ గన్పట్టుచున్నది. ఈ గాథలలో సూర్యుని క్షీణదశకూడ అచ్చటచ్చట సూచింపబడినది. దీని నాధారముగ జేసికొని మాక్సిముల్లరు మొదలగు పండితు లనేకు లీగాథలనన్నిటిని సూర్యుడు హేమంతర్తువందు క్షీణించి వసంతర్తువందు తిరిగి తేజోవంతు డగు సృష్టిచమత్కారముపై సమర్థింపజూచిరి. చ్యవనుడనగ గాఢాంధకారపూరితమై యగ్నిచే ప్రజ్వలించుచున్న అగాధములోనికి క్రుంకుచున్న సూర్యుడని మాక్సిముల్లరుగారు చెప్పిరి. "వందన" కొరకు అశ్వినులు త్రవ్వియెత్తిన బంగారు నిధియనగ సూర్యుడేనని ఆ గాథయే చెప్పక చెప్పుచున్నదట.

కలి, విశ్పలా గాథలు చంద్రుని కృష్ణపక్షక్షైణ్యమును దెల్పుచున్నవట. ఋజ్రాశ్వము యొక్క అంధత రాత్రిపూట నున్న చీకటిగాని, లేక హేమంతర్తు వందలి సూర్యుని క్షీణతేజమును గాని దెల్పుచున్నదట. ‘ పరావృజ ’ గాథవలన అస్తంగత సూర్యుడుగాని, లేక హిమసంక్రమణమువద్దనున్న సూర్యుడుగాని సూచింపబడుచున్నాడట. భుజ్యు రేభ గాథలు కూడ అస్తంగత సూర్యునే సూచించుచున్నవట. వధ్రిమతీ గాథ కేవలము ఉషస్సునే సూచించుచున్నదట. రాత్రిపూట ఉషస్సు (వధ్రిమతీ) తన భర్తయగు సూర్యు నెడబాసి యుండుటచే, ఆపె నపుంసకుని భార్యగ వర్ణింపబడెనట. శయూయొక్క ఆవనగ ప్రాతఃకాలమందలి తేజస్సని భావమట. ఈరీతిగ ప్రతిగాథయు పాశ్చాత్యపండితులచే సమన్వయింపబడినది. ఒకానొకప్పుడు సూర్యుడుగాని, చంద్రుడుగాని క్షీణించి పోవుటయు, మరల యథాప్రకారముగ వారు తిరిగి ప్రజ్వలించుటయు సృష్టియందు సాధారణముగ జరుగు వ్యాపారమే. ఈరీతిగ క్షీణతేజులైన సూర్యచంద్రులు మరల పరిపూర్ణ తేజస్కులైనప్పుడు, దేవతావైద్యులగు అశ్వనులే వీరికి మందులిచ్చి వీరిని మరల తేజోవంతులనుగ జేసిరని యీగాథలకు భావార్థము చెప్పబడినది.

పాశ్చాత్యపండితు లవలంబించిన యీ వసంతసిద్ధాంతము యాస్కాచార్యులవారు జెప్పిన ఉషస్సిద్ధాంతమునకంటె చాల సరళముగ నున్నదనుటలో సందేహ మేమియు లేదు.



అయినను, దీనిలో ముఖ్యముగ మూడులోపములు గన్పట్టుచున్నవి. అవేవనగ:-

మొదటిలోపము:-అశ్వినులు తాము రక్షించినభక్తుల నందరిని గాఢాంధకారమునుండియే లేవనెత్తిరి; యీభక్తులలో చాలమందికి గ్రుడ్డితనమును పోగొట్టిరి. ఈ గ్రుడ్డితనము వలనకూడ గాఢాంధకారమే సూచింపబడుచున్నది. కాని, వసంతసిద్ధాంతమువలన యీగాథలలోని కెల్ల మిక్కిలి ప్రధానాంశమగు నీయంధకారమును మాత్రము సమర్థించుటకు వీలులేదు. వందనగాథలో త్రవ్వబడిన బంగారుముద్ద "గాఢాంధకారములోపడియున్న సూర్యుని"తో పోల్పబడెను. భుజ్యుడు అంతులేని గాఢాంధకారమందు (అనారంభణే తమసి) పడియుండెను; అత్రికూడ గాఢాంధకారమునుండియే లేవనెత్తబడెను. ఇంకననేకచోట్ల గాఢాంధకారమును, గ్రుడ్డితనమును పేర్కొనబడినవి. వీనినన్నిటిని సమర్థించుటెట్లు? హేమంతర్తువందు సూర్యతేజస్సు క్షీణించుననుమాట వాస్తవమే. అందుచే సూర్యుడు ముసలివాడయ్యెననిగాని, కుంటివాడయ్యెననిగాని, లేక దుఃఖదశయందుండెననిగాని, చెప్పవచ్చును. కాని, గ్రుడ్డివాడయ్యెననిగాని, గాఢాంధకారమందు మునిగిపోయెననిగాని చెప్పుటకు వీలులేదు. కనుక యీగాథలలో నిజమైన అంధకారమే (రాత్రిచీకటియే) సూచింపబడెననుటలో సందేహ మొంతమాత్రమును లేదు. అదిగాక, సూర్యుడీ యంధకారములో చాలదినములవరకు

కూడ పడియుండెనని యీ గాథలవలన తెలియుచున్నది. కనుక యీగాథలను సమన్వయించుటకు నిత్యము జరుగు సూర్యాస్తమయముగాని, హేమంతర్తువందు జరుగు సూర్య తేజ క్షైణ్యముగాని, పనికిరావు. వీనిని సమన్వయించుటకు ధ్రువమండల దీర్ఘరాత్రి.యొక్కటియే పనికివచ్చును.

రెండవలోప మేమనగ :— అశ్విన భక్తులనుభవించిన విపద్దశలయొక్క కాలపరిమితులను సమర్థించుటకు కూడ యీ వసంతసిద్ధాంతము చాలదు. రేభయను ఋషి పది రాత్రిళ్ళును, తొమ్మిది పగళ్ళును నీటిలో మునిగియుండెను. భుజ్యుడు గాఢాంధకార సముద్రములో మూడు రాత్రిళ్ళు మూడు పగళ్ళు పడియుండెను. అశ్వినులు ఆవలి ప్రక్క నున్న దూరదేశమందు ( పరావత్ ) మూడు రాత్రింబవళ్ళుండిరి. ఈ యవధులను సమర్థించుటెట్లు? సూర్యుడు హిమ సంక్రమణము వద్ద నటు నిటు కదలక 9, 10 దినములవరకు నుండవచ్చునని మాక్సిముల్లరు పండితు డూహించుచున్నాడు. కాని, సూర్యుడట్లు కదలక మెదలక హిమసంక్రమణమువద్ద 9, 10 దినములవరకు నిలిచియుండునాయను నంశము సంశయాస్పదమని మాక్సిముల్లరుపండితుడే మరల సంకోచించుచున్నాడు. అర్వాచీనభౌతికశాస్త్రజ్ఞులకే యీవిషయము దుర్గ్రాహ్యముగనున్నది. ఈపదిదినములపరిమితి చాల యెక్కువగ గన్పట్టుచున్నది. కనుక యిదిపనికిరాదు. పోనీ, దీనినొక వేళయొప్పుకొన్నను అశ్వినులచే రక్షింపబడిన దీర్ఘతముడు



౬ మాసములు సముద్రములోనుండెను. అట్లైనచో, సూర్యుడు కూడ హిమసంక్రమణమువద్ద ౬ నెలలవరకు కదలక నిలిచియుండెనని చెప్పవలసివచ్చును ! ఇది కేవల మసంభవముగద. కనుక, యీలోపమును పూర్తిచేయుటకు మనకు ఉత్తరధ్రువమండల దీర్ఘరాత్రియే పనికివచ్చును. దీనినాధారముగ గైకొన్నచో, సూర్యుడు ౧ మొదలు ౧౦౦ రాత్రులవరకు—వేయేల ౬ మాసముల వరకుకూడ—క్షితిజముక్రింద గ్రుంకియుండెనని సమర్థించుటకు వీలు చిక్కును.

మూడవలోప మేమనగ:— అశ్వినభక్తులు పడియున్న స్థలమును నిర్దేశించుటకు కూడ యీ వసంతసిద్ధాంతము చాలదు. భుజ్యుడు అడుగు (ఆధారము) లేనట్టియు (అనారంభణే), గాఢాంధకారపూరితమైనట్టియు, (తమసీ), నీటియందు (అప్సు) పడియుండెను. ఈవర్ణన ఇంద్రవృత్రాసురుల యుద్ధరంగమునకు సర్వవిధముల సరిపోవుచున్నది. కనుక, దీనిని హేమంతర్తువందు సూర్యుని క్షీణతేజస్సుతో పోల్చుట కెంతమాత్రమును వీలులేదు. ఆధారరహితమును, గాఢాంధకారపూరితమును, జలమయమునగు సముద్రమును సమన్వయించుటకు ఉత్తరధ్రువసిద్ధాంతమునే తీసికొనిరావలెను. "ప్రక్కను రంధ్రమున్నట్టి (జింహా—బారం) యేడు ఆధారముల సముద్రమును ఇంద్రుడు తెరచెనని ఋ VIII, 40, 5 చెప్పుచున్నది. దీనిచే, నిరుద్ధజలమును విడిపించుటకై ఇంద్రుడు అధోలోకమందొనర్చిన యుద్ధము స్పష్టము

సూచింపబడుచున్నది. ఈవాక్యములలోనున్న "జింహ-బారం" అనుపదమే అశ్వినులొనర్చిన ఘనకార్యములను వర్ణింపుచు I, 116, 9; I, 85, 11 – లలోసైతము ప్రయోగింపబడియున్నది. "అడుగుపైకిని, మూతిక్రిందికినియున్న (లేకప్రక్కను రంధ్రమున్న) బావిని అశ్వినులు పైకెత్తిర"ట. "ప్రక్కకుబరగియున్న (జింహా)బావిని అశ్వినులుపైకిత్రోసి గోతముని దాహమును మాన్చిర"ట. ఈవర్ణనలన్నియు పాతాళలోకమునకు (అధోలోకమునకు) సరిపోవుచున్నది. పాతాళలోకమందు ప్రతివస్తువు తలక్రిందుగ నుండుననుభావము సర్వసాధారణమైనదేగద. గ్రీకులు, ఐగుప్తీయులు మొదలగు తదితర ఆర్య సంతతులుకూడ నిట్లేతలంచియున్నారు. ఈభావము బహు ప్రాచీనకాలమునుండి వచ్చుచున్నది. పాతాళలోకము తొట్టె బోర్లించినట్లు తలక్రిందుగనుండి, గాఢాంధకారమయమును, జలమయమునుగ నుండునని ప్రాచీనులుతలంచిరి. పాతాళమున కాధారముగాని, అడుగుగాని లేదు. అందుచేతనే దీనిలోనుండు నీరు పైకి ప్రవహించుటకై అశ్వినులీ బోర్లించియున్న తొట్టెయొక్క ప్రక్కలో నొక రంధ్రమును చేయవలసివచ్చెను; లేక, దానిని పైకి నెట్టవలసివచ్చెను. ఈ తొట్టె నిట్లు పైకినెట్టగనే, దానిలోని నీరు ఊర్ధ్వముఖముగ ప్రవహించి, ఆకాశముపై కెక్కి వర్షరూపముగ పడి గోతముని దాహమును దీర్చెను. ఇట్టి వర్ణనమే I, 85, 10, 11 — లో మరుత్తులొనర్చిన మహాకార్యమునుగూర్చి



చేయబడియున్నది. "ఉచ్చా-బుధ్నా" (అడుగుపైకియున్న); "జింహా – బార" (మూతి క్రిందికి లేక ప్రక్కకు నున్న); — అను విశేషణములు ఒకానొక బావిని (అవత) వర్ణింపుచు ప్రయోగింపబడియున్నవి. పండితు లీవర్ణనను మేఘమున కంటగట్టిరి. కాని యిది సరికాదు. ఏలననగ; ఈ బావిలోని నీటిని ఊర్ధ్వముఖముగ యీవలికి ప్రవహింపజేయుటకై అశ్వను లీబావిని పైకి నెట్టవలసినవారైరి. (ఊర్ధ్వంనునుద్రే) ఇట్లే I, 24, 7—లో వరుణదేవుడు "అడుగులేని (అబుధ్న) ప్రదేశమందు వృక్షమూలమును నిలువబెట్టియుంచుచున్నాడు. ఈవృక్షమునుండివచ్చు కిరణములు (శాఖలు) తలక్రిందుగ నుండి, క్రిందివైపునకు ప్రవహింపుచు, మనకు గోచరింపవు." ఈవర్ణనము తలక్రిందుగనున్న పాతాళలోకమునకు సరిపోవుచున్నవి. ఈతలక్రిందుగనున్న పాతాళమునకు అడుగులేదు; ఆధారము లేదు. అడుగు లేనట్టియు, ఆధారము లేనట్టియు, తలక్రిందుగనున్నట్టియు, గాఢాంధకారపూరితమైనట్టియు, జలమయమైనట్టియు, యీ యధోలోకసముద్రమందే భుజ్యుడు పడి కొట్టుకొనుచుండెను. (I, 182, 6). ఈ సముద్రమునుండియే అశ్వినులు తెచ్చిన పడవలలో కూర్చుని భుజ్యుడు ప్రాణమును రక్షించుకొనెను. "తిర్యగ్బిలమును, ఊర్ధ్వబుధ్నమును నగు పాత్రమందు సమస్తయశస్సు (కాంతి) నిండియున్నది. అందు యేడుగురు ఋషు లీమహాయశస్సును రక్షించుచు కూర్చునియున్నారు" అధర్వవేదము. X-8-9:

తిర్య గ్బిల శ్చమస ఊర్ధ్వబుధ్న స్త స్మిన్యశో నిహితం విశ్వ రూపమ్ । తదాసత ఋషయః సప్తసాకం యే అస్య గోపా మహతో బభూవుః. ఈవాక్యమే బృహదారణ్యకోపనిషత్తు II, 3, 3-లో కూడ కొద్దిమార్పులతో కలదు. యాస్కాచార్యులవారు (నిరుక్తం XII, 38) యీరెంటికి రెండర్థములను జెప్పిరి. మొదటి వాక్యమునకు:- సప్త ఋషు లనగ సూర్యుని సప్తరశ్ములనియు; పాత్రమనగ పైఆకాశమనియు చెప్పిరి. రెండవ వాక్యమునకు:- పాత్రమనగ మనుష్యుని నోటిలోనున్న అంగిలియని యర్థము జెప్పిరి. కాని, నాకు జూడగ, యీరెండువాక్యములలో పేర్కొనబడిన "పాత్ర" మనగ తలక్రిందుగ బోర్లించినట్లున్న అధోలోకమనుట యెక్కువ సమంజసముగ నున్నది. ఇట్టి వర్ణనమే పారశీ గ్రంథములందు కూడ గలదు. తలక్రిందుగ బోర్లించియున్న పాత్రయందుంపబడిన తేజస్సువంటి తేజస్సే పారశీగ్రంథ మందుకూడగలదు. ఈ తేజస్సు దేవతలవద్దనుండి పోయెననియు, దానిని సంపాదించుటకై "వోరుకశా" సముద్రమందు యుద్ధముజరిగెననియు వర్ణనగలదు. ఈవర్ణన వృత్రవధతో సరిపోవుచున్నది. కనుక, తలక్రిందుగ బోర్లించియున్న పాత్రము కేవలము తలక్రిందుగనున్న పాతాళమే గాని వేరొండుకాదు. ఇది గాఢాంధకారపూరిత సముద్రము. ఈ సముద్రమందే భుజ్యుడుపడిపోగా అశ్వినులు రక్షింపవలసివచ్చెను.



భుజ్యు డీసముద్రమందు మూడురాత్రింబవళ్ళు పడియుండెను. అనగ యీకథ మూడుదినముల దీర్ఘరాత్రిని సూచింపుచున్నది. రేభయను ఋషికూడ నీసముద్రమందే 9 పగళ్లును, 10 రాత్రులును పడియుండెను. ఈకథవలన పదిదినముల దీర్ఘరాత్రి సూచింపబడుచున్నది. గ్రీకుపురాణములలో "హేలియో" కు 350 గొఱ్ఱెలును, 350 యెడ్లును గలవని చెప్పబడియున్నది. గొఱ్ఱెలనగ రాత్రులు; ఎడ్లనగ పగళ్ళు అనగ దీనివలన పదిదినముల దీర్ఘరాత్రి సూచింపబడుచున్నది. యీగ్రీకుగాథయు, రేభఋషికథయు సమానార్థకములేయని యెరుంగవలెను. ఋజ్రాశ్వము ౧౦౧ గొఱ్ఱెలను చంపివేసెనని చెప్పుగాథవలన నూరుదినముల దీర్ఘరాత్రి సూచింపబడుచున్నది. దీనికి "హేలియోయెడ్లను దొంగిలించిన" గ్రీకుకథచే మరింతబలము చేకూరుచున్నది. ఈరీతిగ, అశ్వినగాథలవలన, 3, 10, 100 దినముల యవధులుగల దీర్ఘరాత్రులు, సూచింపబడుచున్నవి. ఈగాథలలోనున్న వివరములన్నియు ధృవసిద్ధాంతముచే చక్కగ సమన్వయమగుచున్నవి. ఈవివరములింతవరకు వసంతసిద్ధాంతముచేగాని, ఉషస్సిద్ధాంతముచేగాని సమన్వయింపబడజాలకుండెను.

మన మిప్పుడు "అత్రిసప్తవధ్రి" గాథను విచారింతము. ఋగ్వేదము ౫ వ మండలము, ౭౮ వ సూక్తమునందు ౯ ఋక్కులుగలవు. ఈతొమ్మిదిఋక్కులలో యీగాథ వర్ణింపబడియున్నది. "అత్రిసప్తవధ్రి" యను నతడు ఘోరా

పదలో పడియుండి, తన్నురక్షింపవలసినదని అశ్వినీదేవతలతో మొరపెట్టుకొనుచున్నాడు. మొదటి మూడుబుక్కులలో:— "ఓ అశ్వినులారా! మీరురెండు హంసలవలె యజ్ఞమునకు రావలసినది." అని ఆహ్వానముగలదు. ౪ వ. బుక్కులో— "అత్రిసప్తవధ్రి" గోతిలోపడిపోయి, తన్నురక్షింపవలసినదని ఆడదానివలె యేడ్చుచు, అశ్వినులను ప్రార్థించుచున్నాడు. ౫, ౬, బుక్కులలో:— "అత్రిసప్తవధ్రి" కొయ్యపెట్టెలో బంధింపబడియుండి, — "శిశువునుగనుచున్న స్త్రీయొక్క గర్భము భేదిల్లునట్లుగ యీపెట్టెకూడ పగిలిపోవునుగాక—" యని అశ్వినులను ప్రార్థింపుచున్నాడు. తరువాత ౭, ౮, ౯ బుక్కులలో:— పదినెలలుమోసిన స్త్రీ శిశువును ప్రసవించు విధానము వర్ణింపబడినది. ఈమూడు బుక్కులకు "గర్భస్రావిణీ — ఉపనిషత్" అని శాయనాచార్యులవారు పేరుపెట్టియున్నారు. వాని నిట వివరించెదము.

౭ వ బుక్కు :— యథా వాతః పుష్కరిణీం సమింగయతి సర్వతః । ఏవా తే గర్భఏజతు నిరైతు దశమాస్యః॥

౮ వ బుక్కు:— యథా వాతో యథావనం యథా సముద్ర ఏజతి । ఏవాత్వం దశమాస్య సహావేహి జరాయుణా॥

౯ వ బుక్కు:— దశమాసా ఇఛ్ఛశయానః కుమారో అధిమాతరి । నిరైతు జీవో అక్షతో జీవో జీవంత్యా అధి॥

అర్థము:— ౭ వ బుక్కు:— గాలి కమలాకరమును అన్నివైపుల కదల్చునట్లు, నీగర్భము కదలుగాక! నీగర్భము పదినెలలు పెరిగినపిమ్మట (దసమాస్యః) బయటికివచ్చునుగాక.



౮ వ బుక్కు:— గాలి కదలినట్లు, వనముకదలునట్లు, సముద్రము కదలునట్లు, ఓ పదినెలల పిండమా! పై మావితోకూడ బయటికిరమ్ము.

౯ వ బుక్కు:— తల్లిగర్భమందు పదినెలలున్న కుమారుడు సజీవుడై యేహానియులేక, తల్లి కానందమును గలుగజేయుచు బయటికివచ్చునుగాక!

ఈప్రసవవిధాన మిచ్చట యింతవిపులముగ నేల వర్ణింపబడినది? ఇది అప్రస్తుతముగ వర్ణింపబడినదా? దీనికిని మొదటి ఆరుబుక్కులలో చెప్పబడిన "అత్రిసప్తవధ్రి" గాధకును సహజమగు సంబంధముండితీరవలెను. ఆసంబంధమేమి? వసంత, ఉషస్సిద్ధాంతములచే యీసంబంధమేమియో నిర్ధారణ కాజాలదు. ఈచివరి మూడుబుక్కులలో పదకాఠిన్యమేమియు లేదు, గర్భమందు పదినెలలున్న శిశువుయొక్క సుఖప్రసవమునకై ప్రార్థనగావింపబడినది. ఈశిశువెవరు? ఈశిశువెవరో పండితుల కింతవరకును అగమ్యగోచరముగనేయుండిపోయినది.

కాని, ధ్రువసిద్ధాంతముచే సర్వమును తేటతెల్లమగుచున్నది. సూర్యుడుభూమ్యాకాశముల(ద్యావా-పృథివీ)యొక్క పుత్రుడని ఋగ్వేదము పలుతావులలో ఘోషించుచున్నది. సూర్యుడు "దివస్పుత్రు" డనియుకలదు. ఋ I, 164, 33-లో "ద్యు (లేక దివము) మనలను గన్నతండ్రి; మనకాతడు మూలము; ఈభూమిమనతల్లి; తండ్రిపిండమును విశాలమగు నీరెండుపాత్రలందు (ఉత్తానయోః చంవోః) ఉంచెను."

మరియు I, 164, 32 లో - "సూర్యుడు తన తల్లిగర్భములో నుండియే నిరృతిలోనికిపోయెను;" మరియు, "తననుపుట్టించిన వాడు తన్నెరుగడు; తన్నిదివరకు చూచుచున్నవారికి ఆత డిప్పుడు గోచరమగుటలేదు;" మరియు, I, 160, 1 లో, "భూమ్యాకాశములు రెండును మహోత్కృష్టములగు రెండు జననపాత్రలు ( లేక జననస్థానములు ); ఇవి చాలపవిత్రమైనవి; ఈరెంటిమధ్య సూర్యుడు కొన్నినియమముల ననుసరించి తిరుగుచుండును "—ఈపైవాక్యములవలన ముఖ్యముగ మూడు సారాంశములు తేలుచున్నవి. (౧) సూర్యుడు భూమ్యాకాశము లనబడు రెండుపాత్రలలోనుండి పుట్టిన శిశువుగ వర్ణింపబడియున్నాడు. (౨) సూర్యు డీభూమ్యాకాశములమధ్య గర్భస్థపిండమువలె తిరుగుచున్నాడు; (3) కొంతకాలమిట్లు సూర్యుడు మాతృగర్భములో సంచరించి, పిమ్మట నిరృతిలోకములోనికి పోయెను. అందుచే, తన్నిదివరకు చూచుచున్నవారి కాత డిప్పుడు గోచరమగుట లేదు. ఈరీతిగ సూర్యుని వార్షికగమనమును నిర్ణయించినచో, సూర్యుడు మాతృగర్భమునుండియే, నిరృతిలోకమునకు పోయెనని చెప్పుట బహుసులభమగును. అయితే, యీ సందర్భములో సూర్యుడు " మాతృగర్భమందు పదిమాసములు తిరిగె " నను వాక్యమునకు అర్థమేమి ? పదిమాసములైన పిమ్మట దీర్ఘతముడు సముద్రములోనికి కొట్టుకొనిపోయెననగ నేమియర్థమో, లేక దశగ్వులు తమ వార్షికసత్రమును ౧౦



నెలలో ముగించిరనగ నేమియర్థమో—యీవాక్యమునకును అదియే యర్థము. అనగ, ధ్రువమండలమందు సూర్యుడు ౧౦ మాసములే క్షితిజముపై సంచరించుచున్నప్పుడు భూమ్యాకాశములనబడు మాతృగర్భగోళమందు సూర్యుడు ౧౦మాసములు సంచరించెనని చెప్పుట సహజముగనే యున్నదిగద. తక్కిన రెండుమాసములలో సూర్యుడు క్షితిజముక్రిందికి క్రుంకిపోయి దీర్ఘరాత్రిని గల్గించినప్పుడు, సూర్యుడు దశమాసానంతరము తన తల్లిగర్భమునుండి నిరృతిలోకమునకు నిష్క్రమింపగ అచ్చట కొయ్యపెట్టెలో బంధింపబడి పోయెననుటయు మిగుల సమంజసముగనే యున్నదిగద. కనుక, సూర్యుడు (అత్రిసప్తవధ్రి) తన నీపెట్టెనుండి విడిపించవలసినదనియు, దశమాసానంతరము తన మాతృగర్భమునుండి సురక్షితముగ బయట పడునట్లు చేయవలసినదనియు అశ్వినులను ప్రార్థించుట మరింత సరళముగ నున్నది.

ఈగాథలో మన మింకను విచారింపవలసిన యంశములు ముఖ్యముగ రెండు గలవు. వానిలో మొదటిది:— కొయ్యపెట్టెలో బంధింపబడిన సూర్యునకు "సప్తవధ్రి"యను పేరెట్లు వచ్చును ? వధ్రియనగ నపుంసకుడు; 'సప్తనపుంసకు' డను పేరెట్లు వచ్చెను ? అధ. వే. XI, 5, 12—లో సూర్యుడు " కేకలిడుచు, ఉరుముచు, శ్వేతారుణకాంతులతో వెలుగుచు భూమివెంట మహామేఢ్రమును (బృహాచ్ఛేపస్) గొనిపోవుచున్నాడు" అను వర్ణన గలదు. భూమ్యాకాశముల

మధ్య సంచరించుచున్నప్పుడు సూర్యునకు మహామేఢ్రమున్న దని చెప్పినచో, నిర్రుతిలోకమునకు గ్రుంకిపోయినప్పు డాతడు నపుంసకు డయ్యెనని చెప్పుటయు సహజముగనే యున్నది. అయితే, సూర్యుడు నిర్రుతిలోకమునకు పోయి నప్పుడు నపుంసకుడు (వధ్రి) అయ్యెననియొప్పుకొన్నను, ఆతడు సప్త-నపుంసకు డెట్లయ్యెను ? భూమ్యాకాశములేగాక, అధోలోకముకూడ యేడుభాగములుగ విభజింపబడినట్లు మన మిదివరకే చెప్పియుంటిమి. దీనికనేక ప్రమాణవాక్యముల నిదివరకే జూపియుంటిమి. కాన, వానినిట మరల వివరింపపని లేదు. కనుక, బృహచ్ఛేపుడైన సూర్యుడు భూమ్యాకాశ ముల మధ్యసంచరించుచున్నప్పుడు సప్తరశ్ముడు లేక సప్తాశ్వు డెట్లయ్యెనో, అట్లే నిర్రుతిలోకమందు నపుంసకుడై పడియున్న ప్పుడు సూర్యుడు సప్తనపుంసకుడయ్యెననియు చెప్పవచ్చును. ఈరీతిగ ౫ వ మండలము, ౭౮ వ సూక్తములోని మొదటి ౬ ఋక్కులకును, తుది 3 ఋక్కులకును చక్కని సంబంధ మేర్పడుచున్నది. సూర్యుడు పదిమాసములు తల్లిగర్భమందు సంచరించి, మిగిలినరెండు మాసములను నిర్రుతిలోకమందు సప్తనపుంసకుడై కొయ్యపెట్టెలో బంధింపబడిపోయెనని చెప్పు "అత్రిసప్తవధ్రి" గాథ కీరీతిగ, పదినెలల సూర్యరశ్మితోడను, రెండునెలల దీర్ఘరాత్రితోడను గూడిన ఉత్తరధ్రువమండల లక్షణమువలన సరళమగు భావార్థ మేర్పడుచున్నది.



ఈకథాసందర్భమునం దింకొక చిన్నకట్టుకథ బయల్వె డలుచున్నది. సూర్యుడుపదినెలలు తల్లిగర్భములో సంచరించి, పిమ్మట నిర్రుతిలోకమునకు నిష్క్రమించి, కొయ్యపెట్టెలో బంధింపబడుటచే, యెవరికిని కనుబడలేదు. సాధారణముగ, దశమాసానంతరము శిశువుపుట్టగనే, అందరికిని గాన్పించును. కాని, యీసూర్యశిశువుమాత్రమెవరికిని గన్పడలేదు. ఇది మహాశ్చర్యముగ దోచుచున్నది. ఈవిరోధాభాసమునుగూర్చి వైదికఋషు లనేకచోట్ల చమత్కారముగ వర్ణించియున్నారు. ఋ I, 164, 32 లో- "సూర్యుడు తనను పుట్టించినవానికి గన్పడలేదు" అని చెప్పిరి. V, 2, 1లో—కుమారం మాతా యువతిః సముబ్ధం గుహా బిభర్తి నదదాతి పిత్రే । అనీక మస్య న మినజ్జనాసః పురః పశ్యంతి నిహితమరతౌ ॥౧॥ కమేతః త్వంయువతే కుమారం పేషీ బిభర్షి మహిషీజజాన । పూర్వీ ర్హిగర్భః శరదో వవర్ధాపశ్యం జాతం యదసూత మాతా ॥౨॥ యువతియగు "తల్లి శిశువును రహస్యముగనుంచినది; ఆమె శిశువును తండ్రికి ఒప్పగించలేదు. 'అరాతి'తోనుండి క్షీణించి పోవుచున్న ఆతనిముఖమును ప్రజలుతమయెదుట చూడలేదు. ......" I, 72, 2-లో- "దేవతలు తమచుట్టు సంచరించుచునే యున్న ఆవుదూడను కనుగొనలేకపోయిరి......." అగ్నిచాల కాలము (జ్యోక్) దీర్ఘతమస్సులో (దీర్ఘంతమః) నివసించి, నీటిలోనుండి పుట్టినబిడ్డవలె (అపాంనపాత్) బయటికి వచ్చు చున్నాడని ఋX, 124, 1-లో—చెప్పబడియున్నది. ఇచ్చట

అగ్నియన్నను, సూర్యుడన్నను సమానార్థకమే. ఉత్తరధ్రువ సిద్ధాంతమును, దివ్యజలసంచారమును—యీరెంటిని- ఆధారముగ గైకొన్నచో యీకట్టుకథల నన్నిటిని చక్కగ విడదీసి చెప్పవచ్చును. దశమాసానంతరము తానుగన్న శిశువును తల్లి దాచియుంచినదనగ, ఉత్తరధ్రువమండలమందు పదినెలలవరకు సూర్యుడు క్షితిజముపై వెలుగుచుండి, పిమ్మట రెండు నెలలు క్షితిజముక్రిందికి పూర్తిగ గ్రుంకిపోయి, ప్రజలకు గాన్పింప లేదని భావార్థము.

ఈవిధముగ, నదృశ్యుడైన కుమారు డేమయ్యెను ? ఆతడు మరల పైకిరానేలేదా ? ఆతని నెవరును పైకితీసికొని రాలేదా ? ఋభుదేవత లీకుమారుని పైకితీసికొనివచ్చి మరల తలిదండ్రుల కొప్పగించిరట. ఋభువులు లేగదూడను తల్లితో గలిపిరి I, 110, 8; అశ్వినులు వధ్రిమతికి హిరణహస్తుడను కుమారు నొసంగిరి; అశ్వినులు 'శయూ' ఆవునకు పాలుపడు నట్లు చేసిరి; ఈకథలన్నియు కుమారసూర్యుని మరల తల్లితో కలుపుటనే సూచించుచున్నవి.

ఈగాథలో "కుమారు"డుగ వర్ణింపబడిన బాలసూర్యుడే తదుపరి పురాణములలో కార్తికేయుడగు కుమారస్వామిగ వర్ణింపబడియున్నాడు. తల్లిగర్భమునుండి దశమాసానంతరము నిర్రుతిలోకమునకు జారిపోయినట్టియు, (స్కంద) లేక దాగినట్టియు (గుహ) యీకుమారసూర్యుడే పురాణములలో కుమారస్వామియయ్యెను. ఈకుమారసూర్యుడు ప్రాతఃకాల



మందు తనసప్తమాతృకలతో,—అనగ సప్తదివ్యజలవాహినులతో—పైకివచ్చి దేవసైన్యములకు (అనగ వెలుతురునకు) సేనాపతియై దేవయానమువెంట విజయప్రయాణము సాగించెను. బాలసూర్యుడు పగళ్లకు నాయకుడు; అట్లేకుమారుడు దేవసైన్యములకు నాయకుడు. మరుత్తులు వృత్రవధయందు యింద్రునకు సహాయముచేసి సూర్యునివిడిపించిరి; కనుక, కుమారస్వామి (అనగ బాలసూర్యుడు) మరుత్తులకు (అనగ రుద్రునకు) కుమారుడని పురాణములువర్ణించినవి. సూర్యుడు వృత్రవధానంతరము నీటినుండిపుట్టెను; అగ్నికూడ నీటిలోనుండెను; కనుక, కుమారస్వామి (బాలసూర్యుడు) పురాణములలో అగ్నికుమారుడయ్యెను. బాలసూర్యుడు వృత్రవధానంతరము సప్తవాహినులవెంటవచ్చెను; గనుక, కుమారస్వామి (బాలసూర్యుడు) సప్తమాతృకలకు ( లేకషట్కృత్తికలకు ) పుత్రుడయ్యెను. బాలసూర్యుడు వృత్రవధానంతరము సముద్రము నావరించిన కొండబిలములలోనుండి బయటికివచ్చెను. కనుక, కుమారస్వామి (బాలసూర్యుడు) కొండను భేదించెను. అనగ, క్రౌంచపర్వతమును భేదించుటచే కుమారస్వామికి "క్రౌంచదారణు" డను నామము పురాణములలో ప్రసిద్ధమయ్యెను. మనకింతవరకుచాలును. ఈరీతిగ బయల్వెడలిన కుమారస్వామి చరిత్రమునకుతదుపరి పురాణములలో ననేక చిలవలు పలవలు పుట్టినవి. వానితో మనకిప్పుడు పనిలేదు.

మనము అశ్వినగాథలతో బయల్వెడలితిమి. సప్తవధ్రి గాథలోనున్న "దసమాస్య"యను పదముచేతను, దీర్ఘతముని గాథలోనున్న " దశమేయుగే " యనుపదముచేతను ఉత్తర ధ్రువమండలమందలి పదినెలల సూర్యరశ్మి సూచింపబడు చున్నది. భుజ్యు, రేభ, ఋజ్రాశ్వ,గాథలనుబట్టి ఉత్తరధ్రువ మండలమందలి మూడు, పది, నూరు, దినముల దీర్ఘరాత్రులు సూచింపబడుచున్నవి. ఇదిగాక, "సూర్యుడు గాఢాంధకార ములో నిద్రించుచున్నాడు;" " నిరుతియొడిలో పరుండి యున్నాడు"-అను వాక్యములచే హేమంతర్తువందు క్షీణించి పోయిన సూర్యుడుగాక, కేవలము కటికచీకటిలో పడిపోయిన- అనగ, దీర్ఘరాత్రికాలములో క్షితిజముక్రిందికి గ్రుంకిపోయిన ధ్రువమండలసూర్యుడే సూచింపబడుచున్నాడు. ఈరీతిగ, అశ్వినగాథలలోని ప్రధానాంశములన్నియు ధ్రువమండల దీర్ఘ రాత్రినే సూచించుచున్నవిగాని శీతకాలమందు క్షీణించి పోయిన సూర్యతేజమును సూచించుటలేదు.

## —* సూర్యచక్రము *—

ఉత్తరధ్రువమండలమందు సూర్యరశ్మి ౭, ౯, ౧౦ మాస ములుండు ప్రదేశములను సూచించుటకు అదితి, నవగ్వ,దశగ్వ, సప్తవధ్రి, దీర్ఘతమాది గాథలను వివరించితిమి. ఇవిగాక, ౧౦ మాసముల సూర్యరశ్మినిదెల్పు ప్రత్యేకసౌరగాథ యిం కొకటి గలదు. ఇంద్రుడు సూర్యచక్రమును దొంగిలించెనని యింకొకగాథగలదు. వృత్రుని సంహారించి, వెలుతురును పైకి



తీసికొనివచ్చినవాడు యింద్రుడు. అదిగాక, యింద్రుడు సూర్యునకు ప్రతిచోటను మిత్రుడని వర్ణింపబడియుండగ, అతడు సూర్యచక్రమును దొంగిలించెననుమాటకు అర్థమేమి?

సూర్యరథమున కొక్కటే చక్రమున్నట్లు ఋగ్వేదము చెప్పుచున్నది. ఈ యొక్కచక్రమును యింద్రుడు దొంగిలిం చినచో సూర్యగమనము పూర్తిగ నిలిచిపోవలెను. కనుక, యిచ్చట సూర్యచక్రమనగ సూర్యుడే యని చెప్పవలెను. ఇంద్రుడీసూర్యచక్రమును దొంగిలించి, దానితోనేమిచేసె ను ? ఇంద్రుడు సూర్యకిరణములతో రాక్షసులను దహించె నని ఋ VIII, 12, 9 —చెప్పుచున్నది. కనుక, సూర్యచక్ర హారణమును వృత్రవధయు యేకకాలమందే జరిగినవనుట స్పష్టము. కాని, యిచ్చట నొక విరోధాభాసము తటస్థించు చున్నది ; సూర్యుడు అంధకారములో పడియున్నప్పుడు, యింద్రుడీసూర్యబింబముతోడనే, ఆయంధకారమును భేదించి వెలుతురును పైకితెచ్చెనని యెట్లుచెప్పవచ్చును. సూర్యుడున్న చోట చీకటియుండజాలదని మన మిప్పుడు తలంచుచున్నాము. కానివైదికఋషులట్లు తలంపలేదు. సూర్యుడు క్షితిజముక్రిందికి గ్రుంకగనే, అతని తేజస్సు మాసిపోయెనని వైదికఋషులు తలంచిరి. కనుకనే, సూర్యుడు అంధకారములో పడి యున్నాడు (తమసి క్షియాంతం) అని వర్ణించిరి. సూర్యుడు క్షితిజముక్రిందికి గ్రుంకినప్పుడు అంధకార రాక్షసులు వచ్చి అతని తేజస్సును హారించిరి. అంతట, ఇంద్రుడువచ్చి సూర్య

చక్రమును ఆయుధముగ ధరించి, దానితో అంధకారరాక్షసులను హతమొనర్చి, వారిచే హరింపబడిన సూర్యతేజస్సును మరల సూర్యున కిప్పించెను. ఇచ్చట సూర్యచక్రము (బింబము), సూర్యతేజస్సు — అనునవి రెండు భిన్నపదార్థములుగ గ్రహింపవలెను. సూర్యచక్రముచే రాక్షసులు హతులైరి; అంతట వారు దొంగిలించిన సూర్యతేజస్సు (వెలుతురు) మరల సూర్యునిబొందెను. కనుక, ఇంద్రుడు సూర్యచక్రమును నిలిపి, దానిని గిరగిర త్రిప్పి, అంధకారావృతమైయున్న అధోలోకములోనికి విసరివేసెనని ఋ IV, 17, 14- చెప్పుచున్నది. అనగ, ఇంద్రుడీచక్రమును అంధకారరాక్షసులపై ప్రయోగించెనని తాత్పర్యము.

కాని యీ కథాసందర్భమున, మన మింకను విచారింపవలసిన ప్రధానాంశ మింకొకటిగలదు:—ఋ VI, 31, 3 ను విచారింతము.

త్వమ్ కుత్సేన అభిశుష్ణం యింద్ర
1 అశుషమ్ యుధ్య 2 కుయవం గవిష్టౌ
దశప్రపిత్వే అధ సూర్యస్య
3 ముష్యయస్ చక్రం 4 అవివే 5 రపాంసి॥—

1. అశుషం=అశనాతురుడు.
2. కుయవం=పంటల నాశనముచేయువాడు. } ఇవి రెండును 'శుష్ణ'ను వర్ణించు విశేషణములు.
3. ముష్యయస్=దొంగిలించు, లేక హరించు.
4. అవివే=నాశనముచేయుట.
5. అపాంసి=విపత్తులు.



మొదటి రెండుపంక్తులకు అర్థము:— ఓ యింద్రా! నీవుగోవులను విడిపించుటకై 'కుత్స'తోకలిసి, అశనాతురుడును, పంటలనాశనముచేయువాడునునగు శుష్ణతో (వృత్రునితో) పోరాడుచున్నావు. ఇంతవరకును దీనియర్థము సరళముగనే యున్నది.—

ఇక చివరరెండుపంక్తులు బహుక్లిష్టముగనున్నవి:— "దశప్రపిత్వే"యను పదమును వదలివేసి చూచినచో— "నీవు సూర్యచక్రమును హరించి విపత్తులను నాశనమొనర్చితివి"— అని అర్థము తేలుచున్నది. ఇంతవరకుబాగుగనేయున్నది. మనమిక "దశప్రపిత్వే" యను పదమునకర్థము లాగవలెను. ఈ గాథనేవర్ణింపుచు IV, 16, 12 లో- శుష్ణుడు పగటియొక్క- "ప్రపిత్వ" మందుచంపబడెను—(అహ్నః ప్రపిత్వేనిబర్హీః)- అనియున్నది. కనుక, యిచ్చట, 'ప్రపిత్వే'యను శబ్దము కాలమునుసూచించుచున్నది. మరియు V, 31, 7 లో—ఇంద్రుడు "ప్రపిత్వ"మునుజేరి (ప్రపిత్వంయన్) శుష్ణుడొనర్చు దుండగములను నిలిపివేసెను—అని యున్నది.

కనుక, VI, 31, 3 లోనున్న "దశప్రపిత్వే"
IV, 16, 12 ... ... "అహ్నఃప్రపిత్వే"
V, 31, 7 ... ... "ప్రపిత్వం యన్"

ఈమూడింటిలోనున్న "ప్రపిత్వ" శబ్దములకన్నిటికిని ఒకటే యర్థము చెప్పితీరవలెను. ఈయర్థమేమో పండితులు

స్పష్టపరుపలేదు. పలువురుపలురీతులుగ చెప్పిరి. కనుక, భావము స్ఫుటముగనున్న మరికొన్నివాక్యములను పరిశీలించిచూతము. VII, 41, 4; VIII, 1, 29 ఉతేదానీం భగవంతఃస్యామోత ప్రపిత్వ ఉతమధ్యే అహ్నాం। ఉతోదితా మఘవన్ సూర్యస్య వయం దేవానాం సుమతౌస్యామ్॥మమత్వా సూర అదితే మమ మధ్యం దినేదివః। మమ ప్రపిత్వే అపిశర్వరే వసవాస్తోమాసో అవృత్సత్॥ "ప్రపిత్వే" శబ్దము పగటియొక్క ప్రథమ (ఉదితా,) మధ్య (మధ్యే) భాగములకంటె భిన్నమైనదిగ చెప్పబడినది. కనుక, "ప్రపిత్వే" యనగ పగటియొక్క చరమభాగమను భావముస్ఫుటముగ తేలుచున్నది. మహీధరుడుకూడ యీసందర్భమున "ప్రపిత్వే" యనగ "ప్రపతనే"- లేక "అస్తమయే" యని యర్థముచేసియున్నాడు. ఈయర్థమునుబట్టి చూచినచో IV, 16, 12—నకు "శుష్ణుడు పగటియొక్క చరమభాగమందు చంపబడె" నని తేలుచున్నది. కనుక, VI, 31, 3 లో-నున్న "దశప్రపిత్వే" అను పదమునకు "పదింటియొక్క చరమభాగమందు" అని అర్థము చెప్పితీరవలెను. (అనగ, పదినెలలయొక్క అంతమందు, లేక 'దశమాసాంతమందు' అనుభావము తేలుచున్నది.) కాని, పదపాఠమందు "దశప్రపిత్వే"యను దానినొకటే సమాసముగ గ్రహింపక, దశ, "ప్రపిత్వే" యను రెండు స్వతంత్రశబ్దములుగ గ్రహించుటచే పండితులకు దీనియర్థము బోధపడలేదు. కాని, నేనిప్పుడు "దశప్రపిత్వే" యను దానిని



యేకసమాసముగ గ్రహించి అర్థము చెప్పుచున్నాను. పదపాఠమే శుద్ధమైనదానినిగ మనము గ్రహింపవలసినపనిలేదు. దానిలోకూడ తప్పులుగలవు. అందుచేతనే, శాయనాచార్యులవారును, యాస్కాచార్యులవారును కూడ, అచ్చటచ్చట కొన్ని పదపాఠములలో సవరణలుచేసియే యున్నారు. కాన నేనిప్పు డవలంబింపబోవు పద్ధతి క్రొత్తదికాదు. సహజమును, సరళమును నగు భావార్థము కుదరనప్పుడు పదపాఠమందు సవరణచేయుట సాంప్రదాయకమే యైయున్నది. ఈ యర్థమును గ్రహించినచో, మనము చర్చించుచున్న శ్లోకభాగమున కీరీతిగ అర్థము తేలుచున్నది.

"పదింటియొక్క చరమభాగమందు నీవు సూర్యచక్రమును హరించి, విపత్తులను నాశనమొనర్చితివి" — ఈ వాక్యము శుష్ణవధాకాలమును సూచించుచున్నదనుటకుసందేహము లేదు. ఇక, "పదింటియొక్క చరమభాగమ"నగ అర్థమేమి? పదియనగ, పదిదినములా? లేక పదినెలలా? పదిదినము లనుటకువీలులేదు. అట్లయినచో, శుష్ణవధ (వృత్రవధ) పదిదినముల కొకపర్యాయము జరుగుచున్నదని చెప్పవలసివచ్చును. కనుక, మనము పదిమాసములనియే చెప్పితీరవలెను. పదిమాసముల చివరభాగమందు (దశమాసాంతమందు) 'శుష్ణ' వధింపబడెను. ఈరీతిగ, "దశప్రపిత్వే"యనగ "దశమాసాంతమంద"ని యర్థము నిర్ణయించితిమి. దీనివలన, వృత్రవధాకాలమును, సూర్యచక్రహరణకాలమును నిర్ణ

యింపబడుచున్నవి. ఈనిర్ణయము మన మిదివరకుచేసిన నిర్ణయముతో సర్వవిధముల సరిపోవుచునేయున్నది. ఈగాథకూడ పదిమాసముల సూర్యరశ్మిగల ధ్రువమండలమునే సూచింపుచున్నది.

—* విష్ణుని త్రిపాదములు. *—

ధ్రువమండల లక్షణములను దెలుపు గాథలు మఱికొన్ని గలవు. వానినిట క్లుప్తముగ విచారింతము వానిలో మొదటిది విష్ణుపాదములను గూర్చి చెప్పుచున్నది. విష్ణుని త్రిపాదములను గూర్చి ఋగ్వేదమందు పలుతావులలో పేర్కొనబడియున్నది. ఈ పాదము లెచ్చటెచ్చట నున్నవో పండితు లేకగ్రీవముగ చెప్పియుండలేదు. పలువురు పలురీతులుగ చెప్పియున్నారు. సూర్యుని ఉదయ, మధ్యందిన, అస్తమయములే యీమూడు పాదములుగ వర్ణింపబడినవని మాక్సుముల్లరు పండితుడు తలంచుచున్నాడు. ఈ విష్ణుపాదములే పురాణములలో వామనమూర్తియొక్క మూడడుగులుగ వర్ణింపబయున్నవి. ఇచ్చట విష్ణుడనగ సూర్యుడని పండితులందరును ఒప్పుకొనియేయున్నారు. దీనిని గూర్చి అభిప్రాయభేదములేదు. కాని, యీమూడు పాదములును సూర్యుని దైనికగతిని దెలుపునా? లేక వార్షిక గతిని దెలుపునా యను విషయమై పండితులు భిన్నాభిప్రాయులై యున్నారు. ఈ రెంటిలో నేయభిప్రాయము సరియైనదో మన మిప్పుడు నిర్ణయింపవలసి యున్నది. “విష్ణుడు నాలుగుపేర్లతోనున్న తన తొంబదిగుర్రములను



చక్రాకారముగ పరుగెత్తించుచున్నాడు” అని ఋ I, 55, 6 చెప్పుచున్నది. దీనివలన, ఒక్కొక్కదానిలో తొంబది దినములుగల నాలుగు ఋతువులు (మొత్తము 90×4=360 దినములు) సూచింపబడుచున్నవి. దీనినిబట్టి, సూర్యుని వార్షిక గతియే విష్ణుకార్యములకు మూలాధారముగ నున్నదని స్పష్టమగుచున్నది. అదిగాక, విష్ణుడు యింద్రసఖుడనియు, వృత్రవధయం దాతని కెంతయో సహాయము చేసెననియు ఋగ్వేదమందు పలుతావులలో వర్ణింపబడియున్నది. [IV, 18, 11; I, 156, 4; VII, 99, 4, 5]. కనుక, వృత్రవధకాలమందు విష్ణువు అధోలోకసముద్రమందు, యింద్రునకు కుడిభుజమై నిలుచున్నాడనుట స్పష్టము. కనుక, విష్ణుని మూడుపాదములలో నొకపాదము అధోలోకసముద్రమం దుండితీరవలెను. అందుచేతనే, యీ మూడువిష్ణుపాదములలో రెండుమాత్రమే మానవులకు గాన్పించుననియు, మూడవది పశుపక్ష్యాదులకు గాని, నరులకుగాని గాన్పించదనియు ఋ I, 155, 5—చెప్పుచున్నది. ఈఅధోలోకము చీకటిమయముగను, జలమయముగ నుండి నరుల కదృశ్యముగ నుండునని మన మిదివరకే చెప్పియున్నాము. కనుక, యీయధోలోకమందున్న విష్ణుపాదము కూడ మన కదృశ్యముగనే యున్నదనుట సహజముగనే యున్నది. వేయేల, సూర్యుని వార్షికగమనమే మూడు విష్ణుపాదములుగ వర్ణింపబడినది. సూర్యుడు క్షితిజము పైనుండి ప్రజలకు గాన్పించుకాలము విష్ణుని రెండుపాదము

లగును. తదుపరి సూర్యుడు క్షితిజము క్రిందికి గ్రుంకిపోయి దీర్ఘరాత్రిని గల్గించినప్పుడు అదృశ్యమగు విష్ణుని మూడవ పాద మేర్పడుచున్నది. ఈ మూడవపాదమందే విష్ణు డింద్రునకు వృత్రవథయందు సహాయము చేసెను.

ఇంద్ర శంబరుల పోరాటము శరదృతువు ౪౦ వ తిథి నాడు ప్రారంభమయ్యెనని యిదివరకు నిర్ణయించి యుంటిమి. దీనివలన షుమారు ౮ నెలల సూర్యరశ్మియు, ౪ నెలల దీర్ఘరాత్రియు సూచింపబడుచున్నది. ౮ నెలల సూర్యరశ్మియే విష్ణునకు (సూర్యునకు) రెండుపాదములగును యీపాదము లందరికిని గాన్పించును ౪ నెలల దీర్ఘరాత్రియే విష్ణునకు (సూర్యునకు)మూడవపాదమగును. ఇది యెవరికిని గన్పింపదు. విష్ణువు సంవత్సరములో ౪ నెలలు నిద్రించునని పురాణములు చెప్పుచున్నవి. దీనివలన కూడ ౪ మాసముల దీర్ఘరాత్రియే సూచింపబచున్నది. విష్ణువు సముద్రమధ్యమందు అహిపర్యంకమందు నిద్రించునట. ఈ సముద్రమే అధోలోకమందున్న దివ్యజల (ఆపః) సముద్రము; యీ అహియే వృత్రాసురుడు; యీ నిద్రసంవత్సరముయొక్క చరమభాగమగు *హేమంతమందేజరుగును. విష్ణునినాలుగుమాసములనిద్రయు, అతనిమూడవపాదమును-ఒకేభావమునుదెలుపుచున్నవి. అనగ, వీనివలన ఉత్తరధ్రువమండల దీర్ఘరాత్రి (౪ మాసముల దీర్ఘ

* కాని, యిటీవల ప్రబలిన మేఘసిద్ధాంతముచే పండితు లీ నిద్రను వర్ష కాలమునకు మార్చిరి. ఇది పొరబాటు.



రాత్రి) సూచింపబడుచున్నది. గ్రీకుగాథలలోకూడ "ఫిర్గియన్" అను దేవత శీతకాలమందు నిద్రించి, వేసవికాలమందు పని చేయునట! ఇట్టికథయే ఐరిషుగాథలలోకూడగలదు. ఇవన్నియు ఉత్తరధ్రువమండల దీర్ఘరాత్రినే సూచింపుచున్నవి.

ఈ పౌరాణికగాథ నటుంచి, యీయర్థమునే దెలుపు యింకొక వైదికగాథనెత్తికొందము. ఋ VII, 100, 6-లో విష్ణునకు "శిపివిష్ఠ" యను అశ్లీలనామ మొకటి ప్రయోగింపబడినది. "శిపివిష్ఠ" శబ్దము అశ్లీలార్థమును దెలుపుచున్నదని (కుత్సితార్థీయం) యాస్కాచార్యులవారికి పూర్వులైన ఔపమన్యవ పండితులు చెప్పియున్నారు. "శిపివిష్ఠ" యనగ,— "శేపః ఇవ నిర్వేష్ఠితః"—మేఢ్రమువలె కప్పబడియున్న— అనిగాని, లేక "అప్రతిపన్నరశ్మిః"- కాంతిమాసిన-అనిగాని, రెండువిధములుగ శాయనులవా రర్థముజేసియున్నారు. అయినను, యీబూతుపదమును విష్ణుమూర్తికి ప్రయోగించుట కిష్టములేక శాయనులవారు "శిపివిష్ఠ" పదమునకు యింకొక మంచియర్థమును గల్పింపజూచిరి. "శిపివిష్ఠ" యనగ, "ఎవని కిరణములు (శిపయః) ప్రదర్శితమగుచున్నవో (ఆవిష్ఠాః) ఆతడు శిపివిష్ఠుడు!" ఎవడు తేజోమూర్తిగ వెలుంగుచున్నాడో ఆతడు శిపివిష్ఠుడని శాయనులవారొక మంచియర్థమును గల్పించిరి. కాని, శాయనుల వారు తమయసాధారణప్రజ్ఞచే నెంతయత్నించినను "శిపివిష్ట" శబ్దమున కిప్పటికిని అశ్లీలార్థమే సంస్కృతవాఙ్మయమందు స్థిరముగనిలిచియున్నది. "శిపివిష్ట"

యనగ "వెంట్రుకలు రాలిపోయిన" లేక "కుదుర్చుటకువీలు లేని చర్మరోగముచే బాధపడుచున్న"- యను అసహ్యార్థ మిప్పటికిని సంస్కృతమందు నిలిచియేయున్నది. "శిపి" యనగ "పశవః" అని అర్థముచెప్పి తైత్తిరీయ సంహితాకారులుకూడ విష్ణునకు మంచిపేరుబెట్ట జూచిరి. కాని, యీయత్నము లన్నియు నిష్ఫలములయ్యెను. ఈపదమిప్పటికిని "కుత్సితార్థయము" గనే (బూతుమాటగనే) గ్రహింపపడుచున్నది. విష్ణున కీఅశ్లీలమైన పేరెట్లువచ్చెనో చూతముగాక! ఋVII, 5, 6 లో భక్తుడనగు నేను... యీదినమున "శిపివిష్ట" యను నీనామమును భజించుచున్నాను. బలహీనుడనగు నేను బలవంతుడవగు నిన్ను కొనియాడుచున్నాను—నీవీలోకమున కావల, అధోలోకమందు నివసించుచున్నావు. (క్షయాంతం అస్యరజసః పరాకే) "ఓవిష్ణూ! నేను "శిపివిష్టు"డనని నీవుచెప్పుకొనుటలో తప్పేమియున్నది? యుద్ధమందు నీవు మారువేషమును ధరించియున్నావు గనుక, యీవేషమును (వర్పస్) మాదృష్టినుండి దాచకుము."-అను వర్ణనగలదు."ఈలోకమున కావల" "అధోలోకమందు నివసించుచున్నావు" (రజసఃపరాకే)-అనుమాటల్లవలన యీఋక్కుయొక్క భావార్థమంతయు కరతలామకలమగుచున్నది. విష్ణు డీయధోలోకమందుండగ ఆతనికీ "శిపివిష్టు"డను నశ్లీలనామధేయము గలిగెను. గాఢాంధకారపూరితమగు నీలోకమునకు పోవుటచే విష్ణుమూర్తి నల్లని యావరణములో మూసికొనిపోయెను. అందుచే అతనికి



శిపివిష్టుడు (మేఘమువలె మూసికొనిపోయినవాడు) అను బూతుపేరు వచ్చెను. "ఈ అశ్లీలనామముచే నీవు సిగ్గుపడవలసిన పనిలేద"ని భక్తుడు విష్ణునితో చెప్పుచున్నాడు. ఏలననగ, యీరూపము, అధోలోకమందు అసురులతో పోరాడవలసి వచ్చినప్పుడు, తాత్కాలికముగ ధరింపబడినదే గాని శాశ్వతమైనదిగాదు. కాన, దీని విషయమై యెవరును అసహ్యించుకొనవలసిన పనిలేదని విష్ణుభక్తుడు తలంచుచున్నాడు. ఇప్పుడు యుద్ధము ముగిసినది గనుక, "నీ నిజస్వరూపమును (వర్పస్) మాకు చూపవలసినదని భక్తుడు ప్రార్థించుచున్నాడు. ఈ ఋక్కునకు నిజమైన అర్థమిది. సూర్యుడు క్షితిజలముపై మహాతేజోవంతముగ వెలుగుచున్నప్పుడు "బృహచ్ఛేపు"డుగ వర్ణింపబడెను. కనుక, అధోలోకమందు దీర్ఘకాలము హీనతేజుడై గాఢాంధకారములో మునిగియున్నప్పుడు సూర్యుడు "శిపివిష్టు"డుగ వర్ణింపబడుట సమంజసముగనే యున్నది. దీనికై విష్ణుమూర్తిగాని, విష్ణుభక్తులుగాని సిగ్గుపడవలసినపని యావంతయైనను లేదు. తదుపరి ప్రబలిన పురాణములలో యీభావమునే విష్ణుమూర్తియొక్క నిద్రగ వర్ణించిరి. నిద్రయన్నను, రోగమన్నను ఒక్కటే భావము. విష్ణుమూర్తినల్లని యాచ్ఛాదనమునుధరించి,పాతాళలోకమునకుపోయి, అసురుల నెత్తిపై తనమూడవ పాదము నుంచెనన్నను, లేక నల్లనికవచమును ధరించి వృత్రవధయందు యింద్రునకు సహాయముచేసెనన్నను ఒకటేభావము. ఈకథలన్నియు ఉత్తరధ్రువమండల దీర్ఘరాత్రినే దెలుపుచున్నవి.

విష్ణునివలెనే యీవిశ్వమునంతను చుట్టివచ్చుచుండు తదితర దేవతాస్థానములను పరిశీలించిచూచినను యీసిద్ధాంతమే ధ్రువపడుచున్నది. "సవిత్రి" యను దేవత ప్రపంచమునంతను (రజాంసి) చుట్టివచ్చును. సవిత్రికిమూడులోకములు (ద్యావః) గలవు. వీనిలోరెండు దగ్గరనున్నవి; మూడవది యమలోకములో నున్నది. (అనగ, అధోలోకమందున్నది.) ప్రపంచమును చుట్టివచ్చు రెండవ దేవత అగ్ని. అగ్నికిమూడు స్థానములుగలవు. మొదటిది సముద్రమందు; రెండవది దివియందు; మూడవది నీటియందు (అప్సు) అగ్ని తేజము త్రివిధములు; అగ్ని త్రిశిరుడట. అతనికిమూడునాలుక లున్నవట; అగ్నియొక్కమూడవస్థానము ఒక్కవిష్ణునకుమాత్రమే తెలియునట. అనగ,యిదివిష్ణునిమూడవపాదమునకుసరిపోవుచున్నది. మరియు, అగ్నితనయూర్ధ్వ (ఉపమ) పాదముతోపవిత్రములగు గోవులను కాపాడుచున్నాడని ఋ V, 3, 3 చెప్పుచున్నది. ఈ వర్ణన విష్ణుని యూర్ధ్వపాదవర్ణనముతో సరిపోవుచున్నది. ఎట్లనగ, విష్ణుని యూర్ధ్వపాదమునుండి తేనె ప్రవాహములు ప్రవహించుచుననియు, యీ పాదమందు గోవులున్నవనియు I, 154, 5, 6, చెప్పుచున్నది. ఈవిధముగ అగ్నిపాదములున్ను, విష్ణు పాదములును ఒకేభావమును దెలుపుచున్నవి. ఇచ్చట అగ్ని యన్నను, విష్ణుడన్నను సూర్యుడనియే అర్థము. ఈ యిరువురే గాక అశ్వినులుకూడ ప్రపంచమును చుట్టి వచ్చువారే. (పరిజ్మన్). వీరికికూడ మూడుస్థానములు గలవు. వీరి రథము



యీ మూడుస్థానములందును సమానముగనే (సమానయోజనః) పోవును. ఈ రథమునకు మూడుచక్రము లున్నవి. వీనిలో మూడవ చక్రము యెవరికిని గనపడకుండ యొకానొక రహస్యమైన గుహాయందున్నదట. ఈవర్ణన విష్ణుని మూడవ పాదవర్ణనతో సరిపోవుచున్నది. ఈరీతిగ ప్రపంచమునంతను చుట్టివచ్చు దేవతలందరియొక్క తృతీయస్థానములు ఒకేరీతిగ వర్ణింపబడియున్నవి. కనుక, యీతృతీయస్థానము (లేక పాదము) అధోలోకమునే సూచింపుచున్నదనుట కెంతమాత్రమును సందేహము లేదు. అందుచే, ధృవమండల దీర్ఘరాత్రికి మరింతబలమైన ప్రమాణము దొరుకుచున్నది.

—* "త్రిత ఆప్త్య" *—

సంవత్సరమును మూడుభాగములుగచేసి, యీమూటిని మూడువిష్ణుపాదములతో పోల్చియుండిరి. మరియొకచోట, యీమూటిని ముగ్గురుఅన్నదమ్ములుగ పోల్చిరి. వీరిలో మొదటి యిద్దరునుకలిసి మూడవవానిని చీకటిగోతిలోనికి త్రోసిరట. ఈ కథయే ఋగ్వేదములో "త్రితఆప్త్య" కథగ చెప్పబడియున్నది. ఇదిగాక, శాయనులవారు "శాట్యాయను"ల కథను చెప్పియుండిరి, ఏకత, ద్విత, త్రిత, — అను ముగ్గురు అన్నదమ్ములుగలరట; మొదటియిద్దరుకలిసి మూడవవాడగు"త్రిత" ను చీకటిగోతిలోనికి త్రోసిరట. వా డచ్చుటపడి మొరపెట్టుకొనుచుండగ బృహస్పతివచ్చి వానిని పైకిలేవదీసెనట. ఋగ్వేదమందు ఏకత-యను పేరులేదు. కాని, ద్విత, త్రిత,-ల

పేర్లుగలవు. త్రిత- అనగ, మూడవవాడని యర్థము. ఈ 'త్రిత'కు "ఆప్త్య"—నీటిలోబుట్టినవాడు, లేక నీటిలోనుండువాడు- అను విశేషణము వేదమందుగలదు. ఈతడు, వృత్రవధయందు యింద్రమరుత్తులకు సహాయముచేసెనని ఋగ్వేదము పలుతావులలో చెప్పుచున్నది. ఇదిగాక, యీతడొక కూపమందు పడినట్లును, యీతని మొరవిని, బృహస్పతివచ్చి, పైకితీసి కాపాడినట్లును ఋ I, 105, చెప్పుచున్నది. ఈ సూక్తమందలి వర్ణనను బట్టి యీ "త్రిత" యను నాతనికి జ్యోతిర్దేవతలతో సంబంధమున్నట్లును, దురదృష్టవశమున చీకటిలో పడియున్నట్లును తెలియుచున్నది. త్రితయొక్క నివాసస్థానము, విష్ణుని తృతీయపాదమువలెనే, యెవరికిని గానరాకుండ రహస్యముగ నున్నదని IX, 102, 2 చెప్పుచున్నది. ఈకథనే తూచినట్లుగ పారశీగ్రంథముకూడ చెప్పుచున్నది. ఇంకొక విశేషమేమనగ "త్రైతన" (అనగ, త్రిత) అధోలోకమందు రాక్షసునితో పోరాడునప్పుడు తన అన్నల నిద్దరిని కూడ వెంటబెట్టుకొని వచ్చెనట. ఇదిగాక, ప్రాచీనమగు ఐరిషు భాషయందు "త్రియత్" అనగ సముద్రమని అర్థముగలదు; ఇదికూడ మన సిద్ధాంతమునే సూచించుచున్నది.

పండితలోకమునకు ఉత్తరధ్రువసిద్ధాంతము తెలియనందున, యీకథయొక్క భావార్థము వారికి గోచరముకాలేదు. ఈదేవతకు "త్రిత" (మూడవవాడు) అను సంఖ్యావాచకనామ మేలకలిగెనో పండితులు గ్రహింపలేకపోయిరి.



కావున, త్రితశబ్దము తప్పనియు, "తృత"శబ్దమే అసలు సరియైన మాటయనియు మాక్సిముల్లరుపండితు డూహించుచున్నాడు. "తృత"శబ్దము, "తౄ=దాటుట"యను ధాతువునుండి యుత్పన్నమగును. కనుక, "తృత"యనగ, సముద్రమును దాటుచున్న సూర్యుడని మాక్సిముల్లరు పండితు డూహించుచున్నాడు. (దీనిని, "తరణి"యను సూర్యనామముతో పోల్పవచ్చును.) దీనివలన, నిత్యమును సముద్రమందు గ్రుంకుచుండు సూర్యుడు సూచింపబడుచున్నాడని మాక్సిముల్లరుగారి యభిప్రాయము. "త్రిత"యొక్క నివాసస్థానము అంతులేని గాఢాంధకారపూరితముగ నున్న ఆ సముద్రమే యనియు (అనారంభణం తమస్) దీనినుండియే అత్రి, వందన, మొదలగు జ్యోతిర్దేవతలు నిత్యమును బయటికి వచ్చుచుందురనియు మాక్సిముల్లరుగారు వ్రాసియున్నారు. ఈ వాక్యములో — "నిత్యమును" — అను ఒక్కమాటను తీసివేసినచో సర్వమును మాకు అంగీకారమే. ధ్రువసిద్ధాంతము తెలియనందున మాక్సిముల్లరుగారు గురికి ఒక నూలువాసి తప్పిపోయిరి. సంవత్సరమును మూడుభాగములుగ చేసినచో, మూడవభాగము ధ్రువమండలమందు దీర్ఘరాత్రిగ నుండును. దీనినే ఒక దేవతగ పోల్చినచో యీదేవతకు "త్రిత" యను నామము సార్థకమగును. తదుపరి వర్ణనమంతయు తూచినట్లు సరిపోవును. ఈ సంఖ్యావాచకనామము ఒక్క వేదమందే గాక, పారశీక, గ్రీకు, ఐరిషు గ్రంథములలో సైతమున్నప్పుడు

దీనిని తప్పనుట బహుసాహసము. ఒకానొక శబ్దములో నంతర్గర్భితమైయున్న భావార్థము బోధపడనప్పుడు మహా పండితులుసైత మెన్నిపాట్లు బడవలసివచ్చునో దీనినిబట్టి మనము గ్రహింపవచ్చును. మాక్సిముల్లరుగారికి యీ ధ్రువ సిద్ధాంతకీలక మేమాత్రమైన తెలిసియున్నచో వారిట్టి సాహస మున కొడిగట్టవలసిన పనియుండెడిది కాదు.

—: ఆపః :—

దివ్యజలమునుగూర్చి చెప్పవలసిన దంతయు నిదివరకే చెప్పియుంటిమి. కనుక, యీజలదేవతయొక్క స్వరూపస్వభావముల నిచ్చట క్లుప్తముగ మరియొకసారి వివరించెదను. క్షితిజముక్రిందనున్న అధోలోకము తలక్రిందుగ బోర్లించిన పాత్ర వలెనున్నది. ఇది జలపూరితమును, గాఢాంధకారపూరితమును నై యున్నది. కనుక, దీనికి అంతులేని చీకటి ప్రదేశమనియు, అడుగులేని సముద్రమనియుపేర్లు వచ్చెను. ఈసముద్రము చుట్టును పర్వతపంక్తి యొకటిగలదు. తిర్య గూర్ధ్వ లోకములను వేరుబరచురాతిగోడగ యీపర్వత పంక్తినెంచవచ్చును. ఈపర్వతపంక్తిలో కొన్నిబిలములుగలవు. వృత్రు డీసముద్ర మందుండి తనదేహమును పెంచి, యీబిలముల నన్నిటిని మూసివేయుటచే, దీనిలోని నీరు పైకిప్రవహింపక, అందే నిర్బంధింపబడిపోయెను. అంతట, యింద్రుడు వచ్చి, వృత్రుని సంహరించి, యీకొండబిలములను ఖాళీచేయుటచే లోపల నున్ననీరు యీవలికివచ్చి ఊర్ధ్వముఖముగ ప్రవహించెను.



ఈరీతిగ, కొండలతోడను, చీకటితోడను నిండియున్న యీ యధోలోకసముద్రము రాక్షసులకును, దుష్టగ్రహములకును, నివాసస్థానమయ్యెననియు, ఇదియే దేవదానవుల (చీకటి, వెలుతురుల) యుద్ధరంగ మయ్యెననియు, వృత్ర, భుజ్యు, సప్తవధ్రి, త్రిత—గాథలవలన తెలియుచున్నది. సూర్య, అగ్ని, విష్ణు, అశ్విన, త్రితాది జ్యోతిర్దేవతలు తమ వార్షికసంచారమందీ సముద్రజలములలో కొంతకాల ముండవలసివచ్చెననియు కూడ తెలియుచున్నది. విష్ణు డీసంద్రమందే నిద్రించెను; యీసంద్రమునుండియే సప్తదివ్యవాహిను లూర్ధ్వముఖముగ ప్రవహించి తమవెంట సప్తసూర్యులను పైకిగొనిపోయి ధ్రువ మండలమందున్న ఆర్యులకు యేడుమాసముల సూర్యరస్మిని గల్పించి, పిమ్మట మరలివచ్చి యీసంద్రమందే గలిసెను. ఈవిధముగ, గగనమార్గమున ప్రవహించు దివ్యజలవాహినుల నుండియే భూప్రజలకు వర్షముగలిగి ఓషధులు మొలచెను. ఈ సముద్రము పశ్చిమమునుండి తూర్పునకు వ్యాపించి పాతాళమందున్న మూడులోకములను నింపుచున్నది. కొండ గోడలమధ్యనున్న యీసంద్రమందే వృత్రుడు ఆవులను బంధించెను. ఇదియే యమ, వరుణుల రాజ్యము; ఇందే పితరులు నివసింతురు. పైనున్న భూమ్యాకాశము లేరీతిగ ౩, ౭, ౧౦, లోకములుగ విభజింపబడియున్నవో, యీయధోలోక సముద్రముకూడ అదేరీతిగ ౩, ౭, ౧౦, విధములుగ విభజింపబడియున్నది.

వైదికగాథలయొక్కయు, వీనినిబట్టి తదుపరి బయల్వెడలిన పౌరాణికగాథలయొక్కయు నిజమగు భావార్థమును తెలిసికొనగోరినచో యీదివ్యజలములయొక్క నిజమైన స్వరూపస్వభావములను చక్కగ తెలిసికొనుట యెంతయో ఆవశ్యమైయున్నది. దీని నిజస్వభావము తెలియనిచో ఆగాథలన్నియు అయోమయముగ దోచును. వేదమందు పేర్కొనబడిన యీ దివ్యజల లక్షణములనే యిటీవల మనవారు భూమిపైనున్న సముద్రజలముల కంటగట్టిరి. సముద్రమును వర్ణింపుచు భర్తృహరి మహాయోగి యీ లక్షణములనే పేర్కొని యున్నాడు.

భర్తృహరి:- నీతిశతకం: పరోపకారపద్ధతి:-

శ్లో॥ ఇతః స్వపితి కేశవః కులమిత స్తదీయ ద్విషా
మితశ్చ శరణార్థినాం శిఖరిణాం గణాః శేరతే
ఇతోఽపి బడబానలః సహసమ స్తసంవర్తకై
రహోవితతమూర్జితం భరసహంస సిన్ధోర్వపుః॥

చ॥ ఒకయెడఁ బవ్వళించు హరి ♦ యొక్కయెడన్
[ వసియించు రాక్షస
ప్రకరము లొక్కచో నడఁగుఁ ♦ బర్వతసంఘము
[ లొక్కెడన్ బలా
హకములతోడ నుండు బడ ♦ బాగ్నియు విస్తృత
[ మూర్జితంబునన్
ప్రకటభరక్షమం బగుచు ♦ భాసిలు నార సముద్ర
[ మెంతయున్॥



తా॥ సముద్రము తనయందొక్కచోట విష్ణుని, ఒక్కచోట రక్కసులను, ఒక్కచోట పర్వతసమూహమును, ఒక్కచోట బడబానలంబును వహించియున్నది; ఆహా! దీని మహాత్త్వమెంత గొప్పదైనది. ఇందు పేర్కొనబడిన ప్రతిలక్షణమును మనము పైనవివరించిన దివ్యజలసముద్ర లక్షణముల మీదనే యాధారపడియున్నది. యూరోపియన్ భాషలలో సముద్రమునకు "ఓషన్" అని పేరుగలదు. ఈశబ్దము "ఆశయాన"– కప్పుచున్న, – ప్రపంచమును చుట్టియున్న– అను సంస్కృతమూలమునుండియే పుట్టినది. "ఓకేనస్" అను గ్రీకుశబ్దముకూడ దీనితో సమానార్థకమైయున్నది. దివ్యజలము ప్రపంచమునంతను చుట్టియున్నదను భావము వేదమందు ప్రసిద్ధమేగద. ఈదివ్యజలలక్షణమే మనమామూలు సముద్రమునకుకూడ — అంటగట్టుటచే సముద్రమునకు — ప్రపంచమును చుట్టివచ్చునట్టి— పేరువచ్చెను. వైదికగాథలకన్నిటికిని యీదివ్యజలమే మూలాధారముగాన, యీ జలదేవత వైదికదేవతలందు మిక్కిలి ప్రధానమైనదిగ గ్రహింపబడుచున్నది. దీనికున్న నిజకారణ మిదియే.

—* సప్త, దశవిధ విభాగములు *—

భూమ్యాకాశములును, పాతాళమును ౩, ౭, ౧౦ విధములుగ విభజింపబడియున్నదని పైన వివరించితిమి. ప్రాచీన యాజ్ఞికులు తమ యజ్ఞములను ౭, ౯, ౧౦ నెలలో పూర్తి చేయుచుండిరి. వైదికవాఙ్మయమందును, తదితర ఆర్యసంత

తుల ప్రాచీన గ్రంథములందును సప్తవిధవిభాగము సర్వసాధారణముగ గన్పట్టుచున్నది. ఈ విభాగములు పలురీతులుగ గన్పట్టుచున్నవి. కనుక, యీ విభాగములకు సంబంధించిన యంశములనెల్ల నిచ్చట క్రోడీకరించి, యేసూత్రముపై యీవిభాగములు చేయబడినవో పరిశోధింపవలసియున్నది. వీనిలో సప్త, దశ, విభాగములు ప్రధానములుగ గన్పట్టుచున్నవి. కనుక వేదవాఙ్మయమందీ విభాగము లెంతవరకు వ్రాకియున్నవో చూతము.

సూర్యుడు:– సూర్యునకు యేడు గుఱ్ఱములు గలవు. (సప్తాశ్వ) V, 45, 9. సూర్యరథమునకు యేడు చక్రములు గలవు. యేడు గుఱ్ఱము లీరథమును లాగుచున్నవి; లేక యేడు పేర్లుగల ఒక గుఱ్ఱమే యీరథమును లాగుచున్నది I, 164, 3. సూర్యరథమునకు యేడు హారితములు గలవు– I, 50, 8. అంతేగాక, సూర్యరథమునకు పది గుఱ్ఱములు కట్టబడినవి — IX, 63, 9. సంవత్సరదేవతయొక్క చక్రమును పదిగుఱ్ఱములు లాగుచున్నవి. — I, 164, 14. మరియు, సూర్యరథమునకు యెనిమిదిచక్రములు (అష్టా-చక్ర) గలవని అథర్వవేదము XI, 4, 22 చెప్పుచున్నవి.

ఇంద్రుడు:– ఇంద్రునకు "సప్త-రశ్మి" యను బిరుదు గలదు II, 12, 12; అతని రథముకూడ "సప్త-రశ్మి" యేనట– VI, 44, 24. కాని, మరియొకచోట యింద్రుని రథమును పది తెల్లగుఱ్ఱములు లాగుచున్నవని చెప్పిరి– V, 33, 8.



ఇంద్రుడు "క్రొత్త పదియవవాడు" (దశమం నవం) అని VIII, 24, 23. చెప్పుచున్నది. ఇంద్రుని ఆత్మ పది విధములుగ చరింపుచున్నదని (ఇంద్రస్య ఆత్మానం దశధా చరంతం) తైత్తిరీయ ఆరణ్యకము III, 11, 1 చెప్పుచున్నది. వెరెత్రఘ్ను (వృత్రఘ్ను) ని యొక్క దశావతారములు పారశీగ్రంథమందు పేర్కొనబడియున్నవి. ఇంద్రభక్తులలో "దశద్యు" అను నాతడు కలడు– I, 33, 14; VI, 26, 4. దశోణి, దశమాయా, యనువార లద్యోతనకు లొంగునట్లు ఇంద్రుడు చేసెనని VI, 20, 8 చెప్పుచున్నది. ఇంద్రుడు సోమరసమును త్రాగినప్పుడు అతనివెంట దశోణ్య, దశశ్రిప – యను వారలుకూడ కలరు. VIII, 52, 2.

సోమ, పూషన్:— వీరికి ౫ కిరణములును, ౭ చక్రములును గలవు. II, 40, 3. సోమునకు ౧౦ కిరణములుగలవు రశ్మయః–IX, 97, 23.

అగ్ని:– అగ్నికి సప్తరశ్మియనిపేరు గలదు (I, 146, 1) అతనికిరణములు యేడని II, 5, 2, స్పష్టముగ చెప్పుచున్నది. అతని గుఱ్ఱములకు యేడు నాలుకలు గలవు. III, 6, 2. మరియు, అగ్ని "దశప్రమతి" యని I, 141, 2. చెప్పుచున్నది. X, 51, 3 లో అగ్నియొక్క రహస్యస్థానములు పది పేర్కొనబడినవి. కనిష్ఠుడగు అగ్నికి (నవిష్ఠాయ) "నవమం" లేక తొమ్మిదవవాడు–అను విశేషము V, 27, 3 లో గలదు.

ధీతులు:— యాజ్ఞికులొనర్చు ప్రార్థనలు లేక ధీతులు యేడని IX, 8, 4 చెప్పుచున్నది. కాని, I, 144, 5 లో వాని సంఖ్య పదియని చెప్పబడినది.

ఆహారపదార్థములు:— ఇవి యేడని III, 4, 7 చెప్పుచున్నది. కాని, I, 122, 13 లో వాని సంఖ్య పదియని గలదు. హవిస్సు పదివిధములుగ చేయబడునని శత॥ బ్రా॥ I, 8, 1, 34, చెప్పుచున్నది.

హోత్రులు:— ఏడ్గురు (III, 10, 4; IV, 2, 15; X, 63, 7.) విప్రులు యేడ్గురు. (III, 7, 7) కాని, III, 39, 5 లో దశగ్వుల సంఖ్య పదిగ చెప్పబడినది. తై॥ బ్రా॥ II, 2, 1, 1; II, 2, 4, 1—లో హోత్రుల సంఖ్య పదిగ చెప్పబడినది.

బృహస్పతి:— ప్రథమయాజ్ఞికుడు: ఇతనికి "సప్తాస్య" డను బిరుదు IV, 50, 4 లో గలదు. అథ॥ వే॥ XX, 88, 4 కూడ యీబిరుదునే యిచ్చుచున్నది. కాని, బృహస్పతి దశాస్యుడనియు, దశశీర్షుడనియు అథ॥ వే॥ IV, 6, 1 చెప్పుచున్నది. "మనపితరుడు" సప్తశీర్ష్ణిభక్తిని లేక జ్ఞానమును (ధీ) సంపాదించెనని X, 67, 1 చెప్పుచున్నది.

భూమి:— భూమియొక్క యేడుభాగములు I, 22, 6లో గలవు. కాని, X, 94, 7 లో భూములు పదియని (దశావని) చెప్పబడియున్నది.

గోశాలలు:— అశ్వినులు తెరచిన గోశాలలు 'సప్తాస్య' ములని (X, 40, 8) చెప్పుచున్నది. కాని, దశవిధగోశాలలు



(దశవ్రజ) VIII, 8, 20; 49, 10; 50, 9 — లలో పేర్కొనబడినవి.

రాజులు:— అర్యమన్, మిత్ర, వరుణ, రుద్ర, మరుత్త పూషన్, భగ, —— యను యేడ్గురు రాజులు X, 93, 4—లో పేర్కొనబడిరి. కాని, బంగారమువలెనున్న పదిమంది రాజులను (హిరణ్యసందృశ) VIII, 5, 38 పేర్కొనుచున్నది. పురాతన దేవతలు పదిమందియే యని అథ॥ వే॥ XI, 8, 10 - చెప్పుచున్నది. VII, 83, 7—లో యజ్ఞములు చేయని (అయజ్యవః) పదిమంది రాజులు పేర్కొనబడిరి. అర్యముని వివిధరూపములలో (విషు-రూపేషు) సప్తహోత్రియని చెప్పబడుచున్నాడు X, 64, 5.

పై పట్టికనుబట్టి చూచినచో సప్త, దశ, విధవిభాగములు ప్రతివస్తువునందును ప్రధానముగ గన్పట్టుచున్నవి. ఈ సప్త, దశ, విభాగములేగాక భూమ్యాకాశపాతాళముల యొక్క త్రివిధవిభాగమును, దేవతలయొక్క యేకాదశ విధ విభాగమునుగూడ మనము గమనింపవలసియున్నది. మరియు, అధర్వవేదము XI, 7, 14—లో తొమ్మిది భూములు, తొమ్మిది సముద్రములు, తొమ్మిది ఆకాశములు పేర్కొనబడియున్నవి. అధర్వశీర్ష —— ఉపనిషత్తు —— ౬ లో కూడ యీ నవవిధ విభాగము గన్పట్టుచున్నది. ఈ పలువిధ విభాగములయొక్క భావార్థమేమో యాస్కాచార్యాదిపండితులు వివరింపరైరి. భూమ్యాకాశపాతాళములను బట్టి త్రివిధ విభాగములను

సమర్థించినను తక్కిన ౭ మొదలు ౧౧ వరకు నున్న పలువిధ విభాగములను సమర్థించు టెట్లు? వీని కర్థమేమి? యే సూత్రాధారముచే యీ విభాగములు గావింపబడినవి? లేక, యేసూత్రము ననుసరింపక యే తలకొకవిధముగ చేసినారా? నవగ్వ, దశగ్వ, సప్తహోత్రుల చరిత్రలవలన మన కీసూత్రము కొంతవరకు గోచరించుచున్నది. సూర్యుని గుర్రము లొకప్పుడు యేడనియు, మరియొకప్పుడు పదియనియు, చెప్పుటచే ధ్రువమండలమందలి యేడుమాసముల సూర్యరశ్మి యొకప్పుడును, పదిమాసముల సూర్యరశ్మి మరియొకప్పుడును సూచింపబడుచున్నవి. ఇదేరీతిగ, తక్కిన వివిధ విభాగములన్నియు ధ్రువమండలమందున్న ౭, ౮, ౯, ౧౦, ౧౧, నెలల సూర్యరశ్మిని సూచించుచున్నవి. ప్రాచీనార్యులు కాపురమున్న ధ్రువమండలములో అక్షాంశభేదములనుబట్టి కొన్నిప్రదేశములలో ౭ నెలల సూర్యరశ్మియుండెను; మరికొన్నిచోట్ల ౮ నెలల సూర్యరశ్మియుండెను; మరియు, ౯, ౧౦, ౧౧ నెలల సూర్యరశ్మియున్న ప్రదేశములుకూడ గలవు. అంగిరసులలో నవగ్వ, దశగ్వులు, ప్రధానశాఖలనుటచేతను, సూర్యునకు సప్తాశ్వనామము ప్రముఖమైన దగుటచేతను, ధ్రువమండలమందు, ౭, ౯, ౧౦, నెలల సూర్యరశ్మియున్న ప్రదేశములే మన యార్యులకు ప్రధాన నివాసస్థానములుగ నుండెననియు, తక్కిన, ౮, ౧౧ నెలల సూర్యరశ్మియున్నచోట్లంత ప్రధానమైనవి గావనియు మనము గ్రహింపవచ్చును.



ఆర్యులొక్క ధ్రువముమీదనే కూర్చునియుండక, ధ్రువమండలమంతటను వ్యాపించియున్నారనుటకు X, 27, 15, సాక్ష్యమిచ్చుచున్నది. ౭, ౮, ౯, ౧౦ "వీరులు" క్రిందినుండియు, పైనుండియు, ముందునుండియు, వెనుకనుండియు, లేచుచున్నారని యీఋక్కు చెప్పుచున్నది మరియు, యింద్రుడు ముందు, వెనుక, క్రింద, పైన, నున్న జనులచే పూజింపబడుచున్నాడని VII, 4, 1 చెప్పుచున్నది. ఈరెండుఋక్కులును ఒకేభావమును దెలుపుచున్నవి. యాజ్ఞికులయొక్క సప్త, అష్ట, నవ, దశ, యేకాదశ, విధ విభాగములు ధ్రువమండలమందంతటను వ్యాపించియున్నవని దీనినిబట్టి తెలియుచున్నది. ఆయాప్రదేశములలో సూర్యరశ్మిగల మాసములసంఖ్యను బట్టి, ఆయాప్రదేశములం దీరీతిగ ప్రతివస్తువునందును వివిధ విభాగములు చేయబడెనని స్పష్టమగుచున్నది. ఈఒక్క సూత్రముపైననేతప్ప, యింకొకవిధముగ యీపలుతెరగులగు విభాగములను సమర్థించుటకు వీలులేదు. కనుక, యింతకంటె మంచిసూత్రము నెవరైనను చూపించువరకు మన సిద్ధాంతమే యంగీకార్యముగాక తప్పదు.

### —• పదిమందిరాజులు; రావణుడు •—

బంగారువంటిరాజులు పదిమందియు (VIII, 5, 38) యజ్ఞములచేయని రాజులు పదిమందియు (VII, 83, 7) గలరని ఋగ్వేదము చెప్పుచున్నది. దివోదాస అతిథిగ్వుని కుమారుడగు సుదాసుడనువాడు యజ్ఞములుచేయని యీపది

మంది రాజులతో యుద్ధము చేసెననియు, యీ యుద్ధమం దాతనికి యింద్రవరుణులు తోడ్పడిరనియు ఋ VII, 33, 3-5; 83, 6-8-చెప్పుచున్నది. దీనికే "దశరాజ్ఞ" యుద్ధమని పేరు. సుదాసు డీయుద్ధమందు తనపురోహితుడగు వశిష్ఠునిద్వారా యింద్రసహాయమును బడసెనట. దీనినిబట్టి, ఆర్యులు మొదట ఆర్యావర్తమునకు వచ్చినప్పు డిచ్చటనున్న ఆదిమనివాసులతో చేసినయుద్ధము సూచింపబడుచున్నదని కొందరు పండితు లూహించుచున్నారు. కాని, నాకిదిసమంజసముగగన్పట్టుటలేదు. ఇంద్రుడు అంధకారరాక్షసులతో చేసినయుద్ధమే (X, 120, 6) యీరీతిగవర్ణింపబడినదని నాతాత్పర్యము. సప్తదాసులనుసంహ రించినసందర్భమందును, వృత్రునిసప్తపురములను నాశనమొన ర్చినసందర్భమందును ఇంద్రునకు "సప్తహన్"యను బిరుదు గలిగెను. ఇంద్రునిచే భేదింపబడిన గాఢాంధకారము (లేక అధోలోకము) ఒక్క యేడువిధములుగానే గాక, పదివిధ ములుగకూడ విభజింపబడియున్నదని యిదివరకే మనముపైన వివరించితిమిగద. ఇంద్రునకు సప్తవిధవిభాగముపై "సప్తహాన్" అను బిరుదుగలిగినప్పుడు, దశవిధవిభాగముపై యింద్రునకు "దశహాన్" అను పేరేల యుండకూడదు? ఇంద్రునకు "దశహాన్" యను పేరు ఋగ్వేదమందు ప్రత్యక్షముగ లేక పోయినను, యీ దశరాజ్ఞయుద్ధముయొక్క భావార్థమీ "దశ హాన్" నామమునే సూచింపుచున్నదని నాతాత్పర్యము. ఇంద్రశత్రువులలో, దశమాయు, దశోణి యనువారలు గలరు.



వీరినామములు దశసంఖ్యావాచకములుగ నున్నవి. కనుక, దశసంఖ్యావాచకనాములగు నీరాక్షసులను సంహరించిన యింద్రునకు "దశహాన్" అను పేరు సార్థకమే యగును. (దీనికి సప్తహాన్ అను పేరే సాదృశ్యము.) అయజ్వులగు దశ రాజులతో బాటు, బంగారువలె ప్రకాశించుచున్న పదిమంది రాజులు సైతము పేర్కొనబడిరి. ధ్రువమండలమందు సూర్య రశ్మిగల పదినెలల కధిదేవతలగు దశాదిత్యులే యీరీతిగ వర్ణింపబడిరనుటలో సందేహములేదు. ఈపదిమంది బంగారు రాజులును యాజ్ఞికుల కివ్వబడిరట. అనగ, ప్రాచీనయాజ్ఞి కులు యజ్ఞములుచేయుచుండిన పదినెలలు సూచింపబడు చున్నవి ఇంద్రునిచే రక్షింపబడినవారిలో "దశద్యు"—పది విధములుగ ప్రకాశించు వాడొకడు గలడు. ఈయంశముల నన్నిటిని క్రోడీకరించి పరీక్షించినచో, యింద్రశత్రువులగు అంధకారరాక్షసులు యేడుతెరగులుగనే గాక, పదివిధములుగ గూడ వర్ణింపబడియున్నారని తెలుచున్నది. అయజ్వులగు పదిమందిరాజులతో పోరాడుచున్న, సుదాసున కింద్రుడు తోడ్పడెననగ మరల మనయెప్పటికథయేవచ్చుచున్నది. అనగ, దశవిధములుగ విభజింపబడిన అంధకారరాక్షసులతో యిం ద్రుడు పోరాడుచున్నాడని తాత్పర్యము.

రాజశబ్దము క్షత్రియులకేగాక, అంగిరసులకుకూడ ప్రయోగింపబడియున్నది. (I, 139, 7) దీనినిబట్టి, "హిరణ్య సందృషులగు పదిమందిరాజులు," దశహోత్రులు, దశవిధాం

గిరసులు, పదినెలలు యజ్ఞమొనర్చు పదిమంది దశగ్వులు,—
యీశబ్దములన్నియు సమానార్థకములగును. బృహస్పతి
అంగిరసులలో ప్రధానుడు. ఈతడు సప్తాస్యుడనియు, దశా
స్యుడనియు, దశశీర్షుడనియు, ఋగ్వేదము చెప్పుచున్నది.
వృత్రాసురుని రాతిగోడలను పగులగొట్టి, అందు బంధింపబడి
యున్న ఆవులను యీబృహస్పతియే విడిపించెనని ఋగ్వేదము
చెప్పుచున్నది. బృహస్పతి భార్యనెవరో యెత్తికొనిపోగా
దేవతలామెను మరల బృహస్పతి కిప్పించిరని X, 109, చెప్పు
చున్నది. పోయిన ఉషఃకాలము (భార్య) మరల మానవులకు
(బృహస్పతికి) గన్పట్టుటయే యీరీతిగ వర్ణింపబడినది. ఇం
ద్రుడు అహల్యాజారుడని (అహల్యాయై జారః) తైత్తిరీయ
ఆరణ్యకము I, 12, 3, 4 చెప్పుచున్నది. ఈకథ సూర్య,
ఉషస్సులకు సంబంధించినదని కుమారిల భట్టాచార్యులవారు
చెప్పియుండిరి. అహల్య గౌతమఋషి (చాల ఆవులుగలవాడు)
భార్యయని యిటీవలి సంస్కృతవాఙ్మయమందు పేర్కొనబడి
యున్నది. కనుక, అహల్య కథ ఉషస్సునకు సంబంధించిన
కథయేయనుట స్పష్టము. ఈ కథయే యింకొక విధముగ
X, 109 లో "బ్రహ్మజాయా" కథగ వర్ణింపబడియున్నది.

ఈ సందర్భమున, రామాయణములోని ప్రధానాంశ
ములు కొన్నిజ్ఞప్తికి వచ్చుచున్నవి. రామాయణమునకు ఐతి
హాసిక (Historical) మూలాధారమేమైన కలదాయని
విచారించుట మనపనికాదు. రామాయణములో ప్రతిచిన్న



విషయమును మిక్కిలి విపులముగ వర్ణింపబడియుండుటచే,
దీనికేదో ఐతిహాసికాధారముండియే తీరవలెనని గన్పట్టు
చున్నది. అయినను, రావణునకు పదితల లెట్లువచ్చెను ? ఇట్టి
వికృతపుమానిసి ఐతిహాసిక పురుషు డెట్లగును ? మరియు,
శ్రీరాముని తండ్రికి దశ-రథుడు (పదిరథములు గలవాడు)
అను పేరెట్లువచ్చెను ? కనుక, రామాయణ గ్రంథకారుడు
వైదికగాథలలోనున్న కొన్నియంశములను తీసికొనివచ్చి,
అసలుమూలమునందు ఐతిహాసికముగనున్న ప్రధానాంశము
లతో సమ్మిళితమొనర్చి యీరామాయణకథ నల్లెనని తెలి
యుచున్నది. ఇంద్రశత్రువులలో దశోణి, దశమాయ యను
వారలు గలరనియు, దశరాజ్ఞయుద్ధమందు సుదాసుడు అయ
జ్వులగు పదిమంది రాక్షసరాజులతో పోరాడవలసివచ్చెననియు
ఋగ్వేదము చెప్పుచున్నది. వేదమందు పేర్కొనబడిన
యీ పదిమంది రాక్షసరాజులే రామాయణమందు పది
తలలు గలిగిన ఒక్కరావణుడుగ వర్ణింపబడియున్నాడు.
దీనికి సాదృశముగ, అంగిరసులలో ప్రధానుడగు బృహ
స్పతి దశాస్యుడనియు, దశశీర్షుడనియు, వేదమందే గలదు.
మరియు, రావణునితమ్ముడు కుంభకర్ణుడు సంవత్సరములో
ఆరునెలలు యెడతెగక నిద్రపోవుచుండుననుటచే ధ్రువమండల
దీర్ఘరాత్రి సూచింపబడుచున్నది. రావణుడు దేవతలనందరిని
బందిఖానలో బంధించియుంచెననియు, తదుపరి శ్రీరాముడు
వారలను విడిపించెననియు, రామాయణము చెప్పుచున్నది.

ఇదేరీతిగ, గ్రీకులుకూడ, తమ దేవతలందరు శీతకాలమందు బందిఖానలో బంధింపబడుదురనియు, వేసవికాలములో విడుదలయగుదురనియు తలంచుచున్నారు. దీనినిబట్టికూడ, ధ్రువమండల దీర్ఘరాత్రియే సూచింపబడుచున్నది. రామాయణములో పేర్కొనబడిన హనుమంతు డెవరు? ఈతనికి కోతి పేరెట్లువచ్చెను? శరద్విషువత్ వద్ద దీర్ఘరాత్రిలో బడిపోవుచున్న సూర్యునకు "వృషాకపి" యను పేరు ఋగ్వేదమందు గలదని నేనిదివరకు "మృగశీర్ష" యను గ్రంథమందు వివరించియున్నాను. ఈ దీర్ఘరాత్రిలో పడబోవుచున్న సూర్యుడగు "వృషాకపి"యే రామాయణమందు హనుమంతుడుగ వర్ణింపబడి యుండవచ్చును. హనుమంతుడు సూర్యగ్రహణ కాలమందు పుట్టెననుటచే యీ యూహకు కొంత బలము చేకూరుచున్నది. "ఓ! సీతా! (నాగేటిచాలా!) భక్తునిపై సర్వసంపదల ననుగ్రహింపుము" — అని ఋగ్వేదము IV, 57, 6-7-లో నొక ప్రార్థనగలదు. వేదములో చెప్పబడిన యీ నాగేటిచాలే, — లేక సీతయే — రామాయణమందు నాగేటిచాలులో పుట్టిన సీతాదేవిగ వర్ణింపబడి యున్నది. సీతాదేవి భూమినుండియే పుట్టెను; తుదకు భూమిలోనికే చొచ్చుకొని పోయెను.

ఉత్తరధ్రువమండలమందు దీర్ఘరాత్రి గడచినపిమ్మట—అనగ, చాలకాలమునకు—ఉషస్సు మనుష్యులకు గన్పించును. ఉషస్సును స్త్రీతో పోల్చిరి. అంగిరసులలో ప్రధానుడగు



బృహస్పతియే యీస్త్రీకిభర్తగ పోల్చబడెను. ఉషస్సు మానవులకు చాలకాలమైనపిమ్మట గన్పడుననను అంశమునే యెత్తుకొని,—బృహస్పతి తనభార్యను గోల్పోయెననియు, పిమ్మట కొంతకాలమున కామె యీయనవద్దకువచ్చి గలిసెననియు—ఒకకథగ వేదమందు వర్ణించిరి. బృహస్పతిభార్యను (అనగ, ఉషస్సును) తిరిగి తెచ్చుటకే యింద్రుడు దశరాజ్ఞయుద్ధ మొనర్చెను. వైదిక గాథలలోనున్న యీయంశములనే యెత్తుకొని తమ ప్రధానైతిహ్యములతో సమ్మిళిత మొనర్చి వాల్మీకులవారు రామాయణకథగను, 'హోమర్' అను గ్రీకుపౌరాణికుడు "ఇలియడ్" కథగను అల్లియుండిరి. "ఇలియడ్", "రామాయణ" గ్రంథములరెంటికిని మూలమొక్కటే. అందుచేతనే, యీ రెండు కథలకును పోలికచాల కలదు. గ్రీకులును, భారతీయులును, తదితర ఆర్యసంతతులును ఉత్తరధ్రువమండలమందు కలిసి కాపుర మున్నప్పుడు వారికి స్వానుభవ గోచరమైన—ఉషారూపియగు భార్య మరల తన భర్తను పొందుటయును—సృష్టిచమత్కారమే యీరెండు మహాగ్రంథములకును మూలాధార మయ్యెనని చెప్పవచ్చును. అంతియేగాని, కొంద రనుకొనునట్లు, వాల్మీకులవారు రామాయణకథను ఇలియడ్ గ్రంథమునుండి కాపీచేయలేదు.

బౌద్ధగ్రంథమగు "దశరథజాతకము" లో సీత రామునకు చెల్లెలని చెప్పబడియున్నది. దీనిభావమేమి? సూర్యుడు ఉషారూపియగు స్త్రీకి సోదరుడుగను, భర్తగనుకూడ వేదము

లందు పోల్పడి యున్నాడు. ( VII, 75, 5; VI, 55, 4; X, 3, 3): బుద్ధునకు పూర్వమందు కొందరు శ్రీరాములవారిని సూర్యునితో పోల్పయత్నించినందువలన, సీత (అనగ ఉషస్సు) శ్రీరామునకు (అనగ, సూర్యునకు) చెల్లెలను భావ మీ బౌద్ధ గ్రంథములలోని కెక్కియుండవచ్చును.

దశావతార కథకూడ ఋగ్వేదమందు పేర్కొనబడిన "హిరణ్య సందృషు" లగు పదిమంది రాజులకును లేక అధర్వవేదమందు పేర్కొనబడిన పదిమంది దేవతలకును, లేక పారశీగ్రంథమందు పేర్కొనబడిన "వెరెత్రఘ్న" ని పదియవతారములకును సంబంధించియే యున్నది. పారశీ గ్రంథమందు పేర్కొనబడిన దశావతారము లేమనగ:- (౧) గాలి (౨) ఎద్దు (3) గుఱ్ఱము (కల్కి) (౪) ఒంటె (౫) పంది (వరాహము) (౬) యువకుడు (వామనుడు) (౭) కాకి (౮) పొట్టేలు (౯) లేడి (౧౦) మనుష్యుడు (రాముడు). వీనిలో 3, ౫, ౬, ౧౦ అవతారములు మన కల్కి, వరాహ, వామన, రామావతారములను బోలియున్నవి. ఇటీవలి పురాణములలో పేర్కొనబడిన మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, వామన, రామావతారములకు కొంచ మించుమించుగ ఋగ్వేదమే మూలమని చెప్పవచ్చును. కాని, వీని నన్నిటిని విపులముగ పరిశీలించుట మనపనికాదు. ఈ విషయము నెత్తికొన్నచో నిది ప్రత్యేక మొక మహాగ్రంథ మగును గాన దీని నింతటితో వదలివేయుదము. నే నింతవరకు



వైదిక, పౌరాణికగాథలనుగూర్చి యీ గ్రంథమందు సూచించి వదలివేసిన యంశములనెల్ల మరల ప్రత్యేకముగ నెత్తికొని, వానిని ధ్రువసిద్ధాంతముపై సమన్వయింపబూనినచో నిది యొక మహాగ్రంథమగును. ఇది బహు కష్టసాధ్యమైనపని. దీని కెంతయో మోపికయుండవలెను. అదిగాక, మన ప్రస్తుతాంశమున కిది సంబంధింపదు; గనుక దాని నిట వదలివేయుదము.

ఇంతవరకు మన సిద్ధాంతమును ధ్రువపరుచు గాథలను పరిశీలించి చూచితిమి. ఇట్టివే మరి యింక యెన్నియో గలవు. ఉదాహరణ:- మిత్రావరుణులు పరస్పరసంబంధము గల దేవతలని చెప్పబడిరి. మిత్రుడు ౬ నెలల దీర్ఘదివసమును, వరుణుడు ౬ నెలల దీర్ఘరాత్రమును సూచించుచున్న వారగుటచే వారు పరస్పరసంబంధముగల దేవతలనుట సహజముగనే యున్నది. మరియు, వరుణుడు "రాత్రులను కౌగలించుకొనుచున్నాడ"ని (క్షపః పరిశస్వజే) ఋ VIII, 41, 3 చెప్పుచున్నది. అనగ, వరుణుడు దీర్ఘరాత్రిని సూచించు దేవతగనున్నాడు. మేఘ, ఉషస్సిద్ధాంతములచేగాని, వసంతసిద్ధాంతముచేగాని, సమన్వయింపబడజాలని పెక్కుగాథలను మన ధ్రువసిద్ధాంతము సరళముగ సమన్వయింపగలిగినది. వృత్రవధ సంవత్సరమున కొక్కమా రేలజరుగునో, వృత్రవధవలన జ్యోతిర్జలముల కేకకాలమందే బంధమోక్షణమెట్లు గలిగెనో, శంబరాసురయుద్ధము శరదృతువు నలుబదియవ తిథి నాడేల

ప్రారంభమయ్యెనో, యీ యుద్ధము "పరావత్" మండల మందేల జరిగెనో, దీర్ఘతముడు పదియవ "యుగ"=(మాస) మందేల అశక్తు డయ్యెనో, అదితి తన యెనిమిదవ కుమారు డగు మార్తాండు నేల పారవేసెనో, "త్రిత" యేల గోతిలో పడెనో, విష్ణుని తృతీయపాద మేల మనకు గాన్పింపదో — యీ మొదలగు గాథలనెల్ల వసంత, మేఘ, ఉషస్సిద్ధాంతములు సమన్వయింపజాలకపోయెను. కాని, మనధృవసిద్ధాంత మీగాథలనే గాక, ఇంక పెక్కింటినిసైతము సంతృప్తికరముగను, సరళముగను, సమన్వయింపగలినది. వృత్ర,సప్తవధ్రి,అదితి,దీర్ఘతమ, సూర్యచక్రాది గాథలలోనున్న కొన్ని ప్రత్యక్షవాక్యములచే ధ్రువమండల మందలి ౭, ౧౦ మాసముల సూర్యరశ్మిగల ప్రదేశములు సూచింపబడుచున్నవి. ఇప్పటివరకు, మహాపండితు లందరిచే దుర్గ్రాహ్యములుగ వదలివేయబడిన యెన్నియో యంశముల నింతసరళముగ సమన్వయింపగలిగిన యీ ధ్రువసిద్ధాంతము నందరంగీకరింపక తప్పదు. ఇంతమాత్రముచే యిదివరకున్న వసంత, మేఘ, ఉషస్సిద్ధాంతములను పూర్తిగ త్రోసివేయవలెనని నేను చెప్పను. నేను చెప్పుసంగతి యేమనగ:— ఇప్పటివరకు దుర్గ్రాహ్యములుగ పండితు లందరిచే వదలివేయబడిన వైదికగాథలనేమి, వైదికపరంపరలనేమి, తదితరాంశములనేమి, పెక్కింటిని, మా ధ్రువసిద్ధాంతము చక్కగ సమన్వయింపుచున్నది. మరియు, వైదికగాథలకు భావార్థములను దీయుటలో మా ధ్రువసిద్ధాతతము మీ వసంత, మేఘ,



ఉషసిద్ధాంతము లన్నింటికంటె యెన్నియో మడుంగు లెక్కువ శక్తిసామర్థ్యములు గలదని ఘంటాపథముగ చెప్పగలము. మా ధ్రువసిద్ధాంతమును ఋజువుపరచుటకు యీ ఒక్క వైదికగాథాప్రమాణములే చాలును. దీనికితోడు ఋగ్వేదమునుండి ప్రత్యక్షవాక్యములను, స్వతంత్రప్రమాణములనుకూడ యిదివరకే చూపియున్నాము. ఇదిగాక, అర్వాచీన భౌతిక పండితులు నేటివరకొనర్చియున్న భూగర్భ, భూనిక్షేపపరిశోధనలవలన కూడ యీ ధ్రువసిద్ధాంతము ఖండితముగ ఋజువగుచునే యున్నది. ఇన్నిప్రమాణములచే ఋజువైన సిద్ధాంతమును పండితలోక మంగీకరింపదా? శాస్త్రప్రమాణములకును, హేతువాదమునకును, బద్ధులైయున్న పండితులెల్ల రీసిద్ధాంతము నంగీకరింపకుండ తప్పించుకొనలేరు.



# వైదికనిలయము

పదునొకండవ అధ్యాయము.

## అవైస్థిక ప్రమాణము.

(పారశీక వేదప్రమాణము.)

ధ్రువసిద్ధాంతమును స్థాపించుటకు మన మిదివరకు వైదికప్రమాణములతో పాటు పారశీకుల వేదమునుండికూడ అచ్చటచ్చట ప్రమాణముల నెత్తి చూపించి యున్నాము. భారతీయులకు వేదమెంతప్రాచీన గ్రంథమో, పారశీకులకు అవైస్థికగ్రంథముకూడ అంతప్రాచీనమును, మాన్యమునైనదని మనము గ్రహింపవలెను. వైదిక, అవైస్థికగ్రంథము లొక్క మూలమునుండియే పుట్టియున్నవి. వీనిని మన ఆర్యసంతతికి ప్రాచీనధనమైన కవలగ్రంథములుగ నెన్నవచ్చును. ఈ రెండు గ్రంథములును అన్యోన్యపూరకములుగ నున్నవి. కాన, వేదములో లేని యంశములను అవైస్థిక గ్రంథమునుండియు, అవైస్థికగ్రంథములో లేని యంశములను వేదమునుండియు గ్రహింపవచ్చును. దీర్ఘరాత్రులు, దీర్ఘఉషస్సు, మొదలగు ధ్రువమండల సృష్టిచమత్కారములనుగూర్చి చెప్పు ప్రత్యక్ష వాక్యములును, గాథలును, పెక్కులు మన భారతీయుల



వేదమందు గానవచ్చుచున్నవి, ఆర్యుల ధ్రువనివాసమును గూర్చిగాని, తదుపరి వా రేయే కారణములచే తమ మూల స్థానమును వదలివేసి దక్షిణాపథములకు లేచివచ్చిరో స్పష్టముగ దెలియజెప్పు వాక్యములుగాని, గాథలుగాని, మన భారతీయవేదమందు లేవు. కాని, మన యదృష్టవశమున పారశీకుల అవైస్థికవాఙ్మయమం దీలోపము పూర్తిచేయబడినది. ఇదివర కచ్చటచ్చట నుదాహరించియున్న అవైస్థిక ప్రమాణములనుబట్టి పారశీకుల పూర్వజులకు కూడ ఆరు మాసముల రాత్రింబవళ్ళనుగూర్చియు, మూడుమాసముల దీర్ఘరాత్రిని గూర్చియు, దివ్యజలసంచారమును గూర్చియు పూర్తిగ తెలియునని స్పష్టమగుచున్నది. భారతీయవేదమందు పేర్కొనబడిన యీ ధ్రువమండల లక్షణములేగాక, ఇందు లేని మరికొన్ని ప్రధానాంశములుకూడ పారశీకుల అవైస్థిక గ్రంథమం దెక్కువగ గానవచ్చుచున్నవి. ఉత్తరధ్రువమండల మందలి ప్రాచీన మూలస్థానమును గూర్చి అవైస్థికగ్రంథ మెక్కువ విపులముగ వర్ణించియున్నది. ఆ ప్రదేశమందు మొట్టమొదట ఆర్యులు కాపురమున్నప్పు డచ్చటి శీతోష్ణాది పరిస్థితు లెట్లుండెనో, తదుపరి యెట్లు మారెనో, యేకారణముచే మారెనో, అంతట ఆర్యు లామూలస్థానమును వదలివేసి యేయే దేశములకు లేచివచ్చిరో — యీ మొదలగు అంశములన్నియు పారశీక వేదమందు స్పష్టముగ పేర్కొనబడియున్నవి. పారశీక వేదవాఙ్మయమందు ధర్మశాస్త్రముగ [illegible]

బడుచున్న "వెండిడాడ్" గ్రంథముయొక్క మొదటి రెండధ్యాయములును మన కీసందర్భమున చాల యుపకరింపుచున్నవి.

మొదటి యధ్యాయములో:— పారశీక దేవుడైన "అహూరా-మజ్డా"యను దేవుడు ౧౬ దేశములను సృజించెనట. మానవులకు నివాసయోగ్యమైన భూములను దేవు డిట్లు సృజించుకొనుచు పోగా, దుష్టస్వభావుడగు "అంగ్రమైన్యు" డను రాక్షసు డీభూములకు ఉపద్రవములను గల్పించి మానవు లచ్చట నివసించుటకు వీలులేకుండ పాడుచేయుచుండెను.

దేవుడుచేసిన సృష్టులను, రాక్షసు డొనర్చిన ప్రతిసృష్టులను దెలుపు నీ ప్రక్క పుటలోని పట్టీలో వివరింపబడిన ఆ పదునారుభూములలో కనీసము పదింటినైనను మన మిప్పటికిని నిజమైన దేశములుగ గుర్తింపవచ్చును. కనుక, యివి పుక్కిటి పురాణములని త్రోసివేయుటకు వీలులేదు. కాని యాపట్టీలో మొట్టమొదటి దేశమైన "ఐర్యనవైజో" యను నది నిజమైనదేశమా లేక పుక్కిటిపురాణమా యను విషయమై పండితులు భిన్నాభిప్రాయులై యున్నారు. (ఐర్యన=ఆర్యుల యొక్క; వైజో=(సం) బీజము.) ఐర్యనవైజో యనుట ఆర్యుల మూలస్థానమని దాని పేరే చెప్పుచున్నది. కాని యిది నిజమైన దేశమైనచో యిది యెచ్చటనున్నదో మనము నిర్ణయింపవలసియున్నది. ఇది మొదటివిషయము. ఇక, రెండవ విషయమేమనగ, యీ పదునారుదేశము లిట్లు పేర్కొనబడుట కర్థమేమి? ఆర్యులు తమ మూలస్థానమును వదలిపోసిన

దేవుడుచేసిన సృష్టులను, రాక్షసు డొనర్చిన ప్రతిసృష్టులను తెలుపు పట్టీ.

| వరుస సంఖ్య | దేవుడు సృజించిన మంచి భూములు. | అవైదికపండితుల నిర్ణయ ప్రకారము ఇప్పటి పేర్లు. | అంగ్రమైన్యుడను రాక్షసు డొనర్చి యుపద్రవములు. |
|---|---|---|---|
| ౧ | ఐర్యన వైజో | ? | అతిచలి, మంచు. |
| ౨ | సుగ్ధ | సామర్ ఖండ్ | జోరీగలు, కందిరీగలు. |
| ౩ | మోరు | మర్వ్ | పాపభూయిష్ఠమగు కామాంధత. |
| ౪ | బాక్ధీ | బాల్క్ | పెద్దచీమలు; క్రూరమృగములు, |
| ౫ | నిసాయ | ? | అవిశ్వాసము. |
| ౬ | హరోయు (సంస్కృతం:శరయు) | హీరట్; (హరినదీ ప్రాంతము) | దోమలు; దారిద్ర్యము. |
| ౭ | వైకెరెట | కాబూల్, లేక సెగస్థాన్ | (వైరికాస్ ?) |
| ౮ | ఉర్వ | కాబూల్, లేక ఇసఫన్ ప్రాంతము | అశుచి; గర్వము; రాజులక్రౌర్యము |
| ౯ | ఖెంటు | గుర్ జాన్, లేక కంధహార్ | అస్వాభావికమైన పాపము. |
| ౧౦ | హరస్వతి (సరస్వతి) | హరూట్ | శవములను భూస్థాపనచేయుట. |
| ౧౧ | హైతుమంత్ (సేతుమత్) | హెల్ మెండు | మిడతలు; దుష్టమాంత్రికులు. |
| ౧౨ | రఘ | రై | అవిశ్వాసము; నాస్తికత. |
| ౧౩ | చక్ర | కొరసాన్‌లో నొక పట్టణము ? | శవదహనము. |
| ౧౪ | వరేణ (వరుణ) | ఘిలాన్ ( ? ) | విదేశస్థుల నిరంకుశపరిపాలన. |
| ౧౫ | హప్తహిందు (సప్తసింధు) | పంజాబు | అత్యుష్ణము. |
| ౧౬ | రంఘ (రసా) | కాస్పియన్ సముద్రము; లేక మెసపొటేమియా: అర్వస్థాన్-ఇ-రూమ్-? | శీతలము; భూకంపము. |

పిమ్మట యీ దేశములగుండ క్రమముగ సంచారమొనర్చుచు వచ్చిరని యర్థమా? లేక, యీ గ్రంథరచనా కాలమునాటికి పారశీకులకు తెలిసిన భూములన్నియు నీవిధముగ పేర్కొనబడి యున్నవని మాత్రము అర్థమా? ఈవిషయమై కూడ పండితులు భిన్నాభిప్రాయులై యున్నారు. ఆకాలమునాటికి పారశీకులకు తమ దేశములలోనున్న యీ పదునారు భూములు మాత్రమే తెలియుననియు, కాన వారు వాని నిచ్చట వివరించిరనియు, వానిలో మొట్టమొదటిది యగు "ఐర్యనవైజో" యను భూమి వారికి తెలిసినంతవరకు తూర్పు సరిహద్దుగను, చిట్టచివరిదియగు "రంఘ" యను భూమి పడమటి సరిహద్దుగను నుండెననియు కొందరు పండితులు తలంచుచున్నారు. దీనినిబట్టి పారశీక దేశమునకు తూర్పు సరిహద్దున నున్న "ఆకససు," "జక్సార్టిసు" నదుల మూలస్థానమే "ఐర్యనవైజో" యనబడవలెను. మరియు, పారశీకదేశమునకు పశ్చిమ సరిహద్దుననున్న మెసపొటేమియా దేశమే పదునారవది యగు "రంఘ" దేశమగును— ఇది కొందరి పండితుల మతము. కాని, మరికొందరి మతమేమనగ:— ఆర్యులకు మూలస్థానమైన "ఐర్యనవైజో" యను భూమి చాల ఉత్తరమున నున్నదనియు, కారణాంతరములచే ఆర్యులీభూమిని వదలివేసి, దక్షిణాభిముఖులై క్రమక్రమముగ యీ పదునారు భూముల గుండ దాటివచ్చుచు, తుదకు "రంఘ" యను దేశమునకు చేరిరనియు మరికొందరు పండితులు తలంచుచున్నారు. ఈ



దృష్టితో చూచినచో "సుఘ్ద" (సామర్ ఖండ్) మొదలు "హాప్త — హిందు" (పంజాబు) వరకు గల పదునాల్గు భూములును ప్రాచీన పారశీకులు కాలక్రమమున తమమార్గమందు దాటుచు వచ్చిన భూములై యుండవలెను. ఈ రెండు మతములలో నేది సత్యమైనదో మన మిప్పుడు నిర్ణయింపవలసియున్నది. ఈనిర్ణయమంతయు "ఐర్యనవైజో"యొక్క స్థానమును స్థిరపరుచుటపై పూర్తిగ ఆధారపడియున్నది. కనుక, మన మిప్పుడీ "ఐర్యనవైజో" యొక్క స్థలమును నిర్దేశింతము.

ఐర్యనవైజోను వర్ణించు సందర్భమున "వెందిదాదు" గ్రంథమందు "ఐర్యనంవైజో వంఘుయావో దాయిత్యయో" యను వాక్యముగలదు. (వంఘుయావో = మంచి) దీనికి "డార్మెస్టటర్" యను పండితుడు "మంచినదియైన దాయిత్య నది ప్రక్కనున్న ఐర్యనవైజో" — అని అర్థముచేసెను. ఈ "దాయిత్య" నదికే "వంగుహి" నదియను పేరుకూడ గలదని యీపండితుడు తలంచుచున్నాడు ఈ "వంగుహి" యను పేరిటీవల పారశీకదేశమునకు తూర్పుకొననున్న యొకానొక నదికి చెందియుండుట తటస్థించెను. కనుక, దానిప్రక్కనున్న ఐర్యనవైజో యనుభూమికూడ పారశీకదేశమునకు తూర్పుకొనయందే యుండితీరవలెనని, యీపండితునిమతము. కాని, దీనికి రెండు, మూడభ్యంతరములు గలవు. (౧) అసలు వాక్యములో నున్న "దాయిత్య" శబ్దమునకు "నది" = (River) యను అర్థమగునో కాదో సందేహాస్పదము.

ఈవిషయమై తక్కిన పండితులు భిన్నాభిప్రాయులై యున్నారు. (౨) ఒకవేళ, "దాయిత్యా" యనగ 'నది'యే యని యొప్పుకొన్నను, దీనికి "వంగుహి" యను యింకొక పేరేల వచ్చెనో డార్మెస్టటర్ గారు చెప్పలేదు. ఈ పదములు రెండును రెండుభిన్ననదులయొక్క పేర్లని యింకొక గ్రంథమందు చెప్పబడియున్నది. అదిగాక, వంగుహినదియొక్క పేరు అసలువాక్యములో మందునకైన లేనేలేదు. (3) ఒకవేళ, అసలువాక్యమందున్న "దాయిత్యా" శబ్దమే "వంగుహి" నదిని దెలుపుచున్నదని యొప్పుకొన్నను పారశీకదేశమునకు తూర్పుకొనయందు ప్రవహింపుచు నిటీవల "వంగుహి" యను నామకరణ మొనర్పబడిన యీనదియొద్దుననే ప్రాచీనమూలస్థానమగు "ఐర్యనవైజో" గలదని వాదించుటసాహసము. ఏలయనగ, ప్రజలు క్రొత్తదేశములకు వలసబోయినప్పుడు తమప్రాతదేశములోనున్న ప్రాతపేర్లనే యీక్రొత్తదేశమందలి క్రొత్తవస్తువులకు పెట్టుచుండుట ఆచారమైయున్నది. ఉదాహరణము:- ఇంగ్లాండునుండి కొందరు ప్రజలు మొట్టమొదట అమెరికాదేశమునకు వలసబోయినప్పుడు అచ్చటనున్న కొన్ని ప్రదేశములకు "ఇంగ్లండు" అని నామకరణ మొనర్చిరి! అట్లయినచో, "ఇంగ్లండు" అమెరికాఖండమం దున్నదని చెప్పవలసినదేనా ? అట్లే "వంగుహి" యను నది ప్రాచీన గాథలలోనున్న దివ్యజలవాహిని పుక్కిటిపురాణములలో (గాథలలో) నున్న యీ "వంగుహి" నామమునే, ఇటీవల



పారశీకులు క్రొత్తగ పారశీకదేశమునకు వలసవచ్చినప్పుడు అచ్చట తూర్పుకొనను పారుచున్న యొకానొకనదికి పెట్టిరి. అంతమాత్రముచే అతిప్రాచీనమూలస్థానమగు యీ "ఐర్యనవైజో" యను భూమి, ప్రాతపేరుతో క్రొత్తగ నామకరణ మొనర్పబడిన యీ తూర్పునదియొద్దుననే యున్నదని చెప్పవచ్చునా ? అదిగాక, ఐర్యనవైజో లో "రంఘ" యను దివ్యవాహిని గలదని పార్శీగ్రంథము చెప్పుచున్నది. "రంఘ" యను ఒక నది పారశీకమునకు పశ్చిమకొనయందు పారుచున్నది. అట్లయినచో, "ఐర్యనవైజో"ను తీసికొనిపోయి పారశీకదేశమునకు పశ్చిమకొనయం దేలపెట్టకూడదు ?

లోగడ వివరించిన పట్టీలో "రంఘ" యను భూమి చిట్టచివరిది. పారశీకదేశమునకు పశ్చిమకొనయందు పారు నొకానొక నదికి యిటీవల "రంఘ" యను పేరుండెను. కనుక, యీ పట్టీలోని "రంఘ" యను భూమికూడ పారశీకమునకు పశ్చిమకొనయందున్న మెసపొటేమియా యనియో, లేక కాస్పియన్ సముద్రమనియో డార్మెస్టటర్ గారు తలంచుచున్నారు. ఈ రీతిగ పట్టీలో మొదటనున్న "ఐర్యనవైజో"ను తీసికొనిపోయి పారశీకమునకు తూర్పుకొనయందును, చివరనున్న "రంఘ"ను తీసికొనిపోయి పశ్చిమకొనయందును డార్మెస్టటర్ గారు పెట్టుచున్నారు. "రంఘ" యనునది ప్రాచీన పారశీక గ్రంథములందు దివ్యజలవాహినిగనున్నది. ఇదియే పంజాబులోనున్న సింధునదియొక్క యుపనదియైన

"రసా" నదిగ ఋగ్వేదమందు పేర్కొనబడియున్నది. కనుక, యీ "రసా" నది భూమిమీద పారు నేరుగకూడ ఋగ్వేదమందు గలదు. దీనినిబట్టి, "రంఘ" యను భూమి పంజాబునకు దగ్గరగనుండి యుండవలెను. పూర్వోత్తర సందర్భములను బట్టి చూచినను యీ యూహాయే యెక్కువ సమంజసమైనదిగ గన్పట్టుచున్నది. ఏలయనగ, పై పట్టీని పరిశీలించి చూచినచో యీ "రంఘ" యను ౧౬ - వ. భూమి, ౧౫-వది యగు "హప్త-హిందు" లేక పంజాబునకు ప్రక్కనేయున్నట్లు స్పష్టము గాగలదు. కనుక, "రంఘ" భూమిని తీసికొనిపోయి పారశీకమునకు పశ్చిమకోనయందు పార వేయుట సమంజసముకాదు. ఈవిధముగ, ప్రాచీననామములతో యిటీవల నామకరణ మొనర్పబడిన నదులపేర్లనుబట్టి డార్మెస్టటర్ పండితుడు "ఐర్యనవైజో"యొక్క స్థలనిర్దేశమును చేయబూనుట చాల తప్పుపద్ధతి. ప్రాచీనార్యుల మూలస్థానము ఉత్తరభూములలో నుండజాలదను సాంప్రదాయకాగ్రహమును (Prejudice) మనస్సులందునుపెట్టుకొని పనిచేయుటచే డార్మెస్టటర్ వంటి పండితులు తప్పుత్రోవల త్రొక్కవలసివచ్చెను. ఐర్యనవైజో యొక్క శీతోష్ణాది పరిస్థితులను మిక్కిలి విపులముగ, కండ్లకు గట్టినట్లు, వర్ణింపుచున్న ప్రత్యక్షవాక్యములే అవైదిక గ్రంథమందుగన్పట్టుచుండగ, యీపండితులు వానిని పుక్కిటిపురాణములని త్రోసివేసి, వానివంకనైనను చూడక, తమసాంప్రదాయకాగ్రహముచే రేపో వెర్రిముర్రియూహాలను మనస్సునందుపెట్టుకొని తమ స్వకపోలకల్పితములగు వట్టియంచనాలతో (Estimates) గాలిలో మేడలగట్ట యత్నించుటచే వీరందరు తలకొక త్రోవలోపడి ప్రాచీనగ్రంథములలో యిప్పటివరకు పరంపరలుగ భద్రపరుపబడియున్న సత్యమగు నైతిహాసికాంశములను కనిపెట్టలేక చీకటి పరువులు పెట్టుచున్నారు.



పారశీకులకు మూలస్థానమును, స్వర్గమును నైన ఐర్యనవైజో యను భూమి మొట్టమొదట సంతత వసంతసమయ సౌభాగ్యసంపదలతో తులదూగుచుండెననియు, తదుపరి కొంతకాలమునకు అంగ్రమైన్యుడను రాక్షసుడు వచ్చి యీ సౌభాగ్యమునంతను నాశనమొనర్చి, అతి చలిబాధను, మంచుగడ్డలను కల్పించి ఆస్థలము మానవ నివాసమునకు నిరుపయోగముగ జేసెననియు వందిదాదు గ్రంథముయొక్క ప్రథమాధ్యాయమందు స్పష్టముగ వర్ణించి యున్నారు. ఈ వర్ణనగల వాక్యమున కర్థముచెప్పుటలో పండితులు కొంతవరకు భిన్నాభిప్రాయులై యున్నను మొత్తము మీద పండితులందరీ క్రింది మూడంశములలో మాత్ర మేకీభవించియే యున్నారు.

(౧) దేవుడు మొట్టమొదట "ఐర్యనవైజో" యను మంచిభూమిని సృజించెను. (౨) కొంతకాలమైనపిమ్మట, అంగ్రమైన్యుడను రాక్షసు డీభూమిలో అతిచలిని, మంచును గల్పించెను. (3) అంగ్రమైన్యుని ప్రతిసృష్టివలన పదిమాసముల శీతకాలమును, రెండు మాసముల వేసవియు కలిగెను.

అంగ్రమైన్యుని ప్రతిసృష్టివలన ఐర్యనవైజోలోని పరిస్థితులు తలక్రిందై పదినెలల శీతకాలమును, రెండు నెలల వేసవియుగలిగెనని తెలియుచున్నది. కనుక, అంగ్రమైన్యుడీయుపద్రవమును గలిగింపక పూర్వము అచ్చటి పరిస్థితు లెట్లుండెనో మనము గ్రహింపవచ్చును. సంవత్సరములో పదినెలలు అహ్లాదకరమగు వేసవియు, రెండు నెలలుమాత్రమే శీతకాలమును నుండి యుండవలెను. అంగ్రమైన్యుడు వచ్చి దీనిని తలక్రిందుచేయుటచే ఐర్యనవైజో యందిప్పుడు పదిమాసముల చలిబాధయు, రెండు నెలల వేసవియుగలిగెను. ఈ వేసవిలోకూడ చెట్లు, చేమలు, నీరు, భూమి, సమస్తపదార్థములును చల్లగనే యుండెనని యీ వాక్యమందు గలదు. అనగ, యీ రెండు నెలల వేసవిలోకూడ చలియుండుటచే మనుష్యులు నివసించుటకు యోగ్యముగ లేకుండెను. ఇప్పుడు సంవత్సరము పొడవునను యీ రీతిగ చలియు, మంచు నుండు ప్రదేశము ధ్రువమండలముగాక మరి యేదేశము గలదు? ధ్రువప్రదేశమును స్పష్టముగ సూచించుచున్న యీ వర్ణనమును వదలివేసి పండితులు తమ స్వకపోలకల్పితములగు వట్టి యూహాలలో చిక్కుకొని పరిభ్రమించుచుండుట చాల విచారకరమైన సంగతి.

మొట్టమొదట ఐర్యనవైజోలో నున్న మంచి శీతోష్ణపరిస్థితులు కొంతకాలమున కెట్లు మారిపోయెనో అవైస్థికగ్రంథము చక్కగ వర్ణించియున్నది. ఈ వర్ణనమంతయు



పుక్కిటిపురాణమని పండితులు త్రోసివేసిరి. శీతోష్ణపరిస్థితులలో అసలిట్టి మార్పు జరుగుట కవకాశ మున్నదా యని పండితులు సంకోచించుచుండిరి. ఇట్టి మార్పు నిజముగ జరిగినదను నమ్మకము వారికి లేకపోవుటచేతనే స్వర్గతుల్యమగు ఐర్యనవైజోను తీసికొనిపోయి యిప్పుడు మంచుతో బిగుసుకొనిపోయియున్న యీ పాడుఉత్తరధ్రువమండలమం దెట్లు పెట్టుదుమా యని పండితులు సంశయించుచుండిరి. కాని, ౩౦, ౪౦, సంవత్సరములక్రింద చేయబడిన భూగర్భ, భూనిక్షేప పరిశోధనలవలన ధ్రువమండలమందలి శీతోష్ణపరిస్థితులొకప్పుడు సంతత వసంతసమయముగ నుండెననియు తదుపరి హిమప్రళయముచే ఆ మంచిపరిస్థితులన్నియు పూర్తిగ మారిపోయి యిప్పుడా ప్రదేశము మంచుగడ్డలతో పేరుకొనిపోయెననియు సిద్ధాంతీకరింపబడియున్నది. ఈరీతిగ భూగర్భశాస్త్రవేత్తలు నిన్నగాక మొన్న కనిపెట్టిన యంశమునే యెన్నియో వేలసంవత్సరములక్రిందట పారశీకులు తమ అవైస్థికగ్రంథమందు స్థిరాక్షరములతో భద్రపరచి యున్నారు. ఇట్టీయంశము అవైస్థిక గ్రంథమందు స్పష్టముగ వివరింపబడియున్నను పండితులు తమ సాంప్రదాయాగ్రహముచే దానిని నమ్మలేదు. కాని, ఆధునికభౌతికశాస్త్రవేత్తలే యీయంశమునిప్పుడు యథాశాస్త్రీయముగ ఋజువుపరచి యుండుటచే పండితలోకమిప్పటికైనను తమసంకోచములను, అనుమానములను, సాంప్రదాయకాగ్రహములను దూరముగ

నుంచి, హిమప్రళయమునకు పూర్వమందు నందనవనము వలె సంతత వసంతసమయసౌభాగ్యసంపదలతో తులదూగుచుండిన ధ్రువమండలప్రాంతమే పారశీకులపూర్వజులకు ఐర్యనవైజోయను స్వర్గతుల్య నివాసస్థానముగ నుండెననియు, తదుపరి అంగ్రమైన్యుడొనర్చిన శీతలోపద్రవమువలన – అనగ, హిమప్రళయమువలన–ఆప్రదేశము నివాసయోగ్యముగామిచే వారచ్చటనుండి లేచివచ్చిరనియు తెలిసికొందురుగాక. అవైస్థిక గ్రంథ మొనర్చిన అంగ్రమైన్యుని శీతలోపద్రవ వర్ణనమును, యిప్పటి భూగర్భశాస్త్రవేత్తలు యథాశాస్త్రీయముగ గనుగొనిన హిమప్రళయ వర్ణనమును తూచినట్లు, ఒకే రీతిగ, సర్వవిధముల సరిపోవుచున్నది. కనుక, అవైస్థిక గ్రంథ వర్ణనమును మనము నమ్మకపోవుట కేవలము అవివేకమేగాని వేరొండులేదు. ఈ వర్ణనప్రకారము ఐవ్యానవైజోయం దిప్పుడు సంవ్సరములో పదిమాసములు అతిచలియు, రెండుమాసములుమాత్రమే కొంచెము చలితోగూడిన వేసవియు నుండవలెను. ఇట్టి శీతోష్ణస్థితి యిప్పుడెచ్చటనున్నది?— ఉత్తర ధ్రువమండలమం దున్నది. కనుక, ఐర్యనవైజో కూడ ధ్రువమండలమందే యుండితీరవలెను. ఇందులకు సందేహ మింతమాత్రమును లేదు. దీనిని ధ్రువపరుచుటకు మన మిదివరకు చర్చించియున్న వైదిక గ్రంథప్రమాణములే ప్రబలసాక్ష్యములుగ నున్నవి. హిమప్రళయమునకు పూర్వము ఉత్తరధ్రువమందు సంవత్సరములో పదిమాసములు అహ్లాదకరమగు వేసవియు, రెండు మాసములు వెచ్చని



హేమంతమును — అనగ, మొత్తముపై సంతత వసంత సమయముగ — నుండెనని భూగర్భశాస్త్రవేత్తలు యథాశాస్త్రీయముగ నిర్ధారణచేసియున్నారు. అంగ్రమైన్యుడు రాకపూర్వ మీ “ ఐర్యనవైజో ” లో కూడ పదిమాసములు చక్కని వేసవియు, రెండుమాసములు శీతకాలము నుండి హాయిగనందనవలెను, స్వర్గతుల్యముగనుండెనని అవైస్థిక గ్రంథమువలన తెలియుచున్నది. దీనివలకూడ, సంతత వసంతసమయముగనున్న ధ్రువమండలమే పారశీకులకు ఐర్యనవైజో యను స్వర్గముగనుండెనని ఋజువగుచున్నది. ఉత్తర ధ్రువమండలమందు పదిమాసములు సూర్యరశ్మియు, రెండు మాసములు చలితోగూడిన దీర్ఘరాత్రియు గలదని మన మిదివరకే ఋజువుపరచియున్నాము. గవాం అయనం మొదలగు వార్షికసత్రములు పదిమాసములే జరిగెననియు, రోమక సంవత్సరములో పదిమాసములేయుండెననియుకూడ వివరించియున్నాము. కనుక, ఐర్యనవైజోలోనున్న పదిమాసముల వేసవికూడ వైదిక గ్రంథములోనున్న “ మానుషాయుగా ” యను పదిమాసములతో సరిపోవుచున్నది. ఇక, తిష్ట్ర్యి-అపోషల యుద్ధకాలమువలనను, శవమున కంత్యక్రియ లొనర్పకుండ శీతకాలములో, చీకటిలో, నెల, రెండు నెలలైనను యింటిలోనే పెట్టుకొనియుండవలెనని చెప్పుటచేతను, ఐర్యనవైజోలోనుండిన దీర్ఘరాత్రిస్థిరపడుచున్నది. మన మొకసారి ఐర్యనవైజోను తీసికొనిపోయి ధ్రువమండలమందు పెట్టిన

చున్నట అచ్చట దీర్ఘరాత్రియుండితీరవలెను. అది యిప్పు డున్న పదినెలల శీతకాలమధ్యమందు వచ్చుచున్నది. కాని, అంగ్రమయిన్యునకు పూర్వమం దీరార్ఘరాత్రి రెండు నెలల శీతకాలములోనే వచ్చియుండెను. ఇంతవరకు తేలిన సారాంశమేమనగ:— ఐర్యనవైజోయనుపారశీకుల స్వర్గము ఉత్తర ధ్రువమండలమం దుండెను. అంగ్రమైన్యుడు రాక పూర్వము — అనగ, హిమప్రళయమునకు పూర్వము — అచ్చట సం॥ లో పదినెలలు ఆహ్లాదకరమైన సూర్యరశ్మితో గూడిన వేసవియు, రెండునెలలు అతిచలిలేనిదీర్ఘరాత్రియు నుండెను. కాని, అంగ్రమైన్యు డొనర్చిన శీతలోపద్రవమువలన అచ్చట సంవత్సరములో పదినెలలు అతి చలియు, దానిమధ్య దీర్ఘరాత్రియు, రెండునెలలు చలితో కూడిన వేసవియు తటస్థించెను. ఈ దుర్భరపరిస్థితులే యిప్పటికిని ఉత్తరధ్రువమండలమం దున్నవి. ఇట్లీ భూమి హిమప్రళయముచే నిరుపయోగముగ చేయబడుటచే, ఆర్యులా స్వర్గమును, ఐర్యనవైజోను, వదలివేసి దక్షిణాభిముఖులై వెందిదాదునందు వర్ణింపబడిన ౧౬ భూములగుండ దాటివచ్చుచు, తుదకు "రంఘు" యను భూమివరకు (పంజాబుదగ్గరవరకు) వచ్చియుండిరి.

ఐర్యనవైజోలో యేడుమాసముల వేసవియు, అయిదు మాసముల శీతకాలముండెనని యింకొక ప్రాచీనైతిహ్యమొకటి "బుందహిష్" గ్రంథమందు గలదు. ఈ వాక్యమే



పైన చర్చించిన "వందిదాదు" వాక్యమునకు చేర్చబడియున్నది. ఈ యైతిహ్యముచే అంగ్రమైన్యునకు పూర్వమున్న శీతోష్ణస్థితి పేర్కొనబడి యున్నదనుట కెంతమాత్రమును సందేహము లేదు. ఇంతవరకు అంగ్రమైన్యుని యుపద్రవమునకు పూర్వమందు ఐర్యనవైజోలో నున్న శీతోష్ణస్థితిని దెలియపరుచు వాక్యములు రెండు దొరకినవి.

(౧) సంవత్సరములో పదినెలలు వేసవియు, ౨ నెలలు శీతకాలముండును. (అంగ్రమైన్యుని ప్రతిసృష్టిని తల క్రిందుచేసినచో యీ పరిస్థితి యేర్పడును.)

(౨) సంవత్సరములో యేడునెలలు వేసవియు, ౫ నెలలు శీతకాలముండును. ("బుందహిష్" వాక్యము; వందిదాదు ప్రథమాధ్యాయమందు చేర్పబడిన వాక్యము.)

ఒక్క ప్రదేశమందే యీ రెండు విధములగు పరిస్థితు లెట్లుండునని పండితులు భ్రమపడిరి. ఇవి పరస్పర విరుద్ధములని వారభిప్రాయపడిరి. కాని, ధ్రువమండలమందు అక్షాంశభేదములనుబట్టి కొన్నిచోట్ల ౭ నెలల సూర్యరశ్మియు, మరికొన్నిచోట్ల ౧౦ నెలల సూర్యరశ్మియు నుండుట అసంభవము గాదని మన మిదివరకే ఋజువుపరచియున్నాము. కాన, దీనిలో వింత యేమియు లేదు. ఋగ్వేదమందు సూర్యునకు యేడుకిరణములు గలవని యొకచోటను, పదికిరణములు గలవని ఇంకొకచోటను చెప్పినట్లే, అవెస్థిక వాఙ్మయమందు కూడ ఐర్యనవైజోలో వేసవి యేడుమాసము లుండెనని యొక

చోటను, పదిమాసములుండెనని యింకొకచోటను చెప్పబడియున్నది. పరస్పరవిరుద్ధములుగ గన్పట్టు యీవాక్యములచే ధ్రువమండలమందు ౨, ౧౦, మాసముల సూర్యరశ్మిగల భిన్నప్రదేశములు సూచింపబడుచున్నవి.

ఈరీతిగ ౨, ౧౦ మాసముల సూర్యరశ్మిగల భిన్నప్రదేశములను సూచించుటకింకొక ప్రమాణముగలదు. సంవత్సరములో ౮ వ నెల మొదటి తిథినాడు శీతకాలము ప్రపంచములో ప్రవేశించునని బుందహిష్ గ్రంథము చెప్పుచున్నది. ఈవాక్యము శంబరాసుర యుద్ధప్రారంభమును దెలుపు శరత్తు ౪౦ వ తిథితో (పదిదినము లెచ్చుతక్కువగ) సరిపోవుచున్నది. ఈశీతకాలము ౧౨ వ నెల ఆఖరువరకు నుండునని కూడ చెప్పబడియున్నది. దీనివలన యేడునెలల సూర్యరశ్మి సూచింపబడుచున్నది. ఇంకొకవిశేషమేమనగ:— పదియవనెల తొమ్మిదవతిథినాడు ఐర్యనవైజోలో శీతకాలము ప్రవేశించునని యీబుందహిష్ వాక్యమందేగలదు. అందువలన, ఆదినమందు ప్రతిచోటను మంటలువేయుదురని యీగ్రంథము చెప్పుచున్నది. శీతకాలప్రవేశమును సూచించుటకే యీమంటలు వేయబడుచున్నవి. దీనినిబట్టి ౯, లేక ౧౦ నెలల సూర్యరశ్మి సూచింపబడుచున్నది. ప్రాచీన రోమక సంవత్సరమందు పదిమాసములున్నట్లు, ప్రాచీనపారశీక సంవత్సరమందుకూడ ౯ నెలల ౯ దినములేయుండి యుండవచ్చును. ఈ బుందహిష్ వాక్యమువలన ధ్రువమండలములో ౨, ౧౦



మాసముల సూర్యరశ్మిగల భిన్నప్రదేశములు సూచింపబడుచున్నవనుట కొంతమాత్రమును సందేహములేదు. ఇంతవరకు జరిగిన చర్చనుబట్టి ఐర్యనవైజో యనుభూమి పారశీకమునకు తూర్పుకొనయందున్నదో, లేక ఉత్తరభూములలోనున్నదో — నిర్ణయమై పోయినది.

అంగ్రమైన్యుని ప్రతిసృష్టివలన ౧౦ నెలల శీతకాలమును, రెండునెలల వేసవియు వచ్చెనని వందిదాదుయొక్క ప్రథమాధ్యాయములో గలదు. దానిని మనము తలక్రిందుచేసి భగవంతుడు మొదటచేసిన సృష్టిప్రకారము ౧౦ నెలల వేసవియు, ౨ నెలల శీతకాలమునుండియుండవలెనని యూహించితిమి. కాని, యిట్టియూహతో పనిలేకుండగనే, అంగ్రమైన్యుడు రాకపూర్వమీ ఐర్యనవైజో యెంత మనోహరమగు స్వర్గముగనుండెనో వందిదాదుయొక్క ద్వితీయాధ్యాయమందే ప్రత్యక్షముగ వర్ణించియున్నారు. ఆప్రదేశము నందనవనమువలె సకలసౌభాగ్య సంపదలతో తులదూగుచుండెననియు, అందలిప్రజలు జరామరణవర్జితులై, బహుసంతానులై, సకలైశ్వర్య సంపన్నులై యుండిరనియు, వారందరికి "ఇమ" యను నాతడు రాజైతన ప్రజలను కన్నబిడ్డలవలె గాపాడుచు, న్యాయమార్గమున ప్రజాపరిపాలన మొనర్చుచుండెననియు యీద్వితీయాధ్యాయము విపులముగ వర్ణించుచున్నది. అంతయొకనాడు భగవంతుడీ "ఇమ" యను రాజును తనదేవసభకు రప్పించి, ముందుభూలోక స్వర్గమగు ఐర్య[illegible]పై

రానున్న హిమప్రళయమునుగూర్చి తెలియజెప్పి, యీయుపద్రవమునుండి భూప్రజను రక్షించుటకై రాజగు తా నొక భవనమును ( వర ) నిర్మించవలసినదనియు, అందు సమస్త జంతువులయొక్కయు, ఓషధులయొక్కయు బీజములను సంగ్రహించి యుంచవలసినదనియు హెచ్చరించెను. ఆ ప్రకారమే “ ఇమ ” రాజు “ వర ” ను నిర్మించెను. ఈ “ వర ” యందు “ సూర్యచంద్రనక్షత్రాదులు సంవత్సరమున కొకమారే యుదయించునట. ఈ “ వర ” లో నున్నవారికి సంవత్సరమొకదినముగ మాత్రమే గన్పించునట”! ఈ రెండును ఉత్తరధ్రువ లక్షణములుగాక మరియేమి ? దీనినిబట్టియైనను ఐర్యనవైజోను ధ్రువమండలమందే యుంచవలెను. వందిదాదుగ్రంథమును రచించిన పారశీకు లీ సృష్టిచమత్కారమును తముకండ్లార చూచియుండకపోవచ్చును. కాని, వీరిపూర్వజు లెప్పుడో యొకప్పు డీసృష్టిచమత్కారమును తమ కండ్లార చూచియే యుండవలెను. వారిట్లు కండ్లారచూచిన యంశమే వంశపరంపరగ, వ్యాప్తమైయిప్పటివరకు వచ్చియుండవచ్చును. ఇట్లుపారంపర్యముగ వచ్చినదానినే వందిదాదు గ్రంథకారులు తమగ్రంథమందు స్థిరాక్షరములుగ భద్రపరచియుండవచ్చును. ఈకారణములచే ఐర్యనవైజోను తీసికొనిపోయి పారశీకదేశమునకు తూర్పుకొనయందు పెట్టుటకువీలులేదు. అట్లయినచో ౧౦ నెలల శీతకాలమునుగాని, సంవత్సరమున కొకపారియే సూర్యచంద్రాదు లుదయించుటనుగాని సమర్థించుట కెంత



మాత్రమును వీలుండదు. కేవలముప్రాచీన గ్రంథములందున్న దివ్యజలవాహినులపేర్లతో యిటీవల క్రొత్తగ నామకరణమొనర్పబడిన నదులపేర్లనుబట్టి ఐర్యనవైజోకు స్థలనిర్దేశమును చేయబూనుట చాలతప్పుపద్ధతి అట్లయినచో, ఇప్పుడార్యావర్తమనబడుచున్న వింధ్యహిమాలయ మధ్యప్రదేశమే ఆర్యులకు మూలస్థానమని యేలచెప్పకూడదు ? కనుక, కేవలమిటీవల క్రొత్తగపెట్టబడిన పేర్లనుబట్టియే స్థలనిర్దేశ మొనర్పబూనుపద్ధతిని పూర్తిగ వదలివేయవలెను.

నందనవనమువలె నొప్పారుచుండిన ఐర్యనవైజో మీదికి హిమప్రళయ మెట్లురాబోవుచున్నదో భగవంతుడు ఇమరాజునకు తెలియజెప్పుచున్నాడు. చక్కని తమ దేశము మంచుచే నెట్లు పాడైపోయినదో ఆర్యులు తమ కండ్లార చూచినట్లే యీ ద్వితీయాధ్యాయమందు వర్ణింపబడియున్నది. ఈ వర్ణనమంతయు ఆధునిక భూగర్భశాస్త్రవేత్త యొకడు యథాశాస్త్రీయముగ జేసిన వర్ణనవలెనే యున్నది. ప్రపంచమంతయు మంచుగడ్డలతో పేరుకొనిపోవునట. మహోన్నత గిరిశిఖరములుకూడ కనీసము మూరెడెత్తు మంచులో మునిగిపోవునట. ఈ వర్ణనమింత ప్రత్యక్షముగను, యథాశాస్త్రీయముగ నున్నప్పుడు దీనిని పుక్కిటిపురాణమని త్రోసివేయజాలము. ఏప్రదేశమందైనను శీతోష్ణస్థితిలో నిట్టి విపరీతమైన మార్పులు గలుగుట అసంభవమని పండితులు గట్టిగ తలంచుటచే, యీ వర్ణనమంతయు పుక్కిటిపురాణమని త్రోసివేసిరి.

కాని, పూర్వ మొకప్పుడు ఉత్తరధ్రువమండలమందు సంతత వసంతసమయముగ నొప్పారుచున్న శీతోష్ణస్థితియుండెననియు, యీ స్థితి కనీసము రెండుసార్లు తటస్థించిన హిమప్రళయములచే పాడైపోయెననియు, గతించిన హిమప్రళయము క్రీస్తుకు పూర్వము షుమారు ౮ వేల సంవత్సరములకు పూర్వమందు తటస్థించెననియు అమెరికను భూగర్భశాస్త్రవేత్తలు మొన్న మొన్ననే (౩౦, ౪౦ సంవత్సరముల క్రిందట) నిర్ధారణ చేసియున్నారు. ఈ హిమప్రళయమే అంగ్రమైన్యుని శీతలోపద్రవముగను, భగవంతునిచే ముందురానున్నదని యమరాజునకు చెప్పబడిన హిమప్రళయముగను అవైస్థిక గ్రంథములం దెన్నడో వర్ణింపబడియున్నది. కాన, యిది నిజమైన చారిత్రకాంశమేగాని పుక్కిటిపురాణము గాదని పండితు లిప్పటికైనను గ్రహింతురుగాక. మన ప్రాచీనగ్రంథములలోని వర్ణనము లెంత స్పష్టముగ నున్నను వానిని నమ్మకపోవుట మనవారి కిప్పు డాచారమైపోయినది. ఇట్టి యపనమ్మకమే లేకపోయినచో ఐర్యనవైజోను పండితు లిదివరకే ధ్రువమండలమందు పెట్టియుందురు. నందన వనమువలె నొప్పారుచున్న తమ జన్మభూమి యిట్లు నాశనమైపోవుటచే, ఆర్యు లాప్రదేశమును విడిచిపెట్టక తప్పినది కాదు. ఆర్యులు స్వర్గతుల్యముగ నుండిన తమ జన్మస్థానమును వదలిపెట్టుట కిదియే కారణము గాని, కొందరనుకొనునట్లు, "పోటుచాలక" గాదు; "యేదోగుబులు"చే గాదు; వట్టి గుబులుచే స్వర్గతుల్యముగ నుండిన తమ జన్మస్థానము



నెవరైన వదలుదురా? ఇప్పటికి పదివేలసంవత్సరముల క్రిందట తమ దేశము మంచుచే పాడైపోవుటచే ఆర్యు లాదేశమును వదలివేసి దక్షిణాభిముఖముగ పయనమై రావలసినవారైరి. వారిస్లైల లేచివచ్చిరో— ఆకారణము— అవైస్థికగ్రంథములందు యెన్నడో లిఖితపూర్వకముగ భద్రపరుపబడియున్నది. ఈ వర్ణనము సత్యమైనదేయని నిన్నగాక మొన్ననే మన భూగర్భశాస్త్రవేత్తలు కనుగొనియున్నారు. ఆహా! వీరుకనుగొనక పోయినచో అవైస్థికవర్ణనమంతయు పుక్కిటిపురాణమేమై పోయెడిదిగదా!

దీర్ఘరాత్రులు, దీర్ఘదివసములు, దీర్ఘఉషస్సులు మొదలగు ధ్రువలక్షణములను దెలుపు నిదర్శనములు పెక్కులువైదికవాఙ్మయమందు గానవచ్చుచున్నను ఆర్యులాప్రదేశములలో నేకాలమందు నివసించిరో, యేకారణములచే అచ్చటనుండి లేచివచ్చిరో తెలియజెప్పు వాక్యమొక్కటియైనను మన వేదవాఙ్మయమందు గానరాదు. ఈలోపమును పూర్తిచేయుటకై మనము భూగర్భశాస్త్రపరిశోధనల నాధారము జేసికొంటిమి. ఇప్పుడుసదా మంచుతో గడ్డకట్టుకొనిపోయి మానవనివాసమున కనుపయోగముగనున్న యీధ్రువమండలమే, పూర్వమొకప్పుడు (పదివేలసంవత్సరములకుపైన)సంతత వసంతసమయసౌభాగ్య సంపదలతో తులదూగుచు మానవనివాసమునకత్యంతోపయుక్తముగ నుండెనని యీ శాస్త్రపరిశోధనలవలన ఋజువైనది. పదివేల సంవత్సరముల క్రిందటతట

స్థించినహిమప్రళయమునకు పూర్వమే ఆర్యులా ప్రదేశమందు కాపుర ముండియుండవలెను. గాని తదుపరి యుండియుండ జాలరు. ఈ యూహయే అవైస్థిక ప్రమాణమువలన ప్రత్యక్షముగ ఋజువైనది. దీనినిబట్టి (౧) ఐర్యనవైజోలో మొట్టమొదట మంచి శీతోష్ణస్థితి యుండెను; కాని, కొంతకాలమునకు అంగ్రమైన్యుడు వచ్చి దానియందు పదినెలలు అతిచలిని, ౨ నెలలు వేసవిని గల్గించి మానవులు నివసించుటకు వీలు లేకుండ పాడుచేసెను. (౨) ఐర్యనవైజోయందున్న "వర"లో సూర్యచంద్రాదులు సంవత్సరమున కొకమారే యుదయింతురు; సంవత్సర మొక దినముగ నుండును. (౩) నందనవనముగ నున్న యీ భూమి హిమప్రళయముచే మానవ నివాసమున కనుపయోగమయ్యెను. ఈరీతిగ పూర్వకాలమందు నిజముగ జరిగియున్న చరిత్రాంశములనే ఆర్యులు వంశపారంపర్యముగ తమ మనస్సులందు జ్ఞాపకముంచుకొని, యీనాటివరకు సంక్రమింపజేసిరి. కాని, యీ ప్రళయము నిజముగ జరిగి యెన్నియో వేల సంవత్సరము లగుటచే, పరంపరానుగతముగ వచ్చుచున్న యీయైతిహ్యముయొక్క నిజభావమును మాత్రము ప్రజలు మరచిపోయి, దీనిని మొన్నటివరకు పుక్కిటి పురాణముగనే తలంచుచుండిరి. కాని, మన అదృష్టవశమున, ౫౦, ౬౦ సంవత్సరముల క్రిందటచేయబడిన భూగర్భశాస్త్రపరిశోధనల వలన యీపరంపరానుగతమైన యైతిహ్యము సత్యమైన చరిత్రాంశమే యని స్థిరపడినది. ఈ విష



యమై యీశాస్త్రపరిశోధనలు లోకమునకు మహోపకార మొర్చినవనుటలో సందేహము లేదు. మనమతగ్రంథములలో పరంపరానుగతముగ భద్రపరుబడియున్న యైతిహ్యములయొక్క సత్యాసత్యముల నింత ఖండితముగ ఋజువుచేయగల ఆధునిక భౌతికశాస్త్రపరిశోధన లింకను పెక్కులుగావింపబడవలసియున్నవి. ఇంతవరకుచేసిన పరిశోధనలు బహుకొద్దిగ మాత్రమున్నవి. ఇవిచాలవు.

మన మిప్పుడు ఐర్యనవైజోయొక్క స్థలనిర్దేశమును పూర్తిగ చేసియున్నాము. కనుక, వందిదాదు గ్రంథముయొక్క ప్రథమాధ్యాయములో వరుసగ పేర్కొన బడిన ౧౬ దేశములయొక్క భావార్థమేమో మన మిప్పుడు సరళముగ నిర్ణయింపవచ్చును. ప్రాచీన మూలస్థానమగు ఉత్తర ధ్రువమండలమునుండి ఆర్యులు దక్షిణాభిముఖముగ బయలుదేరి తమ మార్గమందు దాటుచు (పంజాబువరకు) వచ్చిన భూములే యీ పదునారుభూములైయున్నవి. ఆర్యులీ దేశములగుండ వచ్చినారని "వందిదాదు" నందు ప్రత్యక్షముగ చెప్పియుండనిమాట వాస్తవమే; చెప్పవలసిన అవుసరమును లేదు. ఏలయసగ, ఐర్యనవైజో ఉత్తర ధ్రువమండలమందున్నదనియు, అది మంచుచే పాడైపోయి, మానవనివాసమున కనుపయోగమై పోయినదనియు చెప్పినప్పుడు ఆర్యులచ్చటినుండి లేచివచ్చిరని వేరుగ చెప్పవలెనా యేమి ? అదిగాక, ఐర్యనవైజోయను భూమి హిమప్రళయముచే మానవ

నివాసమునకనుపయోగమయ్యెనని చెప్పిన వెంటనే యీ పదునారు భూములును క్రమముగ పేర్కొనబడుటచే యీ క్రమమున కేదియో అర్థముండితీరవలెనుగద. అనగ, మొదట నున్న చోటులో నుండుట యసంభవము కాగనే వారచ్చట నుండి లేచి యీ పదునారు భూములగుండ క్రమముగ సంచార మొనర్చుచు వచ్చిరని స్పష్టమగుచున్నది. కనుక, యిది నిజమగు చరిత్రాంశమే గాని పుక్కిటి పురాణముగాదు.

పూర్వము నందనవనమువలెనున్న యీ ధ్రువమండలమునందలి "ఐర్యనవైజో" యను భూమినే కొంతకాలమునకు పారశీకులు "స్వర్గ" మని చెప్పుకొనుచు వచ్చిరి. దీనినే మన పురాణములలో "మేరుపర్వతము"గ వర్ణించిరి. ఇది దేవతలకు నివాసస్థానము — అనగ స్వర్గము.

ఆర్యుల మూలస్థాన మిట్లు మంచుచే పాడైపోయిన చరిత్రాంశమే భారతీయగ్రంథములలో కూడ గలదు. శతపథ బ్రాహ్మణము, మహాభారతము, మత్స్య, భాగవతాదిపురాణములు మొదలుగా గల గ్రంథములలో యీ యంశమే వివరింపబడియున్నది. శత. బ్రా. I, 8, 1, 1–10–లోని వర్ణనము వీని యన్నిటిలో బహు పురాతనమైనది. మనువు ప్రతఃకాలాదులకై తెచ్చిన నీటిలో యొక చేప కనుబడెను. "నన్ను నీవిప్పుడు రక్షించినచో ముందురానున్న గొప్పవరద (ఔఘః) నుండి నిన్ను కాపాడుదును, యీ వరద సమస్తజంతుకోటిని తుడిచివేయనున్నది. (నిరోఢా)" అని ఆ చేప మనువుతో



చెప్పెను. మను వా చేపను మొదట కమండలములో నుంచెను; అది పెరిగినకొలది దానిని బావిలోను, నదిలోను, తుదకు సముద్రములోను వేసి కాపాడెను. అంతట ఆ చేప ఫలాని సంవత్సరములో (యే సంవత్సరమో తెలియదు) వరద రానున్నది; కనుక నీవిప్పుడొక నావను (నావం) కట్టి దానిలో భద్రముగ నుండుమని చెప్పెను. మను వా ప్రకారమే చేసి ఓడలో సిద్ధముగ నుండెను. నావయొక్క పాశమును ఆ చేపకొమ్మునకు కట్టి మనువు "యీ ఉత్తరపర్వతముమీదుగ"—ఏతం ఉత్తరం గిరిం—పోవును. ఈపర్వతమే హిమవత్పర్వతమని వ్యాఖ్యాతలు వ్రాసియున్నారు. నావయొక్క పాశమును ఆపర్వతముపైనున్న చెట్టునకు కట్టవలసినదని చేప చెప్పెను. మనువా ప్రకారమే చేయగ వరదతో పాటు నావ కూడ క్రమముగ క్రిందికిదిగెను. అందుచేతనే యీ పర్వతమునకు "మనోర్ అవసర్పణం"—మనువు దిగినచోటు—అని పేరు–వచ్చెనట. ఈవరదవలన జనులందరునశించిరి; మను వొక్కడే మిగిలెను. మను వంతట "పాకయజ్ఞ" మొనర్పగ ఆనీటినుండి సంవత్సరములో "ఇడా" యను స్త్రీ వచ్చెను. ఈ స్త్రీవలన మనువు సంతానమును (ప్రజాతిః) బడసెను. ఈ కథయే అథ. వే. XIX, 39, 7, 8–లో కూడగలదు. అచ్చట గిరిశిఖరముపేరు "నావ-ప్రభ్రంశనమ్" అనియున్నది. మహాభారతకథలో "నౌబంధనమ్" అనియున్నది. మనువు తపస్సు చేసినచోటు మలయ (మలబారు) అని మత్స్యపురాణము

చెప్పుచున్నది. ద్రవిడదేశపురాజగు సత్యవ్రతుడే మనువునకు బదులుగ భాగవతపురాణమునందు పేర్కొనబడియున్నాడు. వీనియన్నిటిలో శతపథబ్రాహ్మణవర్ణనమే బహుపురాతనమైనది. ఇది క్రీ. పూ. ౨౫౦౦ సంవత్సరములకుపూర్వమే వ్రాయబడినదనిపండితులునిర్ణయించిరి. కనుక యిదియే మనకిప్పుడు ముఖ్యమైనది. మనువునకును చేపకును మొట్టమొదట సంభాషణమెచ్చటజరిగెనో తెలియదు. మనువు నావనెచ్చట యెక్కెనో తెలియదు. శతపథబ్రాహ్మణమందు నీటివరద వర్ణింపబడినదే గాని, అవైస్థికగ్రంథములోవలె మంచుగడ్డల సంగతి లేనేలేదు. అయినను, యీ రెండువర్ణనలును ఒకే యుపద్రవమును దెల్పుచున్నవని చెప్పవచ్చును. "ప్రాలేయ" యనగ "మంచు" అని యిటీవలి సంస్కృత వాఙ్మయమందుగలదు. ఈ "ప్రాలేయ" శబ్దము "ప్రళయ" (వరద) శబ్దమునుండియే యుత్పన్నమైనదని పాణిన్యాచార్యులవారు చెప్పుచున్నారు. కనుక, యీ వరదకును మంచునకును సంబంధమున్నట్లు మన ప్రాచీనులకు తెలియకపోలేదు. కాని, యీ సంగతిని ఆధునికు లంతగ గుర్తింపరైరి. హిమప్రళయము తటస్థించినప్పుడెల్ల మంచులో మునిగిపోయిన ప్రదేశములనుండి పెద్ద నీటివరదలు బయలుదేరి అన్నివైపులకు విరివిగ ప్రవహించునట. ఇట్లు అపారముగ బయల్వెడలి అన్నివైపులకు ప్రవహించుచున్న నీటివెల్లువలవెంట అపరిమితమైన బురదయు, యిసుకయు కొట్టుకొని వచ్చునట. ఈ యంశములను భూగర్భ శాస్త్రవేత్తలే చెప్పుచున్నారు. కనుక,



శతపథబ్రాహ్మణములో చెప్పబడిన వరద (ఔఘః) కూడ హిమప్రళయము క్రింద పడిపోయిన ప్రదేశమునుండి యిట్లుకొట్టుకొనివచ్చుచున్న యొకానొక నీటివెల్లువయైయుండవచ్చును. బహుశః, మనువుకూడ యీనీటి వెల్లువవెంట, నావలోయెక్కి, యీ చేపవెంబడి, హిమవత్పర్వతపార్శ్వమునకు కొట్టుకొనివచ్చియుండవచ్చును. కనుక, శతపథ బ్రాహ్మణవర్ణనము కేవలమొక్క నీటివరదనే సూచించుచున్నదని చెప్పుటకు వీలులేదు. భూగర్భశాస్త్రమును బట్టి చూడగ యీ కథ హిమప్రళయమునుకూడ సూచించుచున్నదనియే చెప్పితీరవలెను. కావున, అవైస్థిక గ్రంథములోని హిమప్రళయమును, శతపథబ్రాహ్మణములోని జలప్రళయమును ఒక్కటే చరిత్రాంశమును దెలుపుచున్నవి. వీనిరెంటికిని మూలమొక్కటే ఈరెంటికిని యింకొక పోలికకూడ కలదు. ఈజలప్రళయములో రక్షింపబడిన మనువు వివస్వతుని కుమారుడు; హిమప్రళయములో రక్షింపబడిన "ఇమ" యనునాతడు "వివంఘటు" ని కుమారుడు.

పదవేల సంవత్సరముల క్రిందట యీభూగోళముపై జరిగిన మహాప్రాకృతిక విపర్యయ మీరీతిగ ప్రాచీనార్యసంతతులచే వాఙ్మయరూపముగ భద్రపరుపబడి యున్నది. వైదిక, అవైస్థికవర్ణనముల రెంటిలో అవైస్థికవర్ణనమే మిక్కిలి పురాతనమును, యెక్కువ విపులమునునై యున్నది. భూగర్భశాస్త్రపరిశోధనలుకూడ అవైస్థికవర్ణనముతోడనే — ప్రతిచిన్నవివరమునందును — తూచినట్లు, సర్వవిధముల, సరిపోవు

చున్నవి. శబ్దశాస్త్రపరిశోధనలను బట్టికూడ శతపథబ్రాహ్మణముకంటె వెందిదాదుగ్రంథమే యెక్కువ పురాతనమైనదని హేగుపండితుడు కనుగొని యున్నాడు.

ఆర్యులొకప్పుడు ఉత్తరభూములలో నివసించియున్నారని దెలుపు వాక్యములు కొన్నిగలవు. వానిలో రెంటి, మూటినిమాత్ర మిచ్చట పేర్కొందుము. "శతం హిమం" అను పదము ఋగ్వేదమందు పలుతావులలో గలదు. (I, 64, 14; II, 33, 2; V, 54, 15; VI, 48,8; Etc. ...) "శరదశ్శతం" అను పదముకూడ ఋగ్వేదమందు గానవచ్చుచున్నను, యీ "శతం హిమం" అను పదముచే ఆర్యులప్పటి కింకను తమ యుత్తరమండల నివాసమును పూర్తిగ మరచిపోలేదని తెలియుచున్నది. ఐ. బ్రా. VIII, 14- లో హిమవంతమునకావలనున్న "ఉత్తరకురు"భూములు పేర్కొనబడి యున్నవి. ఈ యుత్తరకురుభూములను మానవమాత్రు లెవరును జయింపజాలరనియు, యిచ్చట దేవతలు నివసింతురనియు, ఐ. బ్రా. VIII, 23 చెప్పుచున్నది. అనగ, యీబ్రాహ్మణమునాటికే యీయుత్తర కురుభూములు దేవతానివాసస్థానములుగ పరిగణింపబడజొచ్చెనని తెలియుచున్నది. సత్కార్యములొనర్చిన పురుషులీయుత్తర కురుభూములలో నివసింతురని రామాయణము (IV, 43, 38) చెప్పుచున్నది. "అర్జునా ఇవిగో!- యివియే ఉత్తరకురుభూములు; వీనినెవరును జయింప సాహసింపకు"-అని మహాభారతము (సభా: 28. అ) చెప్పుచున్నది. "టాల్మీ" యను గ్రీకుపండితుడుకూడ "ఒత్తొరొకొర"



అనుభూమియు, పర్వతమును, ప్రజలును, గలరని చెప్పుచున్నాడు. "పత్యాస్స్వస్తి"కి (అనగ, వాగ్దేవికి) ఉత్తరమండలములు (ఉదీచీమ్‌దిశం) తెలియునని కౌషీతకీబ్రాహ్మణము (VII, 6) చెప్పుచున్నది. ఈవాక్యములనుబట్టి ఆర్యులొకప్పుడు ఉత్తరభూములలో నివసించియున్నట్లు తెలియుచున్నదని "మ్యూయిరు" పండితుడు తలంచుచున్నాడు. కాని, యీవాక్యములంత స్పష్టముగలేవు. వీనివలన ధ్రువమండలము సూచింపబడుటలేదు. అయినను, తదితరప్రమాణములచే యిదివరకే ఋజువైన ఉత్తరధ్రువ నివాసమును మరింత యెక్కువగ తెలుపుటకుమాత్ర మీ వాక్యములు తోడ్పడుచున్నవని చెప్పవచ్చును. మన సిద్ధాంతమును ఋజువు చేయుటకు మన మిదివరకు చర్చించియున్న వైదిక, అవైదిక ప్రమాణములే ప్రబలాధారములుగ నున్నవి. వీనివలన ఆర్యులొకప్పుడు ఉత్తరధ్రువమండలమం దుండిరనియు, తదుపరి హిమప్రళయముచే ఆమండలము పాడైపోగా వారచ్చట నుండి లేచి దక్షిణాభిముఖముగ పయనమై మధ్య అనేక భూములను దాటుచు, కొంతకాలము ఆక్సను, సింధు, కుభా, రసా, నదీప్రాంతములలో నివసించుచు, తుదకు మరల అనేక శాఖలుగ చీలిపోయి కొందరు హిందూదేశము లోనికిని, మరికొందరు పారశీకదేశములోనికిని పోయిరనియు, తెలియుచున్నది.



# వైదికనిలయము

## పంద్రెండవ అధ్యాయము.

### తత్తుల్య గాథలు.

### ( Comparative Mythology )

ఆర్యుల ఉత్తరధ్రువనివాసమును ఋజువు చేయుటకు మనమింతవరకు భారతీయులయొక్కయు పారశీకులయొక్కయు ప్రాచీన గ్రంథములనుండి ప్రమాణములనెత్తి చూపియున్నాము. మన సిద్ధాంతము సత్యమేయైనచో ధ్రువనివాసమును దెల్పు నిదర్శనములు గ్రీకు, రోమను, కెల్టిక్, ట్యూటానిక్, స్లవోనికాది తదితర ఆర్యశాఖలవారి ప్రాచీనగ్రంథములందును గాథలయందును కూడ యుండియుండవలెనుగద. ఈవిషయమై "రీసు" పండితుడు చాల శ్రమజేసి ఆ గాథల నన్నిటిని విపులముగ పరిశీలించిచూచి, వానివలన ఉత్తరధ్రువనివాసమే సూచింపబడవచ్చునని చెప్పియున్నాడు. కనుక, ఆగాథలనన్నిటిని మనమిప్పు డిచ్చట మరల సూక్ష్మముగ పరిశీలింపవలసిన యావశ్యకతలేదు. "రీసు" గారిదివరకే చేసియున్నకృషివలన



మనపనిచాల తేలికయైనది. కనుక, యీవిషయమై మనము వారి కనేకవందనము లొనర్పవలసియున్నది. 'రీసు' గారొనర్చిన పరిశ్రమనాధారముజేసికొని నేనిచ్చటకొన్ని ముఖ్యాంశములను మాత్రము క్లుప్తముగ పేర్కొందును.

ధ్రువమండలమందలి ప్రాచీన సంవత్సరమును గూర్చిన చిహ్నము లేమైన తదితర ఆర్యజాతుల గ్రంథములలో కలవేమో ముందు విచారింతము. ఋగ్వేదమందు ఉషస్సు బహువచనములో ప్రయోగింపబడియున్నది. ముప్పదిమంది యుషాకన్యలు ఒక ఆవరణములోనే చీలిపోకుండ కలిసియుండి, ఒక్క మనస్సుతోనే, గిరగిర తిరుగుచుందురని ఋగ్వేదము వర్ణించెను. "లెట్టు" జాతివారి ప్రాచీనగ్రంథములందుకూడ ఉషస్సు "దివో-దుక్తే" – (ఋగ్వేదము:– దివో-దుహితా) అనగ, "దివముయొక్క కూతురు"గనే వర్ణింపబడియున్నది. సుందరులగు యిట్టి "దివో దుహితలు" చాలమంది గలరని "లెట్టు"కవులు వర్ణించియున్నారు. గ్రీకుగాథలందు "హేరకిల్సు" యొక్క భార్యలు పెక్కుమందిగలరు. "వీరు ఉషస్సేనకంటె భిన్నమైనవారని చెప్పుటకు వీలులేద"ని మాక్సిముల్లరుగారే చెప్పియున్నారు. ఈ కథయే "కెల్టిక్" గాథలందు గలదు. సూర్యుని భార్యకు చాలపేర్లుగలవట. స్త్రీరూపములుగ వర్ణింపబడిన బహు సంఖ్యావాచకములగు నీయుషస్సులన్నియు సంవత్సరములో ౩౬౦ దినములలో ప్రతిదినమును కన్పడు ఉషస్సులు గావనియు, ఉత్తరధ్రువమందు సుమారు నెలదిన

ములవరకుండు దీర్ఘయఖండ ఉషస్సే యీవిధముగ వర్ణింపబడియున్నదనియు మన మిదివరకే ఋజువుపరచి యున్నాము. ఉషస్సు "దివో-దుహిత"గను, బహువచనముగను ఋగ్వేదమందేగాక లెట్టుగాథలలో కూడ ఒకేవిధముగ వర్ణింపబడి యుండుటచే, యిది తప్పక ధ్రువమండలమందలి దీర్ఘయఖండ యుషస్సే యై యుండవలెను. కెల్టిక్, గ్రీకు గాథలకు కూడ నిదియే తాత్పర్యము.

'గవాం అయనం'యొక్క అవధిని గూర్చియు, దశగ్వుల చరిత్రనుగూర్చియు చర్చించుసందర్భమున ప్రాచీన రోమన్ సంవత్సరములో పదిమాసములే యుండెననియు, "న్యూమా"యను నాతడువచ్చి తదుపరి రెండు నెలలను క్రొత్తగకలిపెననియు వివరించియుంటిమి. ప్రాచీనసంవత్సరములో ౧౨ నెలలే యుండియున్నచో ౫ వ నెల మొదలు ౧౦ వ నెలవరకునున్న సంఖ్యావాచకనామము లొక్కసారి ఆకస్మికముక, ౧౦ వ నెలతోడనే నిలిచిపోజాలవు. "క్వింటిలిస్" (అయిదవనెల) మొదలు "డిశంబరు" (పదవనెల) వరకునున్న రోమన్ నెలలయొక్క సంఖ్యావాచకనామములను బట్టి మనమింకొక విశేషాంశమును గ్రహింపవచ్చును. మొట్టమొదట ఆర్యులందరుకలిసి ఉత్తర ధ్రువమండలమందున్నప్పుడు నెలలకు వానిక్రమమునుబట్టి — మొదటినెల, రెండవనెల, మూడవ నెల,........ అను సంఖ్యావాచకనామములే యుండెను. గాని వానికి ప్రత్యేకమైన పేర్లు వేరుగ లేకుండెను.



కాని, ఆర్యులందరును భిన్నశాఖలుగ చీలిపోయిన తరువాత యీ సంఖ్యావాచకనామములకు బదులుగ నెవరి యిష్టము చొప్పున వారు తమతమ నెలలకు క్రొత్తపేర్లను పెట్టుకొనిరి. అందుచేతనే, యిప్పు డన్ని భాషలలోను నెలలపేర్లు ఒకేమాదిరిగ లేక భిన్నములుగ నున్నవి. ప్రాచీన రోమన్ సంవత్సరము యొక్క పదినెలల యవధినిబట్టి పదినెలల సూర్యరశ్మిగల ధ్రువప్రాంతము సూచింపబడుచున్నదనుటలో సందేహము లేదు.

కెల్టిక్, ట్యూటానిక్, గ్రీకుజాతుల ప్రాచీన సంవత్సరమునుగూర్చిన వర్ణన లంతస్పష్టముగ లేవు. కెల్టుసంవత్సరమునుగూర్చి కొంచము తెలిసికొందము. సంవత్సరములోనున్న ఉష్ణోగ్రతనుబట్టియు, శీతోగ్రతనుబట్టియు వారిసంవత్సరము రెండు సమభాగములుగ విభజింపబడినట్లుగాన్పించుచున్నది. సూర్యరశ్మికంటె చీకటియు, పగటికంటె రాత్రియు వారికెక్కువ ప్రధానములుగ గన్పట్టుచున్నవి. నవంబరు మొదటి తేదీనాడు వారికి శీతకాలము ప్రవేశించును; చీకటియు వచ్చును. ఇదియే వారికి ప్రాతసంవత్సరములో చివరిదినము. ప్రాతసంవత్సరము చనిపోయినదని సూచించుటకనేక పండుగలు, జాతరలు జరుగును. ఇదియే పిశాచములు గన్పడుటకు తగిన సమయము. సూర్యదేవు డీదినమందే చలియు, చీకటియు నను రాక్షసులకు ( లేక పిశాచములకు ) లొంగిపోయెనని చెప్పుటకై వారనేకజాతరలను జరుపుదురు. అంధకారము

నల్లని పందిరూపమునుధరించి, తోకగాని చెవులుగాని లేక మహాభయంకరముగ ప్రపంచమందు విచ్చలవిడిగ సంచరించునట. ఈవిధముగ వారినూతనసంవత్సరము చలితోడను, చీకటితోడను ప్రారంభమగును. ఇదేరీతిగ, సూర్యుడతి తేజోవంతముగనున్న వేసవిమధ్యమును దెల్పుటకుకూడ కెల్టుజాతివారు ఆగస్టు మొదటి తేదీన "లమ్మ" సంతలను "లగ్నసద్" పండుగలను జరుపుదురు. సూర్యుడతితీక్షణములగు తనకిరణములచే శీతలమును, అంధకారమును భేదించి, సస్యములకు ఉత్తేజమును గలిగించును. కావున పంటలుకూడ, ఆకాలమందే చక్కగపండి సిద్ధముగనుండును. అందుచే "లగ్నసద్"పండుగలును,"లమ్మ" సంతలును విరివిగ మహావైభముగ జరుగును. ఇదియే పెండ్లిండ్లు జరుగుటకు మిక్కిలి అనుకూలమైన శుభోదయ కాలము. ఆగష్టుమొదటితేదీ వేసవిమధ్యమైనచో మేనెల మొదటితేదీనాడే సూర్యభగవాను డుదయింపవలెను. అందుచేతనే మేనెల మొదటితేదీన యొకపండుగ జరుగును. దానికర్థమేమనగ:— శీతకాలము ప్రవేశింపగనే అంధకార రాక్షసుడు వచ్చి తనవద్దనుండి లాగికొనిపోయిన స్త్రీని సూర్యుడు తిరిగి యీ దినమందతనివద్దనుండి మరల లాగుకొని వచ్చునట. ఇట్టి కథయే యింకొకటికలదు. "ప్లూటో" యనునతడు "పర్సిఫోను" కన్యనెత్తుకొనిపోయి తనవద్ద ఆరుమాసములే యుంచుకొనగలిగెనట. తన కుమార్తెయైన యీపర్సిఫోనుకన్య తనవద్దనున్న ఆరుమాసములును భూదేవి సంతోషముగ నుండునట.



కాని, యీకన్య భూమిక్రిందనున్న చీకటిలోకమునకు పోయినప్పుడు భూదేవిదుఃఖించునట. దీనినిబట్టి కెల్టిక్ సంవత్సరములో నవంబరు మొదలు యేప్రియల్ నెలాఖరువరకు చలితో గూడినదీర్ఘరాత్రియు, మేనెల మొదలు అక్టోబరునెలాఖరువరకు సూర్యరశ్మితోకూడిన దీర్ఘదివసమును నుండునని తాత్పర్యము. ఇంకొకవిశేష మేమనగ, అంధకార రాక్షసులకును జ్యోతిర్దేవతలకును జరిగిన యుద్ధము నవంబరు మొదటితేదీన జరిగెనని స్పష్టముగ గలదు. ఈ యంశము శంబరాసుర యుద్ధకాల నిర్ణయమొనర్చు శరుత్తు ౨౦ వ తిథిని పోలియున్నది. నార్వేజాతివారి సంవత్సరముకూడ యిదేరీతిగనున్నది. అక్టోబరు ౧౧, ౧౨ తేదీలమధ్య వచ్చు శనివారమునాడు నార్వేజాతివారొకపండుగ జేయుదురు. ఇది ప్రాచీనకాలమందలి నూతన సంవత్సరాదిని సూచింపుచున్నదని పండితుల యభిప్రాయము. "కెల్టు" వారి సంవత్సరమునకంటె "నార్వే" వారి సంవత్సరములో కొద్దిదినములు తక్కువగనున్నవి. నార్వేదేశములో చలి కొంచెము ముందుగవచ్చుటచే వారి సంవత్సరముకూడ కొంచెము ముందుగ ప్రారంభమయ్యెనని రీసుగారు తలంచుచున్నారు.

గ్రీకుజాతివారి ప్రాచీనసంవత్సరముకూడ అక్టోబరునెల చివరతేదీనాడే ప్రారంభమయ్యెను. నూతన సంవత్సరాదిని, ప్రాతసంవత్సరాంతమును, దెలుపుట కానాడు పండుగలు జరుగును. వేసవి మధ్యమును దెలుపుటకు "లగ్నసద్"వంటి

పండుగలు జరుగును. సూర్యోదయమును దెలుపుటకు మే నెలలో కెల్టిక్ పండుగలవంటి పండుగలే జరుగును. ఈ పోలికలనుబట్టి చూడగ, కెల్టుజాతివారి ప్రాచీనసంవత్సరమువలెనే గ్రీకుజాతివారి ప్రాచీనసంవత్సరముకూడ ధ్రువనివాసమునే దెల్పుచున్నది. దీనినిబట్టి ఐరోపాఖండవాసుల పూర్వజులకు ౬ మాసముల పగటినిగూర్చియు ౬ మాసముల రాత్రినిగూర్చియు తెలియునని యింతవరకు ఋజువగుచున్నది. భాషాపరిశోధకులుకూడ యీ విధముగనే సారాంశమును దేల్చుచున్నారు.

అదిగాక, ధ్రువమండలమందు కొన్నిప్రదేశములలో ౭ మాసములును, మరి కొన్నిప్రదేశములలో ౮, ౯, ౧౦ మాసములును సూర్యరశ్మి యుండుటచే వారికి ౧౨ మాసములతో కూడిన సంవత్సరసంజ్ఞ యుండుటకంత అవకాశము లేదు. కనుక వారి సంవత్సరము "ఇన్నిమాసముల వేసవియు + ఇన్నిమాసముల శీతకాలము"నని మాత్రమే యుండును. లేదా, "ఇన్ని నెలల సూర్యరశ్మియు + ఇన్ని నెలల చీకటియు" నని యైన యుండును. దీనికి ఉదాహరణము:— సంవత్సరమునంతను పూర్తిగ తెలుపుటకు "మానుషాయుగా + క్షుపః" అను పదము ఋగ్వేదమందు ప్రయోగింపబడియున్నది. ధ్రువమండలమందలి ఆయాప్రదేశములలో నున్న శీతోష్ణములును, అంధకారప్రకాశములును ఒకేపరిమితి గలవి గాకపోవుటచే వారి సంవత్సరములుకూడ ఒకేరీతిగ నుండక పలురీతులుగ



నుండును. అందుచేతనే ఆర్యభాష లన్నిటిలో సంవత్సరమున కొకే పేరుండక వేర్వేరు పేర్లుండుట తటస్థించెను.

నవగ్వ దశగ్వుల పేర్లలోనున్న సంఖ్యలు వారివారి యజ్ఞకాలపరిమితులను దెలుపుచున్నవని యిదివరకే ఋజువు పరచితిమి. కెల్టుజాతివారిలో కూడ నొక కథ గలదు. తొమ్మిది సుందరరూపములు గల కన్య యొకతె గలదట. తన శత్రువు పడమరవైపునుండి తనమీాదికి వచ్చుచున్నాడని వినగనే సూర్యుడు ఆతని నెదిరించుటకై ఆవైపునకు పయనమయ్యెనట. కాని, మధ్యలో ఆకస్మికముగ సూర్యుడొకా నొక సంకేతస్థానమునకుపోయి యీ నవరూపిణియగు కన్యను కలుసుకొనెనట. అచ్చట యీకన్యసూర్యునకు వేడినీట అభ్యంజనస్నానముగావించి, మంచిభోజనముపెట్టి, రేపు రానున్న యుద్ధమునకు ప్రోత్సాహకరముగ నుండునట్లు తయారుచేసెనట. ఈకథ అంధకారరాక్షసులతో పోరాడబోవుచున్న యింద్రునకు సోమరసమునిచ్చి ప్రోత్సహించిన నగ్వులచరిత్రను పోలియున్నది. కనుక, "నవరూపిణి" యగు "కెల్టిక్" కన్యయు, ఋగ్వేదమందుపేర్కొన బడిన "నవగ్వులును"—ఒకేభావమును సూచించుచున్నారు. "థార్" అను నార్వే దేవత ప్రపంచమునుచుట్టియున్న ఘోరాహిని సంహరించి, తొమ్మిది అడుగులునడచి, అంతట ఆపాము విషముచే చనిపోవునట. ఈ కథకూడ తొమ్మిదిమాసముల సూర్యరశ్మితోడను, ౩ మాసముల దీర్ఘరాత్రితోడను నొప్పు

రుచున్న ధ్రువమండల ప్రాంతమునే సూచించుచున్నది. అవైస్థిక గ్రంథమందింకొక కథగలదు. "విఫ్రనవాజా" యనునాతడు పక్షిరూపముగ పైకెగురవేయబడును. అతడు మూడహోరాత్రములు ఆకాశమందు తిరుగాడుచున్నను తనయింటికి రాలేకపోయెను. మూడురాత్రులైన తరువాత ఉషస్సు కనుబడగనే ఆతడు "అర్ద్విసూర అనాహిత"ను ప్రార్థించెను. అంతట "అర్ద్విసూర అనాహిత" వచ్చి అతనిని సురక్షితముగ యింటికిచేర్చెను. ఈఅవైస్థికకథలోనున్న "విఫ్రనవాజా" ఋగ్వేదమందున్న "విప్రనవగ్వ"యే యై యుండవచ్చును. ఋ VI, 22, 2 లో నవగ్వులతోపాటు యేడ్గురు "విప్రులు"కూడ పేర్కొనబడియున్నారు. మరియు ఋ V, 74, 4లో "విప్ర-వాహసా"యనబడిన అశ్వినులు దూరదేశమందు మూడహోరాత్రములు నివసించిరట. కనుక, దశమాసిక యజ్ఞానంతర మింద్రునకు తోడ్పడబోయిన నవగ్వులును, "విప్రవాహసా"యనబడిన అశ్వినులును కలిసియే అవైస్థిక కథయందు "విఫ్ర-నవాజా" యై యుండవచ్చును. విప్ర శబ్దము అవైస్థికగ్రంథమందు "విఫ్ర"గను, నవగ్వాశబ్దము "నవాజా"గను మారియుండవచ్చును.

ఇంతవరకు చర్చించిన గ్రీకు, కెల్టిక్, నార్వేగాథలను బట్టి వారిపూర్వజులకు యెడతెగని శీతల, దీర్ఘ, రాత్రిని గూర్చి పూర్తిగ తెలియునని స్పష్టమగుచున్నది. దీర్ఘరాత్రి యున్నప్పుడు దీనికి ప్రతిగ దీర్ఘదివసముకూడ యుండితీర



వలెను. కనుక, యీదీర్ఘదివసమును సూచించుగాథలుకూడ కలవేమో చూతము. "బాల్డర్" అను నార్వే సూర్యదేవునకు ఆకాశమందొక నివాసస్థానముగలదట. ఇందుపై రీసుగారి యభిప్రాయమేమనగ:- "ఉత్తరధ్రువమండలమందు సూర్యుడు క్షితిజముపై దీర్ఘకాలముండునను సృష్టిచమత్కారమే యీ కథవలన సూచింపబడుచున్నట్లున్నది." దీనినిపోలిన వర్ణనమే వేదమందుగలదు. సూర్యుడు తన రథాశ్వముల నూడదీసి ఆకాశమధ్యమందు విశ్రమించునని వేదములు వర్ణించినవి. ఈవాక్యమును మనమిదివరకు ఆరవయధ్యాయములో చర్చించియే యున్నాము.

"స్లైవోనిక్" వాఙ్మయమందు ముగ్గురన్నదమ్ములకథ యొకటిగలదు. ముగ్గురన్నదమ్ములుగలరట. మొదటియిద్దరు తెలివిగలవారు. "ఇవన్" అను మూడవవాడు కొంచము అమాయికుడు. "ఇవన్" నివసించుచోట యెల్లప్పుడును రాత్రియే యుండునుగాని పగలులేనేలేదు. ఈదీర్ఘరాత్రి ఒకపాముచే గల్పింపబడెను. ఈపామును చంపివేయుటకై "ఇవన్" పూనుకొనెను. ఈపామును చంపగనే ప్రపంచమందంతటను వెలుగు కలిగెను. ఈకథ వేదమందున్న "త్రిత" కథతో సర్వవిధములసరిపోవుచున్నది. ధ్రువమండల దీర్ఘరాత్రి రష్యాజాతివారిగాథలందు "చావుగాని, మాంసముగాని లేని అస్థిపంజరరూపమైన ఘోరపిశాచము"గ వర్ణింపబడియున్నది. ఆపిశాచము వీరులనందరిని తనయెముకల చేతులమధ్యపెట్టిపిసికి

చంపబడగనే సూర్యదేవత తిరిగి యెప్పుడు రాజ్యమునకువచ్చునో నార్వే గాథముందుగనే దెల్పుచున్నది. గ్రీకు దేవతలకును రాక్షసులకును జరుగు యుద్ధముయొక్క పర్యవసానము ముందుగనే చెప్పబడుచున్నది. తమదేవుని చరిత్ర చర్విత చర్వణముగ ప్రతిసంవత్సర మొకేమాదిరిగ నుండునని "క్రేటను" ప్రజలు చెప్పుచున్నారు. ఈగాథలనన్నిటినిబట్టి అంధకారప్రకాశములకు (అనగ, రాక్షసులకు, దేవతలకు) జరిగిన పోరాటము సాంవత్సరికమేగాని దైనికముగాదని నిర్ణయమగుచున్నది. "ఫిర్గియను"ల దేవుడు (మనవిష్ణునివలెనే) శీతకాలములో నిద్రపోయి వేసవికాలములో పనిచేయును. శీతకాలములో దేవతలందరు చెరసాలలలో బంధింపబడియుందురనియు, వేసవికాలములో విడిచిపెట్ట బడుదురనియు "పాఫ్లగోనియన్" జాతివారు తలంచుచున్నారు. ఐరిషుప్రజల "కావేడ్" అనువింత యాచారముకూడ దేవతలకు గలిగిన అనారోగ్యమును దెలుపుచున్నది. "జీయస్" అను గ్రీకుదేవుడు "టైఫో" యను రాక్షసునిచే యెముకలేని ముద్దగకొట్టబడి, ఒకగుహలో పారవేయబడి, దిక్కుమొక్కులేక యల్లాడుచు, నుండెనట. రాత్రింబవళ్ళను దెలుపు "ఓడెన్" దేవునియుంగరము సూర్యుని(బాల్డరు) చితిపైపెట్టినప్పుడు, అదిసూర్యునితోకూడ అధోలోకమందు పడిపోయి యదృశ్యమగునని నార్వేగాథ చెప్పుచున్నది. ఈ కథ ఉత్తరధ్రువమండలమందు శీతకాలములో రాత్రింబవళ్ళ నడక నిలిచిపోయి సర్వము అఖండదీర్ఘరాత్రిగ నుండుటను



సూచించుచున్నది. సూర్యదేవుడు నిద్రపోకుండ చాలదినములు పోరాడుచున్నాడట. దీనివలన ధ్రువమండల దీర్ఘదివసము సూచింపబడుచున్నది. సూర్యదేవునికుమారుడు ఆకాశమందు చాలసేపుకూర్చుని న్యాయవిచారణము చేయుచుండునట. ఇదికూడ దీర్ఘదివసమునే సూచించుచున్నది. ఈగాథలవలన ఆర్యుల మూలస్థానము చాల ఉత్తరదేశములందు గలదని తెలియుచున్నది.

క్రొత్తగ చేయబడిన భూగర్భ, భూనిక్షేప పరిశోధక శాస్త్రాదిపరిశోధనలవలన గాథాశాస్త్రజ్ఞులును భాషాశాస్త్రజ్ఞులును తమ పూర్వాభిప్రాయముల నెట్లు మార్చుకొనవలసి వచ్చెనో రీసుగారు వివరించియున్నారు. ఆర్యుల మూలస్థానము మధ్యాసియా యందు గలదని పండితు లిదివరకు తలంచుచుండిరి. కాని, యిప్పు డీనూతనపరిశోధనలవలన ఆర్యుల మూలస్థానము జర్మనీకి ఉత్తరమందుగాని, స్కాండినేవియా యందుగాని యుండియుండవలెనని పండితు లొప్పుకొనక తప్పినది కాదు. కాని, "జ్ఞానాభివృద్ధియైనకొలది ఆర్యుల మూలస్థానమును నిర్ణయించుటకు మన మింకను ఉత్తరమునకు పోవలసి వచ్చునేమోయని నేనూహించుచున్నాను. ఏది యెట్లున్నను నేనిప్పుడు మీకు విశదీకరించిన గాథలన్నియు ధ్రువమండలమం దేదోయొక స్థలమును సూచించుచున్నవని నా యూహ. నార్వేవారు అమరలోకమని చెప్పునట్టి యా భూమియే "ఫిన్లాండు" నకు ఉత్తరమున, తెల్లసముద్రమునకు

దగ్గరగ, నుండి యుండవచ్చును. ఆర్యు లచ్చటనుండి కాలక్రమమున స్కాండినేవియాలోనికి దిగివచ్చి యుండవచ్చునని మన మూహింపవచ్చును. ఇట్లు దిగివచ్చి "ఉప్సల"వద్ద తదితరజాతులతో కలిసి స్థిరనివాసము నేర్పరుచుకొని యుండవచ్చును. ఈ చుట్టుపట్లప్రదేశమంతయు మిక్కిలి చదునైన సమతలముగ నున్నది. ఈ స్థలమంతయు చాల సమాధులతో నిండియున్నది. ఈ సమాధు లెప్పటికాలము నాటివో చెప్ప లేనంత బహుపురాతనమైనవిగ నుండుటచే, ఇది చాల పురాతనస్థలమని చెప్పకయే చెప్పుచున్నది" — ఇవి రీసుగారి మాటలు. ఒక్క ఆర్యసంతతులకే గాక, తదితరమానవజాతులకు కూడ ఉత్తరమండలములే మూలస్థానము లని కొందరు పండితులు చెప్పుచున్నారు. "ఈ భూగోళముయొక్క ఉత్తరార్థమంతయు మానవనివాసమునకు యోగ్యము గానంత అత్యుష్ణముగ నుండుటచే, మానవకోటియంతయు మొట్టమొదట ధ్రువసముద్రతీరమందే యుదయించె"నని యొకానొక సుప్రసిద్ధ ఫ్రెంచిపండితుడు గట్టిగ తలంచుచున్నాడు.

పైనుదహరించిన రీసుగారి యభిప్రాయములకంటె నేనింక యెక్కువగ చెప్పవలసిన దేమియు లేదు. అంధకారప్రకాశములకు జరుగుచున్న యుద్ధముగ పోల్చి వర్ణింపబడదగిన సృష్టిచమత్కారములు ముఖ్యముగ మూడేగలవు. (౧) సూర్యుని దైనికాస్తమయము; (౨) శీతకాలమందలి సూర్యుని తేజోహైన్యము; (3) ధ్రువమండలమందలి దీర్ఘరాత్రి. ఈ



యుద్ధము సాంవత్సరికమేగాని, దైనికముగాదని మనమిదివరకే నిర్ణయించి యుండుటచే మొదటియంశమును పూర్తిగ కొట్టివేయవచ్చును. ఆర్యుల ప్రాచీనగాథలలో దీర్ఘాంధకారము మాటయే లేకపోయినచో రెండవయంశముకూడ మనకు పనికివచ్చెడిదే. కాని, యీగాథలలో స్పష్టముగ చెప్పబడియున్న దీర్ఘాంధకారమును సమర్థించుటకీ రెండవయంశము సమర్థము గామిచే దీనినికూడ కొట్టివేయవలసినదే. ఇక మూడవయంశము మిగిలినది. మనము వైదిక, అవైస్థికగాథలను పరిశీలించినట్లే రీసుగారుకూడ కెల్టిక్, ట్యూటానిక్, గాథలను బహుజాగ్రతగ పరిశోధించి, వానిని గ్రీకుగాథలతోకూడ పోల్చిచూచి, ఆర్యుల ప్రాచీనమూలస్థానము ఉత్తరధ్రువమండలమందే యుండి యుండవలెనని యూహించిరి. మనము చర్చించిన యంశములు కూడ రీసుగారికి తెలిసియున్నచో వారీ యభిప్రాయమునే మరింత దృఢముగ చెప్పియుండెడివారు. అయినను, వీనితో అగత్యము లేకుండగనే వారు స్వతంత్రముగ చేసిన యూహ చాల విలువయైనది. ఇది మనముచేసిన నిర్ధారణతో పూర్తిగ యేకీభవించుచున్నది. అందువలన, మన సిద్ధాంతము రెండింతలుగ ఋజువగుచున్నది. భాషాశాస్త్రజ్ఞులుకూడ తమ పూర్వాభిప్రాయములను వదలుకొనిరి. కాని యీ నూతనాభిప్రాయములతో నేకీభవించుట కింకను వారు కొద్దిగ సంశయించుచున్నారు. అందుచేతనే, జ్ఞానాభివృద్ధియైనకొలదియు ఆర్యుల మూలస్థానమును నిర్ణయించుటకై మన మింకను ఉత్తరము

నకుపోయి, ధ్రువమండలమును ప్రవేశింపక తప్పదని రీసుగారు చెప్పియున్నారు.

ఒక్క ఆర్యులేగాక, తక్కిన మానవజాతు లందరును కూడ ధ్రువమండలమందే మొట్టమొదట నివసించియుండిరని చెప్పుచు "వారెన్" పండితుడు విపులముగ చర్చించి యున్నాడు. ఇది చాల ముఖ్యమైన విషయమనుటలో సందేహము లేదు. అయినను మన ప్రస్తుతాంశ మిప్పు డొక్క ఆర్యుల మూలస్థానము నిర్ణయించుట మాత్రమే యైయున్నది. గావున తక్కిన జాతులను గూర్చి మన మీ గ్రంథమందు వివరింపజాలము. ఏది యెట్లున్నను మన సిద్ధాంతము "వారెన్" గారి సిద్ధాంతముతో నేకీభవించుచు, దాని కింకను బలమును చేకూర్చుచున్నదే గాని, దాని కెంతమాత్రమును భిన్నముగ లేదు. కనుక, మన సిద్ధాంత మన్నివిధముల ఋజువగుచునే యున్నది.



# వైదిక నిలయము

## పదమూడవ అధ్యాయము.

### ఆర్యుల ప్రాచీనసభ్యత, మతము.

వైదికార్యుల పూర్వజుల మూలస్థానమునుగూర్చిన చర్చ మనమిప్పుడు ముగించినాము. మనమీయంశమును పలుదృష్టులతో పరిశీలించియున్నాము. మనవాదములు కేవలము ప్రాచీన భాషాపరిశోధనలపై గాని, ప్రాచీనసభ్యతను దెలుపు చరిత్రాంశములపై గాని ఆధారపడియుండలేదని తెలిసికొనవలెను. మన మింతవరకు జూపిన ప్రమాణములన్నియు ముఖ్యముగ వైదిక, అవైస్థిక గ్రంథములందున్న ప్రత్యక్షవాక్యములే యైయున్నవి. ఒక్క ఉత్తరధ్రువమండలమందు మాత్రమే గన్పట్టు శీతోష్ణాదిపరిస్థితులతో ఋగ్వేద కర్తలకు పరిచయము గలదని యీవాక్యములవలన నిస్సందేహముగ ఋజువగుచున్నది. క్షితిజముచుట్టు గిరగిరతిరుగు ఉషస్సు; వృత్రునిచే బంధింపబడిన జలము; దీనదశయందున్న దేవతలను, సూర్యుని రక్షించిన అశ్వినులు; శతక్రతుడగు ఇంద్రుడు; తన త్రిపాద

ములతో విశ్వము నాక్రమించిన విష్ణుడు; అంధకార, సముద్ర ముల కధిపతియగు వరుణుడు; మాసాధిదేవతలగు సప్తాదిత్యులు; మూడవవాడగు త్రితదేవత; — ఇత్యాదిప్రధాన వైదిక దేవతలందరు స్పష్టముగ ధ్రువోత్పత్తిని దెలుపు లక్షణములతో నలంకరింపబడి యున్నారు. వేయేల మూడవ అధ్యాయములో ప్రత్యేకధ్రువమండల లక్షణములుగ పేర్కొనబడిన లక్షణములన్నియు ఋగ్వేదమందు స్పష్టముగ గానవచ్చుచునేయున్నవి. వీనివలన నిర్ధారణమగు సారాంశమువిషయమై యెట్టియనుమానముగాని, సందేహముగాని యుండవలసిన పనిలేనంత ఖండితముగ యీలక్షణములన్నియు ఋగ్వేదమందు వర్ణింపబడి యున్నవి. షాణ్మాసికదివసము, షాణ్మాసికరాత్రి, శోభాయమానమగు నూతనారుణకాంతులను వెలిగ్రక్కుచు, బహుదినములవరకు వలయాకారముగ క్షితిజముచుట్టు నాట్యమాడుచు బోవుచుండు అఖండదీర్ఘఉషస్సు, ధ్రువమండల దీర్ఘదివసము దీర్ఘరాత్రి ౧౨ మాసములకు తక్కువైన సూర్యరశ్మితో కూడిన సంవత్సరము— యివన్నియు వైదిక ఋషులకు తెలియును. వారు వీనినన్నిటిని పట్టిగాథలుగను, అలంకారములుగను గాక, కేవలము స్పష్టమగు ప్రత్యక్ష వాక్యములతో ఖండితముగ వర్ణించియున్నారు. పండితులు మున్నటివరకు యీవాక్యములలోని నిజభావములను దెలిసికొనలేక వానికి పెడార్థములను కల్పించియుండిరి. అయినను ఆధునిక శాస్త్రపరిశోధనములవలన మన ప్రస్తుతాంశముపై



నూతన విజ్ఞానము ప్రసరించుచున్నది. ఈనూతన విజ్ఞానము నాధారముగ చేసికొన్నచో యీవేదవాక్యముల నన్నిటిని సరిగ సమన్వయింపవచ్చును. ఇంతయేల, నేనీగ్రంథమందు చేయబూనిన పని యిదియే. ఏమనగ, ఇట్టి వేదవాక్యముల నన్నిటిని వెదకిపట్టి, యిందంతర్గర్భితమైయున్న భావములను తెరచిచూపగల నిజకీలకము పండితుల కిదివరకు చిక్కకపోవుటచే వారీ వాక్యములు నెట్లుమెలిపెట్టి పెడార్థముల జెప్పవలసివచ్చెనో, లేక వాని నెట్లు పనికిమాలిన వానిక్రింద త్రోసివేయవలసివచ్చెనో, చూపుటకే నేనీగ్రంథమందు పూనియున్నాను — అంతమాత్రముచే యాస్కాచార్యాది భారత నైరుక్తులుగాని, లేక సాయనాచార్యాది వ్యాఖ్యాతలుగాని, ఇదివరలో చేసియున్న కృషి పనికిమాలినదని నే చెప్పుటలేదు. వారి కృషియొక్క విలువను తగ్గించవలెనని నా తాత్పర్యము కాదు. అంతయేల, వీరియొక్క తోడ్పాటే లేకుండపోయినచో వేదార్థములను తీయుటలో మేమొక రవ్వంతపనినైనను చేయజాలకపోయెడివారమే. ఈవిషయమును మేమందరము తక్షణ మొప్పుకొనియే తీరుచున్నాము. కనుక, యీవిషయములో వారుచేసియున్న మానవసేవనుగూర్చి నాకు పూర్తిగ తెలియును. ఈ పవిత్ర గ్రంథముల కర్థమును తీయుటలో వారు తాము చేయగలిగిన దంతయు పూర్తిగ చేసియే యున్నారు. ఈ విషయమై యెంతమాత్రమును సందేహములేదు. వారొనర్చియున్న యీసేవకై భవిష్యత్సం

తతులవారు వారియెడల నెంతయు కృతజ్ఞులై యుండక తప్పదు. దీనిని కాదనువారెవరు నుండుటకు వీలులేదు. వేదములు మనయార్యజాతికంతకును బహు ప్రాచీనగ్రంథములనుటలో సందేహములేదు. ప్రాచీన మానవకోటియొక్క చారిత్రమునుగూర్చిన విజ్ఞానమిప్పుడు విరివిగ వృద్ధినొందుచున్నది. ఇట్లీజ్ఞానాభివృద్ధి యగుచున్నకొలది యీప్రాచీన గ్రంథములందు కొన్నికొన్ని నూతనాంశములును, నూతన వాక్యములును అప్పుడప్పుడు క్రొత్తగ బయటపడుట తటస్థింపుచుండవచ్చును. మనపూర్వజుల ఆచారవ్యవహారములనుగూర్చిగాని, వారు నివసించియున్న పరిస్థితులనుగూర్చిగాని, స్పష్టపరుపగల శాస్త్రములు మనపండితు లీవ్యాఖ్యలు వ్రాసిన కాలమునాటికి పూర్తిగ వికసించియుండకపోవుటచే, యిప్పుడు క్రొత్తగ బయటపడుచున్న యీనూతనాంశములు వారి దృష్టిపథమందు పడియుండకపోవచ్చును. కావున, మన ప్రాచీన వ్యాఖ్యాతలిదివరలో చూడనట్టిగాని, చూచియుండజాలనట్టిగాని, నూతనభావములిప్పుడు మనకు వైదిక, అవైస్థిక గ్రంథములందు క్రొత్తగ గాన్పించుచున్నచో అదియొక వింత గాదు. అందుచేతనే, నే నీ గ్రంథములందు వేదవాక్యములకు క్రొత్తగ చెప్పియున్న యర్థములను పూర్వవ్యాఖ్యాతల యర్థములతో పోల్చిచూచునప్పుడు పాఠకమహాశయు లీయంశమునే తమమనస్సులం దుంచుకొనవలెనని ప్రార్థించుచున్నాను.



మనమీ గ్రంథమందెత్తిచూపిన వేదవాక్యములకు సరిగయర్థము చెప్పినచో వీనియందంతర్గర్భితములైయున్న ధ్రువలక్షణములు తప్పక బయటపడుచున్నమాట వాస్తవమే. మన సిద్ధాంతమును ఋజువుచేయుట కీవాక్యములొక్కటే చాలును. కాని, మన సిద్ధాంతము కేవలమీ వేదవాక్యముల కిట్లర్థముచెప్పుట మీదనే యాధారపడియుండలేదు. వేదకాలమునాటి ప్రజలకర్మకాండను పరిశీలించినను, వారిప్రాచీనగాధలను పరిశీలించిననుకూడ మన కీసారాంశమే సిద్ధించుచున్నది. ఇవన్నియు అవైస్థికగాధలవలనను, పరంపరలవలననే గాక, ఐరోపాఖండస్థులగు తదితర ఆర్యజాతుల గాధలవలనకూడ మరింత బలపడుచున్నవి. ఉదాహరణార్థమై మనమిచ్చుట దశగ్వుల దశమాసికసత్రమును, పదియవదియగు డిశంబరు నెలతో అంతమొందు ప్రాచీన రోమనుసంవత్సరముతో పోల్చిచూడవచ్చును. ఇట్టియుదాహరణల పెక్కింటిని మనమిదివరకే పూర్తిగ చర్చించియున్నాము. షాణ్మాసిక దివసమును, షాణ్మాసికరాత్రినిగూర్చిన పరిజ్ఞానమొక్క ప్రాచ్యఖండస్థులగు ఆర్యులకేగాక ఐరోపాఖండస్థులగు ఆర్యశాఖలవారికి కూడ పూర్తిగ గలదని నే నిదివరకే ఋజువుపరచియున్నాను. మరియు, మిక్కిలి యుత్తరముననున్న పారశీకస్వర్గమును గూర్చియు, అందలి ప్రజలకు సంవత్సరమొక్క దినముగ గన్పించుటను గూర్చియు, హిమప్రళయముచే నాస్వర్గమంతయు దట్టమైన మంచుక్రింద పడి పూడిపోవుటను

గూర్చియు, ‘వెందిదాదు’ గ్రంథమందు భద్రపరుపబడి యున్న ప్రాచీనపరంపరగూడ మన సిద్ధాంతమును ధృవపరుచుటకు ప్రబలప్రమాణముగ నున్నది. “ఆర్యుల మూలస్థానము ఫిన్లండు లేక తెల్లసముద్రప్రాంతములలో గలద”ని పాశ్చాత్యార్యగాథలు చెప్పుచున్నవి. కాని, వైదిక, అవెస్థిక గాథ లీ మూలస్థానము నింకను ఉత్తరమునకు తీసికొని పోవుచున్నవి. ఏలయనగ:– ముప్పది దినముల యవధిగల యఖండదీర్ఘయుషస్సు మనకు గావలె నన్నచో, అది యుత్తరధ్రువమునకు బహు దగ్గరలోనే గాని తదితర చోట్ల దొరకదు. ఈ ప్రకారముగ ఆర్యు లీ భూగోళముపై యే యక్షాంశమం దుండిరో స్పష్టముగ తెలిసికొనుట కవకాశమున్నను, యిందే ప్రత్యేక ప్రదేశమందుండిరో ఖండితముగ తెలియజెప్పగల సూచన లీగాథలయందెంత మాత్రమును లేవు. అనగ, ఐరోపాఖండమునకు ఉత్తరమున నుండిరా లేక, ఆశియాఖండమునకు ఉత్తరముననుండిరా యను నంశమును నిర్ధారణచేయుట కెట్టియవకాశములును చిక్కకున్నవి. కాని, యీప్రాచీనగాథలు తదితర శాఖలలోకంటె భారతీయ, పారశీక గ్రంథములందే యిప్పటికిని యెక్కువ బాగుగ భద్రపరుపబడియుండుటచే బహుశః ఆర్యులనుమూలస్థానము ఆశియాఖండమునకే యుత్తరముననుండి యుండవలెననుట యెక్కువ సమంజసముగ తోచుచున్నది. అనగ, స్కాండినేవియాలో నున్నదనుటకంటె, సైబీరియాకు ఉత్తర



ముననే యున్నదనుట యెక్కువ సమంజసముగ నుండును. కాని, యింతకంటెయెక్కువ ప్రమాణములు దొరకనప్పుడు యీ యంశములనుగూర్చి వట్టి యంచనాలను వేయుట నిష్ప్రయోజనము. ఏది యెట్లున్నను ప్రాచీనధ్రువమండల నివాసము మాట రూఢియే యని వైదిక అవెస్థికగ్రంథములు స్పష్టముగ సాక్ష్య మిచ్చుచున్నవి. హిమప్రళయమునకు పూర్వ మీధ్రువప్రాంతమందు మంచి సమశీతోష్ణపరిస్థితులు ప్రబలియుండెననికూడ యీగ్రంథములు సాక్ష్య మిచ్చుచున్నవి. కాని, ధ్రువమండలమందే ప్రత్యేకస్థలమందు ఆర్యులు కాపురముండిరో ఖండితముగ నిర్దేశించి చెప్పుట కింతకంటె యెక్కువ ప్రమాణములు మన కిప్పుడు లేవు. ఈయున్నవానితోడనే మన మిప్పుడు సంతృప్తిజెంది యుండవలెను. ఆధునిక భౌతికశాస్త్రజ్ఞులచే నేటివరకు చేయబడియున్న భూగర్భ, భూనిక్షేప పరిశోధనలయొక్క ఫలితాంశముల నన్నిటిని యీ గ్రంథారంభమందు క్లుప్తముగ వివరించియున్నాము. వీనివలన మానవకోటియొక్క ప్రాచీనచారిత్రము కొంతవరకు బోధ పడుచున్నది. మరియు, ఆశియా ఐరోపాఖండము లందలి యుత్తరభూము లన్నియు చతుర్థయుగ మందనేక హిమప్రళయములకు లోనయ్యెననియు కూడ యీపరిశోధనలవలన దెలియుచున్నది. క్రిందటి హిమప్రళయమునకు పూర్వ మీభూగోళముపై మానవజాతి లేనే లేదని మొన్నటివరకు భూగర్భశాస్త్రవేత్తలు

తలంచుచుండుటచే వారి భ్రమ ప్రమాదముల నన్నిటిని తొలగించుటకై యిటీవల ప్రబలిన భూగర్భశాస్త్రపరిశోధనల యొక్క సారాంశమునంతటిని యీగ్రంథారంభమం దిట్లు వివరింపవలసివచ్చినది. ఈసారాంశమును పరికించి చూచినచో మనధ్రువసిద్ధాంతము సమస్తపండితులచే ఖండితముగ నామోదింపబడిన యీయాధునిక భూగర్భశాస్త్ర పరిశోధనలతో సర్వవిధముల విధాయకముగ సరిపోవుచున్నది. మానవకోటి యొక్క ప్రాచీనత తృతీయ యుగమువరకుకూడ ప్రాకుచున్నదనియు, హిమప్రళయమునకు పూర్వ ముత్తరధ్రువమండలమందు మంచి సమశీతోష్ణస్థితి యుండెననియు, తదుపరి తటస్థించిన హిమప్రళయముచే నాసమశీతోష్ణస్థితి పాడైపోయి, మానవ నివాసమున కనుపయోగమయ్యెననియు మొదలగునట్టి ప్రధానాంశముల పెక్కింటిని ఆధునిక భూగర్భాదిశాస్త్రములు ఋజువుపరచి యిదివరకున్న భ్రమప్రమాదములను పూర్తిగ తొలగించి యుండనిచో మనధ్రువసిద్ధాంతము కేవల మసంభవమైపోయెడిదే. అతిచలిని, శీతకాలమును సూచించు వేద ప్రమాణములచే ధ్రువనివాసమును స్థాపించుటకై పండితు లిదివరకు చేసినకృషి యేలఫలింపలేదో మనమిప్పుడు సులభముగ గ్రహింపవచ్చును. ఏలననగ:— అసలు మొట్టమొదట, హిమప్రళయమునకు పూర్వమాప్రదేశమందు అతిచలిగాని, మంచుగాని లేనేలేదు. ఒకవేళ, అచ్చటచ్చట వేదవాఙ్మయమందు "శతంహిమం" వంటిపదములెచ్చటనైన గాన్పించినను,



అవి యామూలస్థానమందున్న అతిచలినిగాని, మంచునుగాని దెలుపుచిహ్నములని గ్రహించుటకును వీలులేదు. ఆర్యులకు మూలస్థానమైన యాధ్రువమండలమందు దీర్ఘరాత్రితో కూడిన శీతకాలము రాగనే ప్రాతసంవత్సర మంతమైపోవుటచే "శతంహిమం" వంటిపదము లాకాలమున వాడుకలోనికి వచ్చియుండును. మొట్టమొదట మంచి సమశీతోష్ణస్థితితో నొప్పారుచున్న యీభూమిని పాడుచేసినది యీ హిమప్రళయమేగాని వేరొండుగాదు. ఈహిమప్రళయము రాబట్టియే ఆభూమియంతయు మంచుక్రిందపడి పాడైపోయి మానవ నివాసమున కనుపయోగమయ్యెను. ఈయంశమే అవైస్థిక గ్రంథమం దింకొక రీతిగవర్ణింపబడియున్నది. ఐర్యనవైజో యను మూలస్థానము మొట్టమొదట స్వర్గతుల్యముగ నుండెననియు, తదుపరి అంగ్రమైన్యుడువచ్చి ఆప్రదేశమందతి చలిని, మంచును గల్పించి దానిని పాడుచేసెననియు వందిదాద్గ్రంథము చెప్పుచున్నది. అవైస్థిక వర్ణనమును, ఆధునికభూగర్భశాస్త్రపరిశోధనలును యీరీతిగ తూచినట్లు సరిపోవుచుండుటచే ఆర్యులేకాలమం దీయుత్తరధ్రువ మండలములో కాపురముండిరో మన మిప్పుడు సులభముగ నిర్ణయింప వచ్చును. ఎట్లననగ:— ఉత్తరధ్రువమండలమందు మంచి సమశీతోష్ణస్థితి హిమప్రళయమునకు పూర్వమందే యుండియుండవలెను గాని, హిమప్రళయానంతర

ముందుట కవకాశము లేదని ఆధునిక భౌతికశాస్త్రములు ఖండితముగ సిద్ధాంతీకరించి యున్నవి.

క్రిందటి హిమప్రళయము గతించి యిప్పటికి ౧౦ వేల సంవత్సరము లైనదనియు, ౮౦ వేల సంవత్సరములు కూడ నైనదనియు కొందరు భూగర్భశాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. వేదసూక్తములు పుట్టి క్రీ॥పూ॥ ౪౫౦౦ సంవత్సరములకంటె యెక్కువకాలము కాలేదని కొందరు పండితులు తలంచిరి. అందుచే, హిమప్రళయమునకు పూర్వమందున్న యైతిహ్యము లీహిమప్రళయమునకును వేదకాలమునకును మధ్య గతించిన యీవేలకొలది సంవత్సరములలో చెడిపోకుండ పారంపర్యముగ, కేవలవాగ్రూపములుగ భద్రపరుపబడియున్నవని తలంచుటకు వీలులేదని కొందరు వాదింపవచ్చును. కనుక, మనమీ విషయము నిచ్చట కొంచము విపులముగ చర్చించుట యవుసరమైయున్నది. తైత్తిరీయసంహితయందును, బ్రాహ్మణములందును నక్షత్రమాల కృత్తికలతో ప్రారంభమగుటచే వసంతవిషువ ఆకాలమందు (క్రీ॥ పూ॥ ౨౫౦౦) కృత్తికలలోనుండెనని సిద్ధించుచున్నది. కాని వేదవాఙ్మయమందన్నో మృగశీర్ష ప్రథమనక్షత్రమైనట్లు దెల్పు నిదర్శనములు పెక్కులు గానవచ్చుచున్నవి. తైత్తిరీయసంహితకంటె బహు పురాతనము లైనవని నిస్సందేహముగ స్థిరపరుపబడిన ఋగ్వేదసూక్తముల పెక్కింటినిబట్టిచూడగ వానియందు షుమారు క్రీ॥ పూ॥ ౪౫౦౦ సంవత్సరములను



సూచించు నిదర్శనము లనేకములు గన్పట్టుచున్నవి. అదిగాక, యీవసంత విషువనే ఒకప్పుడు అదితిచే యధిష్టింపబడిన పునర్వసు నక్షత్రమం దుండియున్నట్లు దెల్పు నిదర్శనములు వేదవాఙ్మయ మందచ్చటచ్చట కొద్దిగ గాన్పించుచున్నవి. ఈస్థితి క్రీ॥ పూ॥ ౬౦౦౦ సంవత్సరములక్రిందటమాత్రమే సాధ్యమైయుండగలదు. ఈయంశముల నన్నిటిని నేనిదివరకు రచించిన "మృగశీర్షా" గ్రంథములో వివరించియున్నాను. ఇంతకంటె ప్రాచీనములైన వసంతవిషువ స్థానములను వెదకి కనిపెట్టుటకై నేనిటీవల కొంతపరిశోధనను చేసియుంటిని. కాని, అట్టివి నాకేవియు చిక్కలేదు. దానికిమారుగ యీపరిశోధనలలో నాదృష్టి క్రమక్రమముగ ధ్రువనివాసమునుగూర్చియు, ధ్రువపంచాంగలక్షణములనుగూర్చియు దెల్పు ప్రమాణములతో నిండియున్న వేదవాక్యములచే యెక్కువగ నాకర్షింపబడుచువచ్చెను. ఈప్రమాణవాక్యములను సూక్ష్మముగపరిశీలించినకొలది నాకు చూడగ వైదికార్యులు షుమారు క్రీ॥ పూ॥ ౫, ౬ వేల సంవత్సరములక్రిందట మధ్యాసియాఖండస్థములగు సమప్రదేశములలో స్థిరనివాసము లేర్పరుచుకొని యుండిరని నాకుతోచినది. ఇట్లు వీరు మధ్యాసియాయందు స్థిరనివాసమేర్పరచుకొనిన నాటికి, తత్ప్రాచీన ధ్రువనివాసమునుగూర్చియు, అది మంచుచే నాశనమైపోవుటనుగూర్చియు, వైదికదేవతల ధ్రువోత్పత్తినిగూర్చియు దెల్పు పరంపరలు వీరికిబాగుగ తెలియునని నేనీవేద

వాక్యములచే గ్రహించితిని. కనుక, ధ్రువప్రదేశమును పాడు చేసిన క్రిందటి హిమప్రళయమును తీసికొనిపోయి మృగశీర్షా యుగమునకు చాల వేలసంవత్సరముల వెనుకబెట్టుట కవకాశ మీ వైదికపరంపరలయందు నా కెచ్చటను గాన్పించుటలేదు. నే నీప్రకారముగ వేసిన యంచనా అమెరికను భూగర్భశాస్త్ర వేత్తల సిద్ధాంతములతో చక్కగ నేకీభవించుచున్నది. కొండ లోయలకోతనుబట్టియు, బాగుగ పరిశోధించి నిశ్చయించిన తదితరాంశములనుబట్టియు చూడగ క్రిందటి హిమప్రళయము గతించి క్రీ॥పూ॥ ఎనిమిదివేల సంవత్సరములకంటె యెక్కువ కాలేదని యీ యమెరికను భూగర్భశాస్త్రవేత్తలు తీర్మానించి యున్నారు. ఈ యంశముల నన్నిటిని యీ గ్రంథారంభ మందు మొదటి రెండధ్యాయములలో వివరించియున్నాము. వైదికపంచాంగమును, తత్పరంపరలునుకూడ అమెరికను భూ గర్భశాస్త్రవేత్తలు తగుమాత్రముగ తగ్గించివేసిన యంచనాను స్వతంత్రరీతిగ బలపరుచుచున్నవనికూడ మనము చెప్పవచ్చును. రెండు స్వతంత్రరీతులుగచేసిన పరిశోధనలవలన ఒక్కటే సారాంశము తలవనితలంపుగ తేలినప్పుడు, "క్రోలు" మొదలగు పండితులు వేసిన ౨౦, ౮౦ వేల సం॥ల విపరీతపు అంచనాలను మనము త్రోసివేయవచ్చును. ప్రస్తుతము మనకు గల శాస్త్రాదిపరిజ్ఞానమును బట్టి చూచి నంత వరకైనను క్రోలుగారి యంచనాను త్రోసివేసి తత్ స్థానమున, క్రిందటి హిమప్రళయము గతించి తదనంతర



యుగమారంభమై యిప్పటికి షుమారు క్రీ॥ పూ॥ యెనిమిది వేల సంవత్సరములైనదను అంచనాను అంగీకరింపవచ్చును. ఈ హిమప్రళయానంతర యుగమునుండి మృగశీర్షాయుగము నకు వచ్చుటకు షుమారు 3 వేల సంవత్సరములు పట్టును. కనుక, హిమప్రళయాత్పూర్వమునాటి పరిస్థితులను దెల్పు పరంపరలను ఆర్యు లీమూడువేలసంవత్సరముల పొడవునను మరచిపోకుండ జాగ్రతగ, జ్ఞాపకముంచుకొనుచువచ్చి, యీ మృగశీర్షాయుగమందు వానిని వేదసూక్తములలో నిమిడ్చి పఠింపుచుండిరని చెప్పవచ్చును. దీనిలో అసంభవమేమియు లేదు. ( ఈ వేదసూక్తములు మృగశీర్షాయుగమందే యుత్పత్తి యైనట్లు స్పష్టముగు నిదర్శనములు గాన్పించుచున్నవి. ) వేయేల, మన వైదికపరంపరలు భౌతికశాస్త్రప్రమాణములకు విరోధముగ లేకపోవుటయేగాక, క్రిందటిహిమ ప్రళయకాల నిర్ణయమునుగూర్చి భౌతికశాస్త్రజ్ఞులు అతివిపరీతముగ వేయు వెర్రియంచనాలను క్రమప్రకారము తగ్గించి, చక్కగసరి చేయుటకే యుపకరింపుచున్నవి. మిత్రప్రమాణముగనున్న అమెరికను శాస్త్రజ్ఞుల యభిప్రాయమును మన మంగీకరించి నచో భూగర్భశాస్త్రపరిశోధనలును మన వైదికపరంపర లునుగూడ—ఒకేకాలమును సూచింపుచున్నవి. హిమ ప్రళ యానంతరమందు మనయార్యులు తమ జన్మస్థానమునుండి లేచిరావలసివచ్చిన కాలము క్రీ॥ పూ॥ షుమారు ఎనిమిది వేల సంవత్సరములై యుండుననీ దీనివలన తెలియుచున్నది.

ఒక్క వైదికపరంపరలే గాక, పౌరాణికపరంపరలను కూడ మనము సరిగ యర్థము చేసికొన్నచో అవికూడ యీ సారాంశమునే ధృవపరుచుచున్నవి. బహుదీర్ఘకాల యవధులలో యీభూగోళమును, విశ్వమునుకూడ అప్పు డప్పుడు ప్రళయమొందుచుండునని మనపురాణములు జెప్పుచున్నవి. ఈభూగోళమునకు చిన్నప్రళయమును, విశ్వమునకు పెద్ద ప్రళయమును తటస్థింపుచుండునని, పురాణములు జెప్పుచున్నవి. బ్రహ్మ తన పగటియందు మేల్కొని యున్నప్పుడు యీ సృష్టియుండునట; కాని, దివసాంతమం దాతడు నిద్రపోయినప్పు డీసృష్టి ప్రళయమొంది నాశనమగునట; మరల ఆత డుదయమున మేల్కొని తన పనిని ప్రారంభించుటతోడనే తిరిగి యీసృష్టియుత్పత్తి యగునట కావున, బ్రహ్మయొక్క సాయంప్రాతరములీ భూమికి ప్రళయ, ప్రభవములగును. బ్రహ్మయొక్క రాత్రిగాని పగలుగాని "కల్ప" మగును. బహుదీర్ఘకాలమును గణింపవలసివచ్చినప్పుడీ కల్పమును మానముగ గ్రహింతురు. రెండు కల్పములు కలిసినచో బ్రహ్మ కొక అహోరాత్రమగును. ౩౬౦ × ౨ = ౭౨౦ కల్పములైనచో బ్రహ్మ కొక సంవత్సరమగును. ఇట్టి సంవత్సరములు నూరైనచో బ్రహ్మకు పూర్ణాయుర్దాయమగును. బ్రహ్మకు నూరేండ్లు నిండగనే యీ విశ్వమంతయు మహాప్రళయమందు లయమగును. ఈ మహాప్రళయ మందుబ్రహ్మ కూడ లయమగును. కృత, త్రేతా, ద్వాపర, కలియుగములు కలిసి దేవతల కొక యుగ మగునని మనుధర్మశాస్త్రమును, భారతమును చెప్పుచున్నవి. ఇట్టి వెయ్యి దేవయుగములు కలిసి కల్పము లేక బ్రహ్మ కొక పగ లగును. ( 12, 000, 000 మానవ సంవత్సరములు — ఉభయ సంధ్యాకాలముతోసహా). ఈ కల్పాంతమందీ ప్రపంచము ప్రళయములో మునుగును. కాని, పురాణములలోని లెక్క దీనికి భిన్నముగ నున్నది. కృతత్రేతాద్వాపరకలియుగములు కలిసి మహాయుగమగునట; ౭౧ మహాయుగము లొక మన్వంతరము; ౧౪ మన్వంతరము లొక కల్పము; ఈ లెక్కప్రకారము కల్పమందు ౪, ౩౨౦, ౦౦౦, ౦౦౦ సంవత్సరములుండును. పురాణములకును, మనుభారతములకును నిట్టి భేద మేల గలిగె ననగ:— కృత త్రేతా ద్వాపర కలియుగములకు జెప్పిన సంవత్సరములు దేవమానమని పురాణములును, మనుష్యమానమని మను, భారతములును గ్రహించియున్నవి. ఈ మానభేదముచే ఇట్టి భేదముగల్గెను. ఈవిషయమై ఇంకను యెక్కువ వివరములు దెలుసుకొనదలచినవారు కీర్తిశేషులైన యస్. బి. దీక్షితులుగారు మరాటీభాషలో రచించిన "భారత జ్యోతిశ్శాస్త్రచరిత్ర"ను శ్రీమాన్ రంగాచార్య పండితులవారు "యుగముల"నుగూర్చి రచించిన వ్యాసమును, అయ్యరుగారు రచించిన "ప్రాచీనభారతకాలక్రమానుసరణి"ని(Chronology of ancient India)చూడవచ్చును. అయ్యరుగారు తమగ్రంథమందు యుగములను గూర్చియు, అందు ముఖ్యముగ కలి

యుగారంభమునుగూర్చియు, బహుసూక్ష్మముగను, సమగ్రముగను పరిశోధనజేసియున్నారు. ఒక్క ఆర్యభట్టుడు తప్ప తక్కినభారతజ్యోతిశ్శాస్త్రజ్ఞులందరును పౌరాణిక గణితమునే యవలంబించినట్లు గాన్పించుచున్నది. ౭౧ మహాయుగములకు మారుగ ఆర్యభట్టుడు మన్వంతరములో ౭౨ మహాయుగములు గలవని తలంచుచున్నాడు. మఱియు, మహాయుగమందు కృతత్రేతాద్వాపర కలియుగములు నాలుగు సమభాగములని కూడ ఆర్యభట్టుని యభిప్రాయము. పౌరాణికకాలగణన ప్రకారము మన * మిప్పుడు ప్రస్తుతకల్పమగు శ్వేతవరాహ కల్పమందు, యేడవదియగు వైవస్వతమన్వంతరముయొక్క ౨౮ వ మహాయుగములోని కలియుగములో అయిదువేల మూడుసంవత్సరములు గతించి, అయిదువేల నాల్గవసంవత్సరములోనున్నాము. అనగ, ప్రస్తుత కల్పారంభమందు తటస్థించిన ప్రళయము జరిగి యిప్పటికి ౧,౯౭౨,౯౪౯,౦౦౩ సం॥లైనదని యర్థము. శ్రీమాన్ రంగాచార్య పండితులవారు చెప్పినట్లు, యీ యంచనా ఆధునిక భౌతికశాస్త్రజ్ఞులచే యంగీకరింపబడిన పరిమితికంటె చాలవిపరీతముగ మించిపోవుచున్నది. ఈకల్పారంభమందుసూర్యచంద్రాదులును, గ్రహములును,— అన్నియు,—ఒకే ఋజురేఖ (Straight line) యందుండెనని హిందూ జ్యోతిశ్శాస్త్రజ్ఞులు తలంచిరి. కావున, సూర్యచంద్రాదులును, గ్రహములును యీరీతిగ, భూమి

* "ఇప్పుడ"నగ తిలకుగా రీగ్రంథమును రచించిన ౧౯౦౩ సం॥ లో.—



చుట్టు సంపూర్ణావృత్తులొనర్చివచ్చి, తిరిగి అన్నియుకలిసి యేకరేఖయందే, యేకకాలమందే, నిలుచుట కెంతకాలము పట్టునో గణితశాస్త్రరీత్యా మన జ్యోతిష్కులు బహుశః లెక్కవేసి చూచియె యీ యంకెను నిర్ధారణచేసియుండవచ్చును. అయినను, ఇది మన ప్రస్తుతాంశమునకు సంబంధింపమిచే మనమిప్పు డీవివరములలోనికి దిగిచూడవలసిన పని లేదు. ఈపౌరాణిక పద్ధతికి కృతత్రేతాద్వాపరకలియుగములే ప్రధానమూలము. కనుక, చతుర్యుగవ్యాప్తమైన యీమహాయుగలక్షణ మెట్టిదో మనమిట కొంతసూక్ష్మముగ పరిశీలింపవలసియున్నది. అసలు, మొదట దీనియందున్న భావమును, దీని కిప్పుడు పండితులు సాధారణముగ చెప్పుచున్న భావమును ఒకటి యగునో కాదో చూడవలసియున్నది.

శ్రీమాన్ రంగాచార్య పండితులవారును, ముఖ్యముగ అయ్యరుగారును యీయంశమునుగూర్చి మిక్కిలి సమర్థతతో తమ వ్యాసములందు చర్చించియున్నారు. వారి సారాంశములతో నేను చాలవర కేకీభవించుచున్నాను. "చాలవరక"ని యెందుకు చెప్పుచున్నాననగ, నేనొనర్చిన పరిశోధనలవలన యీ "దేవసంవత్సర" సిద్ధాంతమును కొట్టివేయవలసినదే యని నాకుకూడ స్వతంత్రరీతిగ దోచినను యీసందర్భమందింకను పరిష్కరింపబడవలసిన యంశములు చాలగలవు. ఇంక నెక్కువగ పరిశోధనజేసిన మీదటగాని, వీనినన్నిటిని పూర్తిగపరిష్కరించుటకు వీలులేదు. "యుగ"మనగ యొకానొక కాలపరి

మాణ"మను అర్థమందు ఋగ్వేదములో ప్రయోగింపబడి యున్నదని నేనిదివరకే దెలిపియుంటిని. మరియు, "మానుషా యుగా" యనుపదమందున్న "యుగ" శబ్దమునకు "మానసము" అను నర్థము చెప్పియే తీరవలెననికూడ వివరించియున్నాను. కాని, ఋ X, 72, 3 లోనున్న "దేవానాంప్రథమేయుగే" వంటి పదములలోనున్న "యుగ" శబ్ద మంతకంటె చాల యెక్కువ కాలమునే సూచించుచున్నది. అథ. వే. VIII, 2, 21 లో "మేము నీకు నూరు, (లేక) పదివేల సంవత్సరములను గాని, లేక ౨, ౩, ౪ యుగములను గాని, యిచ్చుచున్నాము" అని యున్నది. [ శతంతేఽయుతం హాయనాన్ద్వే యుగే త్రీణి చత్వారి కృణ్మః॥ ] ఇచ్చట "యుగ" శబ్దము ౧౦ వేలసంవత్సరములకు తక్కువగాని కాలమును దెలుపుచున్నది. అందుచేతనే, యీ అథర్వవేదవాక్యములో ("పదివేల సంవత్సరముల"ని మాత్రమే చెప్పి) "ఒక" యుగ మను మాట చెప్పకుండ బుద్ధిపూర్వకముగ వదలివేసినారని అయ్యరుగారు చెప్పిన యభిప్రాయమువాస్తమే. ఈ యభిప్రాయ ప్రకారము అథర్వవేదసంహితాకాలమునాటికి "యుగ" మనగ "పదివేలసంవత్సరములకాలమ"ని యర్థముచేసికొనవచ్చును. ఇంత కెక్కువ వీలులేదు. మను, మహాభారతకర్తలు కృతత్రేతాద్వాపర కలియుగములకు వరుసగ ౪, ౩, ౨, ౧ వేలసంవత్సరముల పరిమితుల నిచ్చియున్నారు. అనగ, కలియుగ సంఖ్యను ౨, ౩, ౪ లచే గుణించగ ద్వాపర, త్రేతా,



కృతయుగముల సంఖ్యలు క్రమముగవచ్చుచున్నవి. ('కృత' శబ్దమును లాటిన్ భాషలోనున్న "క్వాటుర్"— Quatuor — శబ్దముతో అయ్యరుగారు పోల్చియున్నారు.) సంస్కృత వాఙ్మయమందు "కృత"యనగ నాలుగను నర్థముగలదు. ఈ యర్థమునుబట్టి చూడగ, యీ యుగములపేర్లీసంఖ్యలను బట్టియే వచ్చినవని యనుకొనవచ్చును. కాని, యీ చతుర్యుగముల కాలపరిమితిని నిర్ణయించుటయే మన కిప్పుడు ప్రస్తుత కర్తవ్యము. ఈ చతుర్యుగములకు చెప్పబడిన సంఖ్యలనన్నిటిని కలిపినచో మొత్తము (౪+౩+౨+౧=౧౦) పదివేల సంవత్సరము లగును. దీనికే "మహాయుగ" మని పౌరాణికులు పేరిడిరి. మనువును, వ్యాసులవారును యీ పదివేల కింకొక ౨ వేల సంవత్సరములను కలిపిరి. చతుర్యుగముల మధ్యవచ్చు "సంధ్యా" లేక "సంధ్యాంశా" కాలములన్నియు కలిసి మొత్తముమీద రెండువేల సంవత్సరము లగునట. ఎట్లనగ:— కృతయుగము గతించిన తక్షణమే త్రేతాయుగము రాదు. కృతయుగమున కాద్యంతములందు చెరి నాలుగువందల సంవత్సరములును సంధ్యాకాల ముండునట. అట్లే త్రేతాయుగాద్యంతములందు చెరి ౩౦౦ సంవత్సరములు సంధ్యాకాల ముండును; ద్వాపరాద్యంతములందు చెరి ౨౦౦ సంవత్సరములును, కలియుగాద్యంతములందు చెరి ౧౦౦ సంవత్సరములును సంధ్యాకాలము లుండును. 'సంధ్యా'యనగ సాధారణముగ ఉషఃకాలమని యర్థము.

మనకు సాధారణముగ ౩౦ గడియల యహస్సులో ౩ గడియలు ప్రాతఃకాలమందు ఉషస్సును; ౩ గడియలు సాయంకాలమందు 'యీరెండయు' నుండును. ఈ సంధ్యాకాలముల యవధి యహస్సులో పదియవ వంతు గనుక, ప్రతియుగసంధికాలమునుకూడ ఆ యుగపరిమాణములో పదియవ వంతుగ నిర్ణయించిరని అయ్యరుగారు చెప్పుచున్నారు. కావున, యీ సంధ్యాకాలములు యిటీవల క్రొత్తగ చేర్పబడియుండవచ్చునని అయ్యరుగారి యభిప్రాయము. ఈ లెక్క ప్రకారము, సంధ్యాకాలములను కూడ కలుపుకొన్నచో చతుర్యుగముల పరిమితి పదివేలనుండి పండ్రెండువేలకు పెరుగుచున్నది. (అనగ, కృతయుగము ౪౮౦౦, త్రేతాయుగము ౩౬౦౦, ద్వాపరయుగము ౨౪౦౦, కలియుగము ౧౨౦౦). మనుశాస్త్రమునాటికే, లేక, మహాభారతము నాటికే, కలియుగమారంభమైనది. కనుక, కలియుగములో, వెయ్యి, లేక ౧౨౦౦ సాధారణ మానవ సంవత్సరములకంటె యెక్కువ లేనిచో, యీ కలియుగము షుమారు క్రీస్తుశకారంభమందే * అంతమొంది యుండును. పురాణములు క్రైస్తవశకమారంభమైన మొదటి ౧, ౨, శతాబ్దములలో పుట్టినట్లు గాన్పించుచున్నవి. కనుక, అప్పటికి కలియుగ మంతమైపోయి, (మరల) కృతయుగము జరుగుచున్నదనియే యర్థము. కాని, యీ పురాణములను వ్రాసినవా రప్పటికి కలియుగము గడచిపోయినదనిగాని, తా మప్పుడు కేవలము కృతయుగములోనే నివసింపుచున్నామనిగాని, యెంతమాత్రమును నమ్మియుండలేదు. ఏలననగ:—కృతయుగమనగ మహాపుణ్యయుగము; కాని, తాము నివసించుచున్న కాలమందు దేశము సర్వవిధముల క్షీణించియుండుటచే, అది కృతయుగముకాజాలదని వారిగట్టి నమ్మకము. అందుచే, యీ పౌరాణికులు కలియుగపరిమితిని పెంచుటకై దేవమానమును గల్పించిరి. ఒక దేవసంవత్సరము ౩౬౦ మానవసంవత్సరములకు సమానమనిరి. ఈ లెక్క ప్రకారము కలియుగమునకు చెప్పిన ౧౦౦౦ (లేక ౧౨౦౦) సం॥లను దేవసంవత్సరముల క్రిందికి మార్చిరి. దీనికి సహాయముగ వారికి "సంవత్సరమనునది దేవతలకొక దినమగు" నను తైత్తిరీయ బ్రాహ్మణవాక్యముదొరికినది. మనువును, వ్యాసుల

* మహాభారతం: వనపర్వం 188. అ. V. 21–28. (కలకత్తా ప్రతి) :—

"ఆదితో మనుజవ్యాఘ్ర. కృత్స్నస్య జగతః క్షయే। చత్వార్యాహుః సహస్రాణి వర్షాణాం తత్కృతం యుగం॥ తస్య తావచ్ఛతీ సంధ్యా సంధ్యాంశశ్చ తథావిధః। త్రీణి వర్ష సహస్రాణి త్రేతాయుగ మిహోచ్యతే॥ తస్య తావచ్ఛతీ సంధ్యా సంధ్యాంశశ్చ తతః పరం। తథావర్ష సహస్రే ద్వే ద్వాపరం పరిమాణతః॥ తస్యాపి ద్విశతీ సంధ్యా సంధ్యాంశశ్చ తథావిధః॥ సహస్రమేకం వర్షాణాం తథా కలియుగం స్మృతం। తస్య వర్షశతం సంధిః సంధ్యాంశశ్చ తతః పరం॥ సంధిసంధ్యాంశయోస్తుల్యం పరిమాణ ముపధారయ। క్షీణే కలియుగే చైవ ప్రవర్తతి కృతంయుగం॥ ఏషా ద్వాదశసాహస్రీ యుగాఖ్యా పరికీర్తితా। ఏతత్సహస్రపర్యంత మహర్బ్రాహ్మ ముదాహృతమ్॥"

వారును కలియుగమునకు వేయిసంవత్సరములనే చెప్పిరి. కాని, మను విట్లీచతుర్యుగ పరిమితులను, తత్సంధ్యాకాలములను చెప్పినపిమ్మట, దానివెంటనే, "యీ ౧౨౦౦ సం॥ల కాలమును దేవయుగమనబడును" అనికూడ చెప్పియున్నాడు. దీని నాధారముగచేసికొని ఆయాయుగములకు చెప్పబడిన సంవత్సరములను దేవసంవత్సరములక్రిందికి మార్చుట బహుసులభమై పోయెను. తాము కలియుగములోనే తప్ప యింకనే యితరయుగములోను నివసింపుచుండుట లేదని జనులు గట్టిగ తలంచుటచే యీ దేవమానపద్ధతి మిక్కిలి యనుకూలముగ నుండెను. అందుచే, పౌరాణికు లీపద్ధతిని తక్షణమే యవలంబించి, కలియుగమునకు చెప్పబడిన ౧౨౦౦ సాధారణ మానవసంవత్సరములను ఒక్కపెట్టున ౧౨౦౦ దివ్యసంవత్సరములుగ మార్చివేసిరి. (అనగ, ౩౬౦ X ౧౨౦౦=౪,౩౨,౦౦౦ సాధారణ సంవత్సరముల క్రిందికి మార్చిరి). ఈపద్ధతి ప్రకారమే మహాయుగపరిమితికూడ సరాసరి ౧౨ వేలనుండి (౧౨౦౦౦ X ౩౬౦) ౪౩,౨౦,౦౦౦ సం॥రములకు పెంచిరి. ఈరీతిగ, మన్వంతర, కల్పాదిపెద్దపెద్ద మానములుకూడ యెకాయెకిని పెరిగిపోయెను. ఈ దేవమానపద్ధతిని యవలంబించినప్పుడు మనపౌరాణికులు కలియుగారంభము నేరీతిగ క్రీ॥పూ॥ ౩౧౦౨ సంవత్సరమునకు మార్చిరో — ఆ జ్యోతిర్గణితమునంతను మనమిట వివరింపవలసిన పనిలేదు. ఇదియొక ప్రత్యేక విషయమైయున్నది. ఇది మన ప్రస్తుతాంశమునకు సంబంధింప



మిచే దీనిలోనికి మన మిప్పుడు దిగవలసిన పనిలేదు. కాని, యిట నొక మాటమాత్రము చెప్పిన చాలును. చరిత్ర మతముతో కలిసిపోయినప్పుడు, యెప్పటికప్పు డేదోవిధముగ సరిపెట్టుకొనుటకై యిట్టివే యేవో యుపాయములను పన్నవలసివచ్చుచుండును. దీనిలో అసంభవమేమియు లేదు. కనుక, ఐతిహాసికదృష్టితో ప్రాచీనచరిత్రను నిజముగ పరిశోధింపదలచినవారు మాత్ర మీ చరిత్రను మతమునుండి చక్కగ వేరుపరచితీరవలెను. సమ్మిళితమైయున్న యీ రెంటిని చక్కగ జల్లించి వేరుచేయవలెను. ఈ పని బహు కష్టసాధ్యమైనను ఐతిహాసికదృష్టితో పరిశోధించువారు మాత్ర మీ శ్రమపడకతప్పదు. శ్రీమాన్ రంగాచార్యులవారును, అయ్యరుగారును కూడ పై నుదహరించిన తమ వ్యాసములను వ్రాయుటలో యిట్టి శ్రమనే పడియున్నారు.

పైన వివరించిన యంశములనుబట్టి చూడగ మనుధర్మశాస్త్రము, మహాభారతము ననునీ రెండు గ్రంథములలో మాత్రము పదివేల సంవత్సరముల పరిమితిగల చాతుర్యుగచక్రముయొక్క చిహ్నములు యిప్పటికిని నిలిచియున్నవని స్పష్టమగుచున్నది. ఈ గ్రంథములు రెండును వ్రాసినకాలమునాటికే వేయిసంవత్సరములపరిమితిగల కలియుగము ప్రారంభమయ్యెనని కూడ తెలియుచున్నది. కృతయుగారంభము మొదలు కలియుగాంతమువరకు మొత్తము పదివేల (లేక సంధ్యలతోసహా ౧౨ వేల) మానవసంవత్సరముల యవధి

నొక్క- దానిని గూర్చియే మనువును, వ్యాసులవారును చెప్పుచున్నారుగాని, దేవసంవత్సరములమాట చెప్పుటలేదు. దీనిలో నింకొక యాశ్చర్యమేమనగ:—అథర్వవేదమందు "యుగ" శబ్దమునకు పదివేలసంవత్సరములే చెప్పబడియున్నవి. కనుక, కృతత్రేతాద్వాపరకలినామములచే నొప్పారుచున్న యీ పదివేలసంవత్సరముల యవధినే ప్రమాణముగ తీసికొని అథర్వవేదకర్తలు దానికి "యుగ" మను నామకరణ మొనర్చియుండవచ్చును.

ప్రళయానంతరమందు కృతయుగ మారంభమగునని వ్యాస, మనువులు చెప్పుచున్నారు. ( వారిరువురును ౧౨౦౦ సంవత్సరముల వ్యాప్తిగల కలియుగారంభమం దున్నారని మనమనుకొనవచ్చును. ) తమకుపూర్వము ౮౮౦౦ ( లేక షుమారు ౧౦ వేల ) సంవత్సరములక్రిందట జరిగినదని తమ పెద్దలవలన వినియున్న ప్రళయమునుగూర్చియు, తదనంతర కృతయుగారంభమునుగూర్చియు, వారు తమ గ్రంథములందిట్లొకానొక ప్రాచీనపరంపరను ఉదాహరించి యుందురు. అనగ, ప్రాతప్రపంచమును ముంచివేసి క్రొత్తప్రపంచమును దెచ్చిన యీ ప్రళయము వ్యాస, మనువులకు పూర్వము షుమారు పదివేల సంవత్సరములక్రిందట (౮౮౦౦ సం॥ ల క్రిందట ) జరిగియున్నదని యర్థము. కాని, యీ ప్రాచీనపరంపరను యిటీవల, యెవరికనుకూలమగునట్లు వారు మార్చిరి. అయినను, యీ ప్రాచీనపరంపరయొక్క నిజలక్షణములను



మనమిప్పుడు సులభముగగుర్తింపవచ్చును. ఇదియొకకష్టము కాదు. దీనియందున్న యీ నిజలక్షణముల నిట్లు గుర్తించిన మీదట తేలిన సారాంశమేమనగ:—ఈ నూతన ప్రపంచము ప్రారంభమై, అనగ, భూగర్భశాస్త్రరీత్యా, హిమప్రళయము గతించి క్రీస్తుశకమునకు పూర్వము పదివేల సంవత్సరములకంటె యెక్కువకాలేదని మనము తీర్మానింపవచ్చును. వేదములందున్న కాలక్రమానుసరణిని పరిశీలించి చూచినను కూడ యీ హిమప్రళయము గతించి యింతకంటె యెక్కువకాలము కాలేదని మన మిదివరకే చెప్పియుంటిమి. ఏలననగ:—మృగశీర్షాయుగమునాటి కింకను వైదిక ఋషులు తమ ప్రాచీనధ్రువనివాసమునుగూర్చిన పరంపరలను మరచిపోకుండ పూర్తిగ జ్ఞాపకముంచుకొనియేయున్నారు. కనుక, ఆర్యుల మూలస్థానముపైకి హిమప్రళయమువచ్చి క్రీస్తుశకమునకు పూర్వము పదివేల సంవత్సరములకంటె యెక్కువకాలము కాలేదనుట చాలవరకు నిశ్చయము. అమెరికను భూగర్భశాస్త్రవేత్తలు కూడ స్వతంత్రరీతిగ శాస్త్రపరిశోధనల నొనర్చిన పిమ్మట వారుకూడ యీ నిశ్చయమునకే వచ్చియుండిరని మన మిదివరకు చెప్పియుంటిమి. ఈ రీతిగ, వైదిక, పౌరాణిక, కాలక్రమానుసరణులు షుమారు ఒకే కాలమును సూచించుచున్నప్పుడు, కొందరు భూగర్భశాస్త్రవేత్తలు విపరీతముగ వేసిన ౨౦, ౮౦, వేల సంవత్సరములయంచనాలను పూర్తిగ త్రోసివేసి, మనమిప్పుడు సర్వసాధారణముగ క్రిందటి హిమ

ప్రళయము గతించి క్రీ॥ పూ॥ షుమారు ౮, లేక ౧౦ వేల సంవత్సరములైనదని యంగీకరింపవచ్చును.

ధ్రువనిలయమునుగూర్చియు, తన్నాశమునుగూర్చియు, తత్సంబంధమైన యితరాంశములను గూర్చియు తెలుపు పరంపర లిటీవల వైదిక అవెస్థిక గ్రంథములందు లిఖింపబడువరకు యేయేరీతులుగ చెడకుండ జాగ్రతగ భద్రపరుపబడియున్నవో మన మిట కొంత విచారింపవలెను. వంశపరంపరగ వచ్చుచున్న సత్యమగు చరిత్రాంశములే యిందు బొందుపరుపబడియున్న వనుటకు సందేహ మెంతమాత్రమును లేదు. ఏలననగ :– ఐరోపాఖండస్థులగు తదితర ఆర్యశాఖలలోకూడ ఇట్టి పరంపరలే గానవచ్చుచున్నవి. వీనిని పరిశీలించిన ‘ రీసు ’ పండితుడుకూడ యీ నిశ్చయమునకే వచ్చియున్నాడు. మన పవిత్రగ్రంథము లన్నియు మొదటినుండియు యేరీతిగ భద్రపరుపబడుచు వచ్చుచున్నవో కొంచెము గ్రహించినచో, ఇది యొక యసంభవముగ గాన్పింపదు. వ్రాతయు, ముద్రణాయంత్రములు నున్న యీకాలమందు మనము మన జ్ఞాపకశక్తిపై (మెదడుపై) అంత యాధారపడవలసిన యవసరము లేదు. మన జ్ఞాపకశక్తిని మొదటినుండియు బహు కఠినసాధనకు లోబరచి తగిన శిక్షణము నొసంగినచో దానివలన యెట్టి మహాద్భుతకార్యముల గావింపవచ్చునో మన మెరుంగుట కిప్పుడవకాశము లేదు. భరతఖండస్థులగు బ్రాహ్మణులు ఋగ్వేదమునంతను—వేయేల, వేదమును, తదనుబంధములగు తొమ్మిది



గ్రంథములను కూడ — తు,చ, తప్పుపోకుండ, ప్రతి యక్షరమును, ప్రతిస్వరమును కూడ బహుజాగ్రతగ యిప్పటికి కనీసము ౩, ౪, వేల సంవత్సరములనుండి తమధారణాశక్తిచే భద్రపరచియుంచి యున్నారు. నిన్న మొన్నటివారగు యీ బ్రాహ్మణులే యిట్టి యద్భుత కార్యమొనర్చి యుండగ, ఆ కాలమునాటి బ్రాహ్మణులు ప్రాచీన ధ్రువ నివాసమును గూర్చిన పరంపరలను తమ పవిత్రగ్రంథములలోని కెక్కించునంతవరకు బహు జాగ్రతగ, యెక్కడ తప్పకుండ, తమ ధారణాశక్తిచే భద్రపరచియుండిరని మనము గట్టిగ చెప్పవచ్చును. బహుకాలసాధనచే మహాశక్తిమంతమైన యీ ధారణాశక్తి యొనర్చు మహాద్భుతకార్యములు మన కిప్పుడు చాల వింతగ దోపవచ్చును. కాని, ఆదినములలో నిది యొక సర్వసామాన్యమైన కార్యముగనే యుండెను. ఆదినములలో పుస్తకములు లేవు గనుక, వారు తమ జ్ఞాపకశక్తిపైననే యెక్కువ ఆధారపడవలసి యుండెను. అందుచేతనే వారు ప్రత్యేకము తమ ధారణాశక్తిని యెక్కువ శ్రద్ధగ సాధనచేసి, దానిని క్రమమైన శిక్షణమం దుంచెడివారు. అత్యంతశ్రద్ధగ తాము శాశ్వతముగ జ్ఞాపకముంచుకొనవలసిన విషయముల నన్నిటిని వారిట్లు సుశిక్షితమైన ధారణాశక్తిచే వంశపారంపర్యముగ సంక్రమింపజేయుచుండిరి. ఈధారణాశక్తియే వారికీకార్యమం దత్యంతవిశ్వసనీయమైన సాధనముగనుండెను. మనపవిత్రగ్రంథములలోని వాక్యము లొక్కస్వరమైనను తప్పకుండ

బహుజాగ్రతగ వంశపారంపర్యముగ భద్రపరచి యుంచుటకై తమమెదడును అతికఠిన శిక్షలకు లోబరచి, తమధారణాశక్తిని సాధనజేయుటయే తమ జీవితములో ప్రత్యేకవృత్తిగ పెట్టుకొనియున్నవారిని జూచి యధిక్షేపించుట మన కిప్పుడాచారమైపోయినది. ఇట్టివారు "బరువులను మోయుజంతువుల"ని యాస్కాచార్యులవంటి పండితులుకూడ ఆక్షేపించి యున్నారు. "అర్థజ్ఞానశూన్యముగ చిలుకపలుకులు బలుకువార"ని మరికొందరాక్షేపించియుండిరి. కాని, ప్రాచీనమానవకోటియొక్క నిజచరిత్రను, మతమును, తెలిసికొనుటకై యీ "చిలుకపలుకుల బలుకువారే" మనకిప్పు డెంతమహోపకారమొనర్చియుండిరో లెక్కింపతరముగాదు. అనాదినుండియు వచ్చుచున్న ప్రాచీనపరంపరలన్నియు మధ్య శిథిలముగాకుండ వీరు తమమెదడునం దిప్పటివరకు బహుజాగ్రతగ భద్రపరచి యున్నారు. ప్రత్యేకముగ సక్రమశిక్షణమునొందిన ధారణాశక్తియొకటియున్ననేగాని వీనినిట్లు భద్రపరుచుటకు సాధ్యము కాదుగద. ప్రత్యేకమీగ్రంథములను వల్లెవేయుటయే తమ వంశపరంపరానుగతమగు వృత్తిగ—పవిత్రమగుకార్యముగ—భావించుకొని కొందరిట్లు పరిశ్రమచేయుటచేత నేగద యిన్ని ప్రాచీనపరంపర లెన్నియో వేలసంవత్సరములనుండి యిప్పటివరకు చెక్కుచెదరకుండ మనకు భద్రముగ లభించినవి! కావున, వీరీవిషయమైచేసిన మహోపకారమును మన మెన్నటికిని మరువజాలము. వీరొనర్చిన మహోపకారమునకై



వీరియెడ మనమెంతయు కృతజ్ఞులమై యుండకతప్పదు. పండితులీవేదసూక్తముల నిప్పుడు విశదీకరించి అర్థముచెప్పవచ్చును; వానికెన్నియేని సమగ్రవ్యాఖ్యల నిప్పుడు వ్రాయవచ్చును. కాని పూర్వకాలమందు కొందరీవాక్యములను వల్లెవేయుటయే ప్రత్యేకవృత్తిగ పెట్టుకొనియుండకపోయినచో యీ పండితు లిప్పు డేమిచేసెడివారు? ఇవన్నియు యెన్నడో శిథిలములైపోయెడివేగదా? ఇవి యానాడే శిథిలములైపోయి యున్నచో పండితుల కిప్పుడొక్క ఆధారమైనను దొరికెడిదే కాదుగద. అసలు మూలాధారమే లేనప్పు డీపండితు లేమి చేయగలరు? కావున మన మిప్పు డీప్రధానాంశమును మాత్రమెన్నటికిని మరువజాలము. కాని, కొందరింకొకరీతిగ వాదింపవచ్చును. ఈవిధముగ గ్రంథములను వల్లెవేయుట పూర్వమం దవసరమైయున్నను ముద్రణాది సాధనాంతరములచే దాని యవసరమిప్పుడు తీరిపోలేదాయని కొందరడుగవచ్చును. దాని యవసరమిప్పుడు తీరిపోయినదని ఖండితముగ చెప్పుటకు వీలులేదు. ఏలననగ, యీవిషయములో సుశిక్షితమైన ధారణాశక్తిముందర యీ ముద్రణాదిసాధనము లంతగ విశ్వసనీయములుగావు. మరియు, ప్రపంచములో ప్రతిదేశములోను యే యాచారములైనను నశించునుగాని మతాచారములు మాత్రమంత త్వరగ నశింపవు. కావున, ఒకవేళ యీ యాచారముయొక్క యవసర మిప్పుడు తీరిపోయినదని యనుకొన్నను, యిది చిరకాలమునుండియు వచ్చుచున్న మతాచారమగుటచే యింత త్వరలో నశింపజాలదు.

సక్రమ శిక్షణమునొందిన ధారణాశక్తిచే చెక్కుచెదరకుండ భద్రపరుపబడి యున్నట్టియు, నేటివరకు జరిగిన భూగర్భ, భూనిక్షేప, గాథాశాస్త్రాది పరిశోధనలవలన సంపూర్ణముగ ఋజువైనట్టియు, వైదిక అవైదికపరంపరలు హిమప్రళయాత్పూర్వమం దార్యసంతతు లుత్తరధ్రువమండలమందు నివసించి యుండిరనియు, క్రిందటి హిమప్రళయమం దాభూమి పాడైపోవుటచే వా రచ్చట నుండి లేచి దక్షిణాభిముఖముగ బయలుదేరి వచ్చి, తదనంతరయుగమందు క్రీ॥ పూ॥ షుమారు ౮ వేల సంవత్సరముల నాడు ఉత్తర ఐరోపాభూములందో, లేక మధ్యాసియాయందో ప్రప్రథమమున స్థిరనివాసము లేర్పరచుకొనవలసి వచ్చెననియు, పూర్తిగ ఋజు వగుచున్నది. ఈరీతిగ, ఆర్యుల ప్రాచీనతను హిమప్రళయాత్పూర్వమునకు గొనిపోతిమి; మరియు, వారి ప్రాచీననివాసస్థానమును ఉత్తరధ్రువప్రాంతములకు గొనిపోతిమి. ఈ ఒక్క ప్రదేశమందే ౩౦ దినముల పరిమితిగల యఖండదీర్ఘ ఉషస్సు సాధ్యముగాగలదు. ఆర్యసంతతులే గాక, తదితర మానవజాతులుకూడ వీరితోపాటు ధ్రువప్రాంతములం దప్పుడు నివసించి యుండిరా లేదా యను విషయ మీ గ్రంథమునకు సంబంధింపదు. ప్రాచీనకాలమందు ఈజిప్షన్, అక్కేడియన్, అస్సీరియన్, బాబిలోనియన్, చీనా, జపాన్, జాతులుకూడ ధ్రువప్రాంతములం దుండియున్నట్లు దెల్పు ప్రాచీనపరంపరల కొన్నింటిని డాక్టరు వారెన్ గారు "స్వర్గము దొరికె" నను



తమ గ్రంథమునం దుదాహరించి యున్నారు. వీని నన్నిటిని పరిశీలించి చూచినమీదట, సమస్తమానవకోటియొక్కయు పుట్టినిల్లు (లేక, పురిటి యుయ్యాల) ధ్రువమండలమందే గలదని డాక్టరు వారెన్ గారు తీర్మానించి యున్నారు. ఈ తీర్మానమునే తదితర పండితులుకూడ బలపరచియున్నారు. తదితర మానవజాతుల ప్రాచీనపరంపరలు కూడ ఉత్తరధ్రువము వైపునకే సూచించుచున్నవని చెప్పుటచే మన మింతవరకు ఋజువుపరచుచున్న సిద్ధాంతమున కేమియు విరోధము రాజాలదు. ఏలననగ, ఉత్తర ధ్రువమం దార్యులొక్కరు మాత్రమే కాపుర ముండిరని మే మెన్నడును వాదింపలేదు. అదిగాక, ఋగ్వేదమందు తరుచుగ "పంచజనాః" యని చెప్పబడుచు వచ్చిన మానవజాతులైదును బహుశః ఆ కాలమం దార్యులతోపాటు ధ్రువమండలమందు నివసించియున్న తదితర మానవ జాతులై యుండనోపునని చెప్పుటకు కూడ అవకాశములు గలవు. ఏలననగ:— ఆర్యులామూలస్థానమునుండి లేచివచ్చినపిమ్మట, తమ సంచారములో క్రొత్త జాతుల నైదింటిని మాత్రమే కలిసికొనిరనిగాని, లేక, తా మైదుశాఖలుగ మాత్రము చీలిపోయిరనిగాని, తలంపజాలము. ఏదియెట్లున్నను, యింక నెంతయో పరిశోధన గావించిన పిమ్మటగాని యీసమస్యను పూర్తిగ పరిష్కరించుటకు వీలులేదు. ఆర్యులమూలస్థానమును నిర్ణయించు సమస్యతో యిది సంబంధింపదుగాన దీనినిటవిరమింతము. సమస్తమానవకోటియు

మొట్టమొదటపుట్టిపెరిగిన పురిటియిల్లార్యుల ఉత్తరధ్రువమండల మందే యున్నదని పండితులు ఖండితముగ నిశ్చయించినచో, మన మింతవరకు వైదిక, అవైస్థికపరంపరల ప్రమాణములచే ఋజువుపరచిన సిద్ధాంతము నది యెంతమాత్రమును బాధింపజాలదు. కాని, ఆర్యుల ప్రాచీన ధ్రువనివాసమును మే మిప్పుడు మరియొక స్వతంత్రమార్గమున ఋజువుపరచినచో, మానవకోటియంతయు మొదట అచ్చటనే పుట్టెనని చెప్పు సిద్ధాంతమున కది మరింత బలము నిచ్చును. తక్కిన మానవ కోటియందరికంటె పారశీకులును, భారతీయులునే ప్రాచీన పరంపరలను తమ పవిత్రగ్రంథములం దెక్కువ బాగుగ భద్రపరచి యున్నారను మాట నిర్వివాదమగుటచే, మానవకోటి యందరిమాట యటుంచి, ముందీయార్యుల మూలస్థానమును గూర్చియే స్వతంత్రముగ విచారించుట యెక్కువ సమంజసముగ నుండును. ఇదియే మంచిపద్ధతి. అవస్థ, వేద, గ్రంథములార్యసంతతికి అతిప్రాచీనగ్రంథము లనుమాట సత్యమే యని పండితులెల్ల రిప్పు డంగీకరించియున్నారు. ఆధునిక భౌతిక శాస్త్రపరిశోధనల నాధారముగ గైకొని మన మిప్పు డీగ్రంథములను పరిశీలింప మొదలిడినారముగాన యిందున్న ప్రాచీన పరంపరలనుబట్టి ఆర్యుల మూలస్థానమును నిర్ణయించుట యొక కష్టము గాదని మన మిదివరకు చూచి యుంటిమి. ప్రాచీనకాలమం దార్యులు ఉత్తరధ్రువమండలమం దుండిరని మన మిప్పుడొకసారి నిర్వివాదముగ సిద్ధాంతీకరించినచో, వారి



ప్రాచీనసభ్యతనుగూర్చియు, చరిత్రనుగూర్చియు, యిప్పటి వారికున్న యూహలు పూర్తిగ మార్పుజెందవలసి వచ్చును. ఆర్యుల ప్రాచీననికేతనము మధ్యాసియాయం దుండెనని యిదివరకు తలంచిన పండితు లేయభిప్రాయపడిరనగ:– ఆర్యులు తమ యనాది మృగప్రాయత్వదశనుండి గడచి వేదసూక్తములందు గానవచ్చుచున్న నాగరక స్థితికివచ్చుటకు గావలసిన సాంఘిక, నైతిక, వైజ్ఞానికాది పురోభివృద్ధినంతను వారు మధ్యాసియా ఖండస్థములగు సమప్రదేశములలో కాపురమున్న కాలమందే సంపాదించిరని యీ పండితుల యభిప్రాయము. ఉషఃకాలమందు ప్రాగ్దిశను గానవచ్చు మహాద్భుత చిత్రవిచిత్రములను, నూతనారుణకాంతులను, తేజోమయ మూర్తియై యుదయించుచున్న బాలభాస్కరుని, భక్తిభయభ్రాంతులతో ఆర్యులు మొట్టమొదట మహాశ్చర్యముగ తేరిపారజూచిన దీమధ్యాసియాఖండస్థములగు సమప్రదేశములందేనట! తమపై ఆకాశమునం దంతటను నవనీరదమాలికలు దట్టముగ నలముకొని యటునిటు పర్వులిడుచుండుటయు, అంతట వర్షాధిదేవత మహాగంభీర గర్జన మొనర్చుచువచ్చి తన కులిశాయుధముతో నామేఘమాలికల జీల్చివైచి భూమిపై వర్షముకురిపించుటయు మొదలుగాగల మహాద్భుత వాతావరణ పరిస్థితులను ఆర్యులు మొట్టమొదట తమ కండ్లారగాంచి వినయవినమితగాత్రులైన దీప్రదేశమందేనట ! దీనినుండియే పృథివ్యాది మహాభూతసంఘముల నుపాసించు

పద్ధతి ప్రారంభమయ్యెనట! దీనినుండియే తనుపరిపుట్టిన యార్యగాథలన్నియు బయల్వెడలెనట! బట్టల నేయుపద్ధతిని వీరిచ్చటనే మొట్టమొదట నేర్చుకొనిరట! వారంతకు పూర్వము వస్త్రములకుమారుగ చర్మములను ధరింపుచుండిరట! మరియు, రథములనుకట్టుట, గుఱ్ఱములను మాలిమిచేయుట, వెండిబంగారు మొదలగు ధాతువుల ప్రయోజనమును గనిపెట్టుట, మొదలుగాగలవాని నన్నిటిని ఆర్యులు మధ్యాసియాయందే మొట్టమొదటగ నేర్చుకొనిరట! నేయేల, ఆర్యశాఖ లన్నింటియందును సర్వసాధారణముగ సమానముగ, గన్పట్టుచున్నట్లు భాషాపరిశోధనలవలన ఋజువైన నాగరకతా లక్షణములన్నియు మొట్టమొదట ఆర్యులందరును కలిసి హిమ ప్రళయానంతరమందు మధ్యాసియాభూములలో యేక కుటుంబముగ కాపురమున్న కాలమందే పుట్టియుండెనని పండితులు తలంచియున్నారు. ఆర్యుల ప్రాచీనసభ్యతనుగూర్చి భాషా పరిశోధనలవలన నిశ్చయింపదగిన యనేకాంశములను, వాద ప్రతివాదములను డాక్టరు "స్క్రేడర్" గారు తమ * గ్రంథమందు సమగ్రముగ పేర్కొనియున్నారు. ఈ విషయములో మాత్రమీగ్రంథరాజముతో సమానమైన దింకొకటి లేదని చెప్పవచ్చును. ఐతిహాసికదృష్టితో గాని, భాషాపరిశోధక దృష్టితో గాని చూచినవారికీగ్రంథమందలి భాషాపరిశోధనలు చాల

* "ఇతిహాసపూర్వకాలికములగు ప్రాచీనార్య చరిత్రాంశములు" (Prehistoric antiquities of the Aryan peoples.)



ప్రయోజనకారులుగ గన్పట్టవచ్చును. కాని, ఆర్యులప్రాచీన నికేతనమెచ్చటనుండెనో, వారచ్చట యేకాలమందు నివసించిరో, యేకాలమం దచ్చటనుండి లేచివచ్చిరో — మొదలు గాగల ప్రధానాంశములు తెలియనంతవరకుమాత్ర మీ కేవల భాషాపరిశోధనలవలన కించిత్తైనను లాభములేదు. పైగా అవి మనలను తప్పుత్రోవలోనికి యీడ్చుకొనికూడపోవచ్చును.

ఉదాహరణము :— ఆర్యులు శాఖలుగ చీలిపోక పూర్వమే వారికి గోవునుగూర్చి బాగుగ తెలియుననియు, వారు దానిని మచ్చిక చేసిరనియుకూడ ఆయా ఆర్యభాషల నిప్పుడు పరిశోధించుటవలన మనము కనుగొనవచ్చును. అట్లే వారికప్పుడు బట్టల నేతపనికూడ తెలియునని గనుగొనవచ్చును. ఏలననగ:— గోవు, నేత, యను రెండుపదములును సమస్తఆర్యభాషల లోను గాన్పించుచున్నవి. కాని, యిప్పు డీవివిధ ఆర్యభాషలను మాట్లాడు యీ యార్యశాఖలవారందరు పూర్వమేక కుటుంబముగ కలిసి కాపురమున్నస్థల మెద్దియో, వారెప్పుడెట్లు చీలిపోయిరో, ఖండితముగ నిర్ణయించుటకీశబ్దసాదృశ్యములు మనకంతగ తోడ్పడజాలవు. ఇదియట్లుండగ, యిటీవల భూగర్భమునుండి త్రవ్వియెత్తబడిన పురాతన వస్తుసముదాయమును, మనుష్యుల పుఱ్ఱెలు, యెముకలు, మొదలు గాగల వానిని పరిశోధించుటవలన తేలిన సారాంశ మేమనగ:- ఆర్యులు మొట్టమొదట మధ్యాసియాయం దుండిరనియు, తదుపరి యచ్చటనుండి యనేకశాఖలుగ చీలి ఐరోపాఖండము

లోని వివిధ ప్రాంతములకు పోయిరనియు, చెప్పు సిద్ధాంతము అసంభవమనియీయాధునికపరిశోధనలవలన ఋజువుచేయబడి యున్నది. కనుక, ఆర్యుల మూలస్థానము మధ్యాసియా యందుండెనని చెప్పుసిద్ధాంతము యిప్పుడు పూర్తిగ త్రోసి వేయబడెననియే చెప్పవచ్చును. ఇప్పు డైరోపా దేశములలో కాపురమున్న ప్రజలయొక్క పూర్వతరములవారే యుత్తర శిలాయుగారంభమందుకూడ ఐరోపాఖండములో కాపురముండి యుండిరని కొందరుపండితులు చెప్పుచున్నారు. కాని, దీని లోని చిత్రమేమనగ:— ఉత్తరశిలాయుగారంభమం దిట్లు ఐరోపాయందు కాపురముండియుండిరని చెప్పబడుచున్న యీ పూర్వతరములవా రసలు ఐరోపాయందే పుట్టిరా, లేక, మరి యేయితరదేశములనుండియైన యిచ్చటికి వలసవచ్చిరా యను సంశయముమాత్ర మీపండితులు నిర్ధారణచేయక వదలివేయు చున్నారు. ఐరోపాఖండమందు పూర్వశిలాయుగములోకూడ యిప్పటివారి పూర్వజులే కాపురముండి రనుమాటను మన మంతగ పాటింపనక్కరలేదని "క్యానన్ టైలరు" గారు "ఆర్యుల యుత్పత్తి" యను తమగ్రంథమందు చెప్పుచున్నారు. ఏల ననగ:—"ఆర్యభాషలు పెంపొందుటకును శాఖలుగ చీలిపోవు టకును కావలసినంతకాలము ఉత్తరశిలాయుగమునందే గలదని భాషాశాస్త్రజ్ఞులు బహుశః ఒప్పుకొందురు"ని క్యానన్ టైలరు గారు చెప్పుచున్నారు. ఇప్పుడు వివిధ ఆర్యశాఖలలో గాన్పించుచున్న గాథలుకూడ ఆర్యులుచీలిపోయిన పిమ్మటనే



పుట్టెనని వీరిగ్రంథమందు చెప్పుచున్నారు. ఒకవేళ, "ద్యాయస్-పితర్," "జ్యూపిటర్; వరుణ, వరేణ;—వంటిపోలిక లెచ్చటనైన గాన్పించినను అవి కేవలము శబ్దములమీది పోలికలే గాని, అసలీగాథలయొక్క యుత్పత్తియొక్కటే యని యర్థము కాదట! వేయేల, ఆర్యుల ప్రాచీనమూలస్థానము మధ్యాసియాయందుండెనని వాదించువారును, ఉత్తర యైరోపాయందుండెనని వాదించువారునుకూడ — ఉభయులును—ఆర్యసభ్యతయొక్క యుత్పత్తిని హిమప్రళయమున కావలి వైపునకు తీసికొనిపోవుట కిష్టపడకున్నారు. ఈసభ్యత యంతయు హిమప్రళయమున కిటీవలనే పుట్టెనని వీరిమతము. కనుక, ఆర్యుల మతమునకుగాని, గాథలకుగాని, యింతకంటె యెక్కువ ప్రాచీనతనిచ్చుటకు వీలులేదని వీరుచెప్పుచున్నారు. ఆర్యుల యుత్పత్తినిగూర్చియు, వారి ప్రాచీన నాగరకతను గూర్చియు, యిదివరకు చేయబడుచున్నట్టి యూహాలను, యోచనలను - అన్నింటిని - మన ధ్రువసిద్ధాంత దృష్టితో నిప్పుడు పునర్విమర్శన గావింప వలసియున్నది. ప్రాచీనార్యులు హిమప్రళయానంతరమందే పుట్టిరని మన మిప్పుడు చెప్పజాలము; ఉత్తరశిలాయుగములో మధ్యాసియాయందో లేక ఉత్తర యైరోపాయందో యుండగ వారు పశుత్వమునుండి నాగరకతలోనికి వచ్చిరనియు మన మిప్పుడు చెప్పజాలము. ఇప్పుడున్న వివిధఆర్యశాఖలవారి ప్రాచీనగాథలలో నొకే విధమగు దేవతలు గాన్పింపనందున యీగాథలన్నియు నిటీ

వల—అనగ, ఆర్యులు చీలిపోయినపిమ్మట—పుట్టినవని వాదించుటకును వీలులేదు. ఉదాహరణము:-కొంద రిట్లనివాదించుచున్నారు:-"ఉషస్సు" అను సంస్కృతశబ్దము పారశీక భాషలో "ఉషంఘ్" అనియున్నది; దీనిని "ఈయోస్" అను గ్రీకుశబ్దముతోను, "అరోరా" యను లాటిన్ శబ్దముతోను, "ఔజ్రా" యను లితుయేనియన్ శబ్దముతోను, "అసుస్ట్రో" యను ట్యూటానిక్ శబ్దముతోను, "ఒస్త్ర" యను ఆంగ్లోశాగ్జన్ శబ్దముతోను పోల్చుటకు వీలున్నను, ఒక్క వైదిక గాథలందుమాత్రమే యీయుషస్సు ప్రాతఃకాలిక దేవతగ పరిగణింపబడియున్నది. తక్కిన ఆర్యజాతులవారిగాథలలో దీనికింతటి యున్నతపదవి (దేవతాపదవి) యొసంగబడలేదు. ఈ యంశమునుబట్టి "ఉషస్సు" ను పూజించుపద్ధతి ఒక్క భారతదేశమందే యుత్పన్నమయ్యెనని మన మూహింపవలెనట. కాని, మన ధ్రువసిద్ధాంతముచే నిప్పు డిట్టి యూహ చేయుటకు సాధ్యపడదు. ఉషాదేవత కేవలము ధ్రువలక్షణములతో నలంకరింపబడియున్నమాట నిర్వివాదము. ఈ రీతిగనే, తదితరవైదిక దేవతలుకూడ ధ్రువలక్షణములతో, నిస్సందేహముగ, నొప్పారుచున్నప్పుడు యీదేవతలకు సంబంధించిన గాథలు మధ్యాసియాభూములలో పుట్టెనని మనము వాదింపజాలము. తేజఃపుంజముల నతిశోభాయమానముగ వెదజల్లుచున్నట్లు ఋగ్వేదమునందు వర్ణింపబడియున్న యుషస్సును గూర్చి భరతఖండములో కాపురమున్న యాజ్ఞికు లారీతిగ



నెన్నడును తమ మనస్సులందు భావించియుండజాలరు. ఇట్టి పటమును వారిమనస్సులందు చిత్రించుకొనుట కెంతమాత్రమవకాశమేలేదు. ఇది సాధ్యమేకాదు. ఏలననగ:—మనమీ భరతఖండములోనిత్యమును జూచు ఉషస్సు ముహూర్తమాత్రజీవనముగలది. ఇది క్షణములో మాయమైపోవును. కాని, ఋగ్వేదములో వర్ణింపబడిన యుషస్సు దీర్ఘఉషస్సు. అనగ, ధ్రువమండలమందలి యతిదీర్ఘఉషస్సు. కనుక, మన మిచ్చట మామూలుగ నిత్యమును జూచుచుండు ముహూర్తమాత్రజీవనముగల ఉషస్సునకును, ఋగ్వేదమందలి దీర్ఘఉషస్సునకును చాల భేదముగలదు. ఇదేరీతిగ, తక్కినవైదిక దేవతలందరుకూడ ధ్రువలక్షణములతోడనే యొప్పారుచున్నారు. ఇంద్ర, వృత్రులు; నిరుద్ధజలములు; శీతకాలము నాలుగునెలలు నిద్రబోవు విష్ణుడు; బావిలోపడిన త్రితదేవత; అప్పు డస్వస్థులగు దేవతలకారోగ్యమును గలుగజేసి కాపాడుచున్న అశ్వినీదేవతలు; — వీరందరు ధ్రువలక్షణములతోడనే యొప్పారుచున్నారు. కేవల మీపేర్లే కెల్టిక్, ట్యూటానిక్, గాథలలో నుండకపోవచ్చును. కాని, యీకెల్టిక్, ట్యూటానిక్ గాథలను పరిశోధింపగ నివికూడ ధ్రువలక్షణములనే సూచించుచున్నవి. ఇందలిదేవతలుకూడ వైదికదేవతలవలెనే ధ్రువలక్షణములతో నొప్పారుచున్నారు. ప్రధానాంశములతో నివియు ఏకీభవించుచుండగ ఆర్యశాఖలలోనిగాథలన్నియు నొకమూలమునుండియే పుట్టలేదని వాదించుట సబబుకాదు; మరియు దేవతల పేర్లలో

పోలికలున్నచోట్ల అవి కేవలము శబ్దసాదృశ్యములేగాని భావసాదృశ్యములు గావని వాదించుటయు సమంజసముగ లేదు. ఆర్యుల మూలస్థానము హిమప్రళయముచే పాడైపోవుటవలన ఆర్యసభ్యతయొక్క చరిత్రమందు పెద్ద మార్పొకటి జరిగెను. మహోపద్రవకరమైన యీ ప్రళయానంతరమందు పూర్వపు నాగరికత కొంతచెడి మరల మృగప్రాయత్వదశలోనికి పడిపోవుట సహజముగ తటస్థించును. కావున, ఆసియాఖండస్థలగు ఆర్యశాఖలలోకంటె, ఉత్తరశిలాయుగారంభమందుత్తర యైరోఫా భూములలో నివసించిన ఆర్యశాఖలలో తక్కువ నాగరికతగాని, సభ్యతయందు లోపములుగాని గన్పించినవన్నచో బహుశః దాని కిదియే కారణమైయుండవలెను. నాగరికతయందు ప్రవర్థమానమొందుటకై యొకసారి పూనుకొని సాగిపోవుచున్నజాతి ఆకస్మికముగ మరల మృగప్రాయత్వ దశలోనికి పడిపోవునని మనము సాధారణముగ యూహింపజాలము. కాని, యీహిమప్రళయము వంటి మహోపద్రవములు తటస్థించినప్పుడు మాత్రము ప్రళయానంతరముకూడ తత్పూర్వపునాగరికతయే కొనసాగునని మనము తలంచుటకు వీలులేదు! ఏలననగ:- ఈహిమప్రళయమువంటి మహోపాద్రవమునుండి తప్పించుకొని బ్రతికినవారు బహుకొద్దిమందియేయుందురు. మరియు, యీబ్రతికినవారైనను తత్పూర్వమందు తమసంఘములోనున్న సభ్యతనంతను తమవెంట గొనివచ్చి, తమనూతన నివాసస్థానములగు మధ్యాసియా, ఉత్తర



యైరోపాభూములలో, అనార్యులగు శత్రుజాతులమధ్యమందు, స్థాపించిరని చెప్పుటకును వీలులేదు. ఇదిగాక, మనమింకొకయంశమును జ్ఞాపకముంచుకొనవలెను. మధ్యాసియా, ఉత్తరయైరోపాభూము లిప్పుడు సమశీతోష్ణముగ నున్నను హిమప్రళయానంతరమవి బహుశీతలముగ నుండియుండవలెను. మరియు, యీదేశములకు వచ్చినవారు, తమ తాతముత్తాతలు ఉత్తరధ్రువమునుండి లేచివచ్చి యిండ్లువాకిండ్లు లేక దేశదిమ్మరులుగ (లేక, మృగప్రాయులుగ) తిరుగాడుచున్న కాలమందు పుట్టి యుండవలెను. దేశదిమ్మరులుగ తిరుగాడు అనాగరకస్థితిలో పుట్టిన వీరు, తమ తాతముత్తాతలు హిమప్రళయమునకు పూర్వము స్వర్గతుల్యముగనున్న ధ్రువనిలయమందు కాపురమున్ననాటి సభ్యతలో, జ్ఞానసంపత్తిలో యేకించిదంశమునో — అచ్చటచ్చట బహుకొద్దిగ — తమవద్ద నిలుపుకొని యుందురు. కావున, ఉత్తరశిలాయుగారంభమం దైరోపాఖండములో కాపురమున్న ఆర్యశాఖలవారు తక్కువనాగరక స్థితిలో నున్నారన్నచో ఆశ్చర్యములేదు. దీనికి మారుగ మనమింక నెక్కువగ సంతోషింపవలెను. హిమప్రళయమువంటి మహావిపత్తు సంభవించి దేశమంతయు నానావిధములుగ పాడైపోయినను పారశీక, భారతీయశాఖలవారి మతాభిమానముచేతను, కృషిచేతను, హిమప్రళయాత్పూర్వమునాటి సభ్యతలో యింతటిభాగ మిప్పటికైనను చెడకుండ యెట్లు నిలిచియుండ గలిగినదాయని మన మాశ్చర్యపడవలెను.

ప్రాచీన సభ్యతయంతయు చెడిపోగా మిగిలిన యీచిన్నవలుసులను వీరు పరమపవిత్రమగు సంపదగ నెంచుకొనిరి. వాని నెంతమాత్రమును చెరుపకుండ బహుజాగ్రతగ కాపాడిభవిష్యత్సంతతులవారికి సంక్రమింపజేయుటకే భగవంతు డీసంపదను తమకు ఒప్పగించెనని వీరుతలంచిరి. వీరు పడవలసిన యవస్థలను తలచుకొన్నచో వీరిప్రళయాత్పూర్వమునాటి నాగరికతలోను, మతములోను, పూజాదివిధానములలోను, యింతటి పెద్దభాగము నెట్లు కాపాడుకొనుచు రాగలిగిరాయని మన మాశ్చర్య పడకతప్పదు. పారశీక, భారతీయశాఖలుగాక తక్కిన ఆర్య శాఖలవారీప్రాచీనపరంపరల నంతభద్రముగ గాపాడియుండ లేదు. కాని, అంతమాత్రముచే, యీశాఖలవారి నాగరికత యిటీవలనే – ఆర్యులు శాఖలుగ చీలిపోయిన తరువాతనే – పెంపొందినదని వాదించుట సమంజసముగాదు.

హిమప్రళయమునకు పూర్వము ఉత్తరధ్రువమండలములో మంచి సమశీతోష్ణస్థితి — సంతతవసంతసమయమో యన్నట్లుండెననియు, ఆ ధ్రువముచుట్టు భూప్రదేశముండెననియు, అది హిమప్రళయములో క్రిందికి * క్రుంగిపోయెననియు, యిదివరకు దెలిపియుంటిమి. ఇట్టి భూమిపై ఆర్యులు కాపురమున్నప్పుడు వారి కది స్వర్గతుల్యముగ నుండియుండవలెను. వారికి గలిగిన అసౌకర్యమంతయు ఒక్క దీర్ఘరాత్రి

* మొన్నటి జపాన్ ప్రళయములోకూడ యిట్లే కొన్నిలంకలు సముద్రములోనికి పూర్తిగ క్రుంగిపోయెను. మా. స. ణ. శాస్త్రి.



మాత్రమే యైయుండును. ఈఒక్క సృష్టిచమత్కారమునుండి యెన్నిగాథలు—అంధకారప్రకాశములకు జరిగిన యుద్ధములు—బయలుదేరినవో మన మిదివరకు చూచియున్నాము. దీర్ఘరాత్రివచ్చుటయు, అది బహుకాలముండి విసుగుపుట్టించుటయు, ఆకాశమందు క్షితిజముపై వెలుతురెప్పుడు కనపడునా యని వారు మిక్కిలి యాతురతతో కనిపెట్టుకొనియుండుటయు, కొన్నినెలలుగడచినపిమ్మట యీవెలుతురు కనబడుటయు—చాలప్రధానాంశములు. మన పూర్వతరములవారగు ఆర్యప్రజలనెక్కువగ ఆకర్షించిన వీప్రకృతిచిత్రములే. అనేక నెలలు చీకటిలోపడియున్నపిమ్మట, అంధకారపూరితమును, దివ్యజలమయమునునగు అధోలోకసముద్రమునుండి పైకిలేచి వచ్చి ఉషస్తేజము కాంతిపుంజముల వెదజల్లుచు సర్వలోకానందకరముగ తూర్పుదిక్కున క్షితిజముపై తాండవమాడుచు శోభాయమానముగ వెలుగొందుచున్నప్పుడు యిది తమదేవతలొనర్చిన మహత్కార్యముగ ఆనాటియార్యులు భావించిరన్నచో ఆశ్చర్యమేమి? సర్వలోకానందకరముగ నిట్లు తేజోదయమగుటతోడనే దీనితోపాటు తమ నూతన సాంవత్సరికోత్సవములు, పండుగలు, మత, సాంఘిక, యాజ్ఞిక కర్మలు యథారీతిగ మరల ప్రారంభమయ్యెను. దేవయానమునకిదియే ప్రారంభము. జ్యోతిర్దేవతలు, అంధకారరాక్షసులను జయించి తమవిజయోత్సవముల గావించుకొనుచుండిరి. బాలభాస్కరుడగుకుమారస్వామి దేవతాసైన్యముల కగ్రేసరుడై దేవ

యానమార్గము వెంట విజయప్రదముగ బయల్వెడలి, (ఋగ్వేదమందు చెప్పినట్లు) " మానుషయుగముల "ను నడపించుచుండెను. విజయయాత్రను చాటుచున్న ఈ దేవయానమునకుప్రతిగ, రెండవవైపున అధోలోకమందు పితృయానము గలదు. ఇదియే, చలితోడను చీకటితోడను నొప్పుచున్న ధ్రువమండల దీర్ఘరాత్రి. ఈదీర్ఘరాత్రి రెండుమొదలు ౬ మాసములవర కుండును. ఇది ప్రజలు విశ్రాంతిగొనియుండు కాలము. సూర్యకాంతిలేమిచే వారు తుదకు తమశవములను కూడ అంత్యక్రియలను జరుపక సూర్యుడు వచ్చువరకు వానినట్లే నిలిపియుంచిరి. అంధకారరాక్షసులు ప్రపంచమందు రాజ్యముచేయుచుండుటచే, ఆర్యు లాకాలమందు సమస్త మత, సాంఘికకర్మలనేమి, పండుగలనేమి, నిలిపివేసిరి. ఇంతయేల, (డాక్టరు స్క్రాడర్ గారు చెప్పినట్లు) వారి సంవత్సరమంతయు రెండుభాగములుగ నుండెను:— ౭, ౧౦, మాసముల వేసవి + ౫, ౨, మాసముల శీతకాలను. కాని, పూర్వకాలమందుచూడగ వేసవిని, శీతకాలమును—రెంటిని—కలిపి సంవత్సరముగ గణించు ఆచారమున్నట్లు గాన్పింపదు. ఒక్క వేసవియో, లేక శీతకాలమో తిరిగివచ్చుటయే యొక సంవత్సరముగ వారు లెక్కించుకొనుచున్నట్లు గాన్పించుచున్నది. ప్రాచీనకాలమందున్న యేడునెలల సంవత్సరమును, పదినెలల సంవత్సరమును సమర్థించుట కిదియొకటే మార్గముగనున్నది. లేనిచో, దీనినింకొకవిధముగ సమర్థింపజాలము.



దీనినిబట్టియే పదినెలల యవధిగల వార్షికసత్రములనుగూడ సమర్థింపవచ్చును. ధ్రువమండలమును విడిచి దక్షిణదేశములకు వచ్చినచో యీపద్ధతి పనికిరాదు. కనుకనే, హిమప్రళయానంతరమందు ఆర్యులు తమజన్మభూమినుండి లేచి వచ్చి మధ్యాసియా ఉత్తరయూరోపాలలో కాపురముండవలసి వచ్చినప్పుడు వారు (న్యూమాగారుచేసినట్లు) తమ ప్రాత పంచాంగములను మార్చుకొనవలసి వచ్చెను. కాని, కర్మకాండయందు మాత్రము యజ్ఞములకును, తదితర కర్మలకును ప్రధానమైన దేవయానలక్షణములను మాత్రము వారు వదలిపెట్టక గట్టిగ పట్టుకొనియుంచిరి. ఈదేవయాన (ఉత్తరాయన,) మిప్పటికిని కర్మలకేమి, తదితరకార్యములకేమి, ప్రధానమైనదిగను, శుభకరమైనదిగను పరిగణింపబడుచున్నది. సమస్తకర్మలకు ఉత్తరాయణము ప్రశస్తమైనదని గృహ్యాసూత్రములేల చెప్పుచున్నవో, లేక, దక్షిణాయనములో చనిపోవుట అశుభమని మనవా రేల తలంచుచున్నారో మనమిప్పుడు సులభముగ చెప్పవచ్చును. హిమప్రళయమునకు పూర్వమందుండిన ౭, ౧౦, మాసముల సంవత్సరము తత్ప్రళయానంతరమెట్లు ౧౨ మాసముల సంవత్సరముగ మారెనో, దేవపితృయాన సాదృశ్యముపై మొట్టమొదట విషువత్స్థానములందు రెండు సమభాగములుగ విభజింపబడుచుండిన సంవత్సరము తదుపరి — హిమగ్రీష్మసంక్రమణములం దెట్లు విభజింపబడుచు వచ్చెనో, దీనినిబట్టి ఉత్తరాయణమునకుకూడ ప్రాత

యర్థముపోయి క్రొత్తయర్థమెట్లు వచ్చెనో— యీ మొదలుగాగల యంశములన్నియు ఆర్యుల పంచాంగముయొక్క చరిత్రయందు చాల ప్రధానములైనను మనకిప్పుడు ప్రస్తుతము వీనితో పనిలేదు. కనుక, వీని నిటవదలివేసి మన ప్రస్తుతాంశమునకు వత్తము. పృథివ్యాది భూతములను, తదితర ప్రకృతిరచనలను పూజించుపద్ధతి హిందూ-యూరోపియన్ మతములలో ప్రాచీనకాలమందు గానవచ్చినను దీని యుత్పత్తినిమాత్రము వీరందరేకముగ కలిసియున్ననాటి కాలమునకు తీసికొనిపోవుటకు వీలులేదని కొందరు వాదించుచున్నారు. డాక్టరు స్క్రేడర్ గారు తమ గ్రంథమందీవాదమును మిక్కిలి సమర్థతతో ఖండించియున్నారు. మన ధ్రువసిద్ధాంతముకూడ యీ డాక్టరుగారు తేల్చినసారాంశములను పూర్తిగ బలపరుచుచున్నది. "ప్రాచీన గాథలను, మతమును పరిశీలించిన పండితులిదివరకీసమస్యపై పేర్చిన వాదప్రతివాదముల నన్నిటిని అసత్యములక్రింద గణించి, దూరముగ త్రోసివేసి, సంపూర్ణముగ విశ్వాసపాత్రములైన ప్రమాణముల నాధారముగ గైకొని చూచినకొలది మన కన్నివైపులనుండి ఒక్కటే సారాంశము తేలుచున్నది; ఏమనగ:- ప్రాచీన యైరోపీయ మతములకన్నిటికిని మూలమొక్కటే; (ఇవన్నియు ఒక్క మూలమునుండియే యుత్పన్నమైనవి.) ఆమూలమేదనగ:- ప్రకృతిశక్తులను పూజించుటయే. ఈపద్ధతి హిందూ-యూరోపియన్ జాతులన్నియు కలిసి కాపురమున్నప్పుడమ



ములలోనుండెను."— అని డాక్టరుస్క్రేడర్ గారు చెప్పుచున్నారు.

ఉషస్సు, ఆదిత్యులు, అశ్వినులు, వృత్రహన్, మొదలగు వైదిక దేవతలందరు ధ్రువలక్షణములతో నొప్పారుచున్నారు. దీనినిబట్టికూడ భాషాపరిశోధకులు తేల్చిన సారాంశము మరింత బలపడుచున్నది. ఆకాశము, ఉదయము, అగ్ని, వెలుతురు, మొదలగు సృష్టిరచనల నన్నిటిని దెలుపు శబ్దములు సమస్తఆర్య భాషలందు నొక్కమాదిరిగనే యున్నవి. వేయేల, మన మేదృష్టితో చూచినను సరే ఒక్కటే సారాంశము స్ఫుటముగ గన్పట్టుచున్నది. కాంతిమంతమగు ఆకాశము (దాఉస్ పితా) తుపాను లేక ఉరుము (తన్యతు); సూర్యుడు; అగ్ని; ఉషస్సు;- యివన్నియు ప్రాచీనకాలమందే దేవతలుగ భావింపబడియున్నవి. "యజ్" అను సంస్కృతపదము, "యజ్" యను పారశీకపదము "అజొమాయ్" అను గ్రీకు పదము-యివన్నియు నొక మూలమునుండియే యుత్పన్నమైనవి. దీనినిబట్టి చూడగ, ప్రాచీన కాలము నాటికే ప్రజలీయుషస్సాది ప్రకృతిదేవతలకు బలులర్పించుటయు, పూజించుటయు, వాని యనుగ్రహమును సంపాదించుకొనుటకై వానిని ప్రార్థించుటయు మొదలుగాగల పనులను చేయుచుండిరని స్పష్టమగుచున్నది. ఈ ప్రకృతిశక్తులను పూజించు పద్ధతి హిమప్రళయమునకు పూర్వమందే పుట్టెనో, లేక, తదనంతరము పుట్టెనో మన కింతవరకు లభించిన

యాధారములను బట్టి నిర్ణయించుటకు సాధ్యముగాదు. అనగ, యీ ప్రకృతిశక్తులకు దేవత్వగౌరవ మెప్పుడొసంగబడెనో మనము ఖండితముగ నిర్ణయింపజాలము. కాని, మనమింత వరకు మాత్రము నిస్సందేహముగ జెప్పవచ్చును– ఏమనగ:– ఆర్యులందరేకకుటుంబముగ కలిసి ధ్రువమండల మందు కాపురమున్న నాటికే భగవచ్ఛక్తియొక్క రూపాంతరములుగ భావింపబడిన యీ ప్రకృతి శక్తులయొక్క యుపాసనాపద్ధతి యమలులో నుండెనని మాత్రము మనము నిర్వివాదముగ చెప్పవచ్చును. ఈ ప్రాచీన యాజ్ఞిక, యుపాసనాపద్ధతుల నుండియే హిమప్రళయానంతరమందలి మతములు ఉత్పన్నమయ్యెను. మనువు, అంగిరసులు, భృగులు, — మొదలగు ప్రాచీన యాజ్ఞికులు ఋగ్వేదమందు పేర్కొనబడియున్నట్లు మనమిదివరకే చూచియున్నాము. ఈ ప్రాచీన యాజ్ఞికులు తమ వార్షికసత్రములను ౭,౯,౧౦ నెలలలో పూర్తిచేయుచుండిరని చెప్పుటచే వీరు తప్పక ధ్రువమండలమందు కాపురమున్న సమష్టియార్యజాతికే చెందినవారని ఋజువగుచున్నది. ఈ యాజ్ఞికులే ఆకాలమందు ధ్రువమండలములో ౭, లేక ౧౦ నెలల సూర్యరశ్మియున్న ప్రదేశములలో యజ్ఞయాగాదులను జరుపుచుండిరి; మరియు, ప్రాతఃకాలికదేవతలకు బలులువగైరాల వర్పించి పూజింపుచుండిరి. కాని, సూర్యుడు దీర్ఘరాత్రియందు క్షితిజము క్రిందికి క్రుంకిపోయినప్పుడు వీరుకూడ తమ యజ్ఞములను కట్టిపెట్టి వృత్రహనన మొనర్చుచున్న ఒక్క-



యింద్రునకుమాత్రమే సోమరసము నిచ్చుచుండిరి. ఈ దీర్ఘరాత్రియందింద్రుడు అంధకారరాక్షసులతో పోరాడుచున్నాడు. ఇంద్రునకే పోరాటమందు జయముగలిగి అతడు మరల సూర్యకాంతిని తమవద్దకు తీసికొనివచ్చుటకుగాను యీయాజ్ఞికులు యింద్రునకు సోమరసమునిచ్చి ప్రోత్సహించుచుండిరి. హిమప్రళయాత్పూర్వకాలమందు అతివిరళమైన యాజ్ఞికపద్ధతు లుండెడివని నేను వాదింపను. కాని, యజ్ఞమను నది మాత్రము ప్రాచీనార్యమతమున కత్యంతప్రాధాన్యమైన కర్మగనుండెడిదని మాత్రము నేను గట్టిగ చెప్పగలను. మరియు, యీ యాజ్ఞికకర్మ అసలు మొట్టమొదట హిమప్రళయానంతరమే పుట్టెనని చెప్పుట చాలపొరపాటని నావాదము. ప్రాచీనార్యుల మతమును గూర్చియు, ఉపాసనాపద్ధతిని గూర్చియు, కర్మకాండమును గూర్చియు, నేనిటకొంత విపులముగ చెప్పవలసివచ్చినది. ఏలననగ :– ఈవిషయములపై యిప్పటివారికి చాలయపోహలు గలవు; ఈ యపోహలను, తప్పు అభిప్రాయములను వారికిస్పష్టముగ విప్పిచెప్పుటకై మన ధ్రువసిద్ధాంత మెంతయో తోడ్పడుటచే నే నీసందర్భమందాయంశములను గూర్చి కొంతముచ్చటించవలసి వచ్చెను.

ప్రకృతి శక్తులన్నియు భగవంతుని సంకల్ప, శక్తుల యొక్క రూపాంతరములే యని భావించి వానిని పూజింప మొదలిడినట్టియు, ప్రత్యేకమొకసర్వాంగ సుందరమగు మాతృభావను పెంపొందించుకొన్నట్టియు, స్వర్గతుల్యముగ

నున్న ధ్రువమండల లక్షణముల నాధారముగ గొని వాని నుండి ప్రత్యేక మొక గొప్పగాథావాఙ్మయమును సృష్టించి నట్టియు, ఆర్యజాతి సామాన్యజాతియా ? ఇన్ని గొప్పపను లొనర్చినజాతి నాగరకతయందు చాల యభివృద్ధినొందియుండి యుండవలెను. కాని, సమష్టియార్యజాతి ధ్రువమండలమం దుండగ నాగరకతయం దెంతవర కభివృద్ధినొందెనో ఖచ్చిత ముగ కొలతవేసి చెప్పుటకు మన కిప్పుడు సాధనములు లేవు. నూలునేయుట; వడుకుట; లోహపుపనిముట్లను తయారు చేయుట; నావలను, రథములను కట్టుట; పట్టణములను భవ నములను నిర్మించుట; అందు నివసించుట; క్రియవిక్రియాదు లొనర్చుట; వ్యవసాయము చేయుట;— మొదలుగాగల పనులన్నియు ప్రాచీనార్యులకు బాగుగ తెలియునని భాషా పరిశోధనలను బట్టిచూడగ స్పష్టమగుచున్నది. వివాహములు, స్థిరచరాస్థులకు సంబంధించిన చట్టములు,— మొదలుగాగల సాంఘిక, రాజకీయసంస్థాపన లాకాలమం దార్యులలో ప్రబలి యుండెననికూడ మనకు తెలియుచున్నది. ఆకాలమందు సమష్టి యార్యజాతికి తెలిసియున్న జంతుసముదాయముల యొక్కయు, తరులతాగుల్మాదుల యొక్కయు పెద్దజాబితాలు మనకు భాషా పరిశోధనలవలనలభించుచున్నవి. ఇవిగాక యీభాషా పరిశోధ నలవలన యింక నన్నియో చాల ముఖ్యమైన యంశములు బయట పడుచున్నవి. వీని నన్నిటినిబట్టి చూచినచో ఉత్తర శిలాయుగమందున్న మృగప్రాయత్వ దశకంటె ధ్రువనివాసము



నాడే యత్యున్నతమైన నాగరికత ప్రబలియుండెనని స్పష్ట మగుచున్నది. కాని, మనమిట యింకొక సంగతిని విచారింప వలసియున్నది. ఈప్రాచీన నాగరికతయొక్క పరిమితియెంత వరకు గలదు ? భాషాపరిశోధనలవలన మన కిదివరకు గన్పట్టి నంతవరకే యుండెనా ? లేక అంతకంటెయెక్కువయుండెనా? మనమిప్పుడు క్రొత్తగ ఋజువుపరచుచున్న ధ్రువసిద్ధాంత ముచే యీపరిమితినింకను పెంచుటకేమైన యవకాశమున్నదా లేదా ? యని విచారింపవలెను. వైదికగాథలందును పూజా విధానమునందునుగల ధ్రువలక్షణములనుబట్టి చూడగ, యవి చాల పురాతనకాలమునాటివనియు, వానిపేర్లు ఆర్యభాషల లోనికి రాక పూర్వమే యవి ప్రబలియుండెననియు మన మిది వరకు చెప్పియుంటిమి. ఇదేరీతిగ, ఆర్యులప్రాచీనసభ్యతను గూర్చికూడ భాషాపరిశోధకులు చేసిన సిద్ధాంతములను మన మీధ్రువసిద్ధాంత దృష్టితో కొంతవరకు మార్పుచేయ వలసివచ్చును. హిమప్రళయము తటస్థించుటచే ఆర్యులు తమ మాతృభూమిని వదలివేయకతప్పినదికాదు. ఈప్రళయమందు చావగమిగిలిన యార్యులు తత్పూర్వమందున్న మహో న్నత నాగరికతలో బహుకొద్దిగ మాత్రమే తమ వెంట బెట్టుకొని బయలుదేరియుందురు. ఈ కొద్దిపాటినాగరికతతో వారు హిమప్రళయానంతర యుగారంభమందు నూతననివాస ములను వెదకికొనుటకై దక్షిణభూములలో సంచారమొనర్చు చుండిరి. ఇట్లు సంచారమొనర్చుచుండగ వారికి మధ్య

త్రోవలో క్రొత్తజాతుల వారితో సంపర్కము గలుగుచుండెను. ఆర్యలీక్రొత్తజాతుల నన్నిటిని తమ వశముజేసికొని వారిపై యాధిపత్యము వహించిరి. తమ కంతటి యనుకూల పరిస్థితులు లేకపోయినను, యీ కొద్దిపాటినాగరికతతో దేశద్రిమ్మరులుగ తిరుగుచున్న యీ యార్యులే తక్కిన జాతులవారి నందరిని (జయించియో, లేక తమలో కలుపుకొనియో) తమవశముజేసికొని వారిపూర్వ భాషలను, మతములను, భావములను, పూర్తిగ మార్చివేసి, వారినికూడ ఆర్యులుగనేచేసివైసిరి. కావున, ప్రళయాత్పూర్వమునాటి ఆర్యనాగరికతయే యీ యార్యేతరజాతుల నాగరికతకంటె యెన్నియో మడుంగులు మహోన్నతమైనదని చెప్పుట కీయంశమొక్కటియే చాలును. ప్రళయానంతరము దక్షిణదేశములకు లేచివచ్చిన యార్యులలో మిగిలిన నాగరికతకంటెకూడ తత్పూర్వ నాగరికతయే మహోన్నతమైనదని దీనివలననే ఋజువగుచున్నది. ఉత్తరశిలాయుగారంభమం దుత్తర యైరోపా భూములలో నివసించియున్న యార్యసంతతులు అసలచ్చటనే పుట్టెనని పండితులిదివరకు తలంచుచుండిరి. కావున, సమిష్టియార్యజాతి యేపాటినాగరకమును సంపాదించెనో తెలిసికొనుటకై ఆయాభాషలను పరిశోధించుటకంటె యెక్కువ పరిశోధన యవసరము లేకపోయెను. కాని, యిప్పు డీపండితుల యభిప్రాయములన్నియు మార్పుజెందవలసి వచ్చెను. ఉత్తర శిలాయుగమునాటి యార్య సభ్యత స్వతంత్రమును, సంపూ



ర్ణమును నైనది కాదు. అది సమిష్టి యార్యజాతి యంతయును ఉత్తరధ్రువమండలమందు కాపురమున్ననాటి సభ్యతలోనుండి యిచ్చటికి దిగుమతియైన యొకానొక సహస్రాంశమై యుండనోపు. కనుక, ఒకే యర్థమునిచ్చుమాటలుకొన్ని భాషలలోనేతప్ప యన్ని యార్యభాషలలోను గాన్పింపలేదను నొక్కకారణముచే యింతటి సభ్యత సమిష్టియార్యజాతికిలేదని వాదించుట సమంజసముకాదు. భాషాపరిశోధనలలో కేవలము లాభము లేదని నేనుచెప్పను. అవి పనికివచ్చినంతవరకు వానిని మనమంగీకరింపవచ్చును. కాని, మన మొక్క విషయములో మాత్రము బహుజాగ్రతగనుండవలెను. ఒకే యర్థమునిచ్చుమాటలు సమస్తార్యభాషలలోను గాన్పింపలేనంత మాత్రముననే, ఆ వస్తువుగాని, ఆ యర్థముగాని ప్రాచీనార్యులకు తెలియనే తెలియదని మనము వాదింపకూడదు. హిమప్రళయముచే తత్పూర్వమందున్న నాగరికత యెంత నశించిపోయెనో తెలిసికొనుటకు మన కవకాశములేదు. కాని, పూర్వపునాగరికతలో కొంతభాగము మరల దొరుకుట కవకాశములేకుండ పూర్తిగ నశించిపోయిన దనుటలో సందేహమేమియులేదు. కనుక, యిట్టి సందర్భములలో మన మొక మాటమాత్రము ఖండితముగ చెప్పవచ్చును. భాషాపరిశోధనలవలన మన కిప్పుడు గన్పట్టుచున్న ఆర్యసభ్యత ప్రళయాత్పూర్వమందు సమిష్టియార్యజాతిలోనున్న సభ్యతలో కనిష్ఠాంశమని (Minimun) చెప్పవచ్చును. ఈ యంశమును

మాత్రము మన మెప్పుడును మరచిపోకూడదు. ఏలననగ:— ఈ భాషాపరిశోధనల వలననే ప్రాచీనార్యసభ్యత నంతను పూర్తిగ కనుగొంటిమని పండితు లిదివరకు తలంచుచుండిరి. ఆర్యుల మూలస్థాన మెచ్చటనుండెనో తెలియనంతవరకు యీ భాషాపరిశోధకులవాదనలు బహుబాగుగనే గన్పట్టినవి. కాని, ఆర్యజాతియు తన్మతమును, హిమప్రళయమునకు పూర్వమందే విరివిగ ప్రబలియుండెననియు, అప్పటికవి పుట్టియెంత కాలమైనదో చెప్పుటకువీలు లేనంతటి యనాదికాలమునాడే యవి పుట్టెననియు శాస్త్రజ్ఞు లిటీవల ఋజువు పరచియున్నారు. కావున, హిమప్రళయమునకు పూర్వమందున్న యార్యులు మృగప్రాయత్వదశలోనుండిరని చెప్పుట కిప్పుడు వీలులేదు. మానవచారిత్రమునందు శిలాయుగము, కాంశ్యయుగము, లోహయుగము నను మూడుయుగములుండెనని భూనిక్షేప పరిశోధకులు నిశ్చయించియున్నమాట వాస్తవమే. దీనినిబట్టి, ఆర్య లొకప్పుడు శిలాయుగమందుండి యుండవలెనని వారు చెప్పుచున్నారు. కాని, ఆర్యజాతియొక్క శిలాయుగము హిమప్రళయానంతరమందే తటస్థించెనని చెప్పుట కీభూనిక్షేప పరిశోధనలలో నెంతమాత్ర మాధారము గాన్పించుటలేదు. అదిగాక, సమిష్టియార్యజాతికి లోహపు పనిముట్లు తెలియునని భాషాపరిశోధకులు చెప్పుచున్నారు. దీనినిబట్టిచూడగ, ఉత్తరధ్రువమండలమందున్న సమిష్టియార్యజాతియొక్క నాగరికతయే శిలాయుగమునాటి నాగరికతకంటె — అంతయేల,



లోహయుగమునాటి నాగరికతకంటెనుకూడ — యెన్నియో రెట్లు యెక్కువైనదని తెలియుచున్నది. లోహయుగము ఐరోపాఖండములో పుట్టలేదనియు, అది యితరదేశములనుండి యిటకు వర్తకమువల్లనో, లేక ఆర్యశాఖలు కొన్నియిటకు వచ్చుట చేతనో,దిగుమతి యయ్యెననియు ప్రముఖులగు భూనిక్షేపపరిశోధకులు చెప్పుచున్నారు.

హిమప్రళయమునకు పూర్వమార్యులు ఉత్తర ధ్రువమండలమందుండిరనియు, ఆనాడువారు మహోన్నతమగు నాగరికతలోనుండిరనియు చెప్పు మన సిద్ధాంతముకూడ యీ భూనిక్షేప పరిశోధకుల యభిప్రాయమును బలపరుచుచున్నది. కేవలము భాషాపరిశోధనలపైననే యాధారపడుట యెంతటి యనర్థదాయకమో తెలుపుటకై నేనిచ్చట నొక యుదాహరణమును జూపించెదను. ప్రాచీనార్యులకు తామ్రలోహమునుగూర్చి తెలియునని డాక్టరు స్క్రేడర్ గారు ఋజువుపరచియున్నారు. దీనితో వారప్పుడప్పుడు ఖడ్గములను, బల్లెములనుకూడ చేసియుండవచ్చునని వారు ఒప్పుకొనుచున్నారు. వెండిబంగారములు ప్రాచీనార్యులకు తెలియునో లేదో చెప్పుటకు వీలు లేదట. భాషాపరిశోధకులు తమ మతములనే యెంతపట్టుదలతో పట్టుకొని వ్రేలాడుదురో యీ క్రిందియంశమువలన తెలియగలదు. వర్తకవ్యాపారాదులలో నిచ్చి పుచ్చుకొను నాణెము నొకదానిని "ఖల్ కాస్" అను పేరుతో హోమరను గ్రీకు కవి తన గ్రంథమందు పేర్కొని

యున్నాడు. ఈనాణెము బహుశః రాగితోడనో లేక కంచు తోడనో చేయబడియుండును. ఋగ్వేదమందుకూడ (VIII, 1, 5) యిట్టి చిన్ననాణెమేయొకటి "శుల్క" యనుపేరుతో పేర్కొనబడియున్నది. బహుశః యిదికూడ రాగితోడనో, కంచుతోడనో చేయబడియుండి, హోమర్ కవి చెప్పిన "ఖల్‌కాస్" ను పోలియుండును. కాని, భాషాపరిశోధకులు సాధారణముగ గ్రీకు "ఖ" ను సంస్కృత "హ" తో పోల్తురు. ఈ సూత్రము నిచ్చట వర్తింపజేసినచో గ్రీకు "ఖల్‌కాస్" ను సంస్కృత "శుల్క" తో పోల్చుటకు వీలులేదు. కనుక, భాషాపరిశోధకులీగ్రీకు "ఖల్‌కాస్" ను సంస్కృత "హ్రీంకు, హ్లీంకు," లతో పోల్చుటకై యత్నించిరి. కాని డాక్టర్ స్క్రేడర్ గారు చెప్పినట్లీపోలిక యసంభవముగ గన్పట్టుచున్నది. ఏలననగ:—"హ్రీంకు" శబ్దము వేదమందు లేదు; దానికి "రాగి" లేక "కంచు" అను నర్థముకూడ లేదు. కనుక, యీభాషా పరిశోధకు లేర్పరచిన సూత్రము నటుంచి, నేనీగ్రీకు "ఖల్‌కాస్" ను సంస్కృత "శుల్క" తోడనే సరిపోల్చుచున్నాను. ఏలననగ:—సంస్కృత "శ" వర్ణము గ్రీకు "క" వర్ణమునకు సరిపోవును. ఈ "క" వర్ణమునకుబదులుగ అప్పుడప్పుడు "ఖ" వర్ణముకూడ ప్రయోగింపబడుటయు నాచారముగ నేయున్నది. కనుక "ఖల్‌కాస్" "శుల్క" శబ్దములు సమానార్థకములని నిర్ణయింపవచ్చును. దీనినిబట్టి చూడగ, సమిష్టిఆర్యజాతిప్రజలానాడు రాగినో



లేక కంచునో క్రయవిక్రయాదులందు నాణెములుగ వాడుకొనుచుండిరని నిశ్చయింపవచ్చును. ఇట్టి నిదర్శనములే యింక నెన్నియోకలవు. వానినన్నిటిని విచారించుట కిదితావుకాదు. ప్రాచీనార్యసభ్యతా పరిమితిని నిర్ణయించుటలో భాషా పరిశోధనాఫలితముల మనమెంతవరకు గ్రహింపవచ్చునో తెలుపుటకే నేనీయుదాహరణమునిట నిచ్చియున్నాను. ప్రాచీనార్యసభ్యతను హిమప్రళయాత్పూర్వమునకు గొనిపోయినచో ఆనాటివారుమృగప్రాయత్వ దశలోనుండిరని చెప్పు సిద్ధాంత మొక్కనిముసమైనను నిలువజాలదు. ఒకవేళ ఉత్తర శిలాయుగమందు కొన్ని ఆర్యశాఖలలో తక్కువ నాగరికత యున్నచో, అదికేవలము హిమప్రళయముచే తటస్థించిన క్షీణదశయే యని యెఱుంగవలెను. ఈ మహావిపత్తునుండి ప్రజలు బయటపడి, యిండ్లువాకిండ్లను గోల్పోయి, దేశద్రిమ్మరులుగ కాలముగడపుచు, పెక్కిడుముల పడవలసి వచ్చుటచే వారిపూర్వనాగరికత చాలవరకు వెనుకబడియుండవచ్చును. ఆశియాఖండస్థులగు ఆర్యులుమాత్రము ప్రాచీన మతమును, సభ్యతను, చాల యెక్కువగ కాపాడుకొనగలిగిరనుమాట సత్యమే, దీనికికారణము బహుశః వారు తమ ప్రాచీనగాథలను కర్మకాండయందును మంత్రములందును, సూత్రములందును భద్రముగ బొందుపరచియుంచుటచే, అవి చెడకుండ యిప్పటివరకు నిలిచియుండవచ్చును. అదిగాక, యిట్లు బొందుపరచిన మంత్రములను కొందరు

ప్రజలు ప్రత్యేక మొకకులవృత్తిగ పూనుకొని, వల్లెవేసి సుశిక్షితమైన తమధారణాశక్తిచే వానిని వంశపారంపర్యముగ సంక్రమించునట్లు చేయుచుండిరి. అందుచే నవిఖిలముగాకుండ యిప్పటివరకు భద్రముగ నిలిచియున్నవి. వీరింత శ్రమపడినప్పటికికూడ, అసలు మొట్టమొదట రచింపబడిన మంత్రములును, సూక్తములును, చాలభాగ మిప్పుడు పారశీకుల అవేస్థగ్రంథమందు గానవచ్చుటలేదు — అవియెట్లో నశించిపోయెను. దీనినిబట్టిచూచినచో, యీప్రాచీనపరంపరలు చెడిపోకుండ కాపాడుట యెంత కష్టసాధ్యమైనకార్యమో మనకు కొంచము బోధపడగలదు. "అవేస్థా" గ్రంథమునకంటె మన వేదగ్రంథమే యింక యెక్కువభద్రముగ కాపాడబడి యున్నది. అయినను, దీనియందుకూడ కొన్నిభాగములు శిథిలములైపోయెనని పండితులు నిశ్చయించి యున్నారు. ప్రాచీనపరంపరలీగ్రంథమందు బొందుపరుపబడిన యిన్నివేలయేండ్లకు, యిప్పుడీగ్రంథమందు మనకు తత్పూర్వనివాసమైన ధ్రువనికేతనమును సూచించు ప్రమాణములెట్లు లభించగలిగెనా యని మనకెంతో యాశ్చర్యము గలుగవచ్చును. కాని, దీనిలో ఆశ్చర్యపడవలసినపనిలేదు. నిజముగ, ఆర్యులొకప్పుడు ఉత్తర ధ్రువమండలమందున్నమాట వాస్తవమే యని ఋగ్వేదప్రమాణములు చాటిచెప్పుచున్నవి. కనుక, ఉత్తర శిలాయుగమందైరోపాలోనున్న యార్యశాఖలవారు (మాక్సిముల్లరుగారు తలంచినట్లుగ) పశుత్వములోనుండి నాగరకము



లోనికెక్కివచ్చు స్థితిలోలేరు. దీనికిమారుగ వారు హిమప్రళయములో తమ పూర్వనాగరకము నంతను పోగొట్టుకొని అప్పటికి తాత్కాలికముగ పశుత్వములోనికి దిగిపోయి, నశింపగా మిగిలిన కొద్దిపాటి నాగరికతాశకలములతో యెట్లో కాలక్షేపము చేయు స్థితిలోనున్నారు.

వైదికార్యులయొక్కయు, వారిసభ్యతయొక్కయు యుత్పత్తిని హిమప్రళయాత్పూర్వమునకు గొనిపోతిమి. కొందరుపండితు లిప్పుడు సాధారణముగ తలంచుదానికంటె ఆనాటివారి నాగరికత చాల యెక్కువైనదనికూడ మనము తెలిసికొంటిమి. అయినను, ప్రాచీనార్యచరిత్రములో మన మింకను తెలిసికొనవలసిన యంశములు చాలగలవు. ఉదాహరణ:- ఆర్యజాతి తక్కిన మానవజాతులనుండి యెప్పుడు, యెక్కడ, వేరయ్యెను? ఆర్యభాష యెక్కడ యెట్లు వృద్ధినొందెను? మానవకోటియొక్క చారిత్రమునం దీసమస్యలత్యంతప్రాముఖ్యములైనవి. కాని వీనినన్నిటిని సంతృప్తికరముగపరిష్కరించుటకు తగిన సాధనములు మనకిప్పుడు లేవు. బహుశః ఆకాలమందార్యులతోపాటు తదితరమానవజాతులుకూడ నివసించియుండవచ్చును. కాని, దీనివిషయమై వేదమందు మనకెచ్చటను ప్రమాణము లభించుటలేదు. తృతీయ యుగములోకూడ యీభూగోళముపై మానవులు నివసించియున్నట్లు భూగర్భ శాస్త్రవేత్తలు నిర్ణయించి యున్నారు. కనుక, హిమప్రళయములచే యీభూగోళముపై

గావింపబడిన మహావిప్లవముల నన్నిటిని మానవుఁడు తనకండ్లార
గాంచియే యున్నాఁడనుట (భూగర్భశాస్త్రరీత్యా) సత్యమే.
కాని, యీమానవజాతి శరీరవర్ణమునుబట్టియు, భాషను
బట్టియు, యెట్లు, యెక్కడ, యెప్పుడు భిన్నజాతులుగ చీలి
పోయెనో తెలిసికొనుటకు మనకేమియు ప్రమాణములు
లభించుటలేదు. దీనికిమారుగ, భూమినుండి త్రవ్వి యెత్తబడిన
మనుష్యుల పుర్రెలు, యెముకలు మొదలగు వానిని పరీక్షించి
చూడగ, యెంతవరకుపోయినను, మానవజాతి అప్పటికే కొన్ని
తకములుగ విభజింపబడి యున్నట్లు గాన్పించుచున్నది. కనుక
దీనినిబట్టి మానవజాతియొక్క యుత్పత్తినిగూర్చి యిదమిత్థ
మనినిర్ణయింపజాలము. కనుక యెవరియిష్టమువచ్చినట్లు వారు
ఊహాపోహలగావించుటకు పండితులకీవిషయములో
కావలసినంత యవకాశమున్నది. ఆర్యులయొక్కగాని,
మానవజాతియొక్కగాని అసలు ఉత్పత్తినిగూర్చియు, మతము,
భాషనుగూర్చియు నిర్ణయించుట కీగ్రంథమందు చర్చించి
యున్న ప్రమాణములలో నొక్కటికూడ తోడ్పడజాలదు.
హిమప్రళయమునకు పూర్వ మెంతకాలముక్రిందట ఆర్యజాతి
పుట్టినది ? ఈజాతియంతయు మొట్టమొదట ఒకస్త్రీనుండియు,
ఒకపురుషునుండియు మాత్రమే పుట్టెనా ? లేక అనేకదంప
తులనుండిపుట్టెనా ? ఈప్రశ్నలకు సమాధానము చెప్పుటకు
మన కీగ్రంథమం దుదాహరించిన వాక్యములలో నెచ్చటను
ఆధారములభింపదు. మనకిప్పటికి దొరికిన ప్రాచీనపరంపరల



యాధారముచే మనమింతవరకు మాత్రము చేయగలము—
ఏమనగ:— హిమప్రళయానంతరమందు దక్షిణమండలములలో
నుండెనని తలంపబడిన ఆర్యజాతిని, ఆర్యసభ్యతను, గొని
పోయి హిమప్రళయాత్పూర్వమందు ఉత్తర ధ్రువమండల
ములోపెట్టగలము. హిమప్రళయమిక రేపురానున్నదనగ,
ఆర్యసభ్యతయు, ఆర్యజాతియు; ఒక్కనాడే, ఆకస్మికముగ,
పుట్టెనని మనము చెప్పజాలము. ఇవిరెండును అంతకు
పూర్వము చాలకాలముక్రిందటనే పుట్టి, క్రమముగవృద్ధి
జెందుచువచ్చి యుండవలెను. కాని, మనకుతగినన్ని ప్రమాణ
ములు లేనప్పు డీవిషయమై వట్టియూహాలతో కాలము గడ
పుట నిష్ప్రయోజనము. ఆర్యజాతియు, ఆర్యమతమును హిమ
ప్రళయమునకు పూర్వమందే ప్రబలియుండెననియు, అవి అస
లెప్పుడు పుట్టెనో తెలియదనియు—మాత్ర మిప్పటికి తెలిసి
కొని, సంతృప్తిజెందిన చాలును. ప్రస్తుతపరిస్థితులలో మన
మింతకంటె యెక్కువ చేయగలిగినదేదియు లేదు.

వేదముల యుత్పత్తిని గూర్చియు, స్వభావమును
గూర్చియు ప్రామాణ్యమును గూర్చియు హిందూవేదాంత
శాస్త్రజ్ఞుల యభిప్రాయములకును, మనము పైనుదహరించిన
యభిప్రాయములకును యెట్టిసంబంధముగలదో విచారింపకుండ
యీ యధ్యాయమును ముగింపజాలము. బ్రాహ్మణముల
కాలమునాటినుండియుకూడ యీసమస్యలను వేదాంతులు
బహుసూక్ష్మముగను, బహునిపుణముగను, బహుతీక్ష్ణము

గను, బహుపాండిత్య ప్రకర్షతోడను చర్చించియున్నారు. కేవల వేదాంతదృష్టితో యీవిషయమునుగూర్చి చెప్పవలసిన క్రొత్తసంగతు లికనెంతమాత్రమును లేవు. ఐతిహాసికదృష్టి వేరు; వేదాంతదృష్టి వేరు; యీ రెండును భిన్నములైనవి. కనుక, యీ రెంటిని కలిపి చిక్కుపరుపకుండ వేర్వేరుగనుంచి ఒక్కొక్క దానినే పరిశీలింపవలెను. ఇట్లు వీనిని వేరుగనుంచి ఒక్కొక్కదానినే ప్రత్యేకముగ పరిశీలించినపిమ్మట తుదకీ రెంటిలో తేలినసారాంశములను పోల్చిచూడవచ్చును. ఈ రెంటికి యెక్కడపోలికలున్నవో, యెక్కడ విరోధములున్నవో తెలిసికొనవచ్చును. వేయేల, యిట్టిగ్రంథమును చదివిన యే హిందువుడుగాని యీ రెండుదృష్టుల నిట్లు పోల్చిచూడకుండ నుండజాలడు. కనుక, దీనినిగూర్చి యిటరెండు మూడు మాటలనుచెప్పి మాహిందూపాఠకుల శ్రమనుకొంతతీర్చెదను.

హిందూవేదాంతశాస్త్రజ్ఞుల మతప్రకారము:—వేదములు నిత్యములు (నిత్య;) వేదములకు ఆదిలేదు. (అనాది;) వేదములు మానవనిర్మితములుగావు (అపౌరుషేయ) వేదములకు చెప్పబడిన యీలక్షణములు తమకుతెలిసినంతవరకు బహుప్రాచీనకాలమునుండియు వచ్చుచున్నవని చెప్పుచున్నారు. డాక్టర్ మ్యూయిర్ గారీవిషయములనన్నిటిని చర్చించుటకై ప్రత్యేకమొకసంపుటమును వ్రాసియున్నారు. వీనికి సంబంధించిన మూలవాక్యముల ననేకములను వారాగ్రంథమందు ఉదాహరించియున్నారు. ఋగ్వేదభాష్యపీఠికయందు శాయనా



చార్యులవారీవిషయములనుగూర్చి సంక్షేపముగవ్రాసిన విషయమునుకూడ మ్యూయిరుగారు తమగ్రంథమందుదాహరించియున్నారు. అదిగాక, కీర్తిశేషులగు మహామహోపాధ్యాయ రాజారామశాస్త్రి బోడాస్ గారుకూడ మొన్ననే యీయంశములనుగూర్చి యొకకరపత్రమును సంస్కృతభాషయందు ప్రచురించియున్నారు......కనుక, నేనిపుడు హిందూవేదాంతశాస్త్రజ్ఞులయొక్క వివిధాభిప్రాయములను మాత్ర మిచ్చుట క్లుప్తముగ వివరించెదను; వానివివరములలోనికి నేనిప్పుడు దిగను; వివరములుగావలసినవారు పైగ్రంథములను పరిశీలింపవచ్చును. మనమిప్పుడు విచారింపవలసిన యంశమేమనగ:—వేదసూక్తములు—అనగ, వానిలోనిమాటలేగాక, అందున్నట్టియు, అందుసూచింపబడినట్టియు మతపద్ధతులుకూడ—ఋషులచే రచింపబడెను. ఏసూక్తము నేఋషి రచించెనో వేదానుక్రమణికలలో చెప్పబడియున్నది. అయితే, ఫలాని ఋషి ఫలానిసూక్తమును రచించెననగ అర్థమేమి? కాళిదాసు శకుంతలా నాటకమును రచించెనని చెప్పినట్లే యర్థమా? లేక, దీనికింక నేమైన గూఢార్థమున్నదా? లేక, యీసూక్తములు అనాదినుండియు ఉండనేయున్నావా? అనగ, వీనికి "ఆది" యనునది లేక శాశ్వతముగ—నిత్యముగ—నున్నవా? ఈప్రశ్నలకు సమాధానము చెప్పుటకు ఆసూక్తములకంటె యెక్కువ ప్రమాణములు మనకు లేవు. కనుక,

యీప్రశ్నల కాసూక్తములే సమాధానము చెప్పవలెను. కాని, డాక్టరు మ్యూయరుగారు చెప్పినట్లు వైదికఋషుల వాక్యము లీవిషయమై యేకాభిప్రాయమును దెలుపుటలేదు. అనేకఋషు లనేకరీతులుగ జెప్పుచున్నారు. కొన్నిచోట్ల వైదికఋషులు తమ ఆశలను, ఉత్సాహములను, భయములను, మానసోద్రేకములను వెలిబుచ్చిరి; ప్రాపంచికసౌఖ్యములకై దేవతలను ప్రార్థించిరి; శత్రుజయమునకై దేవతలను ప్రార్థించిరి; జూదము మొదలగు దుర్వ్యసనములను ఖండించిరి. (X, 34); తమయెదుట ప్రత్యక్షముగ జరుగుచున్నట్లు గన్పట్టుచున్న కొన్నికొన్ని వ్యవహారములను వర్ణించిరి; వడ్రంగి రథమునుకట్టినరీతిగ తానుకూడ ఒక క్రొత్తసూక్తమును (నవ్యాసి, అపూర్వ్య) చేసితి (కృ)ననియు, పుట్టించితి (జన్) వనియు, కల్పించితి (తక్ష) ననియు, వైదికఋషి చెప్పుచున్నాడు. [ I, 47, 2; 62; 13; II, 19, 8; IV, 16, 24; VIII, 95, 5; X, 23, 6; 39; 14; 54, 6; 160, 5. Etc. ]

ఋగ్వేదమందు మరికొన్నిచోట్ల ఫలానిఋక్కు ఫలాని ఋషిచే ఫలానిఋషియొక్కకుమారునిచే రచింపబడెనని యున్నది.(I, 60, 5; X, 63, 17; 67, 1 Etc.) ఇవిగాక మరి కొన్నిచోట్ల కొందరు ఋషులు తాము జ్ఞానమొనర్చుచున్న యీసూక్తములు ఇంద్ర, సోమ వరుణాది దేవతలచే ప్రేరేపింపబడినవన్ని చెప్పియున్నారు. వేదఋక్కులు (ఋచః) ప్రత్యక్ష



ముగ కేవలము పరమపురుషునుండిగాని, భగవత్ప్రేరణచే గాని యుద్భవమయ్యెనని మరికొన్నిచోట్లగలదు. ఈఋక్కులు "దేవదత్త" ములనియు (దేవతలచే ననుగ్రహింపబడినవనియు) (లేక) దేవతలచే సృజింపబడెననియు, వాని నటీవలకొందరు ఋషులు జ్ఞానదృష్టిచే చూచిరనియు (పశ్యాత్) మరికొన్ని చోట్లగలదు. [I, 37, 4; II, 23, 2; VII, 66, 11; VIII, 59, 6; X, 72, 1; 88, 8; 90, 9; Etc.] వచస్సు (వాచ్) నిత్యమని [ VIII, 75, 6; X, 125 ] మరికొన్ని స్థలములందు చెప్పబడియున్నది. దేవతలు దివ్యవాణిని(వాచ్) సూక్తములను సృజించిరట. [ VIII, 100, 10; 101, 16; X, 88, 8 ] ఇన్ని భిన్నరీతులుగనున్న వేదసూక్త ప్రమాణములనుబట్టి యీసమస్యను యిదమిత్థమని నిర్ణయించుట కవకాశము లేకున్నది. ఈ సూక్తములరచన మనుష్యప్రయత్నము చేతనే జరిగెనని కొన్నిచోట్లను, భగవత్ప్రేరణచేతను, లేక కేవలము భగవంతునిచేతనే జరిగెనని మరికొన్నితావుల లోను పేర్కొనబడియున్నది. ఇట్లీవిషయము రెండువిధములుగ వర్ణింపబడియుండుటచే యీసూక్తములు మొట్ట మొదట భగవత్ప్రేరణచే గానమొనర్ప బడెననిగాని, లేక వాగ్దేవిముఖమునుండియే ప్రత్యక్షముగ నుత్పన్నమయ్యెనని గాని ప్రాచీన ఋషీశ్వరులలో తుదకు కొందరైనను తలంచి యుండిరనుట స్పష్టము. భగవత్ప్రేరణచే గానమొనర్పబడె నని చెప్పబడిన ఋక్కులను మానవయత్నముచే రచింపబ

ననిచెప్పబడిన ఋక్కులతో సరిజేయవచ్చును. ఏలననగ:— ఈఋక్కులను గానమొనర్చిన ఋషీశ్వరులు తాము భగవత్ప్రేరణచేతనే యీఋక్కుల నిట్లుగానమొనర్చుచున్నామని వారు భావించి యుండవచ్చును. కాని, ఫలానిఋక్కు లేక యజుస్, సామన్ — కేవలము పరమపురుషుని ముఖము నుండియే, లేక దేవతల ముఖమునుండియే, యుత్పన్నమయ్యెనని చెప్పుటకర్థమేమి? కావున వేదమెంత ప్రాచీనమైనదో, యీవేదముల నిత్యత్వమును గూర్చినట్టియు, దివ్యోత్పత్తినిగూర్చినట్టియు పరంపరకూడ నంత ప్రాచీనమైనదే యని మనము తెలిసికొనవలెను. ఇదేప్రకారముగ, బ్రాహ్మణములను, ఉపనిషత్తులను, పరిశీలించి చూచినను కూడ సహజముగ యీభావములే గన్పట్టుచున్నవి. ఋగ్వేదము అగ్నినుండియు, యజుర్వేదము వాయువునుండియు, సామవేదము సూర్యునుండియు, యుత్పన్నమయ్యెనని యీ గ్రంథములు చెప్పుచున్నవి. వేదోత్పత్తికై ప్రజాపతి తపస్సుచేయగ, ఆ తపోవేడిమినుండి యీముగ్గురు దేవతలును ప్రోత్సహింపబడి యీ వేదములనుత్పన్న మొనర్చిరట. [ శత. బ్రా. XI. 5, 8, 1; ఐ. బ్రా. V, 32, 34; ఛాం. ఉ. IV, 17, 1] పరమపురుషుని ఉచ్ఛ్వాసమే వేదములయ్యెనట. [ బృ ఉ. II, 4, 10 ] "నిత్యవచస్సు" నుండి ప్రజాపతి వేదములను ప్రపంచమందలి సమస్తమును సృజించెనట. మన్వాది స్మృతులును (I, 21, 23) పురాణములునుకూడ యీభావమునే



తెలుపుచున్నవి... కల్పాంతమందు సంభవించు ప్రళయములో సమస్తపదార్థములతోపాటు యీవేదములుకూడ నశించునని యీగ్రంథములు ఒప్పుకొనుచున్నవి. కాని, అంతమాత్రముచే వేదములనిత్యత్వమునకు భంగము రాజాలదట. ఏలననగ:— నూతన కల్పారంభమందీవేదములు మరల బ్రహ్మచేతనే ప్రవర్తింప జేయబడుచున్నవి. చిన్నచిన్న ప్రళయములు గడచినపిదప అప్పటికి మిగిలియున్న ఋషీశ్వరులు వేదములను తిరిగి ప్రవర్తింపజేయుచుందురు. దీనికిప్రమాణము మహాభారతము [శాంతి: అ. 210; 5, 19] నుండి యుదాహరింపబడుచున్నది. [యుగాన్తేఽన్తర్హితాన్ వేదాన్ సేతిహాసాన్ మహర్షయః లేభిరే తపసాపూర్వ మనుజ్ఞాతాః స్వయంభువా ॥ భవభూతిః ఉత్తర: I, 15:— బ్రహ్మర్షయో బ్రహ్మహితాయ తప్త్వా । పరః సహస్రాః శరద స్తపాంసి । ఏతా న్యపశ్యన్ గురవః పురాణాః । స్వాన్యేవ తేజాంసి తపోమయాని ॥ ] "మహర్షులు స్వయంభువుచే ననుజ్ఞాతులై, యుగాంతమందంతర్హితమైన వేదములను, యితిహాసములను, పూర్వమందు తపశ్శక్తిచే సంపాదించిరి" — కావున, మహర్షులు వేదసూక్తములను చూచినవారేగాని, చేసినవారుగాగు. దీనినిబట్టి తైత్తిరీయ, కాఠకాదిశాఖల పేర్లకును, ఫలానిఋషి ఫలాని సూక్తము "రచించె" "సృజించె" నని చెప్పువాక్యములకును అర్థమేమి తేలుచున్నదన్నగ:— ఫలానిశాఖ, లేక ఫలాని సూక్తము ఫలానిఋషిచే చూడబడెనని — కేవలము చూడ

బడియెనని మాత్రమే — అర్థముగాని వేరొకయర్థము లేదని భావము. ఇటీవల వివిధములగు వేదాంతమతశాఖలు (దర్శనములు) ప్రబలినపిమ్మట ఆయామతకర్తలీ వేదనిత్యత్వమును గూర్చి బహుసూక్ష్మముగ చర్చించియున్నారు. ఈమతకర్తలు బయలుదేరువరకు యీవిషయము నెవరింతసూక్ష్మముగ పరిశీలించినవారు లేరు. ఈ మతకర్తలొనర్చిన చర్చలను పరిశీలించి చూచి "వారి తర్కములోని తీక్ష్ణతయు, వారి వాదప్రతివాదముల హేతుబద్ధతయు, సమయస్ఫూర్తిగ నుపమానముల జూపుటలో వారికున్న చతురతయు, నుల్లాసమును, మన కాశ్చర్యము గలిగింపకమానవ"ని డాక్టరు మ్యూయిరుగారు చెప్పుచున్నారు. ఈ చర్చలను పరిశీలించినమీదట మనకు ప్రధానముగ గాన్పించు సారాంశమేమనగ:— బహుప్రాచీనకాలమునుండియు అవిచ్ఛిన్నముగ వచ్చుచున్న పరంపరలవెంట వెనుకకుబోయి చూచినకొలది యీ వేదములు ఫలాని మనుష్యునిచే రచియింపబడినవని చెప్పదగిన చిహ్నములు (లేక జాడలు) యేకోశమందును గానవచ్చుటలేదు. ఈచర్చల నొనర్చిన మతకర్తలు అసాధారణప్రజ్ఞగలవారుగాని సామాన్యులుగారు. వీరి పాండిత్యమును, ధర్మనిష్ఠాపరతయు ననుపమానము లనుసంగతిని మనము జ్ఞాపకముంచుకొన్నచో, క్రీస్తుశకమునకు పూర్వమనేకశతాబ్దములక్రిందటనే బహుప్రాచీనమైనదని యెంచబడిన వేదనిత్యత్వపరంపరయొకటి యుండెనని ఋజువుచేయుట కీమతకర్తలిచ్చియున్న



సాక్ష్యమే నిర్వివాదమైన పరమప్రమాణముగ మన మంగీకరించితీరవలెను. ఈ పరంపరయొక్క యతిప్రాచీనత నిట్లు దృఢముగ నిశ్చయింపవచ్చును. వేదముల స్వరూపస్వభావముల పరిశీలింపదలచిన యీ సందర్భమందిట్టి పరంపరనుగూడ మనము బహుసూక్ష్మముగ పరిశీలింపవలసిన యవసరమున్నమాట వాస్తవమే. కాని, దీనినెంత పరిశీలించినను తుదకు మనకు గలుగుఫలితమేమి? ఈప్రాచీనఋషీశ్వరుల మేధాశక్తి పోయిపారజూడగలిగినంతవరకు యెచ్చటను వేదములకు కర్తయనదగినమానవు డెవడును గానవచ్చుట లేదు. ఇంతియేగాని, మన కీపరంపరవలన నెక్కువ ఫలితమేమియుగన్పట్టదు. ఇది కేవలము అభావార్థకమైన ప్రమాణమేగాని దీనివలన మనము గట్టిగ నిశ్చయింపదగినదేదియు లేదు. కావున, మీమాంససూత్రకర్తయైన జైమినులవారు వేదనిత్యత్వము నింకొకవిధముగ సమర్థించుచున్నారు. వేదములోని శబ్దమునకును భావమునకునుగల సంబంధము శాశ్వతమే (ఔపపత్తికమే) గాని సాంకేతికముగాదని జైమినులవారి సిద్ధాంతము. ఒకానొక నిర్దిష్టక్రమమందమర్పబడియున్న అక్షరసమూహమునకే శబ్దమనిపేరు. ఈయక్షరములొకదాని వెంట మరియొకటి యిట్లీనిర్దిష్టక్రమమందు ఉచ్చరింపబడుట చేతనే యీ శబ్దమందిమిడియున్న భావము వ్యక్తమగుచున్నది. కాని, వైయాకరణులుమాత్ర మీయభిప్రాయముతో నేకీభవించుటలేదు. అక్షరము లస్థిరములగుటచే, కేవల మక్షర

సమూహాము చేతనే శబ్దములోని భావము వ్యక్తముగాదు. అక్షరసమూహాము నుచ్చరింపగనే "స్ఫోట" యను నొకా నొక యింద్రియాతీతవ్యక్తి వచ్చి దానిపై యావేశించి, అందుండు భావమును పైకివ్యక్తపరుచునని వైయాకరణులు చెప్పుచున్నారు. నశ్వర (అస్థిర) పదార్థములను దెల్పుశబ్దములు వేదమందు లేనేలేవని జైమినులవారు గట్టిగ చెప్పుచున్నారు. వేదశబ్దములును అందలి భావములును నిత్యములగుటచే వేదములు స్వప్రకాశములైనవని జైమినులవారి మతము. అనగ, సూర్యునివలె వేదములు తమంతట తామే వెలుంగుచుండుననియు, అందుచే నవి అన్యూనమైనవనియు, దోషరహితమైనవనియు జైమినులవారు చెప్పుచున్నారు. వేదములో కొన్ని భాగములకు ఋషులపేర్లు చేర్చబడియున్నను, అవి యాఋషులచే రచింపబడెనని యర్థముకాదు. ఆఋషులాభాగములను చదివి పారంపర్యముగ వానిని ప్రసరింపజేసిరని యర్థము. ఇది జైమినులవారిమతము. వేదాంతమతకర్తలగు శ్రీశంకరాచార్యులవారి వ్యాఖ్యప్రకారము, బాదరాయణులవారు శబ్దము (లేక ధ్వని) యొక్కనిత్యత్వము నంగీకరించియున్నారు. కాని, ఆశబ్ద మేజాతికిచెందినదో ఆజాతియొక్క బీజము నిత్యమైనదిగాని కేవల మాశబ్దమే నిత్యమైనదిగాదని బాదరాయణులవా రింకొకవిశేషము జెప్పియున్నారు. సృష్టిలయములకు బద్ధులైన యింద్రాదిదేవతలపేర్లు వేదమందు చెప్పబడియున్నను, యింతమాత్రముచే, వేదముయొక్క నిత్యత్వ



మునకు భంగమురాదు. ఏలననగ:- ఈయింద్రాదిదేవతలేజాతికి చెందిరో ఆజాతిబీజముమాత్ర మెప్పుడును నశింపక శాశ్వతముగ నిలిచియేయుండును. వేయేల, వేదమందు పేర్కొనబడినపేర్లును, జాతిరూపములును నిత్యములు; ఇట్లు నిత్యములుగ నిలిచియున్న వీనిని జ్ఞప్తికి తెచ్చుకొనియే ప్రతి నూతనకల్పారంభమందును బ్రహ్మ మరల జగత్తును సృష్టించుచుండును. [మై. ఉ. VI, 22] కావున, సమస్త జగత్తునకు ప్రభవస్థానమైన ఆదిశబ్దమే వేదము. కావున, వేదము నిత్యమయియేతీరవలెను. ఈసిద్ధాంతమును పాశ్చాత్యులగు అలెగ్జాండ్రియన్ మతస్థుల "డివైన్‌లోగాస్" అనుసిద్ధాంతముతో పోల్చవచ్చునని మాక్సిముల్లరుపండితుడు చెప్పుచున్నాడు. నైయాయికులు శబ్దము (లేకధ్వని) యొక్క నిత్యత్వము నంగీకరించుటలేదు. సహజజ్ఞాన ప్రేరితమైన ధర్మదృష్టిగలట్టియు -(సాయనులవారు చెప్పినట్లు "సాక్షాత్కృత-ధర్మాణః") - సమర్థులైనట్టియు - (ఆప్త) - పురుషులనుండి వేదము లుత్పన్నములగుటచే నవి పరమప్రామాణ్యములుగ నంగీకరింపబడుచున్నవని నైయాయికులు తలంచుచున్నారు. ఐహికవ్యవహారముల నడవడికై వేదము లేర్పరచియున్నచట్టములు మనకిప్పుడు పరమప్రయోజనకారులుగ నున్నవి. వానిని మనస్వానుభవముచేతనే పరీక్షింపవచ్చును. కనుక, ఐహికములగు విషయములలో నింతటి యమోఘచట్టముల నేర్పరచిన యాపురుషుల సమర్థత దీనివలననే

పూర్తిగ బుజువగుచున్నది. ఇదియిట్లుండగ, వేదములకు యీశ్వరుడే కర్తయని వైశేషికసూత్రకర్త చెప్పుచున్నాడు. (I, 1, 3,) శబ్దమునకును అందలి భావమునకును గలసంబంధము నిత్యమైనదనుమాటను (నైయాయికులతోపాటు) సాంఖ్యులుకూడ త్రోసివేయుచున్నారు. (సాంఖ్యసూత్రములు V, 40, 51) వేదము "పౌరుషేయము"-అనగ, ఆదిపురుషునుండి యుత్పన్నమైనది - అని సాంఖ్యులు చెప్పుచున్నారు. అయినను, ఆయాదిపురుషుడు కావలెనని బుద్ధిపూర్వకముగ చేసినయత్నముచే యీ వేదములు పుట్టలేదట. కాని, ఆతని యుచ్ఛ్వాసనిశ్శ్వాసములవలెనే యీ వేదములుకూడ ఆతని నుండి వానియంతట నవియే (యతనియెరుకలేకుండ) బయటికి వచ్చినవని సాంఖ్యులు చెప్పుచున్నారు. దీనినిబట్టి చూచినచో మీమాంసకులు చెప్పిన నిత్యత్వమునకును యీ సాంఖ్యులు చెప్పిన నిత్యత్వమునకును చాలభేదము గన్పట్టును. కనుక, వేదనిత్యత్వమును ప్రతిపాదించు వాక్యములు కేవలము సజాతీయ పరంపరలయొక్క యవిచ్ఛిన్నధారను మాత్రమే సూచించుచున్నవని సాంఖ్యుల మతము (వేద-నిత్యతా-వాక్యానిచ సజాతీయానుపూర్వీ-ప్రవాహానుచ్ఛేదపరాణి) [వేదాంతపరిభాషా, ఆగమపరిచ్ఛేద :- మహామహోపాధ్యాయ ఝల్కికారుగారి న్యాయకోశము 2 వముద్రణము 736 వ పుటనుండి:- వేదః- సర్గాద్యకాలే పరమేశ్వరః పూర్వసర్గసిద్ధవేదానుపూర్వీసమానానుపూర్వీకం వేదం విర



చితవాన్ నతు తద్విజాతీయం వేదమ్॥ వైయాకరణ పండితుడగు పతంజలి తనపాణినివ్యాఖ్యయం దీసమస్య నింకొకవిధముగ పరిష్కరించుచున్నాడు. వేదములలోనుండు శబ్దజాలమునకును (వర్ణానుపూర్వీ), వాని 'యర్థ' మునకును చాలభేదముగలదని పతంజలి చెప్పుచున్నాడు. వేదములకు చెప్పబడిన నిత్యత్వ మీయర్థమునకు వర్తించునుగాని, అందలి యక్షరక్రమమునకు వర్తింపదని వారియభిప్రాయము. [అర్థో నిత్యః, వర్ణానుపూర్వీ అనిత్యా] అర్థము నిత్యముగ నుండెనేగాని, అందలి యక్షరక్రమముమాత్రమెల్లప్పుడు ఒకేవిధముగ నుండక మారుచువచ్చెను. అక్షరక్రమమిట్లు మార్పు జెందుటచేతనే మన కిప్పుడు కఠములు, కలాపములు, ముదకములు, పిప్పలాదములు - లోనుగాగల పాఠభేదములు గన్పట్టుచున్నవని వారి యభిప్రాయము. ఇది "అక్షరక్రమమును, అందలి యర్థమునుకూడ నిత్యములే" యని చెప్పు మీమాంసకమతమునకు విరుద్ధముగనున్నది. అక్షరక్రమముయొక్క నిత్యత్వమును పతంజలి యంగీకరింపక పోవుటకు కారణ మేమనగ:- దీనినంగీకరించినచో, ఒకేవేదమున కనేకశాఖలు, పాఠభేదములు నుండుటకు కారణము గన్పట్టదు. దీనిలో ప్రతిశాఖయు, ప్రతిపాఠమును, సమానమైన ప్రామాణ్యము గలవిగనే యంగీకరింపబడుచున్నవి. వేదములం దిట్లు పాఠభేదములుండుట కొక కారణమును పతంజలి - (కైయటు, నాగోజీభట్టుల వ్యాఖ్యప్రకారము) — చెప్పుచున్నాడు.

ఈప్రపంచమం దప్పుడప్పుడు సంభవించు ప్రళయములచే వేదపాఠములు నశించును. ప్రళయానంతరమందు సజీవులై యున్న మహర్షు లీవేదములను తమకు జ్ఞాపకమున్నంతవరకు పునరుద్ధరించుచుందురు. [పతంజలిః– ననుచోక్తం నహిచ్ఛన్దాంసిక్రియన్తే నిత్యానిచ్ఛన్దాంసీతి। యద్యప్యర్థో నిత్యోయాత్వసౌ వర్ణానుపూర్వీ సాఽనిత్యా। తద్భేదాచ్చైతత్భవతి కాఠకం కాలాపకం మౌదకం పైప్పలాదకమితి॥ నాగోజీభట్టు:– ప్రతిమన్వాంతరం చైషా శ్రుతి రన్యాఽభిధీయతే; మరియు:– ధాతా యథాపూర్వ మకల్పయత్ (ఋ X, 190, 3) కనుక, ప్రతిమన్వంతరమందు నొక క్రొత్త వేదము తయారగును; ఇందలి అక్షరక్రమము తత్పూర్వవేదమందలి యక్షరక్రమమునకంటె భిన్నముగనుండును. కాని, యిందలి యర్థము మాత్రము యెప్పటివలెనే నిత్యముగ నిలిచియుండును. పూర్వకల్పమునుండి వంశపారంపర్యముగ తమకు వచ్చుచున్న యీపవిత్రజ్ఞానసంపదను ఋషీశ్వరులు ప్రతినూతనమన్వంతరారంభమందును, తమకు జ్ఞాపకమున్నంతవరకు, యీలోకమందు మరల ప్రవర్తింప జేయుచుందురు. ఒకేవేదమందు సమానాధికారముగల భిన్నశాఖలు భిన్నఋషీశ్వరుల పేరట నున్నవి. దీనికి కారణమేమనగ:– ఆయాఋషులెవరికి జ్ఞాపకమున్నదానిని వారువ్రాసిరి. ఋషీశ్వరుల్ల జ్ఞాపకములోనున్న భేదమునుబట్టి శాఖలలోకూడ భేదముగల్గెను. ఈయభిప్రాయము మన మిదివరకు మహాభారతమునుండి యుదాహ-



రించిన వ్యాసులవారి యభిప్రాయముతో పూర్తిగ నేకీభవించుచున్నది. సూత్రకారుల యీయభిప్రాయములనే యిటీవల ప్రబలిన భిన్నవేదాంతమతములవారు భిన్నరీతులుగ విరళమొనర్చియున్నారు. వీరిలో కొందరు వేదముయొక్క శబ్దప్రమాణము నంగీకరించిరి; కొంద రంగీకరింపక త్రోసివేసిరి. ఈచర్చలన్నింటిలోనికి మన మిప్పుడు దిగజాలము. అదిగాక, ఇవి మన కిప్పు డవసరముకూడకాదు. ఏలననగ:– వేదములు ప్రతి ప్రళయమందు నశించిపోవుచు, ప్రతి ప్రళయానంతరమందు పునరుద్ధారణ మొనర్పబడుచు వచ్చెననుమాట నిజమేయైనచో, మనము తుదకు వ్యాసపతంజలుల యభిప్రాయములనే యాధారముగ గైకొనక తప్పదు.

వేదముల యుత్పత్తినిగూర్చియు, స్వరూపస్వభావములనుగూర్చియు, ప్రామాణ్యమునుగూర్చియు హిందూ వేదాంతశాస్త్రజ్ఞుల యభిప్రాయముల నిట క్లుప్తముగ వివరించియున్నాను. వేదముల నిత్యత్వయనాదిత్వములనుగూర్చి వ్యాసపతంజలులు దెలిపియున్న యభిప్రాయములు మన మిదివర కీగ్రంథమందు భౌతికశాస్త్రాధారముచేతను ఐతిహాసిక ప్రమాణములచేతను ఋజువుపరుప యత్నించిన ధ్రువసిద్ధాంతముతో చాలవర కేకీభవించుచున్నవి. వేదమతమును, తదుపాసనాపద్ధతులును – రెండును – హిమప్రళయమునకు పూర్వమందే ప్రబలియుండెనని మనమిదివరకు ఋజువుపరచియున్నాము. అస లివియెప్పుడు పుట్టెనో మన మంతనిశ్చయ

దుర్గ్రాహ్యములైపోయెను. కర్మకాండయు, దీనిని గూర్చి బ్రాహ్మణములందు గానవచ్చుచున్న అసంఖ్యాకము లగు వివరములును యీకాలమందే ప్రబలియుండును. ఈ యుగము యొక్క చివరిభాగమందే వేదాంగజ్యోతిషము మొట్టమొదటగ రచింపబడెను, లేక అందు పేర్కొనబడిన విషువత్ స్థానములు ప్రజలచే చూడబడెను; లేక నిర్ణయింపబడెను.

క్రీ॥ పూ॥ ౧౮౦౦-౫౦౦ :— ఇది బుద్ధునకు పూర్వయుగము. ఈకాలమందే సూత్రములును, వివిధ వేదాంతమతములును పొడసూపినవి.

నే నిదివరకు "మృగశీర్షా" గ్రంథములో చెప్పిన కాలవిభాగమునకును దీనికిని కొద్దిగ భేదమున్నది. కాని, ధ్రువసిద్ధాంతముచే యీ మార్పు అవసరమయ్యెను. ఏలననగ :— ఈసిద్ధాంతముచే అదితియుగమును తీసికొనిపోయి ప్రళయానంతర యుగారంభమందు పెట్టవలసివచ్చెను. దీనిని పౌరాణిక పరిభాషలో చెప్పినచో, ప్రళయానంతర ప్రథమయుగమునకు 'కృత'యుగమని పేరుపెట్టవచ్చును. కృతయుగ మనగ (ఐతరేయబ్రాహ్మణము VII, 15 చెప్పినట్లు) "సంచార మొనర్చు" యుగమని భావము. అనగ, యీ కృతయుగమందు హిమప్రళయములో చావగ మిగిన యార్యులు నూతన నివాసస్థానముల వెదకికొనుచు ఆశియా ఐరోపాఖండములయొక్క యుత్తరపార్శ్వములందు తిరుగాడుచుండిరి. 'కృత'యుగమనగ సంచారమొనర్చు యుగమని బ్రాహ్మణగ్రంథములు చెప్పి



నప్పుడు బహుశః వానిభావ మిదియే యగునో కాదో మన మిప్పుడు నిశ్చయముగ చెప్పజాలము. అయినను బ్రాహ్మణగ్రంథములో వర్ణింపబడిన చతుర్యుగ లక్షణముల కిప్పుడు మన ధ్రువసిద్ధాంతముచే నూతనవికాసము గలుగుచున్నది. ఐ. బ్రా. VII, 15 లో నిట్లని వర్ణించిరి:— "కలి శయనించుచున్నది; ద్వాపరము నెమ్మదిగ జరుగుచున్నది; త్రేతాయుగము నిలుచున్నది; కృతయుగము చరించుచున్నది" [కలిః శయానో భవతి సంజిహానస్తు ద్వాపరః। ఉత్తిష్ఠ స్త్రేతా భవతి కృతం సంపద్యతే చరన్॥ ఈవర్ణనము పాచికలాటను సూచించుచున్నదని డాక్టరు హేగుగారు తలంచుచున్నారు. మరికొంద రింకొక విధముగ దీనిని సమన్వయింపజూచిరి. కాని, మన ధ్రువసిద్ధాంతదృష్టితో చూచినచో యీవర్ణనము ధ్రువనిలయమునుండి లేచివచ్చిన ఆర్యులు నూతననివాసములను వెదకికొనుటకై యొనర్చిన పర్యటనాదులను దెల్పుచున్నదని మన మూహింపవచ్చును. భగవంతుడు క్రమముగ పదునారు భూములను సృజించుటయు, వానిని అంగ్రమైన్యుడను రాక్షసుడువచ్చి పాడుచేయుటయు మొదలుగాగల పారశీకగ్రంథవర్ణనమువలెనే యిచ్చటకూడ ఆర్యులు హిమప్రళయానంతరమందు ధ్రువనిలయమునుండి లేచివచ్చి నూతననివాసస్థానములను వెదకికొనుటకై తిరుగాడుట మొదలుకొని తుదకు తమ మనస్సులకు నచ్చిన భూములలో స్థిరముగ కాపురముండుటవరకుగల ఆర్యుల యవస్థాభేదములే బ్రాహ్మణగ్రంథమం

ముగ, ప్రసరింపజేయుటకై వైదికఋషులీజ్ఞానసంపదను సూక్తరూపములుగ బొందుపరచి యుంచిరి. ఇక్కార్యమును వారు ధర్మ్యమును, పరమపవిత్రమునైన విధిగ భావించుకొనిరి. ఇట్టి ధర్మనిర్వహణ మొనర్చుటకై వారికిగల యోగ్యతనుగాని, సమర్థతనుగాని, మనము శంకింపవలసిన కారణము గన్పట్టదు. వారీధర్మమును సత్యముగ నెఱవేర్చిరనియే మనము గట్టిగ విశ్వసింపవలెను. ఇట్లు విశ్వసింపకపోవుటకును మనకు కారణము గన్పట్టదు. ఇట్టియుపాయములచేతనే అధమపక్షమిప్పటికి 3, ౮ వేల సంవత్సరములనుండికూడ వేదసూక్తములన్నియు – ఒక్కస్వరమైనను తప్పకుండ –భద్రపరుపబడుచు వచ్చినవి. ఇటీవలివారు చేసిన యీపనినే ప్రాచీనకాలమందు– అనగ, ధ్రువనీలయమునుగూర్చియు, తత్కాలమందలి మతమునుగూర్చియు చెప్పు ప్రాచీనపరంపరలయొక్క– భావార్థమింకను పూర్తిగ మరుగుబడకయున్నకాలమందు– మనపూర్వజులగు ఋషీశ్వరులుకూడ చేసియుండిరనుట కెంతమాత్రమును సందేహములేదు. ఈసూక్తములు బహిరంగ సమావేశములలోను, బహుజనులచే నిండియున్న సమాజములలోను గానమొనర్పబడుచుండెననికూడ మనము తెలిసికొనవలెను. ఈమప్రాచీనమతమును, ఉపాసనాపద్ధతులను తదితర కర్మకాండను చెడకుండ కాపాడి భద్రపరుపవలెనను గట్టికోరిక ప్రజలలో ప్రతివారికినుండెను. కావున, యీఋషీశ్వరుల ముఖగహ్వరమునుండి వెడలివచ్చువాక్యములను వారు బహు



శ్రద్ధాభక్తులతో, నాలకించుచుండిరనికూడ మనము తలంపవచ్చును. కావున, ధ్రువనివాసమునాటి ప్రాచీనమతము పరంపరలరూపముగ మొట్టమొదట కొంతకాలమువరకు సక్రమశిక్షణ మొందిన ఋషీశ్వరుల ధారణాశక్తిచే యెంతమాత్రము చెడకుండ సరిగ భద్రపరుపబడెననియే మనము గట్టిగ చెప్పవచ్చును. అటుపిమ్మట నవి అపరిష్కృతమైన ఋక్కులుగ ఋగ్వేదమందు బొందుపరుపబడెను. మృగశీర్షయుగమందు వీనికి మెరుగుపెట్టుటచే నవి సూక్తము (సు – ఉక్తము) లయ్యెను. పిమ్మట కొంతకాలమున కీసూక్తములు మండలములుగ విభజింపబడెను. కృత్తికాయుగమం దీసూక్తములన్నియు సంహితలక్రింద విభజింపబడెను. మొత్తముమీద యీసూక్తములలో చెప్పబడిన విషయము లన్నియు హిమప్రళయాత్పూర్వమునాటివే యని మనము నిశ్చయముగ చెప్పవచ్చును. ఇందు వివరింపబడిన విషయములయొక్క యుత్పత్తి యెంతకాలముక్రిందట జరిగెనో యిది యూహింపటకు వీలులేకున్నది. వీనియుత్పత్తి-కాలగర్భమం దంతర్హితమై పోయెను. వేదాంతశాస్త్రజ్ఞులయొక్కయు, ఇతిహాసికులయొక్కయు యభిప్రాయము [illegible] కొన్నియుదాహరణల విరళముగ గాన్పింపగలవు :—

| వేదాంత మతము. | ఐతిహాసిక మతము. (భూతికశాస్త్రరీత్యా) |
| --- | --- |
| (౧) వేదములు నిత్యములు; వానికి ఆదిలేదు (అనాది); అవి అపౌరుషేయములు (అనగ, మానవులచే నిర్మింపబడలేదు) | (౧) వైదిక లేక ఆర్యమతము హిమప్రళయమునకు పూర్వమందే ప్రబలియుండెనని ఋజువు చేయగలము. కాని, దాని యొక్క అసలు మూలోత్పత్తి మాత్రము కాలగర్భమందంతర్ధానమై పోయెను. |
| (౨) క్రిందటి కల్పాంతమందు తటస్థించిన ప్రళయములో వేదములు నశించెను. | (౨) ఆర్యుల ప్రాచీన ధ్రువనిలయమందు తటస్థించిన క్రిందటి హిమప్రళయముచే ఆర్యమతమును, సభ్యతయు నశించెను. |
| (౩) ప్రస్తుతకల్పాదియందు ఋషీశ్వరులు భగవదనుగ్రహముచే తమ ధారణాశక్తియందు పట్టియుంచియున్న ప్రళయాత్పూర్వమునాటి వేదములను—కేవల మాస్వరూపముతోడనే గాకపోయినను వాని సారాంశము నంతను చాలవరకు—తమ తపశ్శక్తిచే పునరుద్ధారణ మొనర్చిరి. | (౩) ప్రళయాత్పూర్వమునాడు వసించియున్న తమ పూర్వజుల నుండి నేటివరకు అవిచ్ఛిన్నధారగ తమకు సంక్రమించుచు వచ్చిన జ్ఞానమును ప్రళయానంతరమందలి కవీశ్వరులు వేదసూక్తరూపములుగ గానమొనర్చియుండిరి. |



ఈ పైకోష్ఠకమును పరీక్షించి చూచినచో వేదముల యొక్క నాశనమును గూర్చియు, తత్పునరుద్ధరణమును గూర్చియు, వ్యాసులవారు మహాభారతమందు చెప్పినవాక్యము కేవలము సత్యమైన చరిత్రాంశముపైననే యాధారపడి యున్నట్లు స్పష్టమగుచున్నది. ప్రస్తుతకల్ప మారంభమై యిప్పటికెన్నియో వేలసంవత్సరములయ్యెనని పురాణములు చెప్పుచున్నమాట వాస్తవమే. కాని, దీనిలో నాశ్చర్యమేమియు లేదు. ఏలననగ:— క్రిందటి హిమప్రళయము గతించి యిప్పటికి ౧౦ వేల సంవత్సరము లయ్యెనని చెప్పు భూగర్భశాస్త్రవేత్తలే కొందరీకాలమందుండగ, పౌరాణికులు వేసిన విపరీతఅంచనాలను చూచి మనమంతగ ఆశ్చర్యపడవలసిన పనిలేదు. ఇంకొకవిశేషమేమనగ:— కృత, త్రేతా, ద్వాపర కలియుగముల పరిమితి మొత్తము పదివేల సంవత్సరములనియు, క్రిందటిప్రళయానంతర మారంభమైన నూతన కల్పముతోడనే (అనగ, భూగర్భశాస్త్రరీత్యా హిమప్రళయానంతరమే) కృతయుగ మారంభమయ్యెననియు దెల్పు సత్యమగు చరిత్రాంశ మొకటి ప్రాచీనపరంపరరూపముగ యీ పురాణములందే స్పష్టముగ గన్పట్టుచున్నది. కావున, యిటీవల పౌరాణికులు వేసిన విపరీతఅంచనాలను మనమంతగ పాటించి ఆశ్చర్యపడవలసిన యవసరములేదు. ఐతిహాసికులకును వేదాంతులకును వేదముల యనాదిత్వవిషయమునందు భేదమున్నదని చెప్పవచ్చును. వేదమతమునకును, ఐతిహాసి

పద్ధతులకును అసలు "ఆది" యనునదియే లేదని చెప్పుట భౌతికశాస్త్రరీత్యా ఐతిహాసికదృష్టిలో అసంభవము. కాని, మనమింతవరకుమాత్రము చెప్పవచ్చును. ఏమనగ, వీనియొక్క మూలము కాలగర్భమం దంతర్ధానమై పోయెనని చెప్ప వచ్చును. లేదా, ఆర్యమానవుడు, ఆర్యభాష, యెంతకాలము క్రిందట పుట్టెనో ఆర్యమతముకూడ నంతకాలముక్రిందటనే పుట్టెనని చెప్పవచ్చును. వేదముల యనాదిత్వమునుగూర్చిన తమ యభిప్రాయమునకు బలము నిచ్చుచున్న యీభౌతిక శాస్త్రప్రమాణములతో వేదాంతులు తృప్తినొందకపోయిన యెడల యీభౌతిక వేదాంత మతముల రెంటికిని సంధి కుదుర జాలదు. వీనియం దవలంబింపబడు పరిశీలనాపద్ధతులు భిన్న ములుగనుంటచే, యీరెండును రెండు ప్రత్యేకమతములుగనే నిలిచిపోవలసివచ్చును. యీకారణముచేతనే నేను పైన యీరెంటిని రెండు ప్రత్యేకశాఖలుగ విడదీసి కోష్ఠకరూప మున ప్రదర్శించియుంటిని. ఈజగత్తంతయు ఆకశబ్దము నుండియే (లేక "డివైన్ లోగస్" నుండియే) పుట్టెనా యను నంశము ఐతిహాసిక దృష్టియందు పడజాలదు. కావున, యీయంశముపై యాధారపడియున్న సిద్ధాంతములను మన మిట చర్చింపజాలము. అయినను, కేవల భౌతికశాస్త్ర దృష్టితోచూచినప్పటికిని వేదమతమున కాదియనునది యున్న ట్లెచ్చుటను గానవచ్చుట లేదని మనము సర్వసాధారణముగ చెప్పుకొనవచ్చును.



తాము గానమొనర్చుచున్న సూక్తములలోనిమాటలు తమ స్వంతమాటలేయైనను అందలి విషయములుమాత్రము బహుపురాతనమైనవని — హిమప్రళయాత్పూర్వమునాటివని— వైదికఋషులకు పూర్తిగ తెలియును. ఋగ్వేదసూక్తములను మనము జాగ్రతగ పరిశీలించిచూచినచో, యీవ్యత్యాసము వైదికఋషులకే పూర్తిగ తెలియునని స్పష్టముగాగలదు. పైన మన మిదివరకు రెండుతరగతుల సూక్తములను వివరించితిమి. ఆయాఋషులపేరిటనున్న సూక్తముల నాయాఋషులు — వడ్రంగి రథమును చేసినట్లు—చేసిరి, సృజించిరి, ఆకృతి నిచ్చిరి, అనిస్పష్టముగ చెప్పెడి సూక్తము లొకతరగతిక్రిందికివచ్చును. మరియు, యీసూక్తములు దేవతలచే "నొసంగబడినవి" "ప్రేరేపింపబడినవి," "సృజింపబడినవి" అని యింత స్పష్ట ముగనే చెప్పెడి సూక్తములు రెండవతరగతిక్రిందికి వచ్చును. ఈరెండుతరగతుల యభిప్రాయములను సమన్వయించుటకై డాక్టరు మ్యూయరుగా రనేక యుపాయములను జెప్పిరి. ఏమనగ:— (౧) బహుశః, ఋషులలో నీ రెండు తరగతుల యభిప్రాయభేదము లుండియుండవలెను. (౨) లేదా, యీ రెం డభిప్రాయముల నొక ఋషియే చెప్పినచో, యేసమయ మం దేయభిప్రాయము తన మనస్సునకు తట్టెనో అప్పు డా ఋషి యా యభిప్రాయమును చెప్పుచు వచ్చెననియైన మన మనుకొనవలెను. (౩) లేక, ఈశ్వరప్రేరణయనగ నేమో వైదికఋషులకు స్పష్టముగ తెలిసియుండకపోవచ్చును; అందుచే

తమ రచన కీశ్వరప్రేరణయున్నదని వారికి తెలిసినప్పటికి, అంత మాత్రముచే నా సూక్తములు తమచే రచింపబడినవి కాజాలకపోవని వారు తలంచియుండవలెను. సారాంశ మేమనగ:- ఈసూక్తరచనయందు పురుషయత్నముతోపాటు దైవప్రేరణ కూడ నుండియుండవచ్చుననియు, దీనియందసంగతమేమియు లేదనియు డాక్టరు మ్యూయరుగారి యభిప్రాయము. కాని, డాక్టరు మ్యూయరుగారు చెప్పిన యీపైసమాధాన మంత దృఢముగ గన్పట్టుటలేదు; ఇది యంతతృప్తికరముగ లేదు. పరస్పరవిరుద్ధములుగ గన్పట్టుచున్న యీఋషుల యభిప్రాయములకు యింతకంటె సంతృప్తికరమైన సమాధాన మింకొకటి గానవచ్చుచున్నది. ఎట్లనగ:- సూక్తముల స్వరూపమును అనగ భాషను, శబ్దజాలమును, ఒక తరగతిగ భావింపుడు; మరియు ఆ సూక్తములందలి విషయములను, లేక సారాంశములను మరియొక తరగతిగ భావింపుడు. ఇట్లీరెంటిని రెండు తరగతులుగ విడదీసి చూచినచో అందు మొదటి తరగతియైన "శబ్దజాలము" మానవనిర్మితమైనదిగ భావింపబడెను; రెండవ తరగతియైన "సారాంశము" బహుపురాతన మైనదిగను, మానవాతీతమైనదిగను (అ-పౌరుషేయమైనదిగను) వైదిక ఋషులచే భావింపబడెనని మనము నిర్ణయింపవచ్చును. వైదిక ఋషులు తమకు పూర్వకాలమందున్న పురాతన ఋషీశ్వరులను (పూర్వేఋషయః) గూర్చియు, పురాతనసూక్తములను గూర్చియు ప్రశంసించువాక్యము లనేకములు ఋగ్వేదమందు



గానవచ్చుచున్నవి. [I, 1, 2; VI, 44, 13; VII, 29, 4; VIII, 40, 121; X, 14, 15, Etc. ] ఈవాక్యములు వైదిక ఋషులకు పూర్వజులైన ఋషులను గూర్చియు, తత్పూర్వ కాలమందున్న సూక్తములను గూర్చియు దెల్పుచున్నవని పాశ్చాత్యు లంగీకరించిరి. కాని, యీ "పూర్వజు" లనగ హిమప్రళయమున కిటీవలివారేగాని ప్రళయాత్పూర్వకాలము నాటివారు గారని పాశ్చాత్యులు వాదించుచున్నారు. కాని, యీ పాశ్చాత్యపండితుల వాదమును ఖండించుటకు తగినంత సాక్ష్య మీసూక్తములందే గలదు. నూతన, పురాతన, సూక్తములనుగూర్చి వైదికఋషులు పేర్కొనియున్నమాట వాస్తవమే. కాని, యీసూక్తము క్రొత్తదియైనను(నవ్యసీ)ఇందు పేర్కొనబడిన దేవతమాత్రము చాల పురాతనమైనదని (ప్రతన) వైదిక ఋషులు పలుతావులలో తరుచుగ చెప్పుచుందురు. [VI, 22, 7; 62, 4; X, 91,13; Etc. ] ఏదేవతలయొక్క మహాత్కార్యములన్నియు నీసూక్తములందు గానమొనర్పబడియున్నవో ఆ దేవతలందరును బహుపురాతనమైనవారుగ వైదికఋషులచే భావింపబడియుండిరి. అంతయేల, యీదేవతలేగాక యీ దేవతలొనర్చిన మహాత్కార్యములుకూడ బహు పురాతనమైనవేయని స్పష్టముగ దెల్పువాక్యములు చాలచోట్లగలవు. అనగ, యీసూక్తములందు తాము వర్ణించుచున్న మహాత్కార్యములను తాము కండ్లార చూడలేదనియు, అవి తమకు పారంపర్యముగ పెద్దలవలన తెలియుచువచ్చినవనియు, ఇట్లు

పెద్దలచే విన్నవానినే తామిప్పు డీసూక్తములలోని కెక్కించుచున్నామనియు భావము. ఉదాహరణము:— ఋగ్వేదము, I వ మండలము, ౩౨ వ సూక్తము, మొదటిఋక్కును ప్రారంభించుచు ఆఋషి యేమిచెప్పుచున్నాడు? "ఆదికాలమందు (ప్రథమానీ) యింద్రుఁడొనర్చిన మహాత్కార్యములను గూర్చి నేనిప్పుడు గానమొనర్పబోవుచున్నాను" అని స్పష్టముగ ప్రారంభమందే యాఋషి చెప్పుచున్నాడు. ఇంద్రుడొనర్చిన మహాత్కార్యములకు "పూర్వ్యాణి" "పూర్వ్యః"— యను విశేషణములు ప్రయోగింపబడియున్నవి. (I, 11, 3; I, 61, 13) ఇదేరీతిగ అశ్వినులొనర్చిన కార్యములుకూడ "పూర్వ్యాణి" యని I, 117, 25-లో చెప్పబడియున్నది. అశ్వినులొనర్చిన మహాత్కార్యములయొక్క పెద్దజాబితా యొకటి యీసూక్తమందు గానవచ్చుచున్నది. దీనినిబట్టి చూడగ, ఆఋషి తనకు పారంపర్యముగ తెలియవచ్చిన మహాత్కార్యముల నన్నింటిని సంక్షేపముగ నొకచోట వివరించుచున్నట్లు గన్పట్టుచున్నదే గాని, కేవలము తానో లేక తన తాతతండ్రులో బహు కొలదికాలముక్రిందట కండ్లార చూచిన వానిని వర్ణించుచున్నట్లు గన్పట్టదు. ఈయభిప్రాయమును బలపరుచుట కింకొక నిదర్శనముగలదు. ఋగ్వేదమందు పేర్కొనబడిన అంగిరస, వశిష్ఠాది ప్రాచీన ఋషీశ్వరులకు మానవాతీతశక్తి గలదనియు (VII, 33, 7-13), వారు దేవతలతో కలసిమెలసి సంచరించుచు వారితోపాటు హాయిగ



సుఖించుచుండిరనియు (దేవానాం సధమాదః VII, 76, 4) వైదికఋషులు నమ్మిరి. వారు భవిష్యత్సంతతులవారికి మొట్టమొదటి మార్గదర్శకులట (పథికృత్ X, 14, 15) బహు కొలదికాలముక్రిందటనే గతించిన తమ తాతతండ్రుల కిట్టి దేవతాలక్షణముల నెవరును అంటగట్టరు. కావున, యిట్టి దేవతాలక్షణముల నంటగట్టదగినవారు వైదికఋషులకు బహు ప్రాచీనకాలమునాటి వారై యుండవలెను. కావున వేదమందు పేర్కొనబడిన ప్రాచీనఋషీశ్వరులు హిమప్రళయాత్పూర్వమందు ఉత్తరధ్రువమండలములో ౭, ౧౦, మాసములలో తమ వార్షికసత్రములను ముగించిన "నఃపూర్వే పితరః" — "మనపూర్వపితరు" లై యుండవలెను. ఈ ప్రాచీన ఋషీశ్వరులనుగూర్చి చెప్పిన సమాధానమే వేదసూక్తములందలి ప్రాచీన దేవతలకుకూడ వర్తించును. అదితి గాథ పూర్వయుగమునాటి (పూర్వ్యం యుగం) గాథయని వేదమే స్పష్టముగ చెప్పుచున్నది. ఈయంశమును మన మిదివరకే చూచియున్నాము. ఇంద్రుడు అశ్వినులు మొదలుగాగల దేవతలనుగూర్చిన గాథలన్నియుకూడ నదేరీతిగ పూర్వ యుగమునాటివే యని చెప్పవచ్చును. ఏలననగ:— వీరొనర్చిన మహాత్కార్యములన్నియు "పూర్వ్యాణి" "ప్రథమాని" యని ఋగ్వేదమే స్పష్టముగ వర్ణించుచున్నది. వేయేల, ఋగ్వేదమందు పేర్కొనబడిన ప్రాచీనసూక్తములు, ప్రాచీన ఋషీశ్వరులు, ప్రాచీన దేవతలు—వీరందరు—హిమ

ప్రళయమునకు పూర్వమునాటివారేగాని యిటీవలివారుగారు. ఇదిగాక, యిట్లయిననేగాని, లేనిచో, యీదేవతలకున్న ధ్రువలక్షణములను సమర్థించుట కసలు వీలేయుండదు. వైదిక ఋషులు క్రొత్తసూక్తములను రచించియుండవచ్చును; కాని, వీరీక్రొత్తసూక్తములలో నేవిషయములనుగూర్చి వర్ణించిరి? వీరేమైన క్రొత్తవిషయములను సృష్టించి వ్రాసిరా? లేక తమ తాతతండ్రులనాటినుండి పారంపర్యముగ వచ్చుచున్న ప్రాతయంశములనే యీక్రొత్తసూక్తములలోని కెక్కించిరా? తామీసూక్తములలో వర్ణించు దేవతలు ప్రాతవారనియు, తాము వారికి కల్పించు యీసూక్తములు మాత్రము క్రొత్తవనియు ఋ VI, 62, 4- స్పష్టముగ విడదీసి చెప్పుచున్నది. మరియు, వారీప్రాతదేవతలను ధ్రువలక్షణములతో నలంకరించి వర్ణించిరి. కావున, మనమిక సందేహింపవలసిన పనిలేదు. సూక్తములలోని శబ్దజాలము క్రొత్తదైయైనను అందలి విషయములు మాత్రము ప్రాతవి—అనగ, బహుపురాతనకాలమునుండి తమకు పారంపర్యముగ సంక్రమించుచు వచ్చినవి—అని తాత్పర్యము. దేవతల పుట్టుకనుగూర్చి స్తుతించుచు X, 72, 1, 2-లో ఆ ఋషి యిట్లు ప్రారంభించుచున్నాడు:- "దేవతల పుట్టుకనుగూర్చి సూక్తపఠనములతో మనము యీ యుత్తరయుగములో వానిని చూడగలిగిన వారమెవరమైనను సరే స్తుతింతుముగాక ...... (యః పశ్యాద్ ఉత్తరేయుగే)" ఇచ్చట మన కొకవైపున దేవతలపుట్టుకయు, రెండవవైపున



ఉత్తరయుగమం దాసూక్తములను చూడగలట్టి ఋషియు—గాన్పించుచున్నారు. ఇవి రెండును రెండు భిన్నవిషయములు. అనగ, యీసూక్తమందు పేర్కొనబడిన విషయము (దేవతల పుట్టుక) ప్రాతది, పూర్వకాలమునాటిది — కాని, ఆప్రాత విషయమును ఉత్తరయుగమందున్న ఋషి తనకు గాన్పించిన రీతిగ స్తుతించుచున్నాడు. వైదికఋషులు వేదసూక్తములను— కాదు, అందలి విషయములను—చూచిరేగాని చేయలేదను మాట కీపై వాక్యము చాల బలము నిచ్చుచున్నది. ఇట్టి వాక్యమే ఇంకొకటి ఋ VIII, 59, 6 లో గలదు. ఇంద్రావరుణా యదృషిభ్యో మనీషాం వాచో మతిం శ్రుత మదత్తమగ్రే। యాని స్థానా న్యసృజంత ధీరా యజ్ఞం తన్వానా స్తపసాభ్యపశ్యమ్॥ "ఓ ఇంద్రవరుణులారా! మీరు పూర్వము ఋషుల కిచ్చిన మనీషా, వాచో, మతి, శ్రుతమ్, యజ్ఞకాలమందు ఋషులు సృజించిన సమస్థానములను-వీని నన్నిటిని నేను తపస్సుచే చూచితిని [అభిఅపశ్యమ్] వేదసూక్తములందు వివరింపబడిన విషయములు వైదికఋషులచే చూడబడెనను భావము వ్యాసులవారు మహాభారతవాక్యమందు వర్ణించియున్నరీతిగనే యిచ్చట యీ ఋగ్వేదవాక్యమందు కూడ వర్ణింపబడియున్నది. ఇట్టి ప్రత్యక్షవాక్యములు మనకున్నప్పుడు వేదసూక్తములు పౌరుషేయములా అపౌరుషేయములా యను సమస్యను పరిష్కరించుట కొకటేమార్గము గలదు. ఎట్లనగ:- పతంజలి మొదలగు పండితులు సూచించినట్లుగ,

వేదసూక్తములలోని శబ్దజాలము పౌరుషేయము; అందలి విషయములు మాత్రము అపౌరుషేయములు — అని విడదీసి నిర్ణయింపవచ్చును. డాక్టరు మ్యూయరుగా రింకొక వేదవాక్యమును (VIII, 95, 4–5) వెదకిపట్టిరి. ఆ ఋషి "ఇంద్రుని కొరకై సరి క్రొత్తయైనట్టియు, ఉల్లాసకరమైనట్టియు, నొక సూక్తమును (నవీయసీం మంద్రాం గిరం) పుట్టించెను (అజీజనత్). ఇది యొకసూక్ష్మబుద్ధినుండి యుద్భవించెను. ఇది యొకపురాతనమగు ధీశక్తియొక్క ఫలితము (ధియంప్రత్నాం). ఇది పరమపావనమగు సత్యముతో నిండియున్నది". ఈసూక్తమిచ్చట ప్రాతదనియు, క్రొత్తదనియుకూడ — యేకకాలమందే వర్ణింపబడియున్నది. ఈవాక్యమందు "గిర్" (=శబ్దము), "ధీ" (=బుద్ధి) కంటె భిన్నమైనదిగ చెప్పబడినది. అనగ, ప్రాత తలంపొకటి (ప్రత్నాధీః) క్రొత్తశబ్దములతో (నవీయసీ గీః) వర్ణింపబడెనని స్పష్టమగుచున్నది. అనగ యీసూక్తము విషయములో ప్రాతది; శబ్దములలో క్రొత్తది. ఈ సారాంశమునే మన మిదివర కింకొక విధముగ తేల్చియున్నాము. ఈ సందర్భమం దింకొక యంశము నిట పేర్కొనుట మంచిది. బ్రాహ్మణగ్రంథములలోని విషయముల నన్నిటిని మన వేదాంతు లనేక శీర్షికలక్రింద విభజించిరి. వానిలో నొకదానికి "పురా-కల్ప" యని పేరిడిరి. ఈ శీర్షికక్రింద ప్రాచీనకాలమందలి కర్మలును, పరంపరలును, చేర్చబడినవి. అనగ, బ్రాహ్మణ గ్రంథములలో కూడ ప్రళయాత్పూర్వమునాటి గాథలును, పరంపర



లును నున్నట్లు మన వేదాంతులు తలంచిరని దీనివలన స్పష్టముగ తెలియుచున్నది. "పూర్వ యుగమందు యాజ్ఞికులు ఉషఃకాలము పూర్తిగవికసించి సూర్యబింబము పైకిరాదేమో యని భయపడి" నట్లు తైత్తిరీయ సంహిత చెప్పుచున్నది. శాయనాచార్యులవా రీ వాక్యమును "పురా-కల్ప" శీర్షిక క్రిందికివచ్చు నంశములలో నొకటిగ నుదాహరించి యుండిరి. ఈ తై॥ సం॥ వాక్యము ఉత్తరధ్రువమండల మందలి దీర్ఘ యుషస్సునే సూచించుచున్నదని మన మిదివరకు విశదీకరించి యుంటిమి. కావున దీనిని కండ్లారచూచిన మనుష్యులు తప్పక హిమప్రళయాత్పూర్వమునాటివారే యైయుండవలెను. ఇటీవల పుట్టిన బ్రాహ్మణములందే యిట్టి ప్రాచీన పరంపర యున్నప్పుడు యిక వేదములం దిట్టి పరంపర లుండుట కాక్షేపణ యేమున్నది? ఈరీతిగ మన మేదృష్టితో, యేవైపునుండి చూచినను తుద కొక్కటే సారాంశము ఖండితముగ తేలుచున్నది:– వేదసూక్తములలోని విషయము బహుపురాతనమును, హిమప్రళయాత్పూర్వమునాటిదియు నైయున్నది. ఈవిషయము అప్పటినుండి అవిచ్ఛిన్నధారగ, పారంపర్యముగ వచ్చి వచ్చి తుదకు ప్రళయానంతరయుగమందు వైదిక ఋషులచే వేదసూక్తములలో బొందుపరుపబడెను.

ధ్రువసిద్ధాంతముచే యుక్తియుక్తముగను, సహేతుకముగను, అపూర్వరీతిగను మొట్టమొదటి పర్యాయము విశదీకరింపబడిన యంశము లింక నెన్నియో వేదభాష్యమందును

వైదిక పౌరాణికగాథలందును గలవు. ఉదాహరణము :— పాశ్చాత్య పండితులు మొట్టమొదట మన వేదములను చూచినప్పుడు తమకు వానియందు ఆర్యసభ్యతయొక్క పునాదులు గన్పట్టవచ్చునని — పాపము ! — వారెంతయో ముచ్చటపడిరి. ప్రకృతిశక్తుల యనంత లీలలను, తచ్చమత్కారములను, ఆర్యులు మొట్టమొదట భక్తి భయభ్రాంతులతో కన్నులార వీక్షించి వానిని దేవతాస్వరూపములుగ నెంచుకొని, తమ మనఃకోశములను విప్పి యేరీతిగ వానిపై తమ స్తోత్రపాఠములను కురిపించిరో తెలిసికొందమని పాశ్చాత్య పండితు లెంతయో యుబ్బురపడిరి. కాని, — పాపము ! — వారి కాశాభంగమయ్యెను. వారి కిట్లేల యాశాభంగమయ్యెనో మన మిప్పు డతిసులభముగ గ్రహింపవచ్చును. మన ధ్రువసిద్ధాంతము వలన తేలిన సారాంశమేమనగ :— ఆర్యజాతికి వేదములే యతిప్రాచీన గ్రంథములు ; వీనికంటె పురాతన గ్రంథములు గానరావు. అయినను, వానియందు వర్ణింపబడిన నాగరికతయు, దేవతాపూజనములును, తదితర విషయములును, యీ గ్రంథములను రచించిన ఋషులు క్రొత్తగ సృజింపలేదు. ఈ విషయము లన్నియు వారికి హిమప్రళయాత్పూర్వమందు నివసించిన తమ పూర్వజులనుండియే పారంపర్యముగ లభించినవి. తమ కిట్లు పారంపర్యముగ లభించినవానిని యీ ఋషులు సూక్తములుగ రచించి, భావిసంతతుల ప్రయోజనార్థమై శిథిలము



గాకుండ భద్రపరచిరి. కనుక, అసలు ఆర్యసభ్యతయొక్క పునాదులను కనిపెట్టదలచిన వారు యీ వేదములను చూచిన ప్రయోజనములేదు. ఇంక నంతకంటెను వెనుకకు పోవలెను; అనగ, హిమప్రళయమును గడచి వెనుకకు బహుదూరము పోయి, ప్రాచీనార్యులు తమ మూలస్థానమైన ధ్రువనిలయమందెట్లు సంచరించుచుండిరో చూడవలెను. కాని మన దురదృష్టవశమున, యీ ధ్రువనిలయమం దాకాలమున వీరెంతటి నాగరికతను సంపాదించిరో తెలిసికొనుటకు మన కాధారములేమియుగన్పట్టుటలేదు. అయినను, హిమప్రళయాత్పూర్వము నాటి ఆర్యసభ్యత సాధారణముగ మన మిదివర కనుకున్న దానికంటె చాల యున్నతమైనదేయని మన మీయధ్యాయమందు వివరించియుంటిమి. సభ్యతయందేమి, నాగరికతయందేమి మనప్రాచీనార్యులు ఇతిహాసపూర్వకాలమందు నివసించిన ఐగుప్తీయుల కెంతమాత్రమును తీసిపోరు. కావున, మనప్రాచీనార్యులకు ఐగుప్తీయులతోపాటు సమానస్థానము నొసంగక పోవుటకు కారణము గన్పట్టదు. ఆర్యులు ఉత్తరధ్రువమును విడిచి, నూతననివాసస్థానములను వెదకికొనుచు భూగర్భరేఖ వరకు—యింక క్రిందికికూడ — వచ్చియుండిరి. వీరికి మధ్య త్రోవలో ననేక యనార్యజాతులతో సంపర్కము గలిగెను. ఈ యనార్యజాతులతో వీ రనేక యుద్ధములుజేసి జయించిరి. కొన్నిజాతులను వీరు పూర్తిగ రూపుమాపిరి. మరి కొందరిని తమలో కలుపుకొనిరి. ఈ యనార్యజాతులపై మన యార్య

జాతి యిట్లు సర్వవిధముల యాధిపత్యమును వహించెను. దీనిని బట్టి ఆర్యజాతి చాల వీర్యవంతమైనదని తప్పక తెలియుచున్నది. ఇట్లు స్పష్టముగ ప్రదర్శితమగుచున్న ఆర్యజాతియొక్క యాధిక్యమును, వీర్యమును, సమర్థించు టెట్లు ? ధ్రువమండలమందు నివసించిన ప్రాచీనార్యజాతి మిక్కిలి మహోన్నత నాగరికత యందున్ననే గాని యిట్టి వీర్యవంతములగు కార్యము లొనర్చి యుండజాలదు. మరియు, మన ధ్రువసిద్ధాంతముచే క్రొత్తగ ప్రసరింపుచున్న నూతనవిజ్ఞానము నాధారముగ జేసికొని, వేదములను మరియొకపర్యాయము విపులముగ పరిశీలనజేసి చూచినచో, యీ పైయభిప్రాయమును బలపరుచు విశేషాంశను లింకను మన కెక్కువగ లభింపగలవు. కాని, యివన్నియు మనకిప్పుడు కానరాక మరుగుపడియున్నవి. కారణమేమనగ:— హిమప్రళయమునకు పూర్వ ముత్తరధ్రువమండలమం దున్న వైదికఋషులపూర్వజు లెట్టి సాంఘిక, భౌతిక, పరిస్థితులలో నివసించియుండిరో సంపూర్ణముగ తెలిసికొనుట కిప్పుడవకాశములు లేమిచే మనకనేకాంశములింకను పైకిరాక మరుగుపడియేయున్నవి. ఆధునిక భౌతికశాస్త్రజ్ఞు లిప్పుడు ఉత్తర ధ్రువమండలమునకుపోయి, దానినంతను విపులముగ పరిశోధన చేసి చూచుచున్నారు. ఈపరిశోధనవలన మనకికముందు ఆర్యసభ్యతయొక్క పునాదులను కనిపెట్టుట కవకాశములు దొరుకవచ్చును. కాని. యీపనికి మనమిప్పుడు పూనజాలము. దీనిని భవిష్యత్పరిశోధకులకే వదలివేయవలెను. కాని, దీనికి



ముందుగ, మనధ్రువసిద్ధాంతము శాస్త్రసమ్మతమైనసిద్ధాంతమే యని పండితలోక మంతయు సర్వసాధారణముగ నంగీకరింపవలసియున్నది. పండితలోక మీసిద్ధాంతము నంగీకరించనప్పుడు, తదుపరి జరుగవలసినపని యంతయు భవిష్యత్పరిశోధకులపైననే నిలిచియుండును. ప్రస్తుత మీగ్రంథమందు మనము చేయబూనిన కార్య మేమనగ:— హిమప్రళయమునకు పూర్వ ముత్తరధ్రువమండలమం దార్యులు నివసించియుండిరని సిద్ధాంతీకరించుటకు తగినంత సాక్ష్యము వైదిక, అవైస్తికగ్రంథములలో స్పష్టముగ గలదని నిరూపించుటయే మా ముఖ్యోద్దేశము. ఆర్యజాతి కత్యంతప్రాచీనతమములైన వైదిక అవైస్థికగ్రంథములందు పారంపర్యముగ భద్రపరుపబడుచువచ్చిన ప్రత్యక్షవాక్యములయొక్క ప్రమాణముపై మా ధ్రువసిద్ధాంతము నిలిచియున్నది. దీని కిదియే గట్టిపునాది. ఇట్టి గట్టిపునాదిపై నిలిచిన మా ధ్రువసిద్ధాంతమను కోటకు రక్షణార్థమై నలువైపులను అన్యోన్యాశ్రయములగు భూగర్భ, భూనిక్షేప, భాషా, గాథా, జ్యోతిషాది యాధునిక భౌతిక శాస్త్రములయొక్క స్వతంత్రపరిశోధన లనియెడి ప్రాకారములు ప్రత్యేకముగ వచ్చి నిలిచి దాని కపారమైన బలమును చేకూర్చుచున్నవి. ఈ సిద్ధాంతప్రతిపాదనకై మే మీగ్రంథమందు పేర్కొనుచువచ్చిన వాదప్రతివాదముల నన్నిటిని మొదటి నుండియు జాగ్రతగ పరిశీలించుచు వచ్చిన పాఠకమహాశయులు మా సిద్ధాంతమునకు గల యిట్టి యపారబల

మును తెలిసికొనక మానరు. వేయేల, ధ్రువనిలయప్రతిపాదనకై వేదమం దేమైన ప్రమాణములు దొరుకునేమో చూతమనుతలంపు అసలు మొట్టమొదట మనస్సునకు కలుగజేసిన దీయాధునిక భౌతికశాస్త్రపరిశోధనలే యని చెప్పవచ్చును. ఈసిద్ధాంతప్రతిపాదనకై మన మీగ్రంథమం దవలంబించిన పద్ధతి కేవలము నియమబద్ధముగనే యున్నదిగాని యెంతమాత్రమును వదులుగలేదు. మొట్టమొదట భారత నైరుక్తులు వేదభాష్యమును వ్రాయుపద్ధతిని స్థాపించి యిప్పటికెన్నియో శతాబ్దములు గతించినవి. కాని, యింతకాలము నుండియు వేదములందు ధ్రువనిలయ చిహ్నము లెవరికిని గాన్పించియుండక పోవుట బహువింతగ గన్పట్టవచ్చును. అయినను, యిట్టి విషయములలో యెవరు నాశ్చర్యపడవలసిన పనిలేదు. ఏలననగ, జ్ఞానతేజస్సు విరివిగ ప్రసరింపుచున్న కొలది కేవల నియమబద్ధముగ నొనర్పబడు పరిశోధనలచే ననేకములగు నూతనాంశములు బయటపడుచుండును. వానిని జూచి మనము ఆశ్చర్యపడనక్కరలేదు. నియమబద్ధమగు పద్ధతులచే వెలువరింపబడిన యిట్టి నూతనాంశములను మన మంగీకరించుటకు సదా సంసిద్ధులమై యుండవలెను. శాస్త్రపరిశోధకుల కందరకును మాన్యములైన యిట్టి నియమముల నాధారముగ గైకొనియే మే మీగ్రంథమందు మాధ్రువసిద్ధాంతమును స్థాపింప యత్నించితిమి. ఈనియమములను ప్రమాణముగ గైకొని మే మీగ్రంథమందు తేల్చిన సారాంశ



ములయొక్క బలము నెవరైనను పరీక్షింపవచ్చును. ఇంతకాలమునుండియు పండితులచే దుర్గ్రాహ్యములుగ నెంచబడి వదలివేయబడినట్టియు, అప్రాముఖ్యములైనవని త్రోసివేయబడినట్టియు, అపార్థముల గల్పింపబడినట్టియు, పెక్కు వేదవాక్యములనేమి, గాథలనేమి, సరళముగ సమన్వయింప సామర్థ్యముగల సత్యమైన కీలకమును మే మీగ్రంథమందు కనుగొన గలిగితిమని మాపరీక్షకులకు బోధపడగలదు. ప్రపంచ మనంతముఖముల ప్రవర్ధమాన మొందుచున్న యీ దినములలో ప్రాచీన మానవసభ్యతను నిర్ణయించుటకై యనంతముఖముల పరిశోధనలు జరుగుచున్న యీకాలములో వేదభాష్య పద్ధతిమాత్ర మెట్లభివృద్ధినొందక వెలిగ నిలుచుండగలదు? సదా కేవలమొక్క భాషాపరిచ్ఛేదముపైనను, వైయాకరణపద్ధతుల పైనను మాత్రమే యెట్లాధారపడి యుండగలదు? ఆర్యజాతికి ప్రాచీనతమములైన గ్రంథములందు భద్రపరుపబడియున్న ప్రాచీనపరంపరలను, యిప్పటి భౌతికశాస్త్రపరిశోధనా ఫలితములతో సమన్వయించుటకై మేమీగ్రంథమం దొనర్చిన ప్రయత్నము దేశకాలపరిస్థితుల ననుసరించియే యున్నదిగాని వేరుగలేదు. కనుక, మా మీవిషయములో దేశకాలపరిస్థితుల ననుసరించియే పోతిమిగాని అందుకు భిన్నముగ వర్తింపలేదు. ఇట్టి గ్రంథములను మన ప్రాచీను లత్యంత భక్తిశ్రద్ధలతో పూజింపుచుండిరనుట

యెంతయు సమంజసముగనే యున్నది. ఇవి నిజముగ పూజనీయగ్రంథములుగ పరిగణింపబడదగినవే యనుటలో సందేహమేమియు లేదు. మన పూర్వజులు మొదటినుండియు తమకెన్ని యనివార్యములగు కష్టములు సంభవించినను వానినెల్ల లక్ష్యమొనర్పక యీ పూజనీయగ్రంథములను మిక్కిలి పట్టుదలతోడను, మతావేశముతోడను, నేటివరకు కాపాడుకొనుచువచ్చిరి.

సర్వము సంపూర్ణము.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

ఓం తత్ సత్

బ్రహ్మార్పణ మస్తు.



... ముద్రాక్షరశాల, గుంటూరు.

